# లక్ష్మీ రఘురామ్

## జీవన స్రవంతి

రచన
టి. యస్. కృష్ణానందమ్



సంఘమిత్ర పబ్లికేషన్స్,
హైదరాబాద్

ప్రథమ ముద్రణ :
జనవరి 1976

సర్వస్వామ్య సంకలితము
సంఘమిత్ర పబ్లికేషన్స్

సంపాదకులు :
శ్రీమతి బొల్లు విజయలక్ష్మి బి.ఎ.,
శ్రీమతి ఏటుకూరి ఉషారాణి బి.ఎ.

పబ్లిషర్ :
శ్రీ బి. చంద్రశేఖరరావు ఎం.కాం..

వెల రు. 20/-
విదేశీ వెల $ 5/-

ముద్రాపకులు :
జ్యోతి ప్రెస్,
హైద్రాబాద్.

బ్లాకులు :
సత్యం ప్రోసెస్
హైద్రాబాద్

ముఖచిత్రరచన :
సత్యం.

ప్రతులకు :
B-14; F-4; కాలాదేరా కాలనీ,
మలక్ పేట - హైద్రాబాద్.

# మున్నుడి

ఒకానొకనాడు ఓ మండుటెండల మధ్యాహ్నంపూట మా ఇంట శ్రీమతి లక్ష్మీరఘురామ్‌గారికి గౌరవ పురస్సరంగా ఆతిథ్యమిచ్చే అదృష్టం లభించింది మాకు.

—అఖిలభారత గ్రామీణ మహిళామండలి తరఫున భారతీయ గ్రామీణ మహిళల సాంఘిక ఆర్థికరంగాలలోని వాస్తవ స్థితిగతులను క్రోడీకరించుకొను టకై శ్రీమతి లక్ష్మీరఘురామ్ పర్యటిస్తున్న కార్యక్రమ మది.

—ఆనాటి కార్యక్రమంలో ఆ యమ్మ భిన్నవర్గాల వారిని విభిన్నకోణాల నుంచి అవగాహనం చేసుకున్నతీరూ, ఆ గ్రామీణ మహిళల బహిరంగసభలో ఆమె ప్రసంగించిన రీతీ, నన్ను ఆకట్టుకున్నాయ్.

—మామూలు రాజకీయ నాయకమ్మన్యులు పాలితులను పలుకరించే విధా నానికి భిన్నంగా ఈమె ఆ అమాయిక పల్లీయ సోదరీమణులను పలుకరించిన విధమూ, వెలువరించిన ప్రేమా ప్యాయతలూ ఎంతో నిండుగా ఉన్నాయ్. ఈమె గారి పలకరింపులకూ కుశల ప్రశ్నలకూ, నూతిలోని గొంతుకల లోంచి విన వచ్చిన రీతి వచ్చిన సమాధానాలకు శ్రీమతి లక్ష్మీరఘురామ్ ఆర్ద్రించి, మరింతగా వారి హృదయాలను సమీపించి,మనస్సులను స్పృశించి, దేశభవిష్యత్తు పట్ల వారికి ఆసక్తిని గలిగించిన మాటలు, నన్ను నేను పునఃపరిశీలించుకునేట్టూ మనుష్యులను తిరిగి అంచనాలు వేసుకునేట్టూ చేశాయ్.

—పాతికేండ్ల ముందునాటి అమలిన రాజకీయ రంగంలోని ప్రసిద్ధులు కొందఱు ఆమె మూర్తిలో తాండవించారు. ఆమెలో తొంగి చూశారు. ఆమె అభిభాషణలలో భాషించారు. ఆమె నిగ్రహ స్ఫూర్తిలో మూర్తీభవించారు.

—ఆ ప్రభావంతో శ్రీమతి లక్ష్మీరఘురామ్‌ను ఇంకా సన్నిహితంగా అర్థం జేసుకోవాలనీ, ఆమె వ్యక్తిత్వాన్ని సమగ్రంగా అర్థంజేసుకోవాలనే తపన నాలో గల్గింది.

—జాతీయ అంతర్జాతీయ రాజకీయాలు, సాంఘిక సమస్యలు, వైయక్తిక విలువలు మున్నగు అంశాలపై, ఆమె అభిప్రాయాలను, ఆదర్శాలనూ,భావాలను పరిభావాలనూ, పర్యటనలనూ, ప్రతిఫలాలనూ; అర్థంజేసుకొన్న కొద్దికీ నా దృష్టిలో ఆమె వ్యక్తిత్వం మరింత పెరిగింది. ఎత్తుగా ఎదిగింది. వట వృక్షంలా ఎన్నో ఉద్యమాలకు ఆశ్రయమిచ్చింది. ఎన్నో భావ ప్రసరణలకు ఆల వాలమయ్యింది. ఎందరో ఆర్తులకూ ఆక్రందితులకూ కన్నతల్లిలా, పుట్టినిల్లులా ఆతిధ్యమిచ్చింది. అభయహస్తం సాచింది.

—అమె నిత్యసత్యాన్వేషణా తపన ఫలితమే ఈపుస్తకరూపందాల్చింది. ఎన్నో సంవత్సరాల ఆమె డైరీలు, జ్ఞాపికలూ రచనలూ, ఈ పుస్తకాన్ని రూపొందించటానికి స్ఫూర్తినీ, ధృతినీ ఇచ్చాయి. ఆమె వెంట నేను ఢిల్లీ, మద్రాస్, కోయంబత్తూరు, కోనార్క్ అహమదాబాద్ బొంబాయి నగరాలకు చేసిన పర్యటనలూ, జరిపిన సుదీర్ఘ సంభాషణలూ, ఈ గ్రంధానికి అవతారిక లయ్యాయి.

—నిత్య సంక్షుభిత ప్రపంచకంలో ఏనాటినుంచో ఈనాటి వరకూ భిన్న శక్తుల సంఘర్షణ ఉంటూనేఉంది. అది రాజకీయాల పరంగానే గావచ్చు, ఆర్థిక అంశాల కారణంగానే కావచ్చు. సామాజిక స్థితిగతుల రూపంగానే కావచ్చు. ఏ రూపంలోనైనా తోటి మనిషికన్నా తన ఆధిక్యతను నిలుపుకొని పెత్తనం సాగించుకోవాలనే తృష్ణ మౌళికంగా, చిరకాలంగా మానవ జాతిలో ఉంటూనే ఉంది. కొందఱు ఈ భావానికి ప్రతిబింబాలుగా మసలుకుంటుంటే, సంస్కృతీ విజ్ఞానాలను ఆకళింపు జేసుకున్న దృగ్విశాలురు మరికొందఱు ప్రగతికి ప్రతీకలుగా నిలుస్తూనే ఉన్నారు. కార్యాచరణను సాగిస్తూనే ఉన్నారు.

—స్థూలంగా ఇదే మన మానవసమాజ నిత్యగమనం. సత్యపురోగమనం.

—అదే నాకు ఒకనాడు శ్రీమతి లక్ష్మీరఘురామ్‌తో పాటు రాజఘాట్ సందర్శించిన తదుపరి, ఆ పుణ్యస్థలంలో ప్రశాంత స్థితిలో, దృష్టులు జిజ్ఞాసా పూరితమై జాలువారుతూన్న సమయంలో స్ఫురించిన సత్యవాక్కు. గ్రహించిన నిజ వాక్కు.

—సదా విద్యార్థిగా, సామాజిక రాజకీయ ప్రగతీ గమనం వేగం అభిలషించే సాదా మనుష్యునిగా నన్ను నేను తాపిళ్లు వేసుకొని, ముందుచూపుకై తంపర్లాడి నప్పుడు, మానవుల సంఖ్యలో అర్థభాగమైన మహిళల పురోభివృద్ధికి సత్యవ్రతంతో నిష్కామికగా నిశ్శబ్దంగా కృషిసలుపుతున్న శ్రీమతి లక్ష్మీరఘురామ్ వ్యక్తిత్వం విశిష్టంగా నాకు ప్రస్ఫుటించింది.

—అందుకే, ఈ నా రచన ఆమె జీవితకథ గాదు. కాకనూపోకుండానే ఆమె అన్వేషణాపథంలోని **మార్దవాన్నీ వైశిష్ట్యాన్నీ** అందించాలని కోరుకుంది.

సత్తెనపల్లి
జనవరి 1976

టి. యన్. కృష్ణానందమ్.

* — 37, 38 పేజీలలో, 'నిషాదుడు' అన్నచోట 'పృథువు' గానూ, 157, 158, 159 పేజీలలో బ్రెజిల్ అన్నచోట బెల్జియంగానూ, చదువ, మనవి.

## కృతజ్ఞత—

ఓ రాత్రి భోజనాల బల్లవద్ద ఈ పుస్తక రచన గురించి నా ఆలోచన వెలువరించ, తానెంతో హర్షించి ఉత్సహించి, నన్నెంతో ప్రోత్సహించి, లీలామాత్రపు ఆనాటి నా తలంపు నేడీ ఆకృతి పొందగ నా కన్ని వసరులూ అందించి, ముప్పదేండ్లుగా నాకు ఛాయగా మెలుగుతూ, నాలో భాగంగా మసలుతూన్న నా జీవిత భాగస్వామి **శ్రీమతి భారత స్వరాజ్య లక్ష్మి కి** నా హృదయ పూర్వక కృతజ్ఞలు తెలుపు కుంటున్నాను.

— కృష్ణానందమ్

# విషయసూచిక



"రఘు" "లక్ష్మి"



శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ
ఎం. ఎల్. సి.
అం. ప్ర. కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు.

# అంకితము

పూజ్యులు శ్రీ వీరమాచనేని
వెంకటనారాయణ గారూ!

తమరు, దేశస్వాతంత్ర్య సమరాంగణాన స్వేచ్ఛా కేతనం చేబూని ముందు నడచిన వారు. జైళ్ళపాలైన వారు. కష్టాలలో కరగిన వారు. భూరి సంపదను భారతాంబ చరణసన్నిధిన హారతిగా వెలిగించిన వారు. నిస్వార్థతను బ్రతుకు బాటలో మలుచుకున్న వారు. ఆర్ద్రతను హృదయంలో నింపుకున్నవారు. గమ్యాన్ని గుర్తెరిగిన వారు. గమనాన్ని నవతరానికి వరవడిగా నేర్పుతున్నవారు. గాంధీజీ అడుగు జాడల్లో పయనించిన వారు. ఇందిరగాంధీజీ ప్రగతి పథంలో పయనిస్తోన్న వారు. మనీషిగా ఎదిగినవారు.

మన అనుంగు సోదరి, శ్రీమతి లక్ష్మీరఘురామ్ తెలుగుతల్లి వరాలబిడ్డ. రైతు లోకపు మురిపాలతల్లి. వీరు సిరులునిండిన కుటుంబంలో జన్మించినవారు. కలలు పండిన జీవితాన్ని అనుభవించినవారు. పల్లెపిల్లగా తెలుగుగడ్డన పుట్టిపెరిగి, మన్నడితో నిబ్బరంగా ఎదిగి అఖిల భారత మహిళామహాసభకు మూడువతూరి ఏకగ్రీవంగా అధ్యక్షులైన వారు. భారతమహిళోద్యమానికి పటిష్టతనూ ప్రతిష్టనూ సంతరించినవారు. మహోదాత్తమైన జీవనసరళి వీరిది. సరిహద్దులు లేని సదయ హృదయం వీరిది.

ఈ మహామహిళ వైవిధ్యభరిత జీవితానికి అక్షరరూపం ఈ పుస్తకం.

అంతర్జాతీయ స్థాయి కెదిగి, ధృవతారగా భాసిస్తోన్న పూజ్యసోదరి "లక్ష్మీరఘురామ్" జీవనస్రవంతిని, జాతీయ పుణ్యభావనామూర్తివైన, తమకు అంకితంగా సమర్పిస్తున్నాను. అందుకొని ఆశీర్వదించండి.

క్రిష్ణానందన్

# జీవితమంటే ఏమిటి?

ఒక మహా ప్రశాంతత చుట్టూరా అలముకొంది. విశ్వమంతా నిశ్శబ్దం నిండింది.

ఆమె ముందు విశాలంగా పరచుకొని ఆకాశమంత ఎత్తుగా నిలిచిన మహానగం ప్రత్యక్షమైంది.

ధవళకాంతులతో మెరుస్తోంది ఆ మహానగం. రజిత కాంతులను ప్రసరిస్తుందా గిరిరాజం. అసంఖ్యాకగిరిశృంగాలు దూరదూరంగా ఆ విశాల పర్వత శ్రేణిలో నింగిలోకి తొంగిచూస్తున్నాయ్. శిఖారాగ్రాలపై అరుణ దేవుని స్వర్ణకిరణాలు ప్రభాసిస్తున్నాయ్. రంగురంగులతో వికసిస్తున్నాయ్. ఇంద్రధనస్సులను ప్రజ్వలిస్తున్నాయ్. నవరత్నరాసుల్లా కాంతులు సర్వత్రా ప్రకాశిస్తున్నాయ్. ఆ మహానగపు యుగళమందు స్వర్ణతోరణాలు వ్రేలాడుతున్నాయ్.

నగమంతా శాంతి నిండింది. విశ్వమంతా నగం నిండింది.

ఆమె పర్వత పాదాన నిలిచింది.

ఎదురుగా మహోన్నతంగా నిలిచిన పర్వతాన్ని చూచింది. చుట్టుప్రక్కల చూచింది. వెనుకకు చూచింది. వెనుక గతం కనపడలేదు. ఎంత తీక్షణంగా చూస్తే అంత చీకటిగా కనపడింది. ఎంత నిశితంగా విలోకిస్తే, అంత భ్రమ పూరితంగా కనపడింది. కుడిఎడమల చూచింది. తానున్న చోటున ఉన్నట్లే ఉంది.

ఎదురుగా అస్పష్టంగా మార్గమేదో ఉన్నట్లు స్ఫురించింది. మార్గమంతా మెట్లు పరచినట్లు ద్యోతకమైంది.

మొదటి మెట్టుపై కాలూనింది. రెండవమెట్టుపై పాదం సాచింది. మూడవ మెట్టు పై కెక్కింది.

ఆమె నడుస్తున్నది. నడుస్తూనే ఉన్నది. ప్రయాణం సాగింది. సాగుతూనే ఉంది. మెట్లు క్రిందికి దిగుతున్నాయి. ఆమె పైకి ఎక్కుతోంది.

ప్రతి మెట్టూ ధృఢంగా ఉంది. ఆమె పాదాలు ధృఢంగా ఉన్నాయ్. ఆమె నడకా ధృఢంగా ఉంది.

గమనం సాగుతూనే ఉంది. మనస్సు గమనంపైననే లగ్న మయింది. చూపుముందుకే సారింప బడుతూ ఉంది. 'మహానగం క్రిందకు దిగుతోందా? ఆమె పైకి ఎక్కుతోందా??'

'మహానగం నిశ్చలంగా ఉందా?

ఆమె నిశ్చలంగా ఉందా??'

నడుస్తూన్న ఆమెకు ఆలోచనలు తాకుతున్నాయ్! ఆలోచన లకు అవధుల్లేకుండా ఉన్నాయ్!!

"నేను కదులుతూనే ఉన్నాను గదా! నడుస్తూనే ఉన్నాను గదా! మరి మహానగం కూడా కదులుతోంది. నడుస్తోంది. నగంతో పాటు శిఖారాగ్రాలు కదులుతున్నాయ్. నడక సాగిస్తున్నాయ్. వాటిపై వ్రేలాడే దివ్యజ్యోతులు నడుస్తున్నాయ్. స్వర్ణతోరణాలు నడుస్తున్నాయ్. రజిత కాంతులు కదలుతున్నాయ్.

వాటితో పాటు ఆకాశంపై మిలమిల మెరసే నక్షత్రాలు వివిధ వర్ణాల మేఘమాలికల కాంతులు నడుస్తున్నాయ్. ధగద్ధగాయ మానంగా ప్రకాశిస్తూ పైని ఆకాశం నడుస్తోంది. క్రింది మహానగం నడుస్తోంది.

నేను నడుస్తున్నాను. ఒక్కో మెట్టేఎక్కుతున్నాను.మరోమెట్టు ఎదురౌతోంది. అందరం నడుస్తున్నాము. కాలం నడుస్తోంది. సృష్టి నడుస్తోంది. క్రమ బద్ధంగా నడుస్తోంది. విశ్వమంతా లయబద్ధంగా నిశ్వసిస్తోంది."—అనుకుంటూ ఆమె నడక సాగిస్తోంది.

ఎన్నో మెట్లు, ఎంత కాలమో, నడచీ నడచీ ఒక రోజున తనకుతానే ఒక ప్రశ్న వేసుకొంది ఆమె.

"ఎక్కడికీ ప్రయాణం ?'' - అని.

ఆమెలోనిదేదో చిన్న ధ్వని చేసింది. చిరునవ్వుధ్వనిలా ఉంది అది.

"ఎందుకా చిరునవ్వు ?''—అన్నది ఆమె.

"నీ ప్రశ్నకు !"—అంది ఆమెలోనిదేదో.

"ఏం ? చెప్పరాదూ తెలిస్తే! నవ్వడమెందుకూ?" అన్నదిఆమె.

"ఏమన్నా ఉంటేగదా తెలియటానికి - తెలిస్తేగదా నీకు చెప్పటానికి". అంది ఆమెలోనిదేదో.

"మరి ఎక్కడికో తెలియకుండానేనా ఈ ప్రయాణం. గమ్యం ఎరుగని ఈ ప్రయాణం మరి ఎందుకు ?" అన్నదామె.

"అసలు నీవు ప్రయాణిస్తున్నావని మాత్రం ఎక్కడుంది?" అంది ఆమెలోనిదేదో.

"మరి ఇదంతా ఏమిటంటావ్ ? గమనం కాదంటావా ?''

"నీవు అనుకుంటంలో ఉంది."

"నడుస్తూ కూర్చున్నానని ఎట్లా అనుకునేది ?''

"అటు, కుడివైపు ఆ ఎత్తైన శృంగాగ్రంవైపుచూడు. అచ్చట నీలాగే ఒక మనిషి ఉండి నీవైపు చూస్తే నీవు కూర్చున్నావో, నడుస్తున్నావో తెలియదు. నీకు కదలికే ఉన్నట్లు భావించడు."

"అది అతని భావన గావచ్చు."

"ఇది నాభావన గావచ్చుగదా !"

"అందుకేగా నేను నడుస్తున్నానని భావిస్తూ, ఎక్కడికీ నడక అని ప్రశ్నించుకుంటం !" —అన్నది ఆమె.

"యుగయుగాలనుంచి మేథావులు ప్రశ్నించుకుంటుందే ఇది. ముముక్షువులు తర్కించుకుంటుందేఇది. మేథావులు ముముక్షువులై, ముముక్షువులు మేథావులుగామారి తర్క వితర్కాలతో సతమతమౌతున్నది ఈ సమాధానం కోసరమే!'' అన్నది ఆమెలోనిదేదో.

"మరి వారికి లభ్యమైన జవాబు ?"

''ఎవరి సమాధానం వారికే లభ్యంగావాలి. ఎవరి ప్రశ్నకు వారే సమాధానం తేల్చుకోవాలి.''

''పోనీ నీవు నాలోనిదానివేగా, చెప్పరాదూ నీసమాధానం ఏమిటో''.

"ఈ గమనమే జీవితం." అన్నది ఆమెలోనిది.

''మరి గమ్యమో?'' —అన్నది ఆమె.

"మరణము'' —అన్నది ఆమెలోనిది.

''మరి ఎందుకు జన్మించినట్టూ ? ఎందుకు జీవించినట్టూ ? ఎందుకు మరణించినట్టూ ? "

"కర్తకుమాత్రమే తెలుస్తుంది ఆ కారణం. కర్మ పని జేసుకుంటూ పోవడమే. క్రియనుబట్టి ఫలితాలు".

''జీవితమంటే ఏమిటి ?''

''నడక సాగడం."

''మరణమంటే ఏమిటి ?''

''నడక ఆగడం.''

మరి మరణాంతరమో !''

''ఇందాకనీవు వెనకకు చూచినపుడు కనిపించినచిమ్మచీకటి."

"పునరపి జననమో!" —అన్నది ఆమె.

''పునరపి మరణంగూడా ఉందిగా!" అన్నది ఆమెలోనిదేదో.

"ఈ పునరపులు...లేకండా ఉంటే ఎట్లా ఉంటుందంటావ్?"

"ఆ నక్షత్రాలు, ఈ సూర్యచంద్రులు, ఈ నగం, ఆ ఆకాశం, నీవూ నేనూ, లేకుండా ఉంటే ఎలా ఉంటుందంటావ్ ?"

"అమ్మో! అంతాచీకటి. ఊహాతీతం... అనూహ్యాం..."

"కనక ఊహేమూలం—ఊహించుకొన్నకొలది అర్థమౌతున్న ట్లనిపిస్తుంది. ఊహాశీలులు వారి చిత్త మొచ్చిన రీతిగా భావించుకొని అర్థాలు చెప్పుకున్నారు జీవితానికి; ఈ గమనానికి. కనకనే ఎవరి ప్రశ్నకు వారు సమాధానాలు చెప్పుకుంటం మంచిది. ఒకరికి నచ్చిన సమాధానం మరొకరికి సమన్వయం గావాలనిలేదు. వారివారి భావ సంస్కారాన్నిబట్టీ, వారివారి ఆలోచనా విశ్వాసాలనుబట్టీ, ఎవరిఅర్థం వారికి స్ఫురిస్తుంది. అదే వారి పట్ల సత్యంగా భాసిస్తుంది."

"మరి మనకు అర్థమయిందేమిటి ?" అన్నదామె.

"మన నడక ఇంకా ముందు చాలా దూరం ఉంది. ముందు ముందు చెప్పుకుందాములే, తొందరేముంది—అయినా అటు ఆ వాయవ్యం మూలకేసిచూడు." అన్నది ఆమెలోనిది.

అటుచూచింది ఆమె. అది కురుక్షేత్రం. అసంఖ్యాక గజ తురగపదాతి దళాలతో ఒకరికొకరు ఎదురెదురుగా మోహరించి, ఇరు వాగులవారూ నిలిచిఉన్నారు. మధ్యభాగంలో దివ్యకాంతులతో స్వర్ణరథం నిలిచిఉంది. పైన కపికేతనం ఎగురుతోంది. రథంపైన దివ్య మంగళ రూపంతో ఒకచేత పాంచజన్యం, మరోచేత సుదర్శన చక్రం ధరించి శ్రీకృష్ణుడు పలుకుతున్నాడు. ఆయన విశాల నేత్రాలువిస్ఫారితమైఉన్నాయి. ఉజ్వల కాంతులను ప్రసరిస్తున్నాయి. జ్ఞానతేజం ఆయన ముఖమండలంలో వెల్లివిరుస్తోంది.

ఆయనకెదురుగా గాండీవాన్ని భుజాన తగిలించుకొని, రత్న ఖచిత కిరీటాన్ని తలపై ధరించి, మహాసేనా నాయకుని వేషంతో అర్జునుడు నిలిచి ఉన్నాడు. వినమ్రుడై ఉన్నాడు. అవనతవదనుడై

ఉన్నాడు. నయనాలు చంచలనంగా ఉన్నాయి. మొగంలో దిగులు కన్పట్టుతోంది. జిజ్ఞాస ప్రస్ఫుటమౌతోంది.

"చూచావా?"—అని ప్రశ్నించింది ఆమెలోని దేదో.

"చూచాను. కృష్ణార్జునులు గారూ!" అన్నది ఆమె ఆశ్చర్యంగా.

"అవును. నర నారాయణులు వారు". అన్నది ఆమెలోనిదేదో.

"నరనారాయణులు ఒకరేగాదా?" అన్నది ఆమె.

"నీవూ నేనూ ఒకరమే గాదా? సరే, చెవులు రిక్కించి విను మరి". అన్నది ఆమెలోనిదేదో.

అనంత ఓంకార ప్రణవ నాదం శృతిగా, విశ్వహృదయ స్పందన లయగా ఇది వినపడింది.

'అవ్యక్తాదీని భూతాని
వ్యక్త మధ్యాని భారత!
అవ్యక్త నిధ నాన్యేవ
కాతత్ర పరివేదనా!'

"ఏమిటి శ్రీ కృష్ణుడు చెబుతోంది?"—అడిగింది ఆమె.

"ఓ అర్జునా! ఈ జీవితం విషయంలో ముందేమిటో తెలియదు. మరణానంతరం ఏమిటో తెలియదు. మధ్యలో మాత్రం ఏదో కొంత తెలుస్తుంది. కనక దీనికి ఇంతగా శోకించడం ఎందుకూ అని".—చెప్పింది ఆమెలోనిదేదో.

"మరిముందూ తెలియకా, వెనుక తెలియకా, తెలిసే, అవకాశం గూడా ఉన్నట్లు కనబడనప్పుడు ఈ అన్వేషణ ఎందుకు?" ప్రశ్నించిందామె.

"నీ ఆనందం కోసం. అన్వేషకుని ఆనందం కోసం. కాగా ప్రతివారి అన్వేషణలో జననానికి మరణానికి మధ్య ఎంతో కొంత తెలిసే దుందిగా దానికోసరం. ఎవరకు వారికి, ఎప్పటికప్పుడు ఎంతో

కొంత తెలుస్తూనే ఉంది గదా ?'' అట్లానేగా మనం ఇన్ని మెట్లు ఎక్కి వచ్చాము.'' సమాధానం చెప్పింది ఆమెలోనిదేదో.

ఆమెలో నిశ్శబ్దం ఆవరించింది. ఆమెలోనిది నిద్రించింది.

ఇందాక, ఆమెలోనిదేదో చిన్నధ్వనిచేసి చిరునవ్వు నవ్వినట్లు, ఆమె గూడా చిన్న ధ్వని చేసి చిరునవ్వు నవ్వుకుంది. ''ఇదంతా కలా ?'' అని అనుకుంది.

అసతోమా సద్గమయ :
తమసోమా జ్యోతిర్గమయ :
మృత్యోర్మా అమృతంగమయ :
మనసులో పాడుకొంది.

*　　*　　*

# అమ్మ - నాన్న - కుటుంబము

తెలుగు కోస్తాతీరానికి దరిదాపుసగంలో ఉంటుంది గుంటూరు జిల్లా. ఒక శతాబ్దంనుంచి, కృష్ణా డెల్టా క్రింద సాగు అవుతూన్న ఈ ప్రాంతంలో సారవంతమయిన భూములకూ, విద్యా విజ్ఞాన నాగరికతలకూ, తెనాలి తాలూకా, చాలకాలంగా కీర్తిగడించుకుంది. ఆ తాలూకాలో సస్యశ్యామలమూ, సుసంపన్నమూ అయిన గ్రామము దుగ్గిరాల. ఆ గ్రామంలో ఒక సంపన్న కుటుంబంలో యాభయినాలుగు సంవత్సరాలనాడు 'లక్ష్మి' పుట్టింది.

'లక్ష్మి' జన్మించిన కుటుంబాలు పాడిపంటలకు పేరెన్నిక గన్నాయి. అభ్యుదయ వ్యవసాయిక కుటుంబాలుగా యావద్భారతంలో వాసికెక్కాయి. కర్మక్షేత్రంలో పలు ప్రయోగాలు చేయటానికీ, చమటోడ్చి పాటు పడడానికీ, ప్రాణప్రదంగా పైర్లను పోషించుకుంటానికీ, ఈ కుటుంబాలు పేరు పొందాయి.

సేద్యాన్ని నమ్ముకొని, పుడమితల్లిని అర్చించడంలో, ఆడా మగా తేడా లేని శ్రమజీవులువీరు. ఒకరికింతపెట్టి తామింత తిని తృప్తిజెందే పుణ్యవంశాలివి. ఆతిథ్యాలకూ, ఆదరణలకూ అనాదిగా ఖ్యాతిగాంచిన కుటుంబాలు వీరివి.

నీటిసౌకర్యముండి, నల్లరేగడి భూములున్నాయంటే ఈ కుటుంబాలవాళ్లు ఎంత దూరమైనా పోతారు. చాలాకాలంనాడే తమిళనాడులోని కోయంబత్తూరు, విరూధ్‌నగర్ ప్రాంతలకు వెళ్లారు. మధ్యప్రదేశ్‌లోని నాగపూర్ ప్రాంతాలకు ఎక్కారు. కన్నడదేశంలోని భద్రావతీ తీరానికి తరలారు. రాయలసీమలో తుంగభద్రక్రింద పంటలు పండించారు. నిజాంసాగర్ ఆనకట్టక్రింద భూములను సస్యశ్యామలం చేశారు. సస్య విప్లవాన్ని సాగించడంలో, దూరాన్ని

భారాన్ని సరుకు కొనక కాడి భుజాన వేసుకొని, గొడ్డూ గోద లతో దేశం నలుమూలలకూ తరలివెళ్లారు.

ఈ పవిత్ర కర్తవ్యతానిర్వహణలో ప్రాంతీయ భేదాలనూ, భాషావిభేదాలనూ పాటించిన వారుకారు వీరు. జాతీయసమైక్యతకు బీజాలు ఏనాడో వేసినవారువీరు.

వ్యవసాయమంటే ఈ మగవారికి ఎంత మక్కువో, పాడి పరిశ్రమ అంటే ఈ స్త్రీలకు అంత ప్రీతి.

ఆవులనూ గేదెలనూ స్వంత బిడ్డలకన్నా మురిపెంగా పెంచు కుంటారు. గోవుతల్లికి కోడెదూడ పుట్టిననాడు ఇల్లంతా సంబరపడి పోతారు. గేదె, పెయ్యదూడను, ఈనిననాడు వొళ్లంతా పొంగి పోతారు. తొలికోడి కూయంగానే ఇల్లాలు నిద్రలేచి తొలిగా దర్శించుకునేది పశువుల కొట్టమే. ఉదయ సంధ్యకుముందే కవ్వ మాడించి, ఆ మధనపు 'జుమ్‌జుమ్' సంగీతానికి తన్మయతజెందే భాగ్యం ఈ కుటుంబాలకు అనూచానం.

కవ్వమాడినచోట కదురు తిరిగిన ఇంట సిరితల్లి గజ్జియలు గలాగలా మ్రోగుననని విశ్వసించే జనంవీరు.

కమ్మని గడ్డపెరుగూ, కడుకమ్మని మెరుగూ వారి స్వంత సొత్తు. భాజ్యాల శుచికీ, భోజ్యాల రుచికీ వీరిది పెట్టిందిపేరు. గృహ పరిశుభ్రతకూ, వస్తువుల అమరికకూ వీరినిచూచి యితరులు నేర్చు కుంటారు.

ఉన్ననాడు అయిదుపదులు వెచ్చించి, అతిథులకు విలువైన పదార్థాలతో ఎంత ఘనంగా విందులు ఇవ్వగలరో, లేనినాడు అయి దణాలు ఖర్చుతో సాదా కూరగాయలతో అంతటి రుచ్య పదార్థా లను తయారించి అతిథులను తృప్తిపెట్టగలరు. నిండుకుండలు ఈ కుటుంబాలవారు. కొంచెం దూరంగాఉండి పరికిస్తే ఎవరు లతుల

కధిపతులో, మరెవ్వరు ఋణబాధా పరితప్తులో అవగాహనగాదు. నిజాయితీకి ఎంతముందుంటారో, అవసరమైతే, అనవసర భేషజానికి అంతముందుంటారు.

ఆ తాలూకాతో పాటు గుంటూరు జిల్లాకు గూడా దేశంలో ఒక ప్రత్యేక స్థానమేఉంది.

దక్షిణా పథంలో బౌద్ధం ప్రభవించి, విస్తరించి, పూజలందుకుంది తొలిగా ఈ పుణ్య కృష్ణా తీరమండలంలోనే. బౌద్ధానికి మహాయాన ప్రవక్త, విశ్వ విఖ్యాత తాత్త్వికాచార్యులు, రసశాస్త్రవేత్త ఆర్యనాగార్జునులు పరిణితి చెందిన మహావేత్తగా నడియాడినది ఈ పునీత ప్రాంతంలోనే. అనన్యశిల్ప విన్నాణంతో నల్లరాళ్లు, జాతక గాథల పాత్రధారులై, తథా గతుల అవతారమూర్తులై, మూడు వందల ఏండ్లపాటు ప్రజనుంచి హారతులందుకుందీ ఈ ప్రాంతంలోనే.

సముద్రాల ఆవల తీరాలనుంచి, జ్ఞానతృష్ణతో, విజ్ఞానార్తితో, అరుతెంచిన ఆర్తులకు, పుష్టితుష్టిగల తమ అక్షయ విజ్ఞాన భాండారంలోంచి, పంచిపెట్టి దీప్తి గలిగించిన విశ్వవిద్యాలయాలు విలసిల్లిందీ ఈ మండలంలోనే.

ఎనిమిది వందల ఏండ్లనాడు మానవతా వాదంతో, సమతా దృక్పథంతో, 'చాపకూడు' సిద్ధాంతాన్ని ప్రతిపాదించి జాతిభేదాన్ని ఛేదించి, సంఘీయులను స్ఫూర్తి వంతులుగా జేయసమకట్టిన బ్రహ్మనాయడు నడయాడిందీ, ఈ మండలంలోనే.

పటిమా పౌరుషాలను సిలువెల్లానింపుకొని, శౌర్యధైర్యాలను గుండెంతా నింపుకొని, అమేయ పరాక్రమంతో విజృంభించి శత్రు సేనా వాహినిని భీభత్సంగావించి, నాగమ్మనెత్తి మొట్టి, నరశింగుని తలగొట్టి తండ్రి పాదాలకడ రాగోలుతో విసిరిన బాలచంద్రుడు కీర్తి కాయంతో అజరామరంగా జీవించింది ఇక్కడే.

ప్రభుత్వ మంత్రాంగంలో, రాజకీయచాతుర్యంలో స్త్రీ నయితం పురుషుణ్ణి మించి రాణించగలదనీ, తలుచుకున్నది నైపు

ణ్యంగా సాధించగలదనీ, నాటినుంచి నేటివరకు, 'నాగు లేటికి దొరసాని నాగసానిగా' విరాజిల్లుతున్న నాగమ్మ స్వంత మండలము ఇదే.

యావదాంధ్రలో ఈ నాటికీ పేరంటాలుగా పూజలందు కుంటూన్న శ్రీ లక్ష్మమ్మ మెట్టినచోటు గూడా ఈ జిల్లాయే.

ఈ ప్రాంతమునుంచే కాకతీయసామ్రాట్టు గణపతిదేవ మహా రాజులుంగారు, తమ పట్టపు దేవేరిని వరించి, కాకతీయ సింహాసనపు అర్ధభాగంలో అధివసింపజేశారు. బాంధవ్యాన్ని ధరణికోటకూ, చేబ్రోలుకూ విస్తరింపజేసి కాకతీయ చరిత్రలో విశిష్టప్రకరణాల రచనకు అవకాశం గలిపించారు.

విశ్వవిఖ్యాత "నృత్త రత్నాకర" రచయితగానేగాక, కాకతీయ సామ్రాజ్య సర్వసైన్యాధిపత్యం వహించి, అనేకానేక యుద్ధ వ్యూహావిజయాల రచయితగా పేరొందిన జాయపసేనాని, కాకతీయ సామ్రాజ్ఞి అగ్రభ్రాత, పుట్టిపెరిగింది ఎదిగిందీ ఇచ్చోటనే.

ఆధునిక చరిత్రలో సయితం ఈ జిల్లా అన్నింట మిన్నగా విరాజిల్లింది. త్యాగపూరిత భారత స్వాతంత్ర సంగ్రామంలో ఈ జిల్లా నిర్వహించిన పాత్ర అనన్య సామాన్యమైనది. జాతీయ స్థాయిలో అఖిల భారతానికి పెక్కురు రాజకీయ నాయకులను అందించిన ఘనతగూడా ఈ జిల్లాకు దక్కింది.

ఆలాంటి ప్రఖ్యాతి గడించుకున్న మండలం గుంటూరుజిల్లా.

ఆలాంటి సస్యశ్యామల సుసంపన్న గ్రామసీమలకు జేరింది లక్ష్మి జన్మించిన దుగ్గిరాల గ్రామం.

ఆలాంటి కుటుంబాల కోవలో జేరింది లక్ష్మి జన్మించిన జంపాలవారి కుటుంబం.

* * *

"యాభయ్ నాలుగు సంవత్సరాల క్రితం, ఒక రోజున మా కుటుంబంలో ఒక పెద్ద సంతోషసంబరం జరిగింది. అప్పటికి ఆరు తరాలనుంచి, మా కుటుంబంలో స్త్రీ సంతానంలేదు అంతా పురుష పుంగవులే. అది ఒక విచిత్రంగా చెప్పుకునే వారట, 'తెచ్చుకోవడమే గాని ఇచ్చుకోనేపని మా కుటుంబాలకు లే' దని, మా వాళ్లపై ఛలోక్తులు విసరుతుండే వారట అయిన వాళ్లు," అంటూ శ్రీమతి లక్ష్మీరఘురామ్ తనజన్మ ఉదంతాన్ని ప్రసంగవశాత్తూ, అభివర్ణించారు.

ఆరు తరాల తర్వాత ఈమె బాలికగా జన్మించడం అమ్మ నాన్నలకే గాక కుటుంబం మొత్తానికి సంబరకారణమైంది. ఊరంతా ఒక విచిత్రంగా చెప్పుకున్నారు. కుటుంబంలో 'లక్ష్మి' జన్మించిందని అనుకున్నారు. బహుశ అదే కారణమేమో ఈమెకు 'లక్ష్మి' అని నామకరణం చేయటానికి. మురిపెంతో మురుసుకున్నారందరూ.

అప్పటికి లక్ష్మినాన్నగారు, వెంకటేశంగారు గుంటూరులో శిరస్తదారుగా ఉండేవారు. ఈ బిడ్డ పుట్టుకతో వారు తహసీల్దారుగా ప్రమోషన్ పొందారు. దానితో 'లక్ష్మి' పేరు సార్థక నామ మయిందన్నారు బంధుమిత్రులు. కుటుంబానికి అదృష్టము గలిగించే భాగ్యజాతకమీమెదనీ అన్నారు.

లక్ష్మి తరువాత రెండేండ్లకు చెల్లి 'కృష్ణ' పుట్టింది. జంపాల వారి కుటుంబంలో సంతృప్తి వెల్లి విరిసింది.

లక్ష్మి కన్న అయిదేండ్లు ముందు పుట్టిన అన్నయ్య ఈమె నెపుడూ చంక దిగనిచ్చే వాడుగాదు. ముద్దుచేసేవాడు. నోరెత్తి ఏడ్వనిచ్చే వాడుగాదు. ఫలానిది కావాలని వ్రేలు జూపిస్తే చాలు, ఆ వస్తువు ఎంత ఖరీదుదైనా పరుగెత్తి వెళ్లి తెచ్చి చెల్లి ముందు ఉంచేవాడు. అడిపగిలితే, చెల్లి ఎక్కడ పరితపిస్తుందోనని, తానే మునుముందు చప్పట్లు కొడుతూ ఆనందించేవాడు.

అయిదేళ్లన్నా నిండకమునుపే అమ్మనాన్నలు లక్ష్మికి, "అ ఆ" లు దిద్ద పెట్టారు. 'అ ఆ' లతో పాటు, విద్యార్థినిగా మారిన లక్ష్మి, పుష్టిగా ఆరోగ్యంగా ఎదుగుతూ, పలుభావాలను ఆకళింపు జేసుకునే స్థితికి పెరిగింది, ఆ స్థాయికి ఎదిగింది.

*   *   *

దేశ స్వాతంత్ర్య పోరాటాన్ని ప్రజా ఉద్యమంగా మార్చిన 1923 పన్నుల నిరాకరణ ఉద్యమం గుంటూరు జిల్లాలో నడచినతీరు చరిత్ర కెక్కినకథ. ఈ సత్యాగ్రహాయుత, సహాయ నిరాకరణ సమరంలో జిల్లా అంతా అట్టుడికినట్టు ఉడికింది. బస్తీలనుంచి గ్రామాలకు ప్రాకింది. గ్రామాలన్నీ ఏకమైనాయి. తెల్లవారంటే ప్రతివారికీ ఏవగింపు గలిగింది. ఈ దేశాన్ని కొల్ల గొట్టుకొని పోవ టానికి వచ్చిన ముష్కర మూఠా అనే అభిప్రాయం జనసామాన్యంలో ప్రాకింది. "తెల్లవారలు గడుసరి గొల్లవారు —— పితుకుతున్నారు పాలను మూతులు బిగియగట్టి-" అనేభావం ప్రతివారిలో గూడు కట్టుకొంది. బెంగాలు దేశంలో ఆ విర్భవించిన 'వందేమాతరం' నినాదం, దేశపు నాలుగు చెరగులకూ ప్రాకింది. గుంటూరుజిల్లాలో మరల మరల ప్రతిధ్వనించింది.

పెదనందిపాడు, ఆ పరిసర గ్రామాలు ఎక్కడికక్కడే పెట్టని కోటలవలె తయారయినాయి. గ్రామీణులంతా ఒకత్రాటి పైన నడిచారు.

సేవాగ్రామంనుంచి మహాత్ముని సందేశం వచ్చింది. సందేశాన్నందుకున్న గుంటూరుజిల్లా రైతాంగం ప్రభుత్వానికి పన్నులు చెల్లించబోమని మొరాయించింది, ఎదురు తిరిగింది.

ప్రభుత్వాధికారులు ఎన్నో మంతనాలు చేశారు. ఎన్నో తంత్రాలు పన్నారు, బతిమిలాడారు, బామాడారు, భయపెట్టారు. ఏమిజేసినా రైతుల్లో మార్పులేదు. గ్రామాలకు గ్రామాలు భీష్మిం చుకు కూర్చున్నాయి.

ప్రభుత్వం సహించలేకపోయింది. ఉడుక్కుంది, రవి అస్త మించని, ఆంగ్లసామ్రాజ్యానికి ఇంతటి అవమానమా! అని ఆవేశ పడింది. ప్రజలను ప్రజానాయకులను బెదిరిస్తూ పెక్కు ప్రకటనలు చేసింది. గ్రామాలలో దండూరాలు వేయించింది. ఆస్తులు జప్తులు చేస్తామన్నారు; సామానులు బయటకు వేస్తామన్నారు; అరెస్టులు కొనసాగిస్తామన్నారు.

అయినా జనం చలించలేదు.

ప్రభుత్వ దమననీతి ప్రారంభమైంది.

పల్లెలలో పొలాలు ఉండి బస్తీలలో కాపురాలుంటూ ఉద్యమానికి నాయకత్వం వహిస్తూన్న కొందరు పెద్దలు ప్రభుత్వ ప్రకటనలకు బెదిరిపోయారు. తాము చెల్లించవలసిన పన్నులు చాటు మాటుగా చుట్టాల ద్వారా ఖజానాకు అందజేశారు. ఇక వారికి పోయేదేమీ లేదు. సర్కారువారు వాళ్ళను ఏమీ చేయరు. కాని చిత్త శుద్ధితో జాతీయోద్యమాన్ని నమ్మి పన్నుల వ్యతిరేక ఉద్యమంలో ప్రధాన పాత్ర ధారులైన సామాన్య రైతాంగం పెక్కు ఇడుములకు లోనైంది. అడుగడుగునా ఎర్రటోపీలు ప్రత్యక్ష మౌతున్నాయి. రోజు రోజుకూ, పోలీసు జులుం మితి మించు తున్నది. తప్పుడు కేసులు బనాయించబడుతున్నాయి. గ్రామీణ జీవితం భయావహమయింది. బీభత్సపూరితంగా మారింది.

అయినా ప్రజలు చలించలేదు. అధికారులు వసూళ్ళకై గ్రామాలకేతెంచినపుడు వారికి సంపూర్ణ సహాయ నిరాకరణమే ఎదురయ్యేది. ఊళ్ళకు దారులు చెప్పేవారుగాదు. రైతుల పేర్లు తెలిపే వారుగాదు. తిండీ తిప్పల విషయం సరేసరి. త్రాగేందుకు మంచినీరు గూడా అందించేవారుగాదు.

పన్నుల ప్రస్తావన రాగానే 'ససేమిరా' అనేవారు. రాష్ట్ర ప్రభుత్వం పలుసార్లు ఉన్నతాధికారులను గూడా పన్నుల వసూళ్ళకు పురమాయించింది. ఇలా పల్లెలకు పయనించిన ప్రతి అధి

కారీ పరాభవంతో వెనుదిరిగేవారు. చాలా రోజులు సాగింది ఈ పోరాటం.

క్రమక్రమంగా ప్రజల బాధలు మిక్కుటమైనాయి. దొరలు ఏమాత్రం అవకాశం దొరికినా రైతులను నిర్దాక్షిణ్యంగా హింసించటం ప్రారంభించారు. బస్తీలలోని ప్రముఖ నాయకులు బెల్లంగొట్టిన రాళ్లలాగా మౌనవ్రతం పట్టారు.

*　　*　　*

జిల్లా అధికారులు తమలోతాము సంప్రదించుకున్నారు. లక్ష్మి తండ్రి వెంకటేశంగారిని పిలిపించుకొని ముఖ్యమైన గ్రామాలలో, పన్నుల వసూళ్ల బాధ్యతను స్వీకరించవలసిందిగా కోరారు. అపుడు న్యాయంగా ఈ కార్యక్రమం వెంకటేశంగారి ఉద్యోగ బాధ్యతలలో లేకపోయినా ప్రత్యేక బాధ్యత క్రింద ఈ పనిని చేపట్టమని అడిగారు అధికారులు. వెంకటేశంగారు ఆలోచించి చెపుతామన్నారు.

వెంకటేశంగారికి ఈ గ్రామాలన్నింటిలో వ్యక్తిగతంగా పేరు ప్రఖ్యాతులున్నాయని జిల్లా అధికారులు గుర్తించారు. ఆ మంచి తనంతో వెంకటేశంగారు ప్రజలను ఒక రకంగా అంగీకరింపజేస్తారనే నమ్మకాన్ని ఏర్పరచుకున్నారు.

అప్పటికి చాలా రోజులుగా సాగుతూన్న ఈ పోరాటాన్ని వెంకటేశంగారు గమనిస్తూనే ఉన్నారు. ప్రజలు లోనౌతున్న బాధలకు లోలోన పరితపిస్తూనే ఉన్నారు. బస్తీనాయకులు ప్రజలను పురిగొలిపి రంగంలోనికి దించటం వరకైతే జేశారుగాని, తదుపరి ప్రజలు ఎదుర్కోవలసి వచ్చిన బాధలకు పరిష్కారం కనుగొనలేక పోయారు. ప్రజలేమో సతమతమై పోతున్నారు.

వెంకటేశంగారు ఆలోచించుకున్నారు. ఈ విషమ సమస్యకు ఏదో రకమైన పరిష్కారం సాధించి ప్రభుత్వం పెడుతూన్న బాధలనుంచి ప్రజలను తప్పించాలని నిశ్చయించుకొన్నారు.

అదే కాలంలో, ప్రిన్స్ ఆఫ్ వేల్స్, మనదేశానికి వచ్చారు. వారితోపాటు వచ్చిన ఒక సైనిక రెజిమెంటును మద్రాస్ నుంచి గుంటూరు జిల్లాకు పంపించి, పశు బలంతోనైనా సరే ఇచ్చటి ఉద్యమాన్ని అణచి వేయవలసిందిగా మద్రాస్ ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది. కవాతులుజేస్తూ అట్టహాసంతో దిగిన సైనిక పటాలాన్ని వెంకటేశంగారు గమనించారు. ఈ తెల్లసైనికులు మన గ్రామాలకువెళ్లి ఎంతటి అల్లకల్లోలం సృష్టించగలరో ఊహించుకున్నారు.

జిల్లా అధికారులు మరొకసారి వెంకటేశంగారిని పిలుపించుకున్నారు. తెల్లపటాలాన్ని తీసుకొని పన్నుల నిరాకరణోద్యమం సాగిస్తూన్న పెదనందిపాడు ప్రాంత గ్రామాలకు వెళ్లి పన్నులు వసూలు జేసుకొని రావలసిందిగా ఉత్తర్వులిచ్చారు.

దారిపొడవునా ఆంగ్లసైనికులు పల్లెవాసులపై కక్షతో చేతికందిన ప్రతి పైరునూ, పీకివేస్తూ నష్టాన్నిగల్గిస్తున్నారు. ఇది గమనించిన వెంకటేశంగారు తక్షణం ప్రత్యేకదూతను పంపి రాష్ట్ర ప్రభుత్వ ముఖ్యఅధికారులకు విషయవివరణజేసి, వెంకటేశంగారి ఉత్తర్వులను మాత్రమే శిరసావహించవలసిందిగా, క్రమశిక్షితులుగా మెలగవలసిందిగా, పటాలానికి ఆర్డర్లు తెప్పించారు.

ఒకరోజు ఒక గ్రామంలో, సైనికులలోని ఒక కుర్రకుంక ఒక కులీన కుటుంబపు మహిళపై ఒక రాయి విసిరాడు. దానితో స్త్రీ జనమంతా శాపనార్థాలు సాగించారు. ఆబాలగోపాలం ఆవేశపూరితులయ్యారు. గ్రామంలో చిచ్చు రగుల్కొంది. సిపాయీలను చుట్టుముట్టారు.

వీరి వెంటనున్న సైనికాధికారి ప్రజలపై తుపాకులు ప్రేల్చవలసిందిగా ఉత్తర్వులిచ్చాడు. తన నడుముకున్న తోలు పటకాలోంచి పిస్తోలుదూసి, ఝుళిపించాడు. జనముకేసి చూచి వెర్రికేకలేశాడు.

వెంటనే వెంకటేశంగారు జోక్యం కలిగించుకున్నారు. 'స్టాప్' అని అంతకంటే పెద్దగొంతుకతో సిపాయీలకు ఉత్తర్వులిచ్చారు. బారుచేసిన తుపాకిలను దించమన్నారు.

తెల్ల అధికారికి ఒళ్లు మండింది. ఆగ్రహావేశంతో క్రిందుమీద య్యాడు. వెంకటేశంగారితో, "కాల్పులనెందుకు ఉపసంహారించావు?" అని ప్రశ్నించాడు. "అది నా ఇష్టం!" అన్నారు వెంకటేశంగారు.

"మరి మేమెందుకు?" అని అడిగాడు తెల్ల అధికారి.

"నా ఇష్టాన్ని పాటించటానికి" అని నిర్భయంగా పలికారు వెంకటేశంగారు.

"అట్లాగా" అని దీర్ఘంతీశాడు అధికారి. ఇంకా ఆవేశంతో ఎగిరిపడుతూనే ఉన్నాడు.

"అందుకు నిదర్శనంగా, మద్రాస్‌లోని మీపై సైనికాధికారి పంపిన తాఖీదు నీ కుడిజేబులోనే ఉండి ఉంటుంది. ఒక సారి విప్పి చూచుకో"— అన్నారు వెంకటేశంగారు.

మద్రాస్‌లోని రెజిమెంటూ, తన పై అధికారీ, జ్ఞాపకం రావటం తోనే, అధికారి ఆగ్రహావేశమంతా ఒక్కసారిగా దిగిపోయి కాళ్లు చల్లబడ్డాయి. అయినా, కాల్పులకు ఉత్తర్వులు ఇవ్వవలసిందిగా మరలవత్తిడి పెట్టాడు.

"ససేమిరా ఇవ్వన"న్నారు వెంకటేశంగారు.

"నిన్నేమి జేస్తానో చూడు" అన్నాడు పెద్దగొంతుతో అధికారి.

"నీ ఇష్టంవచ్చినట్లు జేసుకో" అన్నారు అంతకన్నా పెద్ద గళంతో వెంకటేశంగారు.

రంగమంతా రెండు నిముషాలసేపు నిశ్శబ్దం ఆవహించింది. జనమంతా ఇందాకటినుంచి జరుగుతూన్న కథను చూస్తూనే

ఉన్నారు. సంగతి గ్రహిస్తూనే ఉన్నారు.

ఎదురుగా మోహరించిన ప్రజలవద్దకు, వెంకటేశంగారు శాంత గంభీరవదనంతో నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ నడిచారు. అంద రినీ ఒక సారి కలయజూచారు.

అందఱకూ వినిపించే విధంగా, అదుపుమీరిన పరిస్థితిని అర్థ మయ్యేట్టు తెలిపారు. సిపాయీలలోని ఒకకోతి గున్నచేసిన పొర పాటుపనికి, గ్రామమంతా నష్టపడగూడదని హితవు పలికారు. ఎవ రిండ్లకు వారు తిరిగి పోవలసిందిగా అర్థించారు. కథంతా గమనించిన ప్రజ వెంకటేశంగారి మాటలు శాంతంగా అర్థం జేసుకున్నారు.

కాని కొందరు గ్రామీణ యువకులు ఎదురు చెప్పారు. ఆడ వారిపై నిష్కారణంగా రాయివిసరిన తెల్లకోతిని పరాభవించా ల్సిందే ననిపట్టు బట్టారు. తామంతా సిపాయీలతో పోరాడటానికి సిద్ధంగా ఉన్నామన్నారు. ఆవేశంతో, రోషంతో అడ్డగోలుగా మాట్లాడ నారంభించారు. తమ చేతుల్లోని సనుగొయ్యలూ రాగోళ్లు ఎత్తి సైనికులవైపు చూసి, "రాండిరా" అంటూ కేక లేస్తున్నారు.

"పరిస్థితి ఈదఫా ఇక్కడ అదుపుతప్పిందా ?"— అని వెంక టేశంగారు ఒక క్షణం సంశయించారు. రెండుక్షణాలు ఆలో చించారు.

"రైట్ ! పోరాడండి. మీతోపాటు నేనూ నిలబడతాను. వారు నాకు చుట్టాలుగాదు. మీరు... అంతా చుట్టాలే ! మీరెక్కడ చచ్చిపోతారో ననేబాధతో మాత్రమే నేను మిమ్మువారిస్తున్నాను. పచ్చని ఊరంతా సర్వనాశనమౌతుందో ననే బాధతో మీకు అడ్డువస్తు న్నాను. సరే. మీరు పోరాడుతామంటున్నారు. పోరాడండి. అయితే ఒక్కక్షణం ఆలోచించండి" అని కొంచెం పెద్దగొంతుకతోనే ఆయువకులతో పలికారు.

"ఏమిటండీ ! ఇంకాఆలోచించేది ?" అన్నాడు ఒకయువకుడు.

"ఏమిటా? పోరాట్టానికి మీ వద్ద ఏమున్నాయి?" సూటిగా

ప్రశ్నించారు వెంకటేశంగారు.

"వారికా, చూడండి. తుపాకులున్నాయి. వాటికి దట్టించిన సున్నీలున్నాయి. నడుములకు పటకాలున్నాయి. పటకాలలో కత్తులున్నాయి. మరిమన దగ్గరో ?" అన్నారు వెంకటేశంగారు. యువకులు ఒకరిమొగంఒకరు చూచుకున్నారు. తమ అశక్తతకు తమలో తాము క్రుంగి పోయారు. ఆవేశంతో కందిపోయిన ఆ గ్రామీణ యువకుల మొఖాలలో దీనత వెల్లివిరిసింది. వారి రోష కసాయిత నేత్రాల్లో మండిన అరుణిమను క్రిందికివాలిన కనురెప్పలు సగం కప్పివేశాయి.

"ఒక్కో తుపాకి కనీసం నిముషానికి నలుగురిని బలి తీసుకుంటుంది. ఎదురుగా ఎందరు సిపాయీలున్నారో చూడండి. ఎన్ని తుపాకులున్నాయో గమనించండి. మనం ఎందరమున్నామో చూచుకోండి. మనచేతుల్లోని సనుగొయ్యనాట్లూ, రాగోళ్లు ఎందుకు పనికివస్తాయో ఆలోచించుకోండి."

వెంకటేశంగారు చెప్పకుపోతున్నారు. ఎదురుగా ఉన్న యువకులతోపాటు, మూగిన స్త్రీలు, పెద్దలూ ఒకరినొకరు ఒరుసుకుంటూ వెంకటేశంగారి మాటలు వింటున్నారు. వారి మాటల్లోని తీక్షణత వారి మనసులకు తగులుతోంది. ఆయన చూపుల్లోని నిశితత్వం వారి దృష్టిని ఆకట్టుకొంది. ఆయన మొగంలోని నిజాయితీ వారి హృదయాలను తాకింది.

"ఇందాక ఒక సిపాయి చిలిపివెధవతో అవమానించబడ్డ మీ ఊరి యువతి, నీకు చెల్లెలుగావచ్చు, నీకు అక్క కావచ్చు, నీకు కూతురు గావచ్చు, నీకు వదినగారు గావచ్చు" అని జనంలో ఒక్కొక్కరి కేసి తనతర్జనిని చూపారు. "కాని నాకు గూడా ఆ అమ్మాయి బంధువు అయి ఉంటుంది. ఎక్కడో ఒకచోట బీరకాయ పీచులా బాంధవ్యం ఉండకపోదు. మరి మీ అందరితోపాటు, ఆ చెల్లెమ్మకు జరిగిన పరాభవానికి నేనూ బాధపడుతున్నాను. నామనసూ క్షోభ పడుతోంది."

వెంకటేశంగారు ఈ దఫా తానే ఆవేశంతో ఊగిపోయి మాట్లాడారు.

జనమంతా ఒకరి మొగం ఒకరు చూచుకున్నారు. అంతలోనే ఆవేశాన్ని తగ్గించుకొని వెంకటేశంగారు, అన్నారు. "మనకిప్పుడు కావలసింది ఆవేశమా ? ఆలోచనా ?—మీరే చెప్పండి ! " అంటూ జనంకేసి చూచారు. ముందుగా యువకులకేసి చూచారు. "ఈ ముహూర్తంలో మనం ఆవేశానికి లొంగిపోతే, ఆ తుపాకులు ఫటఫటా ప్రేలిపోతాయి. మీరు టపాటపా రాలిపోతారు. ఇదంతా నెత్తురు మడుగుగా మారుతుంది. పచ్చని గ్రామం వల్లకాడుగా మారుతుంది. ఇది నాకు సమ్మతం కాదు. నా మనుషులు బలికావడం నా కెంతమాత్రం ఇష్టంలేదు. ఆలోచించండి," అంటూ గ్రామ పెద్దలవైపు చూచారు.

గ్రామ పెద్దలు ఒకరి నొకరు చూచుకున్నారు. "ఇక్కడ తుపాకులు ప్రేలి జననష్టం జరిగిందంటే, ఆ తెల్ల సిపాయీల ఎత్తుగడ ఫలించినట్లే ! వారిని ప్రభుత్వం ఎందుకు పంపిందో ఆ పన్నుగడ సార్థకమయినట్లే !! ఏదో విధంగా ప్రజలను భయావహులను జేసి, తమ పాలన భద్రం జేసుకోవాలని తాపత్రయపడే అధికారులకు మనం ప్రాణాలు పోగొట్టుకొని సహాయం చేసినట్లేగా!" అని నింపాదిగా చెప్పారు వెంకటేశంగారు.

"మన బలంతోపాటు, మన శత్రువుల బలాన్ని గూడా అంచనా వేసుకొని పోరాటంలో దిగినపుడేగదా విజయం ప్రాప్తించటం. భారతంలోని యుద్ధపర్వాన్ని రామాయణంలోని యుద్ధకాండను మనం ఎన్నోసార్లు చదివో, వినో, నేర్చుకొంది ఏమిటి?" ఆలోచించండి. అంటూ వెంకటేశంగారు తెలిపారు.

గ్రామస్థులందఱకు వెంకటేశంగారు ఆక్షణంలో గవర్నమెంటు అధికారిగా కనపడలేదు. సైన్యంతోపాటు వచ్చిన ప్రత్యేక అధికారిగాగూడ కన్పడలేదు. వారి పెద్దన్నగా కన్పడ్డారు. ఎవరికి వారికి వారి పెద్దన్నయ్యగా కన్పడ్డారు. ఆ గ్రామానికే పెద్దన్న

య్యగా కన్పడ్డారు. అందరూ ఆయనకు ముకుళిత హస్తాలతో నమస్కరించి, నిశ్శబ్దంగా వెనుతిరిగారు. ఆ యుద్ధరంగం నుండి నిష్క్రమించారు. ఎవరిఇండ్లకువారు వెళ్లారు. ఆనాడు జరుగనున్న రక్తపాతాన్ని, జాతీయోద్యమ అపజయాన్ని, బ్రిటిష్ సైనిక పశు విజయాన్ని నివారించారు వెంకటేశంగారు. ఆనాడాయన తృప్తిగా, హాయిగా నిద్రపోయారు.

ఆ మంచితనంతోనే ప్రజలనూ, ప్రజాప్రముఖులను కలుసుకున్నారు. పన్నుల వసూళ్లలో జరిగే అకృత్యాలను అప్పటికప్పుడు తొలగించారు. ప్రజలు పన్నులు చెల్లించడం ప్రారంభించారు.

కుతకుతలాడుతూన్న అగ్నిగుండం చల్లారింది.

జిల్లా అంతటా ప్రశాంతత నెలకొన్నది.

కానీ తాను తుపాకులు ప్రేల్చమన్నా కూడా, తన అభీష్టానికివ్యతిరేకంగా ఉత్తర్వులిచ్చి ప్రజాభీభత్సాన్ని నివారించినందుకు ఆ ఆంగ్లేయ అధికారికి వెంకటేశంగారిపై అక్కసుగా ఉంది.

వెంకటేశంగారిమీద పై అధికార్లకు పితూర్లు వ్రాసుకున్నాడు.

"నాన్నగారు గూడా ప్రజల మనిషేననీ, సత్యాగ్రహులకు సానుభూతి పరుడనీ, ఎపుడూ ఖద్దరే ధరిస్తాడనీ'' ఆ పితూర్లలో ఆ తెల్లఅధికారి ఆరోపించాడని లక్ష్మి నవ్వుతూ చెప్పింది వారి నాన్నగారి కథచెబుతూ.

ఇంకా విచారించ వచ్చిన పై అధికారికి నాన్నగారు "తనలో ఉన్న మంచిని ఒకవేళ ప్రజలు మన్నిస్తే, అది తన తప్పుగాదనీ, తన ఇంట్లో తన పినతల్లిగారు స్వహస్తంతో వడికిన ఖద్దరు నూలుతో నేయబడ్డదుస్తులు ధరించడం తనకు అలవాటనీ, ఆడంబరాలకు పోయి ఖరీదైన దుస్తులు ధరించటం తన అభిమతం గాదనీ, సమాధానం చెప్పారు'' అని బిగ్గరగా నవ్వారులక్ష్మి.

అధికారులు నిజాన్ని గ్రహించారు.

వెంకటేశంగారిని రావు సాహెబ్ బిరుదంతో సత్కరించారు. గుంటూరు పట్టణంలో ఒక సన్మానసభ గూడా జరిపారు. వివిధ గ్రామాలనుంచి వచ్చిన పెద్దల ఎదుట ప్రముఖులు వెంకటేశంగారికి వెండి, బంగారాలతో తయారుజేసిన ఒక ఖడ్గాన్ని బహూకరించ బోగా, వెంకటేశంగారు వినమ్రతతో ఆ బహుమతులు నిరాకరిస్తూ, ప్రజాధనాన్ని ఈ విధంగా వృధా చేయవద్దని పెద్దలను కోరారు.

ప్రభుత్వం వెంకటేశం గారిని, క్రొత్తగా ఏర్పాటుచేసిన సహకార శాఖలో దత్త మండలాలకు డిప్యూటీ రిజిష్ట్రారుగా ప్రమోట్ చేసింది.

కుటుంబం బళ్లారికి మారింది. బళ్లారి ఎక్కువభాగం కన్నడ మయం. అందుకే లక్ష్మికి చిన్నప్పుడు తెలుగుకన్నా కన్నడం ఇంగ్లీషు ముందుగా అలవడ్డాయి.

తిరిగి వెంకటేశంగారు చల్లపల్లికి దివాన్‌గా పదవీ స్వీకారంజేసి బందరులో వారిని స్కూళ్లలో జేర్పించిన దాకా, ఈ అమ్మాయిలకు తెలుగు చదువనూ వ్రాయనూరాదు. కాని వీరి అదృష్టంకొద్దీ దొరికిన తెలుగు పండితుడు ఎంతో శ్రద్ధగా తెలుగు పాఠాలు నేర్పాడు. ఒకవైపు పాఠ్యగ్రంథాలను చదివిస్తూనే రామా యణ భారత భాగవతాది గ్రంథాలను నేర్పుతూ పద్యార్థాలను వీరిచేత చెప్పించేవారు.

లక్ష్మికి హైస్కూలు విద్యపూర్తయేసరికి వెంకటేశంగారిని, బెజవాడకు సబ్‌కలెక్టరుగా ప్రభుత్వం నియమించింది.

* * *

వెంకటేశంగారు, అప్పటిమద్రాస్‌రాష్ట్రముఖ్యమంత్రిగాఉన్న మునుస్వామినాయుడుగారు ఆప్తమిత్రులు తఱచు కలుసుకుంటుండే వారు. ప్రముఖజస్టిస్‌పార్టీ మేధావులు రామస్వామి మొదలియార్, లక్ష్మణస్వామి మొదలియార్, వెంకటేశంగారూ మద్రాస్ ప్రెసిడెన్సీ కళాశాలలో సహాధ్యాయులు. అందరిదీరాజకీయంగా

ఒకే అభిప్రాయం కనక జీవితంలో గూడా సన్నిహితంగా ఉండే వారు.

పెక్కుసార్లు వారి సంభాషణలలో దొరిలే వివిధ రాజకీయ సాంఘిక విషయాలను ఎంతో శ్రద్ధగా లక్ష్మి ఆలకిస్తూండేది. సర్కారు జిల్లాలలోని అనేకమంది జస్టిస్ పార్టీ ప్రముఖులతో వెంకటేశంగారికి మంచి స్నేహితం ఉండేది. ఎందరో పెద్దలు వీరి ఇంటికి వస్తూండేవారు. ఆ నాటి సాంఘిక వ్యవస్థలో ఉన్న నిమ్నోన్నతములను లోటుపాట్లనూ, భిన్నకోణములనుంచి పరిశీలించుకునేవారు. తర్కించుకునేవారు. వాస్తవాలను నిగ్గ దేల్చుకునే వారు.

గ్రామీణులకు అర్హమైన గౌరవం లభించడం లేదని బాధపడే వారు. పల్లెప్రజకు వినూత్న దృక్పథం గలిగించటానికి తాపత్రయ పడేవారు. వారిలో నూతనోత్తేజాన్ని కలిగించటానికి కార్యక్రమాలు రచియించుకునేవారు.

పల్లెలనుంచి విద్యార్థులుగా బస్తీలకొచ్చినవారికి పలురకాల ప్రోత్సాహం గలిగించే కర్తవ్యాన్నిచేబట్టేవారు. పలుచోట్ల హాస్టల్సు నిర్మాణ బాధ్యతలను నిర్వహించేవారు. పేదలకు ఉచిత భోజన వసతి విధిగా చూపేవారు. వివిధ పదవులలోనున్న జస్టిస్ పార్టీకి సంబంధించినవారు బాధ్యతలను విస్మరించకుండా, ధర్మనిష్ఠతో ప్రజలను పాలించాలనీ, నిస్వార్థంగా మెలగాలనీ ఒకరినొకరు హెచ్చరించుకునే వారు. సద్ధర్మానుష్టానంతో కర్తవ్యాలను నిర్వహించుకునేవారు.

తెలుగుదేశంలో గ్రామస్థాయిలో రాజకీయాలను తొలిగా ప్రవేశపెట్టింది, సాంఘిక రంగంలో చైతన్య జ్వాలలను రగిల్చింది జస్టిస్ పార్టీ.

ఆనాటి సాంఘిక వ్యవస్థలో చదువులకు అవకాశమున్న కొన్ని కులాలవారు, యావత్ సామాజిక వ్యవస్థను అదుపులో ఉంచుకొని పెత్తనం జేస్తూన్నరోజులవి.

క్రైస్తవం తెలుగు గడ్డపై అడుగిడకముందు, సంఘపాలన అంతా చదువరి కులంలోని ఒక కొద్దిమందికి మాత్రమే పరిమితమై

ఉండేది. పండుగ పబ్బాలన్నీ ఈ అధికుల మనోల్లాసాలవరకే పరిమితమై ఉండేవి. రోగాలలో రొష్టులలో తగాదాలలో కచేరీ వ్యవహారాలలో కోర్టుపేచీలలో వారి మాటకే చెల్లుబాటు. సామాన్యుల జీవితం వారి పలుకుబడితో అతలాకుతల మయ్యేది. పౌరుని జీవితం వారి ఏలుబడిలో, చావుపుట్టుకల నుంచీ, పెండ్లిపబ్బాలవరకు ప్రభావితమౌతూ ఉండేది.

కిరస్తానీ మత ప్రాభవంతో, దిగువతరగతుల ప్రజానీకపు పిల్లలకు, మతంపైన నమ్మకమున్నా లేకున్నా, విద్యాలయాలలో ప్రవేశం దొరికింది. ఫలితంగా చదువులబ్బడం, జ్ఞానవంతులు గావడం, మనస్సులను వికసింపజేసుకోవడం జరిగింది.

జనాభా సంఖ్యలో నూటికి ముగ్గురు మాత్రంగానే ఉన్న ఈ అగ్రకులస్థులు, ఆ నాటి ఆంగ్లేయుల దొరతనపు ఉద్యోగాలలో డెబ్బయి ఆరు శాతం వరకు ఉన్నారు. అదే నిష్పత్తిలో న్యాయవాదులుగా, జడ్జీలుగా ఉన్నారు. అధ్యాపక పదవులలో గూడా ఎంతో అధిక సంఖ్యలో ఉన్నారు. మిగిలిన కులాలవారికి ఇది అన్యాయంగా తోచింది. కంటకింపు ప్రారంభమైంది.

ఎదిగిన మనస్సులతో సాంఘికంగా తమ స్థితిగతులు తాము తెలుసుకొని, ఒక ఆరోగ్యకరమైన మార్పు రావాలనే కోరిక క్రమంగా బలంపుంజుకొని, కాలక్రమేణా జస్టిస్ పార్టీ అవతరణకు కారణమయింది.

ఆనాటి గ్రామీణ వ్యవస్థలో సంపన్న వ్యవసాయ కుటుంబాలకు జెంది, శుద్ధంగాచదువుకొని సమాజ శ్రేయస్సు వాంఛించినవారు ఈ పార్టీకి ప్రారంభకులూ, ప్రోత్సాహకులూ ఐనారు.

క్రింది వర్గాల మేధావులవరకే ఆదిలో పరిమితమైన జస్టిస్ పార్టీ అనతికాలంలోనే, జిల్లా కేంద్రాలు, తాలూకా కేంద్రాలకు విస్తరించి, పల్లెప్రాంతాలకుగూడా ప్రాకింది. ఈ భావాల ప్రభావంతో

ఉత్సాహితులైన అనేక మంది గ్రామీణులు, జస్టిస్‌పార్టీ ఆదర్శా లను తోటివారికి ఎరిగించడంలో తోడ్పడ్డారు.

వీరు ప్రధానంగా సాంఘిక సంస్కరణలూ, చట్టబద్ధ పరిపాలనా కోరుతున్నారు కనుకనూ, ప్రభుత్వాన్ని సమర్థిస్తూనే స్వల్పమైన రాజకీయ మార్పులు వాంఛిస్తున్నారు కనుకనూ, ప్రభుత్వోద్యో గాలలో అధిక శాతం బ్రాహ్మణేతరులకు రావాలని అంటున్నారు కనుకనూ, ఆంగ్లేయ ప్రభుత్వం, వీరి రాజకీయ కార్యకలాపాలలో జోక్యం గలిగించుకునేదిగాదు.

ఈ పార్టీకి నాయకులుగా ఉండి, మద్రాసు రాష్ట్ర ప్రధాన మంత్రిగా నాలుగు సంవత్సరాలు పరిపాలన జేసిన బొల్లిన మును స్వామి నాయుడుగారి మరణానంతరం, ఆయనవద్ద నిల్వవున్నది ఆరు రూపాయల చిల్లరే అని తెలుసుకున్న తదుపరి, జస్టిస్‌పార్టీ నాయకులు ఎంతటి ఋజువర్తనులో ఎంతటి శీలవంతులో లోకానికి వెల్లడైంది.

రాష్ట్ర ప్రభుత్వంలో ఉన్న జస్టిస్‌పార్టీ ప్రతినిధులుగానీ, ఆనాటి స్థానిక సంస్థలపై ఆధిపత్యం నెఱపిన పార్టీనాయకులుగానీ ఒకరిచేత వ్రేలెట్టి చూపించుకోని విధంగా పరిపాలన కొనసాగించడమే గాక, వారి వర్తనను ఆదర్శంగా ఉంచుకొని ఉన్నతోద్యోగుల నడ వడిలో వరవడి పెట్టారు.

ఆకోవకు జెందినవారే, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి, బెజవాడ రామచంద్రా రెడ్డి, బొబ్బిలి రాజా, పాత్రో, చల్లపల్లి రాజా, వెంకటగిరిరాజా, త్రిపురనేని రామస్వామి చౌదరి లాంటి లబ్ధ ప్రతిష్ఠులు.

తమిళ జిల్లాలలోగూడా, ఆనాడు జస్టిస్‌పార్టీకి నాయకత్వం వహించిన పెరియార్ రామస్వామి నాయకర్, డాక్టర్ సుబ్బ రాయన్, పి.టి. రాజన్, త్యాగరాజు చెట్టి, డాక్టర్ నాయర్ లాంటి ప్రసిద్ధులు, సుపరిపాలనా నిర్వహణలో విశిష్ట కర్తవ్యాలను నిర్వ హించారు.

ఈ అభ్యుదయ భావాలకు ప్రాతినిధ్యం వహించి పాటుబడిన జస్టిస్‌పార్టీకి, బ్రాహ్మణేతర ఉద్యమం అనే అపకీర్తి గలిగించడానికి కొంత ప్రయత్నం జరిగినా, గాదె సింహాచలంగారివంటి అగ్ర కుల స్థుల భాగస్వామ్యం, ఈ అపవాదులను తొలగించి వేసింది.

ఇంకా, ఈ ఉద్యమానికి బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం అనే అపార్థం కల్పించడానికి విపులంగానే ప్రయత్నాలు సాగించినవారూ ఉన్నారు. ఈ స్థితి కొంతమటుకు తమిళ ప్రాంతంలో కనిపించిన మాట వాస్తవం. అక్కడ జస్టిస్‌పార్టీ కొంతవరకు బ్రాహ్మణ వ్యతి రేక ఉద్యమంగానే నడిచింది. తరతరాలుగా మరీ అణగగొట్టబడి అజ్ఞానంతో, అవమానాలతో ఘూర్ణిల్లుతున్న శూద్రకులాలు తమిళ ప్రాంతంలో సంఘటితపడి, అగ్రకులాలకు వ్యతిరేకంగా పోరాడారు. ఆనాటి అక్కడి సాంఘిక వ్యవస్థ అలాంటిది. క్రమతః, ఈ భావనే బలపడి రాజకీయ పార్టీలలో ఘనీభవించింది.

ఈ పరిస్థితి తెలుగునాట ఉత్పన్నంగాలేదు. జస్టిస్‌పార్టీ ప్రముఖులకు హితవరులూ, సహచరులూ, ఆప్తమిత్రులూ, అగ్ర వర్ణాలలో చాలమంది ఉన్నారు. సామాజిక రాజకీయ అభిప్రాయ వ్యత్యాసాలు ఎన్ని ఉన్నా, వ్యక్తిగత స్నేహశీలతకు భంగంవాటిల్ల కుండా నడుచుకున్నారు. భిన్నరాజకీయ దృక్పథాలతో సంచరిస్తూనే జస్టిస్‌పార్టీ నాయకులు ఇతర పార్టీల ప్రముఖులతో సహానుభూతితో ఉండేవారు.

తమ పార్టీదృక్పథాన్ని బలపరచు కుంటూనే, తమ కార్య కలాపాలను విస్తృత పరచుకుంటూనే, మహోధృతంగా కొనసాగు తూన్న కాంగ్రెస్ ఉద్యమాలను సానుభూతితో పరికిస్తుండేవారు. కాంగ్రెస్ పార్టీకి చెందిన ప్రముఖకార్య కర్తలకు తగు గౌరవం ఇస్తుండే వారు.

ఒక రోజు రాత్రి వెంకటేశంగారు భోజనాలు ముగిసిన తరు వాత, తాంబూలం వేసుకుంటూ వాలుకుర్చీలో పడుకొని ఉన్నారు. లక్ష్మి తండ్రితో పాటుగా భోజనం పూర్తిచేసుకొని దినపత్రిక

చూస్తోంది. మాటల్లో రాజకీయాలు దొర్లాయి. ఏమాత్రం అవకాశం ఉన్నా బిడ్డలతో రాజకీయ ప్రస్థావన తీసుకురావడం వెంకటేశం గారికి ఇష్టం.

"కుప్పుస్వామి చౌదరిగారు ఏమి చేశారో చూశావాతల్లీ!" అన్నారు వెంకటేశంగారు.

"ఏమి చేశారు నాన్నగారూ?" అడిగింది లక్ష్మి.

"అయిదువేల రూపాయీలనోటు అడ్డంగా చించివేశారు" అన్నారు వెంకటేశంగారు.

"ఎందుకని నాన్నగారూ?" అడిగిందిలక్ష్మి.

"చీరాల పేరాల ఉద్యమ నాయకుడు, దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారిపేరు తెలుసుగా అమ్మా!" అని అడిగారు వెంకటేశం గారు.

"వారు సుప్రసిద్ధ కాంగ్రెస్ పార్టీ కార్యకర్తగాదాండీ!" అన్నదిలక్ష్మి.

"అవును, ఆయన తాను నడుపుతూన్న ఉద్యమానికి అవసరమై కుప్పుస్వామి చౌదరిగారి వద్దకు వచ్చి, డబ్బు అప్పుగా ఇవ్వమన్నాడుట, చౌదరిగారు అప్పువద్దూ, సప్పువద్దూ, అంటూ, మానేజర్‌ను పిలిచి "భోషాణంలో డబ్బెంతఉంది"అని అడిగారట. "అయిదు వేలు ఉన్నాయని" మానేజరు చెప్పాడట. "సరే అదికాస్త మన గోపాలకృష్ణయ్యకు ఇయ్యి" మన్నారట కుప్పుస్వామిచౌదరి గారు.

గోపాలకృష్ణయ్య ఆడబ్బు తీసుకొని నోటు రాయబోతుండగా, 'నోటూవద్దు, పత్రమూవద్దు పోయిరాగోపాలకృష్ణయ్యా' అని చౌదరిగారన్నారట.

"కుప్పుస్వామీ! ఇంతకుముందు రెండుసార్లు నేనుడబ్బుకొఱకు వచ్చాను. రెండుసార్లూ నీవు పెద్దమొత్తాలలోనే అడిగిందే తడవుగా ఇచ్చావు. ఎంతఇచ్చావో నీవుమరచావు. ఎంత పుచ్చుకున్నానో నేనుమరచాను. ఈ గుప్తదానాలకు గూడా జ్ఞాపక చిహ్నాలుండాలి.

గదా? నేను తిరిగి ఈ డబ్బు ఇవ్వలేనని నాకు తెలుసు. నీకూ తెలుసు. ఇవ్వలేనిరోజున నీవు కోర్టుకు వెళ్ళవని మన ఇద్దరకూ తెలుసు. అయినా ఎందుకైనా మంచిది. నాతృప్తికోసరమన్నా ఈ పత్రాన్ని పూర్తిచేయనీ; మానేజరుకు ఇచ్చివెళ్తాలే.'' అంటూ గబగబా నోటు గీకి, మానేజర్ చేతిలోపెట్టి వెళ్ళాడట గోపాలకృష్ణయ్య. చాలా రోజులు గడిచాయి.

"మొన్ననాలుగురోజులనాడు ఈ సంగతి ఒక ప్రముఖ జస్టిస్ పార్టీ నాయకునికి తెలిసింది. ఆయన రాష్ట్రమంత్రి మండలిలో సభ్యుడు. ఆయనకు కుప్పుస్వామిగారు చేసినపని ఏమీసహించలేదు. వెంటనే చెన్నపట్టణంనుంచి బయలుదేరి చీరాలవచ్చారు మందీ మార్బలంతో కుప్పుస్వామిగారి ఇంటికి. స్వాగతాహ్వానాలు ముగిసిం తర్వాత, మంత్రిగారు చౌదరిగారిని "గోపాల కృష్ణయ్యకు డబ్బు యిచ్చింది నిజమేనా'' అని అడిగారు. "నిజమే" నని చౌదరిగార న్నారు. ''నోటు రాసియిచ్చాడటగా !" అనిఅడిగారు అతిథి. కొంచెం ఇబ్బందిపడ్డారు కుప్పుస్వామిగారు. ''నేను వద్దంటున్నా ఆపిచ్చోడు నోటునేగీకి పారవేసిపోయారు.'' అని తెలిపాడు కుప్పుస్వామిగారు.

"ఆ నోటు తెప్పించు; దావావేద్దాము. ఈ గోపాలకృష్ణయ్య ఏమిటో బహు నిక్కుతున్నాడు. ఆ నిక్కుడేమిటో తేలుతుంది. తెప్పించునోటు" అంటూ ఆవేశంతో మాట్లాడాడుమంత్రి. "నోటా-దావా" అనివాక్యం పూర్తి చేయలేకపోయారు కుప్పుస్వామిగారు.

'అవును అది తెప్పించి నాకు యిచ్చిందాకా నీఇంట్లో తిండి తినను సరిగదా నీరన్నా ముట్టను.' అని భీష్మించాడు ఆస్నేహితుడు.

ఆతిథ్యానికీ వితరణకూ కుప్పుస్వామిగారి ఇంటికి సర్కారు జిల్లాలలో పెట్టింది పేరు. ఈ స్నేహితుని మంకుపట్టుకు, కుప్పుస్వామి గారి హృదయం విలవిల లాడిపోయింది.

''సరే నోటు యిస్తాలే!" అన్నారు కుప్పుస్వామిగారు.

కుప్పుస్వామిగారు మాట అంటే తప్పరనేదిగూడా ఒకనానుడి. స్నేహితుడు సంతోషించాడు. నిన్నరాత్రి చీరాలలో గడిపి ఈ

తెల్లవారి ఉదయాన్నే కారంచేడు వచ్చారు ఇద్దరు మిత్రులూనూ.

ఫలహారాలు ముగించుకొని, తమ్ముడు చౌదరిగారిని పిలిచారు కుప్పుస్వామిగారు. చౌదరిగారు అన్నగారిని సమీపించగనే, "ఆ గోపాలకృష్ణయ్య ఆమధ్య రాసి ఇచ్చిపోయిన నోటు మానేజర్‌తో చెప్పి తెప్పించుబాబూ" అని అన్నారు. ఆ యింటి వ్యవహారాలన్నీ చౌదరిగారి పర్యవేక్షణలోనే సాగుతుంటాయి. రాతకోతల బాధ్యత లన్నీ వారివే. ఇచ్చిపుచ్చుకునే బరువులన్నీ తమ్ముడిగారివే.

నిముషాలలో నోటువచ్చి కుప్పుస్వామిగారి చేతుల్లో వాలింది. ఏనోటూ అప్పటిదాకా చేతితో తాకని కుప్పుస్వామిగారు దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు వ్రాసిన ప్రాంసరీనోటు చేతితో పుచ్చు కున్నారు.

స్నేహితుని వైపు చూచారు.

నిత్యాగ్ని హోత్రంగా చేతిలోవెలిగే సిగరెట్టు పొగను ఒక సారి పీల్చి దూరంగా విసిరేశారు.

"ఇదుగో ఇటుచూడు.'' అన్నారు. స్నేహితుడు ఆసక్తిగా నోటుకేసి చూచాడు. తనువచ్చిన పని పూర్తవుతుందిగదా అని తృప్తిగా ఉన్నాడు. కుప్పుస్వామిగారికేసి చూచాడు. నిత్యమూ సంతృప్తివెల్లి విరిస్తూ చిందులాడే కుప్పుస్వామి గారిప్రశాంతవదనంలో, ఒక నల్లమబ్బు తునక దోబోచులాడింది. చల్లగా నిత్యమూ ప్రస రించే కాంతులు కుప్పుస్వామిగారి కనులలో మసకబారాయి.

"ఇదుగో నోటు ఇస్తాను. అయితే ఒకమాటవిను. గోపాల కృష్ణయ్యా నేనూ బాల్యమిత్రులం. ఒకచోట ఆడాము, పాడాము. ఒక్కచోట చదువులు సాగించుకున్నాము. పరస్పర గౌరవ విశ్వా సాలు పెంపొందించుకున్నాము. సహానుభూతిని పెంచుకున్నాము. ఈనాడు రాజకీయాలలో మాకు బేధాలు పొడసూపవచ్చు. మా కార్యక్రమాలూ విభిన్నమైనవిగా ఉండవచ్చు. మామా ధ్యేయాలలో సయితం ఉత్తర దక్షిణ ధృవాల తారతమ్యం తోపవచ్చు. కాని

వీటన్నింటికీ మించి జీవితం ఉందిగదా! ఆ జీవితానికి తలమాని కాలుగా వర్ధిల్ల వలసినవి, విలువలుగదా!! ఆ విలువలను మనం పరిరక్షించుకోవాలసినపని లేదంటావా?" అన్నారు కుప్పుస్వామిగారు.

పెద్ద కుర్చీలో అటునుంచి ఇటు సర్దుకొని, మరల, "నీవు నెలకు అయిదువేల రూపాయిలు మంత్రిగా జీతంతీసుకుంటున్నావు. నాకు డబ్బు అవసరం ప్రసక్తి లేదు. మరి గోపాలకృష్ణయ్యో! నెలకు రెండువందల భృతిగల వనరుని నిర్లక్ష్యంగా కాలదన్ని, తాను విశ్వసించిన ఒక ఆదర్శానికి కట్టుబడి కృషి జేస్తున్నాడు. ఆకృషిలో కుటుంబాన్ని విస్మరించాడు. భార్యాబిడ్డల ఆకలిదప్పులను ఏమరచాడు. తన దృష్టిని ఏటో అగమ్యంలోనికి జొనుపుకొని, అక్కడ లీలా మాత్రంగా, దృగ్గోచరమయ్యే ఆదర్శపు ధ్యేయాన్ని గుర్తించుకొని అందుకోసం పలుపాట్లు పడుతున్నాడు. ఆ పాట్లకే మనవద్ద ఈ కొద్దిమొత్తం తీసుకవెళ్లాడు. తన కృషి ఫలితంగా, భవిష్యత్తులో ఈ దేశానికి లభ్యమయ్యేది రామరాజ్యమని, నమ్ముకున్నాడు. అతని నిజాయితీని, త్యాగనిరతిని మనం గుర్తించాలిగదా! ఆ గుర్తింపుకు ఒక విలువనివ్వాలిగదా!! మరి ఇప్పుడు చెప్పు! ఈ నోటు నీకు ఆర్డరువేసి ఇచ్చి, అతన్ని కోర్టుకీడ్చి, డబ్బుకట్టలేని కారణంగా జైలుకుపంపించటం మంచిదా? లేక మన హృదయాలను మనం గుప్పిటతో పిండుకొని పిప్పిజేసుకొనడం మంచిదా? ఆలోచించిచెప్పు. అయినా ఈ కాగితంముక్క నాదగ్గిర ఉండబట్టే గదా మనకీ అధికారం. కసి తీర్చుకోవాలనే కుతీనూ" —— అని అంటూ కుప్పుస్వామిగారు, రెండుచేతులతో పరపరా దాన్ని చింపి నాలుగుముక్కలు చేసి, గబగబా ఎదురుగానడిచి, మరో ఉన్న తాసనంపై ఆసీనుడైన స్నేహితుని చేతిలో ఆ ముక్కలు ఉంచారు. అన్నమాట చెల్లించుకున్నారు. అశ్వద్ధామహతా హాతః——లాగ.

మిత్రుడయిన ఆ మంత్రిగారు, ఈ హఠాత్సంఘటనకు ధ్రమాన్పడి పోయారు. క్షణంలోనే మరల తమాయించుకున్నారు.

"కుప్పుస్వామీ, నీలాంటి ఉత్తమమిత్రుడు నాకు ఉన్నందుకు, నేను ధన్యుడనయ్యా! నాకండ్లు తెరిచావు. నీవు నిజంగానే ఉత్త ముడవనుకున్నాను గాని ఇంతకాలం, ఇంతదొడ్డ హృదయుడవని నేడే తెలుసుకున్నాను అన్నా! నా దృష్టిలోపానికి నేను విచారిస్తు న్నాను. అయినా నీసాంగత్యంవల్లా, నేటి నీ చర్యవల్లా నన్ను నేను మార్చుకుంటూ, ఆ మార్పుకు గర్వపడుతున్నాను కుప్పుస్వామీ. సెలవు ఇప్పించు వెళ్లివస్తాను." అంటూ లేచి వెళ్ళారు, లక్ష్మి—! అదీ కథ. అయిదువేల రూపాయల అపురూపుగాధ." అంటూ వెంక టేశంగారు కూతురు వైపు చూచారు.

వెంకటేశంగారు ఏమిచెప్పినా కథగా చెప్పడం అలవాటు. హృదయాని కత్తుకుకొనేట్టు చెప్పడం అలవాటు.

హృదయాని కత్తుకునేట్లు చెప్పిన ఈ కథలాంటి వాస్తవాన్ని లక్ష్మి మననం జేసుకుంది మనస్సులో.

ఈలాంటి వివిధసంఘటనల వినికిడితోనే, మనస్సును తదుపరి జీవితంలో అవధులు లేని పరిధుల్లోకి వికసింప జేసుకొందిలక్ష్మి. పరుల అభిప్రాయాలకు మన్నన ఇవ్వడంలోనూ, తన అభిప్రాయాలను ఆలోచనను ఉన్నత వలయాలకు పెంచుకోవడంలోనూ, తండ్రినుంచి తెలుసుకున్న అభిప్రాయాలు సూత్రప్రాయంగా ఆనాడు బీజరూ పంగా ఉండి, లక్ష్మికి, అనంతరజీవితంలో ఎంతగానో తోడ్పడ్డాయి.

* * *

తెలుగుదేశంలో జస్టిస్ పార్టీ ఆవిర్భావంతో ఏర్పడిన నూతన వాతావరణాన్ని త్రిపురనేని రామస్వామి చౌదరి ప్రజల భావవికస నకు ఉపయోగించారు. భావవిప్లవానికి పునాదిరాళ్లు బలంగా పాతారు.

జాతిని 'డూడూ' బసవన్నల వతుగా జేసి, తరతరాలుగా జాతిజీవనాడులలో ప్రవహిస్తున్న, బానిసమనస్తత్వానికి విరుగుడు అందించారు.

చిరకాలంగా మహద్గ్రంథాలుగా విలసిల్లుతూ, అత్యంత పూజ్యములుగా నిత్యశిరోధార్యములుగా భావింబడుతూన్న రామాయణ, భారతగ్రంథాలను నిశితమేథస్సుతో పరిశీలించి, నూతన భాష్యాలను ప్రవచించారు, ప్రకటించారు, ప్రచారంచేశారు. రాముడు దేవుడేగాదు పొమ్మన్నాడు. రావణుడే నీతిమంతుడు బహుబలపరాక్రమ సమన్వితుడూ, ఆరాధ్యుడూ అని అన్నాడు. విభీషణున్ని రాజద్రోహి అన్నాడు. రావణాదులు రాక్షసులు గాదన్నాడు. పాండవులకు రాజార్హతలేదన్నాడు. జూద పూరిత మనస్కులన్నాడు. కౌరవసుగుణాలూ, పాండవ దౌష్ట్యాలూ పక్షపాత బుద్ధితోభారతంలో ఉటంకించలేదని వ్రాక్రుచ్చాడు. నిదర్శనాలు చూపెట్టాడు.

ఈ నూతన భావాగ్ని జ్వాలలకు సంఘంలో వేడెక్కింది. అదే సమయంలో తాపీధర్మారావుగారు, తమ రచనలను కొత్త పాళీతో సాగించారు. ప్రజల నిత్యాచారాలలో ఉన్న అప్రాచ్యాలను వెలికి తీసిచూపించారు. దేవాలయాలపై బూతుబొమ్మలు ఎందుకు వెలిశాయో వివరించారు. యజ్ఞయాగాది క్రతువుల అంతరార్థాలను విడమరచి చూపారు. అదేరోజుల్లో అదే భావాలను గూడవల్లి రామబ్రహ్మంగారు ప్రజలభాషలో పత్రికల ద్వారా ప్రజాహృదయాలను స్పృశింపజేశారు. ప్రభావితంగావించారు.

తెలుగునాట భావవిప్లవ ఉద్యమం ప్రారంభమైంది. అనతికాలంలోనే చిలువలకు పలువలు సాగాయి. ఒక సూత్రాశ్రమం వెలిసింది. రామస్వామి చౌదరిగారికి శిష్యప్రశిష్యులు ఏర్పడ్డారు. అపుడే విద్యాలయాలలోంచి బయటికొచ్చిన పెక్కురు నవయువకులను ఈ భావాలు ఆకర్షించాయి. వారిని మేధావులుగా తీర్చిదిద్దాయి. "ఎందుకు?" అని ప్రశ్నించుకుంటం నేర్పింది ఈ ఉద్యమం వారికి.

బస్తీలలోనేగాక ఆనాటి గ్రామీణ యువతరాన్ని రామస్వామి చౌదరిగారి అసంఖ్యాక ప్రసంగాలు, రచనలూ ఒక ఊపు ఊపాయి. నాటి సాంఘిక దురాచారాలను అవలంబనం జేసుకొని బ్రతుకుతున్న గబ్బిలాలకూ, కూటనీతి గండభేరుండాలకూ అవినీతికర రాబందులకూ విషనాగులకూ చిరకాలంగా ఆశ్రయమిస్తూ, సదాచారాలపేరిట వెల్లివిరుస్తూన్న మహావటవృక్షంపై గొడ్డలిపెట్టు పెట్టారు. పెట్టుపై పెట్టు పెట్టారు. ముందు కొమ్మలు నరికారు తదుపరి వేళ్లను నరకసాగారు.

ఎంత మూర్ఖతతో అజ్ఞానంతో బ్రతుకుతున్నారో యువతరానికి తెలిపారు. భావదాస్యంతో ఎట్లామ్రగ్గుతున్నారో కంచుకాగడాలు వెలిగించి చూపారు. తమంతతాము చూచుకోమన్నారు. ఆలోచించుకోమన్నారు. అనుమానాలుంటే అడుగమన్నారు.

"నీ పెండ్లికి ఒకడిపెత్తనమేమిటయ్యా?" అని నిలదీసి ప్రశ్నించాడు.

"నీ శోభనానికిగూడా ఎవరోముహూర్తం పెట్టాలటయ్యా?" అని నిగ్గదీసి కసిరాడు.

"బజారుకెల్తుంటే వితంతువు ఎదురైతే, పనిగాదని భయపడి ఇంట్లోకి తిరిగి వెళ్లేంతటి ధైర్యస్థుడివటయ్యా?'' అని వీపుచఱచి ప్రశ్నించాడు.

"పులి ఎదురైనా నిలబడి పోరాడవలసినమీరు పిల్లి ఎదురైతే పని మానుకొని ఇంటిముఖం పడ్తారటయ్యా?'' అన్నాడుదీటుగా.

"సంఖ్యల్లోగూడా తీన్‌తేరా, ఆట్ ఆఠారాలా! ఎంత పతనమయ్యా?'' అని దిగులు ప్రకటించాడు రామస్వామిగారు.

విన్నజనం ఆలోచించుకున్నారు. రామస్వామిగారి ప్రశ్నలు బాగానే ఉన్నాయి. మరి ఆ సమాధానాలు తేల్చుకొని విస్తుపోయారు. ఆయన సమాధానాలు విని మరీ కృంగిపోయారు.

ఎంత పతనంలో బ్రతుకులు సాగుతున్నాయి !

"వధువూ వరుడూ వివాహం జేసుకునేపుడు, వివాహమంటే ఏమిటో వివాహానంతరం తాము ఎట్లా మసులుకోవాలో తెలుపుకోవాలిగాని, అటు పిల్లకూ, ఇటు పిల్లడికిగానీ, చూడటానికి వచ్చిన బంధువర్గానికిగానీ ఎంతమాత్రం అర్థంగాని ఆ మంత్రాలెందుకంటా? మీకేమైనా అర్థమౌతున్నాయా ?" అని దెప్పిపొడిచారు.

"చనిపోయిన వారికి శ్రాద్ధకర్మలు పెడితే ప్రేతాత్మలు సంతసిస్తాయా ? కాగా ఏడు తరాల వారంతా తిని త్రేన్చుతారా ? ఎంత హాస్యాస్పదం ! అని సూటిగా అడిగి నిండానవ్వేవాడు.

"చనిపోయిన వాళ్ల కెందుకుగాని, బ్రతికినవారిని బాగుగా చూడండి. అదే వాళ్లకూ మీకూ శ్రేయస్కరం" అని సూచించారు.

ఈ ప్రబోధలవలన జాతిజాగృతమైంది.

ఒక్కసారి యువతరంలో వికాసబీజాలు ఏర్పడాలేగాని, ఇక వాటిపని అవి జేసుకుంటూనే పోతాయి. మొదటిసారి నూతన భావ ప్రేరణ జరిగిన తదుపరి, ఆప్రేరణ తనపనితాను చేసుకుంటూ, ఎదురయ్యే అడ్డులను తొలగేసుకుంటూ, అవధులులేని హద్దులవరకూ ఉత్సాహంతో ఆవేశంతో పర్వులెడుతుంది.

ఆనాడు సరిగా అదే జరిగింది. చౌదరిగారి భావాలతో పరిచయమై ప్రభావితమైన యువకులు, మేధావులూ, ముందుచూపుతో జీవిత గమ్యాలవైపు నడకలుసాగించారు. తదుపరి రాజకీయ జీవితంలోవారు ఏ సూత్రాలతోనైనా ఆకర్షించబడనీగాక, ఆ జస్టిస్ పార్టీ, ఈ భావవిప్లవ ఉద్యమం, రామస్వామి చౌదరిగారి ఆలోచనలు మాత్రం సమాజానికి నూతన దృక్పథాన్ని ప్రసాదించిందనడం పరమసత్యం.

  

"అమ్మ ఎపుడూ రామభక్తురాలు. సదా శ్రీ రాముడు ఆమెకు ఆరాధ్యదైవం. రామచరితాన్ని ఎన్నోసారులు చదువు కునేది. రామనామాన్ని నిత్యమూ జపించేది." అంటూ తమతల్లి గారిని గురించి ఎంతో గౌరవంగా పలుకుతుంది లక్ష్మి.

సెలవురోజుల్లో, పనిపాటలుపూర్తయి విశ్రాంతిగా ఉన్నపుడు కుశలవులకథను, పిల్లలను తనతో కూర్చొబెట్టుకొని హృదయంగ మంగాగానంచేసేది. ఆ పాటలో కథలీనమయ్యేది. ఆకథలో ఆమె లీనమయ్యేది. ఆపాట ప్రవాహంలా సాగేది. కథశాంతంగా సాగి నంత సేపూ ప్రవాహం నిశ్చలంగా సాగినట్లుండేది. కథలో మలుపు లొచ్చినపుడు ప్రవాహంలో మలుపులొచ్చేవి. కథను బట్టి ఆగాన ప్రవాహం ఒకోచోట ఒరుసుకొని పారేది. ఒకోచోట సుడులు సుడులు తిరిగేది. మరోచోట అతివేగంగా నడిచేది. ఇంకోచోట భయం భయంగా పరిగిడేది. మరీ సీతాదేవి ఆరణ్యమధ్యంలో కుశలవులను ప్రసవించినపుడు, ఇక్ష్వాకువంశ పట్టపురాణి గావలసిన ఆ మహా యిల్లాలు, అనాదరణపాత్రమై కాననంలో కడగండ్ల పాలైన ఘట్టాలు గానంజేసేటప్పుడు, ఆమె గారి నయనాలు అశ్రుపూరితా లయ్యేవి. గొంతు పూడిపొయ్యేది. పాట పెగిలేదిగాదు. కథలో లీనమైపోయిన ఆమె గారిని అక్కడేదాపులో పడకకుర్చీలో కూర్చొని ఫైళ్లను చూచుకుంటూనే, రామకథను వింటున్న వెంక టేశం గారు ఓదార్చేవారు. లక్ష్మికి, చెల్లికృష్ణకు గూడా కండ్ల వెంబడి నీరు టపటప రాలేవి.

"ఎందుకు ఆరామకథ చదువుతావు? ఆ రాముడు సీతమ్మను జీవితమల్లా దుఃఖపెట్టింది చాలకనా! ఆ కథను చదివిన ప్రతివారినీ దుఃఖపెడుతున్నాడు." అనేవారు వెంకటేశంగారు. వారి గొంతు గూడా గాద్గదికంగానే వినపడేది లక్ష్మికి.

మళ్ళీ, "ఎవడో చారినపోయే చాకలి, త్రాగుబోతు అనామ కుడు, ఆయన భార్యను గురించి అవాకులుమాట్లాడితే, నిండుచూలా లైన భార్యను అడవులకు పంపాలా? ఇది న్యాయమా? అంత

అకారణంగా భార్యను అనుమానించి అవమానించిన రాముడు దేముడు ఎలా అవుతాడు." అని గూడా భార్యను ప్రశ్నించేవారు. వెంకటేశంగారు.

రామపాత్రలోని ఔన్నత్యాన్ని గురించిగాని, రామాయణ గాథను గూర్చి ఆ రోజుల్లో వెలువడుతూన్న తర్కవితర్కాలను గురించిగాని అమ్మ ఆలోచించేదిగాదు. ఆమెకు రాముడే దేవుడు. ఆయనేతండ్రి. సీతమ్మదేవత. ఆమేతల్లి. సీతమ్మ కష్టాలుచదివేప్పుడు తనతల్లి బాధలుపడ్డట్టు ఆమెకు స్ఫురించేది. ఉద్వేగంతో దుఃఖించేది.

వెంకటేశంగారికి మాత్రం "శ్రీకృష్ణ" పాత్రంటే మహా యిష్టం. కృష్ణుడు అద్భుతుడైన మహా మానవుడని వారి అభిప్రాయం. ఆయనప్రవచించిన భగవద్గీత సర్వకాలాలకు, సర్వలోకాలకు, సర్వ దేశాలకు, మార్గదర్శకమని వారి నమ్మకం. అంతేగాదు కృష్ణుడు గొప్పరాజకీయవేత్తయని, అనేవారు. ఆనాటి భారతంలో సాంఘిక రాజకీయ పరిస్థితులను సక్రమంగా అర్థంజేసుకొని, కురు పాండవ వంశాలతో పాటు మిగిలిన క్షాత్రవంశాలన్నీ ఎవరకువారు గొప్పవారమని, విర్రవీగుతూ, దృష్టిని మరీ సంకుచితపరచుకొని, ప్రజాక్షేమాన్నిబొత్తిగా విస్మరించి చీటికీ మాటికీ కయ్యాలకు తల పడే వారందఱను మంచిమాటలతో మార్చాలని ఎంతప్రయత్నం జేసినా ఫలితం లేక పోయేప్పటికి కురుక్షేత్ర యుద్ధాన్ని గల్పించి, భారతావనిలో పాప ప్రక్షాళనం గావించిన వీరుడు, కృష్ణుడు అని వెంకటేశంగారు అనే వారు.

"ఆరోజుల్లో, రాజుల శ్రేయస్సేగాని ప్రజల శ్రేయస్సుఎక్కడుంది నాన్నగారూ! తర్వాతవచ్చిన కాలంలో గదా ప్రజలు. వారి క్షేమాన్ని రాజులు గుర్తించింది." అని లక్ష్మి అడిగేది.

"అదేమిటితల్లీ, అట్లాఅంటావు! కురు పాండవుల రాజరికాలకుముందే మన దేశంలో ప్రజాయుగం ఉండేది. అంతకు చాలా ముందే గణతంత్రపరిషత్తులనీ, ప్రజాఎన్నికలనీ, నిర్దుష్టమైన ప్రజా స్వామ్యముండేది. రాజులు ప్రజల యిబ్బందులను తీర్చటమూ

ఉండేది. కనకనే గదా దేవేంద్రుడు ఏకధాటిగా ఏడురోజులు వర్షంగురిపిస్తే కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తి యాదవులను కాపాడింది. కాళీంద్రుడు యదుబిడ్డలను కాళిందిమడుగులో చంపుతున్నాడనేగదా కాళీయునితో పోరాడి అతన్ని చంపింది.'' అని సమాధానం యిచ్చేవారు వెంకటేశంగారు.

అపుడే ఆంధ్రదేశంలో ప్రారంభమైన భావవిప్లవ ఉద్యమాన్ని వెంకటేశం గారు అర్థంజేసుకున్నారు. ఆ ఉద్యమ నిర్మాతలైన స్వర్గీయ త్రిపురనేని రామస్వామి చౌదరిగారితో పరిచయం పెంచుకున్నారు. వారి రచనలను ఏకాగ్రతతో చదువుతుండేవారు. ముఖ్యంగా 'సూతపురాణం', 'శంబుకవధ,' 'ఖూనీ' లను తన వద్దకు వచ్చిన మిత్రులకు చూపి, వాటిల్లోనివివిధ ఘట్టాలను అర్థమయ్యేట్టు వారికి విశద పరుస్తుండేవారు.

'ఖూనీ' నాటకంలో, పూజారివర్గం, క్షత్రియులను ఎలా హింసించింది, ఎలా మోసంచేసిందీ, తమ ఆధిపత్యాన్ని సంఘంపై చిరకాలం నిలుపుకుంటానికి, రాజకుటుంబాల్లోనే, తండ్రికి వ్యతిరేకంగా తనయుని మనస్సు విషపూరితం జేసి హత్యలు గావించిందీ తేటతెల్లమయ్యేట్టు జేసేవారు.

"ఇదంతా ధర్మం పేరిటే జరిగేదా నాన్నగారూ?" అని విచారంగా ప్రశ్నించేది లక్ష్మి. ఖూనీనాటకాన్ని లక్ష్మి చాలా సార్లు చదివింది. దానిపై వచ్చిన విమర్శలను, ప్రతివిమర్శలను అర్థంజేసుకున్నది. వర్ణ విభజనలో సంఘంలో అగ్రస్థానమందుండి, యావత్ సంఘంతో ఊడిగం చేయించుకుంటూ,. తమ అధికారానికి ఫలానా రాజువల్ల ముప్పువాటిల్లుతుందని తోచిన, అప్పటివారు చేసిన మహా కిరాతక హత్యే 'ఖూనీ'.

"అవునమ్మా, ధర్మాన్ని రక్షించాలనే ఆవేశం నిషాదునకు గల్గించే, తండ్రియైన వేణమహారాజును చంపించింది పూజారివర్గం." అన్నారు వెంకటేశంగారు.

వేణమహారాజు ఎంతో దయగలరాజు. కరుణామయమూర్తి. హేతుబద్ధమైన ఆలోచనలు చేసేవాడు. అతడు తొలిసంఘసంస్కర్త. మూఢాచారాలను మూర్ఖవాదనలను వ్యతిరేకించేవాడు. దేవుడిపేర జరిగే అనేక అఘాయిత్యాలను, అసంఖ్యాక జంతుబలులను తన రాజ్యంలో నిషేధించాడు. నోరులేని ఆ పశువులు ఎవరకు ఏమి అపకారం జేశాయి ? అని ప్రశ్నించాడు పూజారివర్గాన్ని. భగవంతుని సృష్టిలో సర్వభూతాలు సమానముగావా? సర్వజీవులు సమము గాదా? అని ప్రశ్నించేవాడు. సర్వసృష్టి కర్తయైన పరాశక్తి ది తన సంతాన రక్తాన్నే త్రాగాలనుకునే పిశాచరూపమా? అని ప్రశ్నించేవాడు దేవప్రతినిధులమని చెప్పుకునేవారిని. ఇతనివల్ల అసలు తమకూ తమ భావితరాల బ్రతుకులకూ ముప్పువాటిల్లక తప్పదని యోచించుకున్న అప్పటి బ్రాహ్మణ్యం, అంతఃపురంలోనే కుట్ర పన్నింది. తండ్రిని పాషండుడుగా కొడుకుకు చిత్రించి, విషాన్ని మనస్సుకు ఎక్కించి, నిషాదునితమవైపు త్రిప్పుకొని వేణునిహత్యా గావించారు.

వేణరాజు హత్యారంగం చదువుతుంటే లక్ష్మి కనులునీటితో నిండేవి. పేజీలలోని అక్షరాలు అలికినట్టుండేవి. తండ్రిని జంపిన నిషాదుణ్ణిచూచి జాలిగల్గేది. ఎంతటి అర్భకుడు ! అనిపించేది.

ఆ ప్రభావమే తరువాత తరువాత ఈమె ఆలోచనా సరళిలో ఎంతోమార్పు దెచ్చింది. ఏదీ మూఢంగా నమ్మటం ఈమెవల్లగాని పని అయింది తరువాత జీవితంలో. కార్యకారణాలను ఈమెకున్న పరిమిత జ్ఞానంతోనే ఐనా శోధించకుండా ఒక నిర్ణయానికిరాని మానసికస్థితి అలవాటయింది. ఇప్పటికీ ఆజిజ్ఞాస తనకు మేలే జేసిందని నమ్ముతారు లక్ష్మి.

నాన్నగారు రామపాత్రను విమర్శించినపుడుగూడా, లక్ష్మిని ఈ జిజ్ఞాసే ప్రభావితం జేసింది. ఏరకంగానుగూడా సీతాదేవిది తప్పులేదు. రావణుడు సీతాపహరణంగావించటంలో ఆమె అశక్తత తప్ప ఆమె తప్పేముంది? లంకలో చెరలో ఉంచబడినపుడు ఎంత

నిష్కల్మషంగా బ్రతికిందో హనుమంతుడే సవివరంగా రామునకు తెల్పనే! ఆ శోకమూర్తి అశోకవనంలో సదా 'రామారామా' అంటూ ఎలాతల్లడిల్లిపోయిందీ వివరించెనే !! అంగదుడు ఆ మహా యిల్లాలి గుణగణాలను గురించి శ్రీరామునకు వర్ణించెనే !!! మరి ఆమె తప్పేముంది ?

అనుమానించటానికి అవకాశమేముంది ??

అయినా లోకంకోసం అనుమానించినట్లు నటించి, పరీక్ష పెట్టాడు అని పెద్దలసమాధానం. స్త్రీని అనుమానించటం ఎందుకు? ఆ పరీక్ష అన్నెమూ పున్నెమూ ఎరుగని స్త్రీపైన్నే పెట్టడ మెందుకు ? మరోవిధంగా ఋజువుచేయవచ్చునే.

భర్త వ్యక్తిత్వం పెరగటానికీ, ఆరాధ్యుడుగా పూజింప బడ టానికీ భార్యను చితికి అప్పజెప్పటం మానుష్యమా ?

ఈ ఆలోచలు ఎన్నో లక్ష్మి మనస్సులో ఆ రోజుల్లో మెది లేవి. మనస్సు వికసించే వయస్సులో ఈ ఆలోచనా స్రవంతి లక్ష్మిని ఒక్కోసారి ఉక్కిరి బిక్కిరిచేసేది. సీత, ద్రౌపది, అనసూయ, అహల్య మొదలైన పాత్రలన్నీ, అన్యాయానికి గురిచేయబడ్డ ఉత్తమ మానవీమణులుగా కన్పడేవారు ఈమెకు. వారిని మగవారు తమ స్వార్థానికి ఉపయోగించుకున్నట్టు ద్యోతకమయ్యేది ఈమెకు.

యమధర్మరాజును ముప్పతిప్పలుపెట్టి మూడు చెర్వుల నీరు త్రాగించి, భర్తృప్రాణాలతో సహా, వివిధకోరికలను సాధించుకున్న సావిత్రి అంటే లక్ష్మికి ఎంతో గౌరవం.

మహా మేధావులుగా చెలామణీ అయిన ఎందరో ఋషి సత్త ములను తన అమేయమేధా సంపత్తితో, తర్కవిజ్ఞానాలతో ఎదిరించి, నిలిచిన గార్గి, మైత్రేయిలన్నా లక్ష్మికి ఎంతో గౌరవం.

ఈ ఉద్దేశాలే తదుపరి జీవితంలో "తానూ ఒక మనిషిగా నిలబడగలగాలి"అనే అభిప్రాయంగలగటానికీ, వ్యక్తిత్వాన్ని నిలు పుకోవాలనే భావన ప్రబలటానికీ కారణమైందనీ నమ్ముతుంది లక్ష్మి.

భారతదేశంలో స్త్రీ అనాదిగా నిర్లక్ష్యం చేయబడిందనీ, బానిసగా బ్రతికిందనీ అనే అభిప్రాయాలు కలగటానికిగూడా ఆనాటి ఉద్దేశ్యాలే కారణమయ్యాయి ఈమెకు. ప్రత్యేకం ఈమె జీవిత దృక్పథం స్త్రీ జనాభ్యుదయ కృషివైపు మరల్చబడటానికి అజ్ఞాతంగా ఆనాడే తన మనస్సులో భావబీజాలు నాటుకున్నాయి.

సృష్టిలో స్త్రీజాతి పురుషజాతికి ఎందునా తీసిపోదనీ, సృష్టి సక్రమ గమనానికి స్త్రీ పురుషులిద్దరూ విభిన్న ప్రకృతులతో ఒకరి నొకరు సాధించుకోవాలనే భావంతో గాక, ఒకరినొకరు అర్థంజేసుకొని పరస్పర గౌరవ విశ్వాసాలతో జీవికను నడుపుకొనటంలోనే జీవిత కృతార్థత లభ్యమౌతుందనీ విశ్వసించింది లక్ష్మి. అందుకై పురుషుని దయాదాక్షిణ్యాలతోగాక, స్త్రీ స్వశక్తిపై ఆధారపడితేనేగాని ఆమె వ్యక్తిత్వం నిలవదనే ఆలోచనకూ వచ్చింది పిన్ననాడే.

ఈ ఆలోచనా స్రవంతిని అర్థంజేసుకునే గామోసు వెంకటేశం గారు ఈమెను ఎపుడూ ప్రోత్సహించేవారు. సైకిలు త్రొక్కటంలోగాని, గుర్రపుస్వారి నేర్పటంలోగాని ఎంతో ఉత్సాహం చూపేవారు. ఆరోజుల్లో ఆడపిల్లలు సైకిలు త్రొక్కడమన్నా, గుర్రపు స్వారి చేయటమన్నా ఎంతో విడ్డూరంగా ఉండేది. సంఘం రెండు కండ్లతో తేరిపారజూచేది. అయినా వెంకటేశంగారు సందేహించేవారుగాదు.

"మొగపిల్లవానికన్నా, ఆడపిల్ల ఎందులోనైనా ఎందుకు తగ్గిఉండాలి.?" అనేవారు వెంకటేశంగారు.

వారి ఆ దృక్పథమే ఈ అక్కాచెల్లెండ్రను ఆంగ్ల విద్యలు చదవటానికి దోహదం గల్పించింది. దూరప్రాంతాలలో ఒంటరిగా ఉండి కాలేజీలలో విద్యాభ్యాసం చేసే అవకాశమూ గల్గించింది.

వెంకటేశంగారి అడుగుజాడల్లో మసలిన వీరి అమ్మగారు వీరి ఉన్నతవిద్యలకు ఏనాడూ వ్యతిరేకి గాదు. కాగా తన సమ్మతితో ఎప్పటికప్పుడు తమ ప్రోత్సాహాన్ని అందిస్తూనే ఉండేది.

అయినా యిల్లువదలి హాస్టల్సులో ఉండాలనే సరికి ఆమె కొంచెం నీరసించింది. అదే విషయాన్ని వెంకటేశంగారితో చెప్పింది కొంచెంబాధతో. దానికీ కారణం ఉంది. వీరిద్దరికన్నా ముందు ఆమె సంతానం అయిదుగురు రాలిపోయారు. లక్ష్మికన్నా అయి దేండ్లు ముందుపుట్టి, చిన్నతనంలో ఈమెనెంతో మురిపెంగా ఆడించి, ఆడుకున్న అన్నయ్య గూడా, ఆకసంలో కెళ్ళాడు. ఇక మిగిలిన ఈ యిద్దరి పిల్లలపై అమ్మమమతలు పెంచుకుంది. ఆమె జీవిత మంతా ఈ యిద్దరిపైనే కేంద్రీకరించింది. మాతృగర్భానికి తగిలిన ఆ అయిదు ఘాతాల బాధనూ, ఈ యిద్దరి పిల్లలనూ చూచుకుంటూ, పెంచుకుంటూ, పరిపోషించుకుంటూ అమ్మబ్రతుకుతోంది. ఆ స్థితిలో వీరిని దూరంగా హాస్టల్సులో ఆమె కనుచాటున ఉంచటం ఆమెకు బాధగానే ఉంది.

వెంకటేశంగారు పరిస్థితిని అర్థంజేసుకొని భార్యతో అన్నారు. "ఆడపిల్లలను కన్న తర్వాత ఎపుడో ఒకప్పుడు అత్తవారింర్లకు పంపాలసిందే గదా ? వదలి ఉండాలిసిందే గదా ? మరి ఇప్పటినుంచే నీవు అలవాటు చేసుకోగూడదా? వారికి గూడా స్వంతంగాఅలవాటు చేయగూడదా ? కాగా ఈ వియోగం ద్వారా వాళ్లు ఎంతో ఉన్న తికి వస్తారు ? విద్యాధికురాండ్రవుతారు. నీకూ నాకూ కీర్తి ప్రతి ష్టలు సంపాదిస్తారు. ఆలోచించుకో" అన్నారు.

తక్షణం ఆమె వెంకటేశంగారితో అంగీకారం తెల్పింది. వీరి ప్రయాణానికి సమ్మతి తెల్పింది.

అయినా విజయవాడలో సబ్ కలెక్టర్ ఉద్యోగంచేస్తున్న వెంకటేశంగారు, వీళ్లు మదనపల్లి చదువులకు వెళ్లేప్పటికి, తనంతట తానుకోరి వీరికిదగ్గరగా ఉండవచ్చునన్నేధ్యాసతో డిప్యూటీకలెక్టర్ గా మార్పించుకొని రాయవెల్లూరుకు బదిలీ అయ్యారు.

అలాగే కో ఎడ్యుకేషన్ కాలేజీలో లక్ష్మి చేరవలసి వచ్చినపుడు వీరి మేనమామ, ఆడపిల్లలూ మగపిల్లలూ కలసి ఒకే కాలేజీలో తిరుగుతూ చదవటానికి విముఖత చూపించారు. వెంకటేశం గారు, తన బావమరది మాటను ఎప్పుడూ గౌరవిస్తారు. ప్రతి విషయం సంప్రదించుకునే చేస్తారు. అందరూ వారిద్దరను, 'నరనారాయణుల'ని పిలచేవారు. మమేకంగామసలేవారు.

ఈ ఎడ్యుకేషన్ విషయంలో లక్ష్మి మామయ్యకు ఆమె నాన్నగారి అభిప్రాయం నచ్చలేదు. ఎదురుగా వెంకటేశంగారితో చెప్పలేక అక్కగారితో తన అభిప్రాయం చెప్పారు. అప్పటికే వెంకటేశంగారి ఆలోచన తెలిసిఉన్న అమ్మ ఎటూ చెప్పలేక పోయింది.

వెంకటేశంగారే అందుకుని, "ఆడపిల్లలూ మగపిల్లలూకలిసి చదువుకున్నంతమాత్రాన వచ్చే చిక్కేముంది. కాలేజీలో కలిసి వివిధ విషయాలపై మాట్లాడుకుంటేమాత్రం వచ్చే నష్టమేముంది" అన్నారు బావమరిదితో. బావమరిది మౌనంగా ఉన్నారు.

''చూడండి బావగారూ కాలంమారుతుంది. మారేకాలంతో పాటు మనుష్యులు మారటంగూడా అత్యవసరం. అట్లా మారి, మార్పును జీర్ణించుకొని ముందుకుపోయినవారే సంఘగమనంలో అగ్రభాగాన ఉంటారు'' అనిగూడా వెంకటేశంగారు అన్నారు.

లక్ష్మి మామయ్య ఆలోచించుకున్నారు నిశ్శబ్దంగా కొంత సేపు. మొఖంలో నవ్వువెలసింది.

"నాకేమీ అయిష్టంగాదు. లోకంఉంది చూచారూ".

... ఇంకా వాక్యం పూర్తిచేయలేదు లక్ష్మి మామయ్య.

''లోకాన్నిచూచి మనం మంచిదనుకున్నమార్గాన్ని మానుకుంటామా! ఒకవేళ ఎవరైనా ఈనాడు అపహాసిస్తే, మన బిడ్డలు

భవిష్యత్తులో ఉన్నతిని సాధించిన రోజున వారే అందరికన్నాముందు అభినందిస్తారు బావా" అన్నారు వెంకటేశంగారు.

నాన్నగారి ఆ ఆలోచనల్లో ఎంతో దూరదృష్టి ఉన్నట్లు లక్ష్మికి గనిపించింది. భవిష్యత్తులో ఈమె స్థానం ఏదో లీలగా ఊహించు కొన్నట్లుగాగూడా లక్ష్మికి ద్యోతకమైంది.

ఎంతో గారాబంగా పెంచుకునే అమ్మగారు, ఈ ఆడపిల్లలను ఇంటి పనుల్లో వేలుపెట్టనిచ్చేదిగాదు. ముఖ్యంగా వంటగదుల్లోకి అడుగుపెట్టనిచ్చేదిగాదు. వీళ్లు ఎక్కడ చేతులు పొయిలో అంటించు కుంటారేమోననే భయం. గుడ్డలకు నిప్పంటుకుంటుందేమోనని భయం.

వెంకటేశంగారు అమ్మతో చెప్పేవారు. "పిల్లలను పనిచేయ నీయ్, వంటవార్పులు నేర్పు. గృహకృత్యాలన్నీ తెలుసుకొని ఉండవలె. అన్నీ తెలుసుకొని ఉండటంలో చాలా లాభాలు ఉన్నాయి. కష్టపడి అన్ని పనులుచేసి ముందుముందు అవసరం లేకుంటే సుఖపడవచ్చుగానీ, ఇప్పుడు సుఖపడి ముందుముందు అవసర మయినపుడు పనులు చేసుకొనటంరాక కష్టపడటం మరీ ఇబ్బంది" అని భార్యకు నచ్చచెప్పేవారు.

ప్రతి స్వల్ప విషయాన్ని శ్రద్ధతో చేయవలసిందని, ప్రతి క్రొత్త విషయాన్ని ఆసక్తితో తెలుసుకోవలసిందని వెంకటేశంగారు తెలుపుతూ ఉండేవారు. ఆ ఉగ్గుబాల శిక్షణే జీవితంలో లక్ష్మికి ఎంతో తోడ్పడింది.

దేహ పరిశ్రమ విషయంలో లక్ష్మి తల్లిదండ్రులు అధిక శ్రద్ధ జూపేవారు. బందరులో ప్రతిరోజూ స్కూలు వదిలే వేళకు వీరి కారు వచ్చేది. దానిలో వీరి పుస్తకాలు టిఫిన్ కారియర్లుపెట్టి దానిని పంపించి వీరు నడిచి ఇంటికి వెళ్లేవారు. శరీరం వ్యాయామాన్ని గురించి, ఆరోగ్య పోషణనుగురించి చక్కని ఉపమానాలతో వెంక టేశంగారు ఎన్నో విషయాలు తెలుపుతుండేవారు పిల్లలిద్దఱకూ.

విద్వత్ కవిపండిత గోష్ఠులకుగూడా వీరి యిల్లు ఎప్పుడూ నెలవుగానే ఉండేది. ముఖ్యమయిన అన్ని పండుగలకూ, ఉత్స వాలకూ, ఈ సమావేశాలు జరిగేవి. ఆ రోజుల్లో నవర్సు బంగారం 15 రూపాయల ఖరీదు. ఒక్క పండితునికి ఒక స్వర్ణకంకణం బహూ కరించాలంటే 3 నవర్సుల బంగారం యాభయి రూపాయీలయితే సరిపోయేది.

లక్ష్మి బాల్యంలో ప్రతి ముఖ్యమయిన పండుగనాడూ ఒక రిద్దరు పండిత ప్రకాండుల ముంజేతులు వీరి ఇంట్లో స్వర్ణాభరణా లతో అలంకరించబడేవి.

# చదువు-శిక్షణ

అది పందొమ్మిదివందల ముప్పయి అయిదో సంవత్సరం. కాలేజీలు తెరచే రోజులు అవి.

అందాలు తేలుతూ నిగనిగలాడే ఒక క్రొత్త ఫోర్డుకారు మెత్తని రోడ్డును మ్రింగుకుంటూ మదనపల్లివైపు పరువులెడుతోంది.

లక్ష్మి, చెల్లి కృష్ణ, ముందు సీటులో కూర్చున్నారు. అమ్మ నాన్నగారలు వెనుకసీటులో ఆసీనులయ్యారు. కారుముందుకు మెత్తగా దూసుకపోతోంది.

రోడ్డువెంట గుబురుగా పెరిగిన మామిడిచెట్లల్లో కూర్చుని కోయిలమ్మలు గొంతెత్తి కమ్మగా పాడుతున్నాయి. మధ్యాహ్న సూర్యతాపానికి చెట్లనీడలక్రిందకు జేరిన పశుకాపరులు కోయిలమ్మల కుహుకుహూ రవాలును ఉసిగొల్పుతూ, కుహు, కుహూలను ఆలపిస్తున్నారు.

పొలాలలో రైతుబిడ్డలు పతంత్రొక్కుతూ, వినసొంపుగా పల్లెపదాలు పాడుకుంటున్నారు.

లక్ష్మి హైస్కూలు చదువు పూర్తయింది. మంచి మార్కులతో ఉత్తీర్ణురాలయింది. కాలేజీ చదువులనంగానే లక్ష్మి హృదయం ఉత్సాహంతో గంతులేసింది. జీవితంలో ఒక కొత్త మలుపుగా తలచింది.

పరీక్ష ఫలితాలు తెలిసినప్పటినుంచీ, లక్ష్మి చూపు మద్రాసు వైపు మళ్లింది. ఆమెతలపుల్లో క్వీన్ మేరీస్ కళాశాల మెరుస్తుంది. తనను కాలేజీ విద్యార్థినిగా తలచుకొని, భవిష్యత్తును ఊహించుకుంటుంది,

అయితే వెంకటేశంగారు, నాలుగయిదు రోజులనాడు, మద్రాసులో మదనపల్లి గురుకుల విద్యాలయ ప్రిన్సిపాల్ డాక్టర్ గురుమూర్తిగారిని కలుసుకున్నారు. బిడ్డలచదువుల ప్రస్తావన వచ్చింది. దివ్యజ్ఞాన సమితి ఆధ్వర్యాన, జాతీయ భావావేశాలతో, ఆదర్శపూరితంగా క్రమశిక్షణా బద్ధంగా ఈ గురుకుల విద్యాలయం నడపబడుతున్నదని వెంకటేశంగారు తెలుసుకున్నారు. తన యిద్దరు కుమార్తెలకు అక్కడ సీట్లు కావాలని కోరారు.

వెంకటేశంగారు, మొదటి నుంచీ, తన యిద్దరు బిడ్డలనూ, రెండు నేత్రాలలాగా చూచుకునేవారు. ప్రతి విషయంలో శ్రద్ధ తీసుకునేవారు. దూరదృష్టితో యోచించుకునేవారు. తనకుమార్తెలు మామూలు కళాశాలల్లో మామూలు చదువులు ముగించి, డిగ్రీలు సాధించాలని కోరుకోనలేదు. మామూలు జీవితాలు సాగించాలనీ కోరుకోనలేదు. ఒక ప్రత్యేక ప్రయోజనాత్మక చదువులు తన కుమార్తెలకు అబ్బాలని అభీష్టించారు. విశాలదృక్పథంతో ప్రపంచాన్ని అర్థంజేసుకోవాలనీ, జీవితాన్ని సమన్వయం జేసుకోవాలని, ఉన్నతాదర్శపూరితులవాలనీ ప్రథమంనుంచీ అభిలషించారు.

మొదట మద్రాసులో పెద్దమ్మాయి లక్ష్మిని క్వీన్ మేరీస్ కాలేజీలోనూ, రెండవ పుత్రిక కృష్ణను లేడీవెల్లింగ్టన్ స్కూలులోను జేర్పించాలని తలచారు. కాని గురుమూర్తిగారి సంభాషణముతో మద్రాస్ ప్రయాణం మదనపల్లికి మారింది.

"రెండు సీట్లూ అట్టిపెట్టాము. తక్షణం బయలుదేరండి''— అంటూ, మిసెస్ మార్గరెట్ కజిన్సు క్రితంరోజు టెలిగ్రాము పంపింది. ఆ రోజు ఉదయాన్నే కారులో ప్రయాణం సాగింది.

అపరాహ్ణంవేళకు గురుకులానికి జేరుకున్నారు. ప్రిన్సిపాల్ డాక్టర్ గురుమూర్తి, శ్రీమతి మార్గరెట్ కజిన్సుగారలు 'కృష్ణ కుటీర్'లో వారికి హృదయపూర్వక స్వాగతం తెలిపారు. దరఖాస్తు ఫారాలు పూర్తిచేయటం, కాలేజీలో జేరడంలాంటి మామూలు తతంగం అంతా క్షణాలమీద పూర్తయింది. కజిన్సు దంపతుల బల

వంతంతో, ఆపూట వెంకటేశంగారి కుటుంబం 'కృష్ణకుటీర' ఆతిథ్యాన్ని స్వీకరించారు.

ప్రథమంలో వెంకటేశంగారు వినూత్నంగా కనపడే ఆ కాలేజీ వాతావరణానికి కొంచెం ఇబ్బంది పడినట్లున్నారుకాని, ఆ సాయంత్రమల్లా అక్కడేఉండి, అక్కడి భోజన భాజనాలు, శిక్షణావిధానం, అధ్యాపకుల సేవా ప్రవృత్తి; నిరాడంబరతచూచి ముగ్ధులయ్యారు; నిష్ఠాగరిష్టతతో సేవాతత్పరలతో నిండియున్న ఆ వాతావరణానికి ఎంతగానో ఆకర్షితులయ్యారు.

డాక్టరు కజిన్సు దంపతులతో పాటు, మిగిలిన అధ్యాపక వర్గమంతా, ఎన్నో ఉన్నత డిగ్రీలుండి, ఎంతో మేధాసంపన్నులై ఉండిగూడా, కేవలం రెండువందల రూపాయల, అల్పజీతానికి పని జేయడం వెంకటేశంగారి మనస్సును బాధపెట్టింది. వారి త్యాగ నిరతికి, కర్తవ్యదీక్షకు వెంకటేశంగారు అబ్బురపడ్డారు. మనస్సులో జోతలందించారు.

కుమార్తె లిద్దరనూ కాలేజీలో జేర్పించి, అమ్మ నాన్నలు వెల్లూరు వెళ్లిపోయారు. తమకన్నా ఘనులచేతుల్లో బిడ్డలను పెట్టాముగదా అనే తృప్తి ఈ పిల్లల వియోగభారాన్ని తేలిక పరచింది.

ఆక్షణం నుంచి కజిన్సుదంపతులే ఈ అక్కాచెల్లెండ్రకు, 'మమ్మి-డాడీ', అయ్యారు. శ్రీమతి మార్గరెట్ వీరికి "చౌదరీ సిస్టర్స్" అని పేరు పెట్టారు. మిగిలిన వారికిగూడా అదే అలవాటయింది. శ్రీమతి మార్గరెట్‌కు ఆపేరుతో పిలవడం ఎంతో ఇష్టం. ఎపుడు లక్ష్మిని కేకవేసినా, "హే ! చౌదరీ!" అని పిలిచేవారు. కూకలేసేపుడు సయితం, "హే ! చౌదరీ!" అనే పదాన్ని మరచేవారుగారు.

డాక్టర్ కజిన్సు వీరికి ప్రిన్సిపాల్. మోడరన్ పొయట్రీ భోధించేవారు. వారానికో పీరియడ్, "సంస్కృతి" పాఠం తీసుకునే

వారు. ఆడ పిల్లలకు చాల మందికి ఈ పాఠం అనంగానే తల నొప్పిగా ఉండేది. కాని లక్ష్మి మాత్రం ప్రతి శుక్రవారం ఉదయం, రెండో పీరియడ్ గావచ్చే ఈ పాఠం కోసరం, ఎంతో కుతూహలంగా ఎదురుచూచేది.

'సంస్కృతి'—అంటే ఏమిటో, జీవితానికి సంస్కృతి ఎంతటి అవసరమో, మానవజాతి తన సంస్కృతిని, ఎప్పటికప్పుడు పెంపొందించుకుంటూ ఎట్లా ముందంజవేస్తుందో, సవివరంగా విపులీకరించేవారు డాక్టర్ కజిన్సు. డాక్టర్ కజిన్సు పాఠ్యబోధన వింటుంటే ఒక ఋషిసత్తముడు ఎదురుగానిలిచి ప్రబోధిస్తున్నట్లు భావించేది లక్ష్మి. తనొక శిష్యురాలుగా తలంచుకునేది. గురుకులాన్ని ఒక ఋష్యాశ్రమంగా చిత్రించుకునేది.

ప్రతిరోజూ ఉదయం, కాలేజీ అసెంబ్లీ హాలులో ప్రార్థన జరిగేది. డాక్టర్ కజిన్సు ప్రార్థనా సమావేశాలను, విశ్వకవి రవీంద్రుని, "Where the mind is without fear and the head is held high," అనే గీతంతో ప్రారంభించేవారు, ఎలుగెత్తి గానంచేసేవారు. విద్యార్థులంతా ఆ పాటను అందుకునేవారు. క్రైస్తవ, ముసల్మాను ప్రార్థనా గీతాలుగూడా ఉండేవి. చక్కగా మలిచిన చెక్కడపు రాళ్లతో నిర్మించబడ్డ, ఆ సమావేశ మందిరంలో జరిగే ఆ పది నిముషాల ప్రార్థన, ఈ బిడ్డలందఱకూ నూతనోత్తేజాన్ని గలిగించేది. ఆ ప్రార్థనలో ఎంతో ప్రశాంతత నిండి ఉండేది. అభ్యంగన స్నానానంతరం దేహమెంత శుభ్రంగా ఉంటుందో, ఆ ప్రార్థనల తరువాత మనస్సు అంత నిర్మలంగా ఉండేది.

విశ్వకవి రవీంద్ర గురుదేవులు అంతకు ముందు కొద్ది సంవత్సరాల క్రితం, ఈ మదనపల్లి గురుకులంలో విశ్రాంతి తీసుకొనుటకు వచ్చినపుడు, జనగణమన గీతం, బెంగాలీనుంచి, ఆంగ్లంలోకి మార్చబడింది. ఆ ప్రసిద్ధ గీతానికి ఇచ్చటనే సంగీతం సమకూర్చబడింది. శ్రీమతి మార్గరెట్ కజిన్సు సమకూర్చిన సంగీత బాణీనివిని,

రవీంద్ర కవి అధికంగా ముదమంది, తమ ఆమోద ముద్ర వేశారు. నాటినుండి జనగణమన కు ప్రస్తుత సంగీత బాణీ స్థిరపడింది.

*　　　*　　　*

కాలేజీలో విద్యాబోధన ఉత్తమస్థాయిలో జరిగేది. వినయం, త్యాగసౌశీల్యాలు మూర్తీభవించిన ఆ అధ్యాపకులు, విద్యార్థుల లేత మనస్సుల నాకట్టుకొని బోధనచేసేవారు. పాఠ్యాంశాలేగాక ఇతరత్రా జదువ కుతూహలపడేవారికి లైబ్రరీలో గూడా అధ్యాపకుల సహాయం లభ్యపడేది.

ఈ అధ్యాపకులందరూ, కజిన్సు దంపతులలాగే, దివ్యజ్ఞాన సిద్ధాంతాన్ని నమ్మినవారు. త్యాగాన్ని జీవిత విధానంగా అవలంబనం జేసుకున్నవారు. ఆదర్శాలకు, ఆహుతి గావటానికి సన్నద్ధులైన వారు. తమ జీవిత ఆదర్శాలను, తమ నడవడికద్వారా, తమ బోధనలద్వారా తమ శిష్యులకు, నిశ్శబ్దంగా నిరాడంబరంగా సంక్రమింపజేయ సమకట్టినవారు.

కజిన్సు దంపతులు, 'కృష్ణకుటీర్'లో నివసించేవారు. అదే వారి అధికార నివాసగృహం. రెండతస్తులున్న ఆ చిన్ని ఇంటిని, కళా తపస్వి కజిన్స్ అభిరుచుల కనుగుణ్యంగా, ఒక వస్తు ప్రదర్శన శాల లాగా శ్రీమతి మార్గరెట్ తీర్చిదిద్దింది. నిరాడంబరమైన బ్రతుకుకూ, ఉన్నత ఆలోచనా పరిధికీ, కృష్ణకుటీరం, ఒక మచ్చుతునక. అలాగే కాలేజీ వాతావరణమూ ఉండేది. వారిద్దరూ శాకాహారులు. విద్యార్థులలో కొందఱను అపుడపుడు వారి కుటీరానికి భోజనానికి ఆహ్వానించేవారు. అనేకసార్లు విద్యార్థుల భోజనశాలకు ఆ దంపతులు విచ్చేసేవారు. సహపంక్తిని ఆరగించేవారు. పిల్లల అభిరుచులను తెలుసుకుంటుండేవారు.

ఆ సమయాల్లో, 'అమ్మ నాన్న'ల సరసన కూర్చొని భుజించినంత సంబరంగా ఉండేది లక్ష్మికి.

విద్యార్థుల చదువు సంస్కారాలపట్ల ఆ దంపతులకెంత శ్రద్ధో, వీరి అలవాట్లపట్టగూడా వారికి అంత ఆసక్తి ఉండేది. లక్ష్మి, కృష్ణలు ఉంటూన్న వసతి గృహం పేరు 'రుక్మిణీవిహార్'. ఈ హాస్టలుకు, శ్రీమతి మార్గరెట్ రాత్రిపూటలగూడా చాటుమాటుగావచ్చి, విద్యార్థినులను గమనిస్తూండేవారు. నీడల మాటున నిలబడి పిల్లల ప్రవర్తనను పరీక్షించేవారు.

తలలు దువ్వుకున్నపుడు ఊడిన వెంట్రుకలను గుండ్రంగా చుట్టి కిటికీలగుండా బయటకు విసరివేసే దురలవాటును మాన్పించడం నుంచి, అనేక పరిశుభ్రపు అలవాట్లను ఆమె నేర్పారు.

ప్రతి సాయంత్రం, 'రుక్మిణీవిహార్'లోని తులసి చెట్టు మండపం వద్ద లక్ష్మి, ఆమె గురుదేవితో, అనేక విషయాలపై పిచ్చాపాటీ మాట్లాడుకునేవారు. ఇష్టాగోష్టి జరుపుకునేవారు. ఆ సందర్భాలలో శ్రీమతి కజిన్సు వీరికి ఎన్నో సంగతులు తెలిపేవారు. అనంత సృష్టిలో ఏ వస్తువూ నిరుపయోగకరంగాదనీ, ప్రతిదానినీ సద్వినియోగం చేసుకోవచ్చనీ సోదాహరణంగా విపులీకరించేవారు. ఇంటిలో చిత్తు కాగితాల బుట్ట ఉపయోగంనుంచి, కిటికీ అద్దాలు తుడుచుకోవలసిన అవసరంవరకూ ఓపిగ్గా విడమరచేవారు. ఖాదీ ఉద్యమం, జాతీయతాభావం, మతంలాంటి సంక్లిష్ట భావాలను చిన్ని మాటల్లో మనస్సుకు హత్తుకునేట్లు వినిపించేవారు. చిత్రలేఖనం, సంగీతం' కుట్టుపని లాంటి విషయాలపై మక్కువ గలిగించేవారు. ఆమె ఎప్పుడూ పరిశుభ్రతను కోరుకునేవారు. లక్ష్మి గదిని ఆమె మెచ్చుకునేవారుగూడా. అయితే ఆమె ఎప్పుడూ లక్ష్మిని ఒకందుకు గట్టిగా మందలించేవారు.

హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు మిష్టర్ డున్కన్ గ్రీన్లీన్, మార్గరెట్ సతీమణి, హాస్టలు 'మెనూ'ను తయారు చేసేవారు. ఎర్రగావుండే దంపుడు బియ్యపు అన్నం, అధికంగా ఆకుకూరలు, చప్పటి వంటకాలతోనిండి ఉండేది ఆ "మెనూ." లక్ష్మికి ఎంతమాత్రం ఆసక్తికరంగా వుండేదిగాదు. ఈ మెనూ, వాటితోపాటు చపాతీలు

గూడా విధిగా వీరు తినవలసిన భోజనంలో ఉండేవి. పిల్లలకు సంపూర్ణాహారం చాలా అవసరం అనే సిద్ధాంత ప్రాతిపదికగా ఈ ఆహార నిర్ణయాలు చేసేవారు. భోజనానంతరం కొన్ని పండ్లుకూడా వాళ్లు విధిగానే తినాలి. వీరు చపాతీలు ముందుగా తినందే అన్నం వడ్డించేవారు కాదు. అయితే కొందరు, ఆ చపాతీలను తినలేక పీటల క్రిందకు తోసేసేవారు. లక్ష్మి మాత్రం తనకు యిచ్చే రెండు చపాతీలను అటూఇటూచూచి, ఎవరూ చూడకుండా తనపీట క్రిందకు విధిగానే తోసేది నైపుణ్యంగా రోజూ. అప్పుడుగాని ఈమెకు అన్నం వచ్చేదిగాదు. వీళ్ల నౌకరు నారాయణప్ప, అతని భార్య సంతోషంగా నవ్వుకుంటూ, లక్ష్మివాళ్లు భోంచేసి లేచి వెళ్ళింతర్వాత ఆ చపాతీలను తీసుకుపోయి సొమ్ము చేసేవాళ్ళు.

అయితే కొందరు కొంటె పిల్లలు, ఈ విషయం శ్రీమతి కజిన్సుకు చెప్పారు. ఒకరోజు మధ్యాహ్నం తిండ్లు ముగించుకొని గదులకు పోబోతుండగా అకస్మాత్తుగా 'మమ్మీ' భోజనశాలకు వచ్చారు. ఆడపిల్లలందరునూ లోపలకు పిలచింది. పీటలను ఎత్తమన్నది. ఆరోజు నలుగురయిదుగురు పిల్లలు తమ చపాతీలను పీటల క్రిందకు తోశారు. ఒక పీటక్రింద రెండు చపాతీలు ఒకదానిప్రక్క ఒకటి భయంగా ఒరుసుకునిపడి ఉన్నాయి. 'మమ్మీ' రెండు కళ్ళూ రెండు చపాతీలకేసి చూశాయి. "అక్కడ కూర్చున్నది ఎవరూ?" అని ప్రశ్నించింది. సహజంగా రోజూ ఒకే స్థానంలో కూర్చోటం ఈ పిల్లల నియమం గనక, లక్ష్మి పేరు బయటకొచ్చింది. స్థాణువుగా నిలబడింది లక్ష్మి. గుండె వేగంగా కొట్టుకుంటోంది. నోటిమాట లేదు. "ఏయ్ చౌదురీ, ఆ చపాతీలు తీసుకో" అని అన్నారు. చేతితో చపాతీలు అందుకుని లక్ష్మి ఆమెను సమీపించింది. 'రుక్మిణీ విహార్'కు తీసుకొని పోయింది. శ్రీమతి కజిన్సు సతీమణి మండు ఎండలో నిలబెట్టింది. "నీ ఆరోగ్యానికి ఇవి ఎంతో అవసరం. ఇక తిను" అని ఆజ్ఞాపించింది. ఎంతమంచి కూరలున్నా రెండు చపాతీలు తినటం లక్ష్మికి అసాధ్యం. ఎలాగో కొంచెం కొంచెం నోట్లో పెట్టు

కుని నములుతోంది. అదృష్టవశాత్తూ ప్రక్కనే వరండాలో వున్న సీతాఫలాల పండ్లబుట్ట కజిన్సు సతీమణి కంటబడింది. ఆరోజు ఆహారంలో అవీ భాగమే. ఎక్కువమంది అవి తిననందున ఆ బుట్ట తిరిగి అక్కడకు చేరింది. తిననివాళ్ళ జాబితాలో లక్ష్మి పేరు ప్రథమంగానే చెప్పబడింది. అంతేగాదు, 'లక్ష్మి ఎప్పుడూ పండ్లను తినదు మమ్మీ' అంటూ, కొందరు పిల్లలు మమ్మీతో చెప్పారు. "పండ్లను, తినదా"? ఇలారా లక్ష్మి" అని ఆజ్ఞ. చేతిలోని చపాతీలు చల్లగా వెనక్కి జార్చి ముందుకు వెళ్లింది ఈమె, "ఎందుకు పండు తినలేదు?" అని ప్రశ్నించింది. తానెపుడూ సీతాఫలాలను తినలేదనీ, అవి తినటం ఎలాగో తనకు తెలియదనీ నెమ్మదిగా నట్టుబడుతూ చెప్పింది లక్ష్మి, "అవును చౌదరీ; మీ అమ్మగారు ఈ పండు తినటం నీకు నేర్పలేదు, ఎందుకో తెలుసా, ఇవి చౌకగాబట్టి !" అంటూ "ఇవి చాలా మంచి పండ్లు. ఆరోగ్యానికి మంచివి'' అని తెల్పింది. ఎలా వలచుకోవాలో చెప్పి తినే పద్ధతి నేర్పింది. తింటుంటే సీతాఫలం రుచిగానే వుంది. అయితే లక్ష్మి అమ్మగారు వీటిని అజీర్తి చేస్తుందనే భయంతో తిననిచ్చేవారుగాదు చిన్నప్పుడు.

తరువాత మరో రోజు బొప్పాయి పండ్లు తినవలసి వచ్చింది. అదీ ఈమెకు సరిపడదు. ఫలితంగా ఒక అరగంటకు వాంతి చేసుకుంది. ఆ సంగతి తెలిసిన 'మమ్మీ' మరెపుడూ ఫలానావి తినమని బలవంతం చేయలేదుగాని 'రుచి సంస్కారాన్ని' గురించి మాత్రం ఉపన్యాసం వినిపించేది లక్ష్మికి.

ఈ ఒక్క విషయాన్నే ఈమె ఆమెవద్దనుంచి నేర్చుకోలేకపోయారు. ఈమె చొరవకు ఆమె ఎప్పుడూ హర్షాన్ని తెలిపేది. కర్తవ్య నిర్వహణలో ఈమె కృషికి పలుసార్లు సంతోష పడేది. లక్ష్మి మదనపల్లి వదిలేనాటికి ఒక వయస్సు వచ్చిన ఆడపిల్ల నేర్చుకోవాలిసిన ఎన్నో విషయాలను ఈమె అక్కడ నేర్చుకున్నారు. తల్లిగారివద్ద గూడా అంత చక్కని తరిఫీదు తాను పొందగలిగి ఉండేదాన్నిగాదని లక్ష్మి సుదృఢ అభిప్రాయం.

1935-36 లలో మదనపల్లి కళాశాల అనేక ఆర్థిక ఇబ్బందులకు లోనుగావలసి వచ్చినా, అత్యున్నత ప్రతిష్టను సంపాయించుకుంది. లక్ష్మి తల్లిదండ్రులు ప్రతివారం బిడ్డలను చూచేందుకు వచ్చేవారు. కజిన్సు దొరగారు వెంకటేశంగారిని చాలా అభిమానించేవారు. వారు ఎన్నో సంగతులు మాట్లాడుకునేవారు. 'మమ్మీ' 'good big girls' అంటూ ఈ అక్కచెల్లెండ్రను పిలుస్తూ తన అభిమానాన్ని తెలుపుతుండేవారు. 15 సంవత్సరాలకే ఈమె, చెల్లి, 5-4" 5-3" ఎత్తు ఉండే వారు. పుష్టికరమైన దేహ సంపదతో కళకళలాడుతూ ఉండేవారు. అందుకే వీళ్లిద్దరనూ, శ్రీమతి కజిన్సు అట్లా వర్ణించేవారు.

మదనపల్లికి వెళ్ళేముందే లక్ష్మికి సైకిలు త్రొక్కడం చేతనవును. 'మమ్మీ' మిగిలిన పిల్లలకు సైకిలు త్రొక్కడం నేర్పే పనిని ఈమెకు అప్పచెప్పారు. ఆమె లక్ష్మికి టెన్నిస్ ఆట నేర్పింది. పందాలేసుకొని వీరిద్దరూ టెన్నిస్ ఆడుకునేవారు. టెన్నిస్ అంటే లక్ష్మికి చెప్పలేని ఆసక్తి పెరిగింది.

ఒకసారి 'మమ్మీ' లక్ష్మిని పోర్షియావేషం వేయమన్నది. మిగిలిన పాత్ర ధారులందరూ మగపిల్లలు, లక్ష్మి ఏమీ సంకోచించలేదుగానీ నాన్నగారి అనుమతి కావాలని, నసిగింది. 'మమ్మీ' నిమిషాల మీద నాన్నగారి అనుమతి తెప్పించింది. రిహార్సల్సు నడిపేవారు. ఆ ఒక్క ప్రదర్శనకు చాలా రిహార్సల్సు వేశారు. నాటక ప్రదర్శనం అద్భుత విజయం సాధించింది. ఆ రోజుల్లోనే ఈమె పృధ్వీరాజ్, రాణిప్రమీల లాంటి పాత్రలు పోషించారు. తదుపరి జీవితంలో ఈమె నాటకాలలో పాల్గొనే అవకాశం లేకపోయినా, ఆనాటి ఆ ప్రదర్శనలను తలచుకున్నపుడల్లా ఆ ఉత్తమ కళపట్ల ఈమె కున్న అభిమానం ఈమెను, సంతోష పులకితనుగా జేస్తుంది.

ఐర్లండు దేశపు ఈ ఉత్తమ దంపతుల ద్వారానే లక్ష్మి ఆ నాటి చిరుత ప్రాయంలోనే జాతీయ భావావేశాన్ని, సాంఘిక సేవను

అవగాహన చేసుకునే అదృష్టం గలిగింది. లక్ష్మి, మనస్సును ఆలజ్యాల వైపు లగ్నం చేయటం జరిగింది.

అదే సంవత్సరంలో కళాశాలకు ప్రఖ్యాత జాతీయ నాయకు లెందరో విచ్చేశారు. రాజాజీ, జమన్‌లాల్ బజాజ్‌లువారి కుమార్తె లను ఈ హాస్టల్లో చేర్పించారు. వి. వి. గిరి ఈ హాస్టలు నుంచే ఒక అల్లుణ్ణి ఎన్నుకున్నారు.

సి. వి. రామన్, రాజేంద్రప్రసాద్, ఆంధ్రకేసరి, రుక్మిణీ అరండేల్, జిడ్డు కృష్ణమూర్తి లాంటి ప్రఖ్యాతపురుషులు ఈ విద్యాలయాన్ని సందర్శించారు. వీరిపసిహృదయాలు వారిఅమూల్య మైన ప్రసంగాలకు జోతలర్పించేవి. ఆ మహా పురుషులను దర్శించ టమే ఒక భాగ్యంగా భావించే ఈ పిల్లలు, ఆ అనర్గళ ఉపవ్యాస పరంపరలకు ముగ్ధులయి పోయేవారు. ఈ నాయకుల ఉపన్యాసా ల్లోని మాటల వెనుక, నిక్షిప్తమైవున్న భావోద్వేగం వారి మొఖాల్లో ప్రస్ఫుటమయ్యేది. వారి రూపం కళా కాంతులతో వెలిగేది.

1935 లో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటి సమావేశానికి శ్రీమతి కజిన్సు హాజరయ్యారు. శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ అక్కడ చేసిన ప్రసంగానికి ముగ్ధురాలైన 'మమ్మీ' మదనపల్లికివచ్చి మాతులసి చెట్టు సమావేశాలలో ఆమెను ఎంత గానో పొగిడింది. 'కమలాఛటో' అభిప్రాయాలను లక్ష్మికి సవివ రంగా తెలిపింది. ఒకఉత్తమకృషిలో స్త్రీలుఎలా పాల్గొని ఉన్నతులు కాగలరో గూడా శ్రీమతి కజిన్సు విశదీకరిస్తుంటే లక్ష్మిహృదయం ప్రఫుల్లమయ్యేది. ఈమె చూపులతో పాటు మనస్సుగూడా ఎక్కడో దూరతీరాలకు, శూన్యాకాశంవైపు, అస్పష్ట భవిష్యత్తులోనికి, దూసుకుపోయ్యేది. అలాంటి అనేక సమయాలలో శ్రీమతి మార్గ రెట్ అడిగేది, "ఏయ్! చౌదరీ, ఏమిటి ఆలోచిస్తున్నావ్" అనేది. ఒక్కసారి కుదుటపడి "అవును ఏదో ఆలోచన వచ్చింది మమ్మీ" అనేదిలక్ష్మి. "అవును నీవు ఆలోచించగలవు చౌదురీ - తప్పక ఆలో చించు" అని ప్రోత్సహించేది." భారతదేశ భవిష్యత్తు విద్యావంతు

లైన మీలాంటి వారిపైననే ఆధారపడి ఉంది. ఈ మహత్తర దేశాన్ని సరికొత్త రీతిలో తీర్చిదిద్దుకొని కోట్లాది భారతప్రజలకు స్వాతంత్ర్యాన్ని సాధించే పవిత్రకర్తవ్యంలో పాలు పంచుకునే అదృష్టం మీ తరానికి వుంది. అందుకు తయారవాలి చౌదరీ" అనేది. అంటుంటే ఆమె చూపులు ఎటో సుదూరభవిష్యత్తులోనికి తొంగి చూచేవి. కొద్దిక్షణాలు సమావేశమంతా నిశ్శబ్దంగాపుండి పోయేది. గాలి సయితం స్థంభించి పోయినట్లుండేది. "అంతేగాదు చౌదరీ! స్వాతంత్ర్య సమూపార్జనానంతరం, భారతదేశపు పునర్నిర్మాణ కృషిలో మీ తరమంతా అధికంగా శ్రమించవలసి ఉంటుంది. విద్యావిజ్ఞానాలను సమకూర్చుకుంటూ, దేశభక్తితో హృదయాలు నింపుకుంటూన్న మీకుఎన్నో సరికొత్తబాధ్యతలు ఎదురవుతాయి. భారతదేశజనాభాలో సగభాగంగా ఉన్న అవిముక్త స్త్రీజాతి సముద్ధరణ అనే పవిత్ర కర్తవ్యంలో మీరు చేయవలసింది ఎంతో ఉంటుంది. అది ఒక మహా యజ్ఞంసుమా!" అని పలికేది. ఆపలుకులు నిదానంగా ఆమె పెదవులలోనుంచి వెల్లువికేవి.

తెలుగు దేశపు ఒకానొక సాదా బస్తీ ఐన మదనపల్లిలో ఆ దివ్యజ్ఞాన కళాశాల ఆవరణంలో, ఆ సాయంసంధ్యవేళ ఆ తులసీ చెట్టు కెదురుగా ఎంతో శ్రద్ధాసక్తులతో కూర్చొని వున్న లక్ష్మి మనోఫలకంపై, దీనవదనయైన భారతమాత ప్రస్ఫుటంగా గన్పించేది. విచ్చుకున్న కురులు చీలమండలాలను తాకుతుండేవి. తలపై హిమాలయ సానువులు ధవళకాంతులను విరజిమ్ముతుండేవి. పాదాలను దక్షిణ సముద్రజల రాసులు అభిషేకం జేస్తుండేవి. నయనాలు కరుణను వెదజల్లుతుండేవి. అయితే ఆ మహా విగ్రహం దీనవదనంతో లక్ష్మి వైపు చూస్తున్నట్లుండేది. తనలాంటి కోట్లాది భారతీయ స్త్రీ పురుషుల కేసి చూస్తున్నట్లుండేది. ఏదో మహత్తర కర్తవ్యాన్ని నిర్వహించవలసిన బాధ్యతను, ఆ చూపులు ఆమెకు విశదం చేస్తున్నట్లుండేవి. ఆమె కోరికేదో ఈమెకు అర్థమయినట్లే ఉండేది. తన కర్తవ్యమేదో తనకు స్ఫురించినట్లే ఉండేది. ఇంతకూ భారతాంబ బందీయా? ఈ అంబ పరాధీన మాతృమూర్తియా?

ఒక్కసారి వళ్ళు పులకరించేది. ఈమె పసిహృదయం నిశ్శబ్దంగా రోదించేది. అశ్రు బిందువులు రాలేవి. దీప్తితో వెలిగే 'మమ్మీ' ముఖంలోగూడా ఆ సమయంలో విషాదం మూర్తీభవించినట్లు, శోకం ఘనీభవించినట్లు లక్ష్మికి కన్పట్టేది. ఆ సన్నివేశాలకు లక్ష్మి మనస్సు ఎంత కుంగినా, ఆ అమూల్య అనుభూతులకు ఈమె హృదయం ఎంతో పొంగి పొయ్యేది.

ఆ సంవత్సరం శ్రీమతి కజిన్సు త్రివేంద్రంలో జరిగిన అఖిల భారత మహిళా మహాసభకు హాజరై వచ్చారు. రాగానే అచ్చటి విశేషాలను పూసగ్రుచ్చినట్లు తెలిపేరు. తిరువాన్కూరు మహారాణి సేతుపార్వతీబాయిని గురించి అప్పటికే ఎంతో విని ఉంది లక్ష్మి. 19 ఏండ్లకే సింహాసనం అధిష్టించిన యువరాజును గురించి, ఎంతో ప్రగతి సాధించిన ఆ దక్షిణదేశ సంస్థానాన్ని గురించి తెలుసుకుంది. భారతదేశంలో మొట్టమొదటగా హరిజన దేవాలయ ప్రవేశం గలిగించిన ఘనత ఆ సంస్థానానికే దక్కింది. ఆ ఘనకార్యం వెనుక వున్న రాణి సేతుపార్వతీబాయి విశాల హృదయం ఈమెను ఉత్తేజపరచింది.

ఈ సమావేశంలోనే శ్రీమతి కజిన్సు ప్రముఖ మహిళా నాయకురాండ్రను కలుసుకున్నారు. డాక్టర్ పూనన్‌లు, ఖోస్, మార్గరెట్ శాన్‌గర్‌లనేగాక, లండన్‌లో గాంధీజీకి ఆతిథ్యం నెరపిన మురియల్ లెస్టర్‌లను కలుసుకున్నారు. కుటుంబ నియంత్రణం అనేమాట గూడా లక్ష్మి జీవితంలో మొదటసారి ఆ రోజుల్లోనే విన్నది.

కజిన్సు దంపతుల ద్వారా దేశ విదేశాల్లోని ప్రముఖ మహనీయులను తెలుసుకునే అవకాశం అపుడేగల్గింది లక్ష్మికి. ఎందరితోనో పరిచయ భాగ్యం గూడా గల్గింది. శ్రీమతి కమలా ఛటోపాధ్యాయను ఆధ్యాత్మిక పుత్రికగా చూచుకొనేది మార్గరేట్. 1936 వేసంగిలో కజిన్సు దంపతులు కాలింపాంగ్ వెళ్ళారు. మదనపల్లి వచ్చింతరు

వాత టిబెట్ సంస్కృతిని గురించి శ్రీమతి కజిన్సు తెలిపారు. టిబెటియన్ సంస్కృతి ఆ దంపతులను పూర్తిగా ఆకట్టుకున్నట్టు అనిపించేది.

ఆ తరువాత సంవత్సరమే శ్రీమతి కజిన్సు అహ్మదాబాదులో జరిగిన అఖిలభారత మహిళా మహాసభకు అధ్యక్షత వహించారు. 2500 మంది మహిళా ప్రతినిధులు హాజరైన ఆ సభలో 'మమ్మి'ని తల పూడిపోయేదాకా పూలదండలతో ముంచెత్తారు. అపుడే ఫెయిజ్‌పూర్‌లో జరిగిన భారతజాతీయ కాంగ్రెస్ మహాసభలకు గూడా హాజరై తిరిగి వచ్చిన శ్రీమతి కజిన్సు, సరోజినీ నాయుడు, విజయలక్ష్మి పండిట్, జవహర్‌లాల్, సరభాయి కుటుంబం, జిడ్డు కృష్ణమూర్తి గారలను గురించి ఎన్నో విశేషాలను తెలిపారు.

క్రమంగా 'మమ్మి' లక్ష్మికి మహిళామహాసభతో (1936-37) సంబంధం ఏర్పరచింది. సభ్యురాలుగా జేరేందుకు వయసు అనర్హతగా ఉన్నప్పటికి, ఈమెకు కార్యక్రమాలను యిచ్చేది. 'స్త్రీధర్మ' అనే పత్రికకు వ్యాసాలు రాయించేది. అయితే 1937 లో శ్రీమతి అమ్ము స్వామి నాథన్ ద్వారా అఖిల భారత మహిళా మహాసభకు మొదటగా ఈ లక్ష్మి సభ్యత్వం స్వీకరించారు. తరువాత మద్రాసులో ప్రత్యేక ఆంధ్రశాఖ ఏర్పాటుకు ఆందోళనచేసి శాఖను ఏర్పాటు చేసుకున్నారు.

మూడున్నర దశాబ్దాలు గడిచింతర్వాత, ఇపుడు గతాన్ని ఒకసారి లక్ష్మి తలపుకు తెచ్చుకుంటే మదనపల్లిలో గడిపిన ఆ (farmative year) సంవత్సరాలే అతి విలువైనవిగా తోస్తుంది. శ్రీమతి కజిన్సు ఈమెకు మాతృమూర్తి, ఉత్తమ స్నేహితురాలు, ప్రియమైన మార్గదర్శి, విలువగల తత్వవేత్త. ఈమె జీవితం ఉన్నత పథంలో ప్రభావితం గావటానికి ఆ 'మమ్మి' ఈమెకు చేసిందెంతో ఉంది. ఏనాటికీ మరపురానిదీ, మరువలేనిదీ అది. అమలినమూ,

అత్యంత శుభప్రదమూ అయిన వీరిద్దరి ఆ అనుబంధం జన్మాంతర సంబంధాల ఫలితమేమో నన్పిస్తుంది.

1937 లో సన్నిపాత జ్వరంతో కడపలో ఆరు మాసాలు పడివుండవలసి వచ్చింది లక్ష్మి. ఒకటి, రెండుసార్లు ఆప్తులూ, మిత్రులూ తమలక్ష్మిపై ఆశలు వదలుకున్నారు. తనను అన్నివిధాలా ఆ విషజ్వరం కృంగదీసింది. ఈమె మెదడులోని జ్ఞాపకాల పొరలలో బ్రతుకుకూ- మరణానికీ మధ్య అడ్డుగానిలిచిన అతి సన్నని, సున్నితమైన పొరను తొలగించి 'అద్దరి' చూచిన తృటికాలపు అనుభవం గూడా ఇంకా భద్రంగా ప్రతిష్టమై వుంది. తలచుకుంటేనే గుండె జలదరించే ఆ అనుభూతికి శ్రీమతి కజిన్సు శీతల కరస్పర్శ లక్ష్మి నొసటిపై సోకేసరికి, పెదవిపై చిరునవ్వు వెలిసింది. రోగగ్రస్తమై శుష్కించిన లక్ష్మి శరీరానికీ, నీరసించి బేలపడిన ఈమె మనస్సుకు ఆ చల్లని చెయ్యి ఎంతగానో ఊరట గల్గించేది. తన జబ్బు రోజుల్లో ఆమె ఈమెకు కలిగించిన మనస్థైర్యం వర్ణనాతీతం. అందమైన రక రకాల పుష్పగుచ్ఛాలతో ఈమె రోగశయ్య వద్దకు వచ్చేది. ఈమె కోసం ఆమె పూర్ణ హృదయంతో సర్వేశ్వరుని ప్రార్థించింది. కళాశాలలో ప్రతి తరగతిలో లక్ష్మి ఆరోగ్యం కోసం ప్రార్థనలు జరిపించింది. ఆమె రాసిన ఉత్తరాలు లక్ష్మిరోగశయ్య తలగడక్రింద వుండి తనను ఎప్పుడూ ఉత్సాహపరుస్తుండేవి.

ఆయమ్మ ఎంత మంచిది!

ఎక్కడ ఐర్లండ్ దేశం! ఎక్కడ దుగ్గిరాల!! ఆమె ఎవరు! ఈమె ఎవరు! ఈ అప్యాయతకు అర్థమేమిటి! అహో! సృష్టికర్తా! నీవు తగిలించే బంధనాలు, ఎంత చిత్రంగా ఉంటాయి! ఎంత విచిత్రంగా రూపొందుతాయి!!

లక్ష్మికి వివాహమై మద్రాసులో సంసారంపెట్టుకున్నతర్వాత, కజిన్సు దంపతులు అడయార్ వచ్చినపుడల్లా పరస్పరం కలుసుకునేవారు. 1944 లో వెంకటేశంగారు మరణించినపుడు ఆమె కూడా

శ్రీమతి లక్ష్మితోపాటు బహిరంగంగా దుఃఖించారు. ఈమెకు ఎంత గానో దుఃఖోపశమనం గావించారు.

కాని ఆ పుణ్యదంపతుల నిర్యాణం ఎప్పుడు జ్ఞాపకం వచ్చినా లక్ష్మిలోని దేదో పోయినట్లు బాధపడుతారు. తనలో కొంత మేరకు శూన్యత ప్రవేశించినట్లు భావిస్తారు.

అడయారులో ఒక భయంకర ప్రమాదానికిలోనైంది శ్రీమతి కజిన్సు. ఆమె కోలుకునే సమయానికి జేమ్సు కజిన్సు గూడా మరో ప్రమాదంలో చిక్కుకుని ఆసుపత్రిలో చేరారు. ఎంత ప్రయ త్నించినా లాభం లేక పోయింది.

ముందుగా 'మమ్మీ' స్వర్గధామంచేరింది. తర్వాత సంవత్సరా నికి కజిన్సు ఆమెమార్గం అనుసరించారు. ఆమెలేని వెలితిని ధైర్యంగా ఎదుర్కొని జీవితం సాగించటానికి ఎంత ప్రయత్నించినా, కృత కృత్యులు కాలేక పొయ్యారు శ్రీకజిన్సు. బహుశా ఆమె పిలుపు ఈయనకు అంది ఉండవచ్చు. స్వర్లోకాల నుంచి వచ్చిన ఆప్రియ బాంధవి పిలుపు చాలా గాఢంగానూ తాకి వుండవచ్చు!! భార్యా వియోగ బాధా పరితప్తుడైన శ్రీకజిన్సుకు ఈ ప్రపంచంలో మిగి లింది మరి ఏమీలేదు.

ఒకరి కొకరు అంకితమై, జీవితాన్ని అంత సంపన్నంగా బ్రతి కిన దంపతులు నిజంగానే అరుదు. దంపతులిర్వురూ ఒకరికొకరు అంకితం కావటమేగాక, ఇద్దరూ కలసి ఒక ఆదర్శం కోసం అంకితం గావటం, వారు ప్రేమించిన దేశం కోసం నిస్వార్థ సేవలద్వారా బ్రతుకుట, మరణించుట, అనేది ఎంతో గౌరవించవలసిన విశేషం. గర్వించవలసిన విషయం.

ఈ పవిత్రమూర్తుల సాన్నిధ్యంలో లక్ష్మి తన జ్ఞానతృష్ణ తీర్చుకుం టానికి ప్రయత్నం చెశారు. ఆ తపనోపశమనంలో జాతీయత, మతం, సంస్కారం, సాంఘిక సేవ లాంటి విషయాలపై సమగ్రమైన అవ గాహనను పొందారు. మాంసాహారంతినే కుటుంబంలో పుట్టిన లక్ష్మి శాకాహారిగా మారారు. దివ్యజ్ఞానతత్వచింతనతో ఈ పూజ్య దంపతుల సమక్షంలో వివిధ విషయాలను మనస్సుతోనే గాక హృద

యంతో గూడా గ్రహించారు. అన్నిమతాలను గౌరవించటం, ఎదుటివారిని ఆప్యాయతతో చూడటం, మానవ సంఘసేవా పరాయణతలో మాధవసేవానుభూతిని పొందటం తెలుసుకున్నారు. అంచులూ అవధులూలేని మానవ జాతిని సూక్ష్మరూపంలోనైనా దర్శించుకో గలిగారు.

ఈనాడు కొందరు తెలిపే విధంగా జాతీయతా వాదాన్ని లక్ష్మి ఆనాడు గ్రహించలేదు. ఆజాతీయ భావుకులకు తెల్లటోపీలు అక్కరలేదు, పార్టీటికెట్లు అవసరంలేదు; అధికారం ఉండ పనిలేదు; ఉద్యోగాలు అనవసరం. కర్మయోగిని కాలేకపోయినా, ఈమె కర్మయోగ సాధకురాలుగా తననుతాను ఈపునీత ప్రదేశంలో ప్రభావితం చేసుకున్నారు. ఆవాంఛతోనే జీవితాన్ని అంకితంజేసుకున్నారు.

సేవాధర్మ ప్రబోధాన్ని హృదయమారగ్రోలిన ఆదివ్యజ్ఞాన కళాశాల ఆవరణలోని ఆ తులసిచెట్టునూ, అక్కడే ఋషితుల్యులుగా ప్రభాసించిన ఆ ఆదర్శపూజ్యదంపతులను లక్ష్మి విస్మరించలేదు. వారి ప్రభావంతో వికసింప జేసుకున్న లక్ష్మి అంతరంగంలో ఆదంపతులిద్దఱకూ, ఆవిద్యాబుద్ధులు నేర్పిన ఆ మదనపల్లి కళాశాలకు ప్రత్యేక భక్తి గౌరవాలున్నాయి.

*　　*　　*

# లక్ష్మి - రఘురామయ్య

మదనపల్లి థియోసాఫికల్ కళాశాలలో అక్క లక్ష్మి, చెల్లి కృష్ణలకు రెండుసంవత్సరాల విద్యార్థినీ జీవితం విజయవంతంగా పూర్తయింది. వేసంగిసెలవులకు ఇంటికివచ్చారు అక్కచెల్లెండ్రు ఇరువురూ.

ఇంటిలోనిపెద్దవారిలో సమాలోచనలు ప్రారంభ మయినాయి. అవి గుజగుజలరూపంలో ఈ అక్కచెల్లెండ్ర చెవిని బడుతున్నాయి.

అక్కచెల్లెండ్రిరువురూ ఒకరిమొగం ఒకరు చూచుకుంటు న్నారేగాని, పెద్దల గుజగుజల గాధఅంతు తెల్సుకుంటానికి ఇద్దరూ మొగమోట పడుతున్నారు. కారణం ఇద్దరకూ తెలిసింది కర్ణాకర్ణిగా ఆసమాలోచనల తాత్పర్యం వారిద్దరి వివాహప్రసక్తేనని.

మామూలుగా అందరు ఆడపిల్లలకూ వివాహ మౌతుందనీ, వివాహసమయంలో, బంధుమిత్రలందరూ వస్తారనీ, నూత్నఆభరణాలూ, దుస్తులూ విరివిగా లభిస్తాయనీ, పెద్దమేజువాణీలూ, పెద్ద పెద్ద ఊరేగింపులూ జరుగుతాయనీ తెలిసే వయస్సేగాని, తదనంతరపు బరువు బాధ్యతలు అట్టే తెలిసే వయస్సుగాదు లక్ష్మి, కృష్ణలకు.

*　　*　　*

కృష్ణకూ, రఘురామయ్యగారి తమ్మునకూ వివాహం జరపాలనేది, ఇరుపక్షాలపెద్దలకూ చిన్ననాటి నుంచీ ఉన్న అభిప్రాయమే. బంధువుల్లో పిల్లలు పుట్టగానే బంధుత్వాలు తెలుపుకొని, కలుపుకోవాలని ఆరాటపడుతూ మమతలు పెంపొందించుకునే రోజులవి. కనక ఈ ఇద్దరికీపెండ్లి చేయాలని వాళ్లపసితనంలోనే పెద్దలు నిర్ణయించుకున్నారు.

అయితే, రఘురామయ్యగారి అన్న వెంకయ్యగారికి రఘు రామయ్యకు లక్ష్మిని చేసుకోవాలనే అభిప్రాయం, తమ్ముడు ఇంగ్లండులో బారిష్టరీ చదివేరోజుల్లోనే గలిగింది.

ఒకేకుటుంబంలోని ఇద్దరు అక్కచెల్లెండ్రను, వేరొకే కుటుం బంలోని ఇద్దరు అన్నదమ్ములకిచ్చి వివాహం జరుపడం అనేది బహు సకృతు. అయినా, అన్నీ ఆలోచించిన వెంకయ్యగారు వెంకటేశం గారి కుటుంబంతో ఈ రకంగా బాంధవ్యం అందుకుంటంలో ఎంతో ఉత్సాహం జూపారు. వెంకటేశంగారు తథాస్తు అని తమ మనోగత సంతృప్తిని బహిర్గతంచేశారు. ఇరువాగుల పెద్దల్లోసంపూర్ణాంగీకారం వెల్లివిరిసింది.

అప్పుడే రఘురామయ్యగారు, గ్రేట్ బ్రిటన్‌లో బార్-ఎట్-లా పూర్తిజేసుకొని, పట్టంతీసుకొని, దొరబాబులా మాత్ర గడ్డపై కాలూనారు. ఎన్నో ఆలోచనలను పునికి పుచ్చుకొని, ఆశయాలను రూపొందించుకొని, మార్గాలను శోధించుకొని స్వదేశంలో దిగారు.

ఇంగ్లండు నుంచి వచ్చిన రఘురామయ్యగారు నేరుగా ఊటీకి వెళ్లారు. అక్కడ విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆ రోజుల్లో మదరాసు రాష్ట్ర ప్రభుత్వానికి ఊటీ వేసంగి రాజధాని. రాష్ట్ర గవర్నరూ, సలహాదారులూ, హైకోర్టు న్యాయమూర్తులూ, ఉన్నత ప్రభుత్వోద్యోగులూ, రాజాలూ, యువరాజాలూ, సంపన్న జమిందా రులూ, సకుటుంబ సపరివారసమేతంగా వేసంగి నెలలన్నీ ఊటీలో విడిదిచేసేవారు. అందుకుకారణం మండు వేసవిలో గజగజలాడించే చలి అక్కడ ఉండటమేగాక ఆంగ్లవాతావరణం అక్కడ వెల్లివిరి స్తుంటుంది. సీమ నుంచి వచ్చిన భారతీయులు ఊటీలో తమవిశ్రాంతి కాలాన్ని గడపటానికి ఉత్సాహపడేవారు.

(రఘురామయ్యగారి అగ్రజులు వెంకయ్యగారు ఊటీకి వెళ్లారు. తమ్మునితో వివాహప్రసక్తి తీసుకవచ్చారు. తాను మాట్లా డిన సంబంధాలను, గురించి వివరించారు.)

గుంటూరు మదరాసు లకోన్ల లోని రఘురామయ్యగారి విద్యార్థి జీవితం పలువన్నెలతో విలసిల్లినట్టిది. తన అనర్గళ సహజ వాగ్ధోరణిలో, వివిధ సందర్భాలలో ఆంగ్లభాషలో ఆయన చేసిన ప్రసంగాలు అధ్యాపకులనేగాక, పలుసమావేశాలకు ఆహూతులుగా విచ్చేసిన ప్రముఖులను సయితం ముగ్ధులను గావించేవి. విషయ వివరణలో వారుచూపే సౌలభ్యము, భావప్రకటన, భాషను వారు ఉపయోగించుకునే తీరు, అన్ని స్థాయిలలోని శ్రోతలనూ ఆకట్టుకునేది. అంతర్ విశ్వవిద్యాలయ వాగ్వివాద పటిమాపోటీలలో శ్రీరఘురామయ్య స్వర్ణపతకాన్ని గెలుచుకున్నారు.

విద్యార్థి జీవితంలోనే ఆనాటి రాజకీయాలవైపు ప్రబలంగా ఆకర్షితులైన రఘురామయ్యగారు వీలైనపుడల్లా పెక్కు ఉద్యమాలతో ప్రత్యక్ష సంబంధం పెట్టుకోవడానికి ఎంతో ఉత్సుకత జూపేవారు. సంపన్న కుటుంబము బిడ్డడుగావడంతో, అనేక రాజకీయకార్య కలాపాలకు ధారాళాంగా విరాళాలు సమర్పించుకునే వారు.

అయితే ఈయన చేసే ప్రతిపనీ, వేసే ప్రతి అడుగూ ఎంత దూరంలో ఉన్నా వారి అగ్రజుడు వెంకయ్యగారు అతినిశితంగా పరికిస్తుండేవారు. ప్రతి ఆలోచననూ పరిశీలిస్తుండేవారు. నిత్యమూ ఆవేశపూరితమైన ఆనాటి రాజకీయ వాతావరణంలో, ఏక్షణంలో తమ్ముడు తలదూర్చుతాడోననే భయాందోళనలు ఆ అన్నగారిని వెన్నంటి ఉండేవి. ప్రతిసారీ రఘురామయ్యగారికి ముకుతాడు వేసినట్లు నడుపవలసి వచ్చేది.

"చరిత్ర ఇచ్చిన పిలుపుకు తన మనస్సు స్పందిస్తోందనీ, తన కర్తవ్యాన్ని తాను నిర్వాహించాలనీ"—రఘురామయ్యగారి వాదన.

"ఇంకా ఉన్నత పథంలో నీ కర్తవ్యాలను నిర్వహించాలంటే నీ విద్యార్థి జీవితం నిరాటంకంగా కొనసాగాలి. నీ రంగంలో

నీవునిష్ణాతుడవవాలి. నీ వ్యక్తిత్వం ఇంకా ఎంతో ఎదగాలి. అందాకా నీవు బాధ్యత గుర్తెరిగిన విద్యార్థివి మాత్రమే"—అని అన్నగారి ప్రతివాదన, ప్రతిపాదన.

"ఆవేళ రాజకీయాలు వ్యక్తి వికాసానికి తోడ్పడవు సరికదా సంఘానికి సయితం ఉపకరించవు."—అది అన్నగారి సలహా. అన్నగారి సలహా రఘురామయ్యగారికి 'ఆజ్ఞ', అతిక్రమించరాని ఆనతి.

రఘురామయ్యగారిది బాగా కలిగిన కుటుంబం. అన్నగారు ఇంజనీరు. తమ్ముణ్ణి స్వంతబిడ్డకన్నా మించి ప్రేమించేవారు. రఘురామయ్యగారి జీవితంలోని ప్రతి మలుపులోనూ ఈ అన్నగారి పాత్ర ఉంది. వారి ప్రోత్సాహం ఉంది. వారి ఆదేశం ఉంది. ఇండియాలో ఎం.ఎ., ఎల్.ఎల్.బి పరీక్షకు పంపించడంలోనూ, ఇంగ్లండులో బారిష్టరీ అధ్యయనం చేయించడంలోనూ, వారిదేచివరిమాట. ఒకోసారి అన్నమాట తమ్మునకు దాటలేని కోట.

అన్నగారి ఆచ్ఛాదనలో రఘురామయ్యగారు నాటి రాజకీయోద్యమాలతో ప్రత్యక్ష సంబంధాలను పెట్టుకోకపోయినా, ఏదోవిధంగా తన అభిమానాన్ని రాజకీయవాదులకు అందిస్తూ ఉండేవారు. రాజకీయాలను సాంగోపాంగంగా అధ్యయనం జేస్తూండేవారు. వివిధ దేశప్రభుత్వాల దృక్పథాలు, పలుపార్టీలు ప్రతిపాదించే రాజకీయ సిద్ధాంతాలు, జాతీయ అంతర్జాతీయ రంగంలో వస్తూన్న మార్పులు, నవతరం ప్రతిపాదిస్తూన్న సామ్యవాద భావసరళీ శ్రద్ధగా ఆకళింపు జేసుకునేవారు. సహజంగా తనదైన సునిశితమేధా సంపత్తితో ప్రతి విషయంలోనూ విత్తుకు విత్తూ, పత్తకుపత్తా విడమర్చుకుంటూ ఆలోచనలలో ముందుకు సాగిపోయేవారు.

కాగా ఆంగ్లదేశవాసం రఘురామయ్యగారి దృష్టిని ఎంతో వికసింపజేసింది. బ్రిటిషుదొరల రాజకీయాలను సామీప్యంలో ఉండి అవగాహనచేసుకునే అవకాశం, ఐరోపా ఖండంలో పెక్కుదేశాలలో త్వరత్వరగా వస్తూన్న మార్పులనూ ప్రత్యక్షంగా అర్థంచేసుకునే



తులసి తల్లి కెమరుగా.



మహాత్ముని మూర్తి ప్రక్కన



తాంబూల చర్వణం



మహిళా మహాసభ ఢిల్లీశాఖ సమావేశంలో ప్రధాని స్వర్గీయ జవహర్ లాల్ నెహ్రూ, శ్రీమతి మసుమాబేగం, శ్రీమతి రాజన్ నెహ్రూ, శ్రీమతి ఫూల్ రేణుగుహ, అధ్యక్షత వహించిన శ్రీమతి లక్ష్మీరఘురామ్.



ఢిల్లీ ఆంధ్ర అసోసియేషన్ రజతోత్సవ మహాసభకు రాష్ట్రపతి స్వర్గీయ బాబూరాజేంద్రప్రసాద్ అధ్యక్షత వహించారు. ఆచార్యరంగా ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. అసోసియేషన్‌కు తొలి మహిళా అధ్యక్షురాలు శ్రీమతి లక్ష్మీరఘురామ్.




- అంతర్జాతీయ మహిళా సమాఖ్య సమావేశంలో అధ్యక్షత వహించిన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ; స్వాగతం పలుకుతున్న శ్రీమతి లక్ష్మీరఘురాం.



అఖిలభారత మహిళా మహాసభ 44వ సమావేశంలో ప్రారంభోపన్యాసం చేస్తున్న శ్రీమతి విజయలక్ష్మీపండిట్, వేదికపై అధ్యక్షత వహించిన శ్రీమతి లక్ష్మీరఘురాం.



— ఈజిప్టు అధ్యక్షులు శ్రీసాదత్ సోదరి శ్రీమతి సకీనాఎల్‌సాదత్‌తో గోష్ఠి.



- 44వ అఖిల భారత మహిళా మహాసభ సమావేశ ప్రారంభకులు శ్రీమతి విజయలక్ష్మి పండిట్, అద్యక్షులు శ్రీమతి లక్ష్మీరఘురామ్.



— యుగోస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటో దంపతులు శ్రీమతి లక్ష్మీ రఘురామయ్య ఇచ్చిన విందులో



శ్రీరఘురామయ్య దంపతులు అశోకహోటల్‌లో ఇచ్చిన విందుకు హాజరైన అతిథులు అమెరికా రాయబారి శ్రీ కెన్నెత్ బి. కీటింగ్, జాన్‌వాల్ష్ దంపతులు



అఖిల భారత మహిళా సదస్సు సమావేశంలో శ్రీమతి ఇందిరాగాంధీతో



లక్నో సభకు అధ్యక్షపీఠం వహించిన శ్రీమతి లక్ష్మీరఘురామ్; ప్రారంభకులు ఉత్తర ప్రదేశ్ మాజీ గవర్నర్ డాక్టర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి.



ప్రపంచ తెలుగు మహాసభలలో మహిళా సదస్సు అధ్యక్షపీఠం పైన; ప్రక్కన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు.




"అన్య రాష్ట్రాలలో తెలుగువారు—తెలుగు సంస్కృతి"—సమావేశంలో అధ్యక్షోపన్యాసం : వేదికపై శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి.

అవకాశం వారికి లండన్‌లో బారిష్టరీ చదివే రోజుల్లో లభ్యమైంది. దానిని వారు చక్కగా ఉపయోగించుకున్నారు గూడా.

పక్వమైన మేధస్సుతో, వికసించిన దృక్పథంతో, రాజకీయ రంగంలో ప్రధాన పాత్రలు నిర్వహించాలని మాతృభూమిపై ఉత్సాహంతో అడుగిడిన రఘురామయ్యగారిని, ఊటీలో అన్నగారి ఆలోచన, శీతాకాలంలో చన్నీళ్ళ స్నానం చేయించింది. పొంగులారే ఉత్సాహపు పాలపాత్రపై కాసిని నీళ్లు చల్లినట్లయింది.

రఘురామయ్యగారి ఆలోచనలు అతలాకుతలమైనాయి. మనస్సు కల్లోలపడింది.

ఉన్నత విద్యలు పూర్తి జేసుకొని స్వదేశానికి తిరిగి వచ్చిన సోదరుడు రాజకీయాలలో ప్రవేశిస్తే, ఎందుకూకొరగాని వాడవుతాడనీ, తాడూబొంగరమూలేని ఈ దేశపు రాజకీయపు ఆటల్లో, చివరకుఅలసట నిరాశలే మిగులుతాయనీ అన్నగారి సుదృఢఅభిప్రాయం. తమ్ముడు ఆర్జించిన విద్యావిజ్ఞానాలతో, ఉన్నత ప్రభుత్వోద్యోగి అయితే, తనకుతాను బాగుపడటమేగాక సంఘానికిగూడా ఉపయోగ పడతాడని వారి విశ్వాసం. తక్షణం వివాహంజేసి ఉద్యోగంలో ప్రవేశబెడితే పొంగులువారే యువకరక్తం, క్రమంగా చల్లారి శాంతంగా బ్రతుకుబాటలో పయనిస్తుందని ఆయన నమ్మకం.

అందుకే ఈ పెండ్లి ప్రస్తావన. అన్నగారి మాటకు మనస్సులో ఇష్టం ఉన్నా లేకున్నా మాటల్లో అంగీకరించండం, తలఊపడం రఘురామయ్యగారికి బాల్యం నుంచీ అలవాటే. అలాగే ఈ వివాహ విషయంలో గూడా అన్నకు తమ్ముని అంగీకారం లభించింది.

తృప్తిగా వెంకయ్యగారు ఊటీనుంచి సంగంజాగర్లమూడి వచ్చారు. పెద్దలసమక్షంలో రెండుజంటలకూ లగ్న నిశ్చయం జరిగింది.

* * *

శుభలేఖార్థములు పరస్పరం ఇచ్చిపుచ్చుకోవడంతో పెండ్లి పనులు చకచకా ప్రారంభమైనాయి.

ఇంటిలోపలి గోడలన్నీ గవ్వసున్నపు ధవళకాంతితో మెరుస్తు న్నాయి. బయటవరండాలు దర్వాజాలూ క్రొత్త రంగులు సంత రించుకున్నాయి. ఇంటిముంగిటా వీధిలోగూడా పెద్ద పెద్ద తాటి యాకు పందిళ్లు వెలిశాయి. తెల్లని చాందినీ పందిళ్ల క్రిందమెరిసింది. ఇల్లంతా రంగులతో శృంగారించబడింది. నవరంగుల కాగితాలతో ఇంట్లోని దూలాలు, మొగరాలు, పందిళ్లూ కొత్తకాంతులు చిమ్ము తున్నాయి.

పెండ్లికై ప్రత్యేకంగా తెప్పించి ఏర్పాటు చేయబడ్డ విద్యు దుత్పాదకయంత్రం దూరంగా ఒక కొష్టంలో నుంచి లయప్రకారం తిరుగుతూ, వీధినీ ఇంటినీ ప్రకాశవంతం జేస్తోంది.

పందిళ్ల పైని కప్పిన కొత్త తాటాకులు చల్లగా కమ్మని వాసనలను వెదజల్లు తున్నాయి.

పేరు పేరునా సపరివారసమేతంగా ఆహ్వానించబడిన బంధు వర్గమంతా, వారివారి బంధుమిత్ర పరివార సమేతంగా వివాహానికి సంతోషంతో తరలివచ్చింది. బియ్యంచేసేవాళ్లు పప్పులుచేసేవాళ్లతో ముందు వరండాలన్నీ నిండాయి. కారాలుకొట్టేవాళ్లు పచ్చళ్లు పట్టే వాళ్లూ వెనుక దొడ్డంతా ఆక్రమించారు. వచ్చే పోయేవారి హడా వుడి ఇంతా అంతాగాకుండా ఉంది.

వంటపంతుళ్ల ఆర్భాటం గూడా మిక్కుటంగానే ఉంది. విద్యుద్దీపాలకాంతిలో రాత్రిళ్లు పగళ్లుగా మారాయి. పనుల పురమా యింపులూ, వరుసగా ఇరవైనాలుగుగంటలూ కొనసాగుతూనే ఉన్నాయి.

ఈ పెండ్లి సంప్రదింపులుసాగే సమయంలో వెంకటేశంగారు విజయనగరంలో ఉద్యోగంలో ఉన్నారు. పిల్లల పెండిండ్లు చౌదరి

గారు తలపెట్టారని తెలుసుకున్న రాజాగారు విజయనగరంలోనే వివాహాలు జరుపగూడదా !, అని అన్నారు. 'అన్ని విధాలా పెద్ద ఎత్తునజరుపవచ్చనీ, ఉన్నత విద్యాపారంగతులైన అల్లుళ్ళకూ, పెండ్లి వారికీ లాంఛనాలూ మర్యాదలూ ఘనంగా జరుపవచ్చుగదా' అని గూడా వెంకటేశంగారితో రాజాగారన్నారు.

వెంకటేశంగారికి తనకూతుండ్రవివాహం, స్వంతగ్రామంలో స్వగృహంలోనే జరపాలనేది కోరిక. దగ్గరబంధువులందరూ దుగ్గిరాలలో నయితేనే తృప్తిగా వచ్చేందుకు వీలవుతుందనీ, తనఇద్దరి బిడ్డల వివాహం ఒకేసారి చేస్తున్నారు గనుక, మరో శుభకార్యానికి అవకాశం ఉండదనీ భావించి ఇంటివద్దనే జరుపాలని నిశ్చయించారు. బంధుమిత్రులందరకూ ఈ నిర్ణయం ఆనందాన్ని గల్గించింది.

వివాహాలకు విపులసన్నాహం గావించారు వెంకటేశంగారుం చల్లపల్లి జమీ నుంచి ఒక ఏనుగు, మరో చోటు నుంచి మరో ఏనుగు ఉరేగింపులకని వచ్చాయి. ప్రసిద్ధులైన నాదస్వర విద్వాంసులు విచ్చేశారు. బ్యాండు షహనాయ్ మేళాలతో ఊరంతా మారుమ్రోగింది.

అమ్మగారూ, మిగిలిన దగ్గిరబంధువులూ పెండ్లికూతుళ్లకు అమరవలసిన ఆభరణాలను, దుస్తులను, తయారించుకొని సిద్ధం పెట్టుకున్నారు.

జిల్లాలనుండేగాక, ఇతరప్రాంతాలనుండి గూడా వెంకటేశం గారి శ్రేయఃకాములు, మిత్రులూ ఎందరోవచ్చారు. పరిసర గ్రామాలనుంచి వందల సంఖ్యలో ఆహ్వానితులు విచ్చేశారు. పెరుగు కావిండ్లు, పాలబిందెలు కూరగాయలబండ్లు ఎటుచూచినా ప్రత్యక్షమైనాయి.

ప్రతిమనిషి జీవితంలోనూ ఉత్తమమైన దినములాగే లక్ష్మి జీవితంలోగూడా ఉత్తమోత్తమమైన రోజు జూన్ మూడవ తేదీ రానే వచ్చింది. అది ఉత్సవదినం భాసిల్లింది. జీవితపుమహోత్సవ దినంగా విభాసిల్లింది.

అప్పుడే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొని లక్ష్మి లోగిలి ముంగిటకొచ్చేసరికిస్వర్ణ కాంతులతో సూర్యదేవుడు తూరుపుదిక్కున ఎగబ్రాకుతున్నాడు. భూతలాన్ని వెలుగులతో నింపు తున్నాడు. చాలాసార్లు లక్ష్మి సూర్యోదయాన్ని గమనించిందిగానీ, ఆరోజెం దుకో సూర్యుడు ఆమెకు అందంగా కనపడ్డాడు. భూమిఅందంగా కనబడింది. మబ్బుతునకలు అందంగా కనపడ్డాయి. ఆకాశమూ అందంగా కనపడింది. పశుపక్ష్యాదులు, ఇంటిప్రక్క చెట్టుచేమలూ, ఉదయపు సంధ్యారాగపు వెలుగులూ అందంగా కనపడ్డాయి. మనస్సు లోనే సూర్యభగవానునకు నమస్కరించ బుద్ధయింది. నమస్కరిం చింది లక్ష్మి.

ఏ దేశంలోనైనా ఆడపిల్ల జీవితంలో వివాహపు దినం ప్రధాన మైనరోజు. ముఖ్యంగా భారతదేశంలో అది అత్యంత ప్రధానమైన దినం. ఆనాటితో ఆడపిల్ల జీవితంలో మార్పువస్తుంది. భావనలో మార్పువస్తుంది. ఉనికిలో మార్పువస్తుంది. నాటివరకూ పెంచుకొని ఉంచుకున్న మమకారాలలో మార్పువస్తుంది. పుట్టిపెరిగిన పరిసరా లలో మార్పువస్తుంది. తనదనేదేదో తనకు లభ్యమౌతుంది. అదె లాంటిదో తెలియకపోయినా ఆడపిల్ల అందులో కడుగుపెడు తుంది.

మెడలో ఆ మూడుముళ్లూ పడగానే నూతనవధువు, కని పెంచిన తనిదండ్రులవద్ద అశ్రుపూరిత నయనాలతో అంపకాలు చెప్పించుకొని, మూగవోయిన గొంతుకతో సెలవుచెప్పి, పాదాల నంటి నమస్కరించి, నవమాసాలుమోసి, కని, అష్టాదశవర్షాలు పోషిం చిన అమ్మనాన్నలనూ, తనవారినీ బాల్యమాది ఆడిపాడిన నెచ్చెలు లనూ, తన ఇంటినీ మరీమరీ తలచుకుంటూ, దుఃఖోద్వేగాన్ని గొంతు లోనే ఇముడ్చుకొని, బాధను గుండెలోనే దాచుకొని, నెమ్మదిగా బరువుగా అడుగులేసుకుంటూ వరుని చిటకినవ్రేలు ఆసరాగా వీధి లోనికి వడుస్తుంది. పల్లకీలో ప్రయాణిస్తుంది. అత్తవారింట అడు గిడుతుంది. జీవితంలోనికి పాదం సాచుతుంది. నూతన జీవితం సాగిస్తుంది.

హిందూ సమాజంలో వివాహానికి చాలా ప్రాముఖ్యత ఇచ్చారు. పంచభూతాలను సాక్షీభూతం చేసుకున్నారు. అగ్నిదేవుని ప్రత్యక్షసాక్షిగా ఆ వాహనం జేసుకొని ఆజ్యంసమర్పించి తృప్తిజేసి, ఆ దేవునిముందు వివాహబంధాన్ని మంగళసూత్రపు మూడు ముళ్లతో బిగిస్తారు. ప్రత్యేక పవిత్రతను ప్రతిపాదిస్తారు. శుభ ముహూర్తాలంటూ కొన్నింటిని ప్రత్యేకిస్తారు. వాటినే ఇందుకు విని యోగిస్తారు. వేద పండిత మంత్రోచ్ఛారణల మధ్య, మంగళ తూర్యాల మధ్య ఆ బంధనం పవిత్ర బంధంగా వధూవరుల జీవిత కాలపు మేలుకలయికకు పవిత్ర చిహ్నంగా మనస్సుల్లో ద్యోతకం చేస్తారు.

రఘురామయ్య అన్నగారికి సాంప్రదాయ వివాహాలంటే పరమ ప్రీతి. అందుకే సంగం జాగర్లమూడి నుండి వరునితోపాటు చక్కగా అలంకరించిన ఒకవంద ఎడ్లబండ్లతో తరలివచ్చారు వివాహానికి.

అందరకూ అన్ని మర్యాదలు వధువుల గృహంలో సక్ర మంగా జరుపబడ్డాయి. అత్యంత శోభాయమానంగా అలంకరించ బడిన వివాహవేదికపై లగ్నసమయానికి బంధుమిత్రుల సంతోషాతి శయాలమధ్య 'లక్ష్మి' - 'రఘురామయ్యల' వివాహం పూర్తయింది.

అదే రాత్రి వేకువన మరో ముహూర్తాన రెండవజంట 'రాధాకృష్ణ' - 'కృష్ణరావుల' వివాహం జరిగింది.

ఇక తదుపరి వివాహ వేడుకలు కోకొల్లలు. ఏనుగులపై అందంగా అలంకరించిన అంబారీలు, అంబారీలలో ఇరుజంటల నవ వధూవరులు, రెండు ఏనుగులు ఒకదాన్ని అనుసరించి మరొకటి మందగమనంతో నడుస్తుండగా, బాజాభజంత్రీలు బ్యాండు వాయి ద్యాలు, నాదస్వర షహనాయిమేళాలు, వివిధ రాగాలాపనలతో ముందునడువ, అవ్వాయిసువ్వలు ఆకాశంలో విహరిస్తూ వెలుగులు విరజిమ్మ, బాణాసంచాలు వింతధ్వనులుచేయ, బజారుబజారునా గ్రామ మంతా ఊరేగింపు సాగింది.

పదిరోజుల పెండ్లి అది. ఆ పది రోజులూ మధ్యాహ్న సాయంత్రాలలో వధూవరులకు వివిధ వేడుకలు జరిగాయి. ప్రతి సాయంత్రం సీతారామ కళ్యాణం, పార్వతీ కళ్యాణం, రుక్మిణీ కళ్యాణం లాంటి పురాణ స్త్రీల కళ్యాణ గాథలను తెలుగు దేశంలోని సుప్రసిద్ధ కథకులు హరికథలుగా గానం చేశారు. కవి పండిత సభలకు పెండ్లి పందిరిలో పెద్దఎత్తున ఏర్పాట్లు జరిగాయి. దూరప్రాంతాలనుంచి సయితం విద్వజ్జులు విచ్చేసి తమతమ పాండితీ ప్రకర్షతో ఈ నూతన వధూవరులపై అక్షతాక్షతలు చల్లేరు.

తిరిగి రాత్రికి ఏదో ఒక సంగీతగాన కచ్చేరీలను ఏర్పాటు చేసేవారు.

ముప్పయివేల రూపాయీలదాకా ఈ వివాహాలకు ఖర్చు అయిందని లక్ష్మి మేనమామ తనతల్లికి చెప్పినపుడు ఈమె అక్కడే ఉన్నారు.

ఇచ్చుకున్నవారికీ, తెచ్చుకొన్నవారికీ, ఇచ్చిపుచ్చుకోబడిన వారికీ, చూచేవారికీ, సర్వవిధాలా సంతృప్తికరంగా, పదహారవ రోజు పండుగ నాడు కంకణ విసర్జనతో వివాహమహోత్సవాలు ముగిశాయి.

# లక్ష్మి - రఘు

లక్ష్మి - రఘురామయ్యగారల వివాహం ఘనంగా సంతృప్తి కరంగా పూర్తయింది. మూడు నిద్రలూ, మలినిద్రలూ ముగిశాయి. కొత్తకాపురం పెట్టాలని పెద్దలు నిశ్చయించారు.

మదరాసులో కొత్తసంసారానికి అవసరమైనవన్నీ అమ్మ నాన్నలు వచ్చి అమర్చిపెట్టి వెళ్ళిపోయారు.

నవదంపతులు స్వంతబ్రతుకులు బ్రతకటం ప్రారంభించారు. రఘురామయ్యగారు ఉన్నత విద్యలు అభ్యసించారు. విదేశాలలో గూడా ఉండివచ్చారు. ఆధునిక నాగరిక లక్షణాలన్నీ వారిలో మూర్తీభవించి ఉన్నాయి. పరిచయాలూ, సహవాసాలూ గూడా పెద్దలతోనే ఉన్నాయి. ఇంట్లో వంటరిగా ఉన్నపుడు మొదటిరోజుల్లో ఆలోచించుకుంటుంటే లక్ష్మికి కొంచెం భయంవేసేది. తనేమో తల్లి దండ్రుల అదుపు ఆజ్ఞలలో సాంప్రదాయబద్ధంగా పెరిగిన పిల్ల. కాలేజీల చదువు ఉన్నా అతిపరిమితమైన స్నేహాలూ పరిచయాలూ వినా లక్ష్మి ఎప్పుడూ ఎవరితో ఎక్కువ సంబంధాలు పెంచుకోలేదు. అసలు లౌకికం, కలుపుగోలుతనం చాలా తక్కువనికూడా ఈమెను గురించి అందరూ అనుకునేవారు. మరి అలాంటి తాను రఘు రామయ్యగారివేగాన్ని అందుకొనగలనా! అంటూ ఒకోసారి లక్ష్మికి సంశయంగలిగేది. అయితే రఘురామయ్యగారి అనురాగ పూరిత ప్రవర్తనాసరళి ఈమెను నిస్సంశయురాలినిగా జేసింది.

మద్రాస్ కాపురపు మొదటిరోజుల్లోనే రఘురామయ్యగారు ఒకసారి అన్నారు. "ఇదిగోలక్ష్మి, నన్ను నీవు, అండీ, ఏమండీ, రఘురామయ్యగారండీ, అని పిలువపనిలేదు. సింపుల్‌గా 'రఘూ' అని పిలువు చాలు. అది నాకు ఇష్టంగూడా" అని అన్నారు. లక్ష్మి

ఊరకే నిలుచుని వింటున్నది. 'ఇలారా, ఈసోఫాలో కూర్చో. ఏమండీ, గారూ; అనిపిలిచేదెవర్ని?.'' అని ప్రశ్నించారు రఘురామయ్యగారు. లక్ష్మి సమాధానం చెప్పలేదు.

వారే అన్నారు; "ఎవరనో తెలుసునా, గౌరవనీయులైన పరాయివారిని; అంతే గాని ఆప్తులనీ తనవారిని అంతగా మాటి మాటికీ మర్యాదలతో సంబోధించవలసిన పనిలేదు. అత్యంత సన్నిహితులుగా మనవలసినమనం 'రఘూ' అని పిలుచుకుంటేచాలు." అన్నారు. తనకీమాట బాగానే ఉంది. నచ్చిందిగూడా, "సరే" అన్నదిలక్ష్మి. "మరి నిన్ను ఏమని పిలవమంటావ్ ?'' అన్నారు నవ్వు కుంటూ. ''మీ యిష్టం మీకు ఎట్లాపిలిస్తే బాగుంటుందో అలాగే పిలువు రఘూ" అంది లక్ష్మి.

'' నా యిష్టంతోపాటు నీ యిష్టంగూడా తెలుసుకోవాలి. రెంటినీ జోడించుకోవాలి. రెండు ఇష్టాలు ఒకేయిష్టంగా చేసుకో వాలి. అపుడు ఏ పేచీ ఉండదు. మరి ఇప్పుడు చెప్పు నిన్ను ఏమని పిలవమంటావో?" అన్నారు రఘురామయ్యగారు.

"లక్ష్మి అని పిలవండి'' అన్నదిలక్ష్మి.

లక్ష్మి అసలు పేరు లక్ష్మీనారాయణ.

"కరెక్టు. నామనస్సులో ఉన్న పేరే అది. నీకూ అదే నచ్చినప్పుడు నీవు నిజంగా లక్ష్మివే. అయితే చిన్న ఎమెండ్ మెంటు 'లక్కీ' అని పిలుస్తాను." ఆ పిలుపు లక్ష్మికి అందంగానే వినిపించింది. సరేనన్నది. ఇద్దరూ నవ్వుకున్నారు. నాటినుంచి రఘు లక్ష్మిని 'లక్కీ' అనే పిలుస్తారు. ఆ నాటినుంచి, లక్ష్మి భయాలు అర్థరహితమని తేలిపోయింది. రఘు మంచి స్నేహితుడుగా కన పడ్డాడు. హృదయపూర్వకమైన హితవరిగా కనపడ్డాడు. మార్గ దర్శిగాకనపడ్డాడు. ఉత్తమప్రేమికుడుగా కనపడ్డాడు. భవిష్యత్తు ఆయనతో భద్రప్రదమౌతుందనే విశ్వాసంగలిగింది లక్ష్మికి.

ఇన్నిరోజులు అమ్మకూ నాన్నకూ దూరంగా కాలేజీల్లో ఉంటూంటే అట్టేబెంగ అనిపించేదిగాదు. లక్ష్మికి ఇప్పుడు అప్పుడ

డప్పుడు అమ్మ నాన్నలు జ్ఞాపకం వస్తుండేవారు. ఇల్లూ, ఊరూ జ్ఞాపకం వస్తుండేవి. అలాంటి వేళల్లో అంత మహానగరంలో ఒంటరిదా అన్నట్లు భావిస్తుండేది. ఒక అలాంటిసమయాన్ని రఘు పసిగట్టి, లక్ష్మీ, ఏం దిగులుగా ఉన్నావా ? అమ్మానాన్నగారలు జ్ఞాపకం వచ్చారా, మధ్యాహ్నమేగా ఉత్తరం అందుకున్నావు. సరేపద బయటికెళ్దాము'' అన్నారు. ఇద్దరూ తయారయి కారులో కూర్చున్నారు. మద్రాస్ నగరమంతా త్రిప్పారు. వివిధ విశేషాలను తెలిపారు. చివరకు చెన్నపురి ఆంధ్రమహాసభకు తీసుకపోయారు. అక్కడ అందరూ రఘురామయ్యగారిని ఆప్యాయతగా పలకరించారు. కుశలప్రశ్నలు వేశారు. ప్రక్కనే ఉన్న లక్ష్మిని అర్ధాంగిగా తెలుసుకొని, అభినందనలను తెలిపారు. అనేక మంది మహిళా సభ్యురాండ్రతో గూడా అక్కడే పరిచయమయిందిలక్ష్మికి.

జీవితంలో క్షణికంగా తొంగిచూచిన స్తబ్దత తొలగిపోయింది. ఈమె జీవితప్రవాహంలో కలసిపోయింది.

శ్రీమతి దుర్గాబాయమ్మగారి లాంటి ప్రఖ్యాత మహిళా ఉద్యమ కార్యకర్తలతో పరిచయమయింది. క్రమంగా ఆ పరిచయం పెంపొందింది. అంతకుముందే లక్ష్మి మనస్సులో బీజరూపంలో ఉండిఉన్న స్త్రీజన సంక్షేమ కార్యక్రమాలవైపు ఆసక్తి మళ్లింది. ఈమె గురుదేవి మార్గరెట్ కజిన్సు మనస్సులో మెదిలింది.

మదరాసులో ఉన్న ఆంధ్రులకు సాహిత్య కళారంగాలలో ఆసక్తిని పెంపొందిస్తూ పట్టణంలో ఉన్న నలుగురూ ఏదో సమయంలో కలుసుకొని పరస్పరం ముచ్చటించుకొనే వేదికగా ఆంధ్ర మహాసభ చిరకాలంనుంచి పేరుపడింది. కాని ఆంధ్ర స్త్రీలకు ప్రత్యేక వేదిక అంటూ ఏమీ మద్రాస్‌లో అంతవరకు ఏర్పడలేదు. అందరి మనసుల్లో ఆ ఆలోచన ఉంది.

ఒకరోజున శ్రీమతి దుర్గాబాయమ్మ ఆ విషయమే ప్రసంగ వశాత్తు బయటపెట్టారు. లక్ష్మి 'అవశ్యం' అన్నారు. మిగిలిన సభ్యు

రాండ్రు గూడా ఉత్సాహం జూపించారు. పురుషులు గూడా 'మంచిదే' అన్నారు. అందరూతథాస్తు అనుకున్నారు.

ఆనాటి కృషితో అట్లా ప్రారంభమయింది ఆంధ్ర మహిళా సభ మద్రాస్‌లో. వ్యవస్థాపక సభ్యురాండ్రల్లో లక్ష్మి ఒకరైనారు. నాటినుంచి, ఆంధ్ర మహిళా సభ చిలవలకు పలవలుగా వర్ధిల్లింది మూడు పూవులూ ఆరు కాయలుగా వికసించింది. ఆంధ్ర మహిళా ఉద్యమ చరిత్రలో చిరస్థాయిగా నిలిచే ఒక మహా సంస్థగా రూపొందింది.

రఘు అన్నయ్యాగారికి, వీరు ప్రభుత్వోద్యోగంలో ప్రవేశిస్తే బాగుండునని అభిప్రాయం చాలా కాలం నుంచి ఉంది. న్యాయ శాస్త్రంలో ఉన్నత పట్టానుపొందిన తమ్ముడు త్వరగా ప్రభుత్వ న్యాయశాఖలో జేరితే, కొద్ది సంవత్సరాలలో జిల్లా జడ్జిగావచ్చనీ, తర్వాత హైకోర్టు జడ్జిగావచ్చనీ, వారి అభిప్రాయం.

రఘురామయ్యాగారికి, రాజకీయాలంటే మక్కువ ఎక్కువ. స్వతంత్రతపై వాంఛమెండు. కొన్నిరోజులపాటు ఒకరి అభిప్రాయాలను ఒకరు తెలుసుకొని తర్కించుకున్న తదుపరి అన్నదమ్ముల మధ్య సయోధ్య కుదిరింది. రఘురామయ్యాగారు స్వంత ప్రాక్టీస్ మద్రాస్‌లో ప్రారంభించారు. రఘురామయ్యాగారు మొదటి కేసు గెలిచారు. అయితే వచ్చిన ఫీజు ఇరవై అయిదు రూపాయిలు. అందులో మరొక అడ్వకేటుగూడా సహకరించాడనే కారణంగా పన్నెండున్నర రూపాయీలు భాగం పంచియిచ్చారు. రఘు రామయ్యాగారు గెలిచినందుకు తోటిన్యాయవాద మిత్రులకు తేనీటి విందు హైకోర్టులోనే చేయగా మరోరెండున్నర మిగిలింది. కారెక్క బోయేప్పుడు బహుశా కోర్టు జవానుగా మోసు బారిష్టర్ గారు మొదటికేసు గెలిచారు అని ననుకుతూ సలాంపెట్టినందుకు రెండు రూపాయిలు.

ఇంటికిరాగానే "లక్ష్మీ!" అంటూ కేకవేశారు. ఏమండీ అంటూ వారి గదిలోనికి వెళ్ళింది లక్ష్మి.

"ఇవాళ మనమొదటికేసు గెలిచాము, తెలుసా?" అన్నారు; నవ్వుతూ.

"అలాగా సంతోషం - కంగ్రాచ్యులేషన్సు" అన్నది - లక్ష్మి.

"కంగ్రాట్సుసరే. సంపాయించిందెంతో అడగవేం?" అని మళ్లీ ప్రశ్నించారు షైవిప్పుకుంటూ.

"సంపాదనదేముంది? ఎంతో కొంత. ఆరంభంలోనే ఎవరకూ వేలకువేలురావుగా," అన్నది అనాసక్తంగా లక్ష్మి.

"ఆ వచ్చిన పాతిక రూపాయిలైనా ఏమిచేశానో అడగ వేం?" అన్నారు కోటు ఊడదీసుకుంటూ రఘురామయ్యగారు. అంటూ పైని వివరించిన ఖర్చులు తెలిపారు.

లక్ష్మి నవ్వుకున్నది వారి జమాఖర్చుల జ్ఞాపకానికి.

"సరే ఆ మిగిలిన అర్ధ రూపాయి ఇలా ఇవ్వండి" అన్నది లక్ష్మి ఆసక్తితో.

"ఎందుకు? అన్నారు" కుతూహలంగా. "ఒకందుకులెండి!" అంటూ దానిని తీసుకొని భద్రంగా ఒక కవరులోపెట్టి దాచింది లక్ష్మి. చాలా రోజులు అది అమూల్య వస్తువుగా దాచింది. బేబి పుట్టి పెద్దదైన తరవాత గూడా ఆ కవరులో ఆ విక్టోరియామార్కు నాణెం చెక్కు చెదరకుండానే ఉంది.

ఒక రోజున బేబీ ఆ కవరును చేత్తోపట్టుకొని ఆఫీసులో పని జేసుకుంటున్న వాళ్లనాన్నగారివద్దకు వెళ్లి "నాన్నా ఇదిఏమిటో చెప్పుకోండి" అంది వయ్యారంగా. బేబీ చేతిలోని కవరు కేసి చూచి, "నీవే చెప్పుకో తల్లీ అదేమిటో" అన్నారు రఘురామయ్యగారు.

"మీకు తెలియదంటే నేనే చెబుతాను" అన్నది బేబీ.

''తెలియదులే అమ్మా, చెప్పు." అన్నారు రఘురామయ్యగారు.

"మీరు గెలిచిన మొదటి కేసులో వచ్చిన డబ్బులోంచి మిగిలిన అర్ధరూపాయి నాణెం నాన్నగారూ!" అన్నది బేబీ.

రఘు ఆలోచనలు ఎంతదూరమో పోయాయి. ఎంత వెనక్కో నడిచాయి. ''లక్కీ'' అనిపిలిచారు.

ఈమె సమీపించగానే, ''ఇందుకా! ఆరోజు ఆ అర్ధరూపాయిని అంత ఆసక్తిగా అడిగి తీసుకున్నావు. ఇంతకాలం దాచే ఉంచావూ ఆ కవరులో...'' ఎటోచూస్తో ఏదో ఆలోచిస్తూ పలికారు, రఘురామయ్యగారు.

నిజమే ! ఈ సంఘటన జరిగినపుడు రఘురామయ్యగారు కేంద్ర మంత్రి మండలిలో సభ్యుడుగా ఉన్నారు. "ఎంత మంచి జ్ఞాపకం లక్కీ" అన్నారు.

మద్రాసుకు ఢిల్లీకి పదిహేనువందల మైళ్లు. ఇరవై సంవత్సరాల కాలగమనం !! ఎక్కడనుంచిఎక్కడకు ఎంతదూరంప్రయాణం చేశాము అని లక్ష్మికి అనిపించింది. జీవితం ఎంతవేగంగా మార్పు చెందిందా అని అనిపించింది. ఒక్కత్రుటిపాటు ఎన్నో జ్ఞాపకాలు స్మృతిపథంలో మెదిలాయి.

అది ఒకచిన్న నాణెమేగావచ్చు. ఎంతటి మధురాతి మధురమైనస్మృతిని మనో వీధిలోంచి బయటకు తీసింది. ఆ నాణెంలో మార్పులేదు, కాని వీరిలో ఎంతటిమార్పు ! ఆనాడు వీరు ఊహించని మలుపు తిరిగింది జీవితం.

తల్లిదండ్రులను చూచి, వారి భావాల లోతులనుపసిగట్టిన 'బేబీ'—"ఇది అమూల్యమైన నాణెం నాన్నగారూ" అని తిరిగి

భద్రంగా కవరులో పెట్టింది. తనగదిలోనికి తీసుకపోయింది. దానిని తన పెట్టెలో భద్రం చేసుకొని ఉంటుంది. బహుశా ఒక రోజుకు తనబిడ్డలకుగూడా ఆ నాణాన్ని చూపించి దాని కథా కమామీషు తెలుపుతుంది గామోసు !

* * *

ఆంధ్రమహిళాసభ పలుమార్గాలలో పయనిస్తూ నిరాశ్రయులైన యువతులకు, తిరిగి తమకాళ్ళపై తాము నిలద్రొక్కుకొని సంఘంలో తలెత్తుకొని తిరగటానికి వివిధ కార్యక్రమాలను తలపెట్టింది. వాటిల్లో భాగంగా ఒక శిశుసంరక్షణాలయం గూడా ఏర్పాటు జేశారు. అందులో అనాధశిశు పోషణ, విద్యాభ్యాసము లాంటి కార్యక్రమాలను నిర్వర్తించేవారు. దాని పూర్తి ఆధ్వర్య బాధ్యతలు లక్ష్మిక్రిందనే ఉండేవి.

అలాగే నిర్వ్యాపారంతో ఉండే యువతులకు వీరు ప్రింటింగుప్రెస్ ఒకటి ఏర్పాటుజేసి, దానిలో వారికి, కంపోజింగ్, ట్రెడిలింగు, బైండింగు మొదలైన భృతికి దోహదం గలిగించే వృత్తులను నేర్పించేవారు. "ఆంధ్రమహిళ" పత్రికకు సంపాదకురాలి బాధ్యతలను నిర్వహిస్తూ స్త్రీ ఉద్యమాలపట్ల అభిరుచి గల్గిన పెక్కురకువ్యాసరచనా కుతూహలాన్ని గల్గించేది లక్ష్మి.

ఈ రోజుల్లోనే అనేకమంది యువతులను మహిళాసభకు ఆహ్వానించి, వివిధ విషయాలపై వాద వివాదాలను జరిపించేదిగూడా శ్రీమతిలక్ష్మి.

మదరాసు జీవితం సాఫీగా సాగిపోతూంది. వివిధ మహిళా కార్యక్రమాలతో ఒకోసారి పనివత్తిడిగానే ఉండేది. ఆ రోజుల్లోనే శ్రీమతి సరస్వతీబాయి గిరితో పరిచయం కలిగింది. ఆ పరిచయం

క్రమేపీ పెరిగింది. కలిసిన ప్రతిసారీ మహిళాసభ కార్యక్రమాలను గురించి వివరాలు తెలుసుకుని అభివృద్ధి కార్యక్రమాలను గురించి చర్చించుకునేవారు.

ప్రజాహిత కార్యక్రమాలవైపు ఆకర్షించబడిన శ్రీమతి లక్ష్మి నిత్యమూ ఏదో ఒక స్త్రీజనాభ్యుదయ ప్రణాళికను రచించుకొని, దానికి రూపురేఖలు సంతరింపజేసుకొని అమలు పరచుకుంటుండేది. ఆ కార్యక్రమాల విధినిర్వహణలోనే సంపూర్ణ తృప్తిని పొందేది.

* * *

# స్వాతంత్ర్యం వచ్చిన రోజు !

1947 - ఆగష్టు 14 వ తేదీ అర్ధరాత్రి ఘటికాయంత్రం సరిగ్గా 12 వ గంట మ్రోగించిన అనంతరం త్రివర్ణ పతాకం ఢిల్లీ ఎర్ర కోటపై ఎగిరింది. దేశం బానిసత్వం నుంచి విముక్తమయింది. స్వాతంత్ర్యాన్ని సముపార్జించుకొంది.

మేఘాచ్ఛాదితమైన ఆవర్ష ఋతువులోని ఆగష్టు మాసపు ఆకాశంలో తారకలు ప్రకాశించలేదు కాని, బహుశా అంతకు మించిన సంఖ్యలో భారత ధరాతలంపై కోటానుకోట్ల రంగురంగుల విద్యుద్దీపాలు శోభాయమానంగా ప్రకాశించాయి.

యావత్ప్రపంచం నిద్రిస్తూన్న సమయంలో భారతదేశం జాగృతి పొందింది.

దేశభక్తుల చిరకాల తపస్సు నాడు ఫలించింది. అసంఖ్యాక భారతీయ సోదరసోదరీమణుల త్యాగఫలం ఆనాడు ఫలితానికొచ్చింది.

ఆ మహాముహూర్తాన్నే ఈ దేశంలో నూటతొంబది ఏండ్లు పరోక్షంగా ప్రభుత్వం నడిపి, మరోతొంబది ఏండ్లు ప్రత్యక్షంగా రాజ్యపాలన జేసిన ఆంగ్లేయుల యూనియన్ జాక్ పతాకం అవనతం జేయబడింది. లాల్ ఖిల్లాపై నుంచి దించివేయబడింది.

శత సహస్ర హస్తాలతో బంగారు రంగును భారత భూగడ్డపై వెదజల్లుతూ అరుణదేవుడు తూరుపుదిక్కున పదిహేనవ తేదీ ప్రభాతాన ఉదయించాడు.

ఎటు చూచినా సంబరాల సంరంభాలే. ఉత్సవాలే. వేడుకలే. ఆలింగనాలే. ముప్పదిమూడుకోట్ల భారతీయుల వదనాలలో చిరుదరహాసాలే.

స్వాతంత్ర్యం! శాంతి!! అభ్యుదయం!!!

"స్వాతంత్ర్యం," ఎంతగొప్పమాట! ఎంత కమ్మనిపలుకు!! తేనెసోనలు బిందులారే ఎంతటి రుచికరమైన శబ్దమది!

ఎందరు నవజవానులు ఈ పలుకును సాధించేందుకు చిరు నవ్వులతో ఉరికంబాలకెక్కారో?

ఎందరు యువవీరులు తమ నవ వధువులను విస్మరించి జైలు కటకటాల ఆవల జీవితాలు గడిపారో?

మరఫిరంగులకూ, తుపాకులతోటాలకూ, లాటీల దెబ్బలకూ ఎందరు ఆహుతయ్యారో?

ఎందరో మాననీయ స్త్రీలు సయితం పరదాలను త్రెంచి, కుటుంబాలనువీడి జైళ్లలో మ్రగ్గారు. మరింకెందరో 'వందే మాతరం' దివ్యనామాన్ని స్మరించుకుంటూ, 'మందేరాజ్యం' పల్లవిని ఉచ్చరించుకుంటూ దేశస్వాతంత్ర్య సమర యజ్ఞానికి సమిధలుగా ఆహుతయ్యారు.

ధనిక నిర్ధనిక భేదంలేక, కులమతప్రాంత విభేదాలులేక, చదువు సంధ్యల వ్యత్యాసాలులేక, కదంత్రొక్కుతూ పదంపాడుతూ ఎందరో ఈ భారతాంబ విమోచన మహా సమరంలో అసువులు అర్పించారు.

ఆనాడు దేశమంతా త్యాగశీలుర ప్రభావాలతో ఉత్తేజితమై జాతినరనరాన స్వాతంత్ర్యేచ్ఛ పొంగిపొరలింది.

ఆ ఆగష్టు 14 అర్థరాత్రి భారతం విముక్తమై స్వతంత్రం పొందింది.

స్వతంత్ర భారత అవతరణకు ముందు జరిగిన కొన్ని ఘట్టాలు లక్ష్మి మనోఫలకంపై మెదిలాయి.

'క్రిప్సు రాయబారవర్గం' విఫలమయిందనీ, రాయబారవర్గ సభ్యులు గృహోన్ముఖులయ్యారనీ రేడియోద్వారా విన్న లక్ష్మికి

తిరిగి దేశం స్వాతంత్ర్యం పొందటానికి ఒక అవకాశం పోయిందే అని అనిపించింది. చిన్నతనంనుంచి స్వాతంత్ర్యపోరాట విధానాలనూ కార్యక్రమాలనూ ఎంతో శ్రద్ధాసక్తులతో గమనిస్తున్న లక్ష్మికి ఈ రాయబార వైఫల్యం ఒకరకంగా నిరాశనే గల్పించింది. అంతకు ముందు కాబినెట్ మిషన్ వైఫల్యం చెందటంగూడా లక్ష్మి మనస్సులో మెదిలింది.

జాతీయ అంతర్జాతీయ రంగాలలోని పరిస్థితుల వత్తిడివల్ల ఆంగ్ల ప్రభుత్వం పనుపున ఈ దేశానికి స్వతంత్ర ప్రదాన విధానాలను రూపొందించుకుంటానికి వచ్చిన కాబినెట్ మిషన్, తన కర్తవ్య నిర్వహణలో కృతకృత్యత సాధించకపోయె !

ఏదోవిధంగా కార్యాన్ని చక్కబెడతాడని ఆశించిన సర్ స్టాఫర్ క్రిప్స్, ఆశించిన ఫలితాలను సాధించలేకపోయె ! ఉన్న పరిస్థితుల్లో మార్పు ఎంతమాత్రం లేకుండాపోయె !!

లక్ష్మి ఆలోచనలు పరిపరివిధాలుగా పోతున్నాయి. ఈదేశం ఏమికాబోతుంది ?

ఒక రాత్రి భోజనాలవద్ద రఘురామయ్యగారితో ఈ ప్రస్తావన తెచ్చింది.

"రఘూ - వార్తలు విన్నావుగదా ! మరోసారి మనం స్వాతంత్ర్యం పొందేరోజు దూరమయింది. క్రిప్స్ రాయబారవర్గం బహుశా ఈరాత్రే బ్రిటనుకు బయలుదేరుతున్నారట" పలికింది లక్ష్మి.

ఆమె పలుకుల్లోని నిస్పృహను పసిగట్టిన రఘురామయ్యగారు, "దూరమైన మాటనిజమేగాని, ఎంతోదూరంగాదని నా నమ్మకం లక్ష్మి. ఒకసారి చక్రం తిరగటానికి ప్రారంభమయిన తర్వాత కొంచెం వెనుకగానో ముందుగానో సర్కిలు పూర్తిగావటం తథ్యం. నా ఉద్దేశ్యంలో క్రిప్స్ రాయబారంలో మరికొంచెం వేగం ఉండి ఉండవలసింది. వేడీ ఉండి ఉండవలసింది. వాళ్లసూచనలన్నీ స్థూలంగా

పరిశీలించిన తదుపరి మనవాళ్లు అంగీకరించరనే, నేను అనుకున్నాను. జరిగిందిగూడా అదే''—అన్నారు రఘురామయ్యగారు.

"ఎల్లకాలం చర్చిలు ప్రభుత్వం ఉండదుగదా! యుద్ధానంతర సార్వత్రిక ఎన్నికలలో కన్సర్వేటివ్ ప్రభుత్వమే రావాలని ఎక్కడుంది? చర్చిలే అధినాయకుడౌతాడని మాత్రం ఎక్కడ రాసిపెట్టి ఉంది? ఆంగ్లజాతియావత్తు ఎంతో చైతన్యవంతమై ఈ యుద్ధంలో పాల్గొంటున్నారు. ప్రపంచ మానవాళి సంరక్షణమో మారణమో ఈ యుద్ధ ఫలితంపైన ఆధారపడి ఉంటుందని విశ్వసించి సర్వత్యాగాలు చేసుకుంటూ పోరాడుతున్నారు. యుద్ధంలో విజయులైన బ్రిటిష్ ప్రజలు తిరిగి తోటి మానవజాతిని గతంలో లాగా దోచుకుంటానికి విముఖత చూపిస్తారనే నా నమ్మకం", అన్నది లక్ష్మి.

"ఆంగ్ల జాతికి సంబంధించినంత వరకూ నీ ఊహాకరక్టే. కాని కేవలం ఊహను ఆధారంజేసుకొని మన రాజకీయ నాయకులు దేశ భవిష్యత్తుకు సంబంధించిన నిర్ణయాలు చేయరుగదా! చేయగూడదు గదా!"—అన్నారు రఘురామయ్యగారు.

''యుద్ధానంతరం తప్పక భారతదేశం తన న్యాయబద్ధమైన స్వాతంత్ర్యాన్ని పొందుతుందనే హామీ అయినా ఇవ్వలేక పోయాడు క్రిప్సు. ఆమాత్రం హామీ యిచ్చినా మన కాంగ్రెస్ నాయకత్వం అంగీకరించి ఉండేదేమో యుద్ధసహకారానికి.''—అన్నది లక్ష్మి.

లక్ష్మికి ఈ యుద్ధంలో మిత్రరాజ్యాలు గెలవాలని కోరిక. ఆ గెలుపులోనే మానవజాతి తరతరాలుగా నిర్మించుకొన్న మహోన్నత నాగరికత విలసిల్లి, స్వేచ్ఛ స్వాతంత్ర్య పిపాసలు పెంపొందుతాయనీ నమ్మకం. తద్వారా యావత్ప్రపంచంలో. ఆద్యతన భావిలో పాలక పాలిత దేశాలనేవి ఉండవనీ, అన్ని దేశాలు సమానస్థాయిలో ప్రపంచ భవిష్యత్తును పెంపొందించుకుంటాయనీ ఆమె అభిప్రాయ పడేది.

"కరుడుగట్టిన కన్సర్వేటివ్ నాయకుడు చర్చిల్. అతని ప్రాణాల్లో పలుకు ఉన్నంతవరకు రవి అస్తమించని ఆంగ్ల సామ్రా

జ్యాన్ని విచ్ఛిన్నం చేయటానికి ఎంతమాత్రం అంగీకరించడు. కన కనే క్రిప్స్ వ్యక్తిగతంగా ఎంత అభ్యుదయవాదైనా, ఆంగ్ల ప్రభుత్వ ప్రతినిధిగా చర్చిల్ అభిప్రాయానికి వ్యతిరేకంగా పోలేడుగదా లక్ష్మీ! ఆ మాటకొస్తే క్రిప్స్ లండన్‌లో బయలుదేరేటప్పటికే తన రాయబారవర్గానికి వైఫల్యం ఎదురౌతుందని తెలియకపోదనే నా నమ్మకం—'' అన్నారు రఘురామయ్యగారు.

''తన రాయబారం విఫలమౌతుందని తెలిసిగూడా రాయబారం నడిపేటంత వ్యక్తిత్వంలేనివాడా క్రిప్స్?'' అన్నది లక్ష్మి.

''రాజకీయాలలో కొన్ని తప్పవు లక్ష్మీ! చక్రం తిరగటానికి ప్రతివారూ కొంతకు కొంత దోహదం చేయాలి. తన రాయబారం సఫలం గాకపోయినా ముందుముందు చరిత్ర త్వరిత గమనానికి ఈ కృషి ఉపయోగ పడవచ్చునని క్రిప్స్ తలంచవచ్చుగదా! ఏ రోజుకారోజు బేరీజులు వేసుకునే వ్యాపారంగాదుగదా రాజకీయ వ్యాపారం. కాగా తాను వ్యక్తిగతంగా యుద్ధానంతరం భారత దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం లభిస్తుందనీ నమ్మవచ్చు.'' అన్నారు రఘురామయ్యగారు. భోజనాలయింతర్వాత గూడా ఈ సంభాషణలు పొద్దు పోయిందాకా కొనసాగేయి. మద్రాసులో వీరి ఇంటి ముందున్న చిన్నతోట చంద్రకాంతిలో మెరుస్తుంది. వెన్నెల పిండి ఆరబోసినట్లు పరచుకొంది.

తాంబూలం అందిస్తూ లక్ష్మి అడిగింది ఎంతో ఆసక్తిగా, ''అమెరికా అయినా మనదేశం విషయంలో మరికొంచెం ఆసక్తి చూపవచ్చునే.''—అని.

''కనకనేకదా లక్ష్మీ! ఆంగ్లేయుల దృక్పథంలో ఈ మాత్రం మార్పయినావచ్చింది. దానిఫలితంగానే చర్చిలు ప్రభుత్వం భారత దేశం ఐచ్ఛికంగా యుద్ధంలోపాల్గొనాలనీ కోరుకుంటున్నది. ఆ కారణంగానే ఎగ్జిక్యూటివ్ కౌన్సిలునిండా భారతీయులే ఉంటారనీ వారికి మరికొన్ని అధికారాలుంటాయనీ చర్చిలు ప్రభుత్వం ప్రకటించుకుంది'' అన్నారు రఘురామయ్య.

మరి భవిష్యత్తు ఏ విధంగా ఉండబోతుందో అనే నిరామయ నిస్పృహాలతో ఆలోచనతో ఆరాత్రిగడిచింది.

క్రిప్స్ రాయబారం వైఫల్యమవటంలో భారతదేశమంతా తుఫానుముందుఉండే ప్రశాంతత ఆవరించింది.

తర్వాత చాలారోజులకు, తనూ రఘురామయ్యగారు ఒక సాయంత్రం మద్రాస్ మెరీనాలో కూచున్నారు. సిమ్లా సమావేశాలు జరుపుతున్నరోజులవి. లిన్‌లిత్‌గోపోయి వేవెల్ సేనాని భారత రాజకీయరంగాన్ని అధికారయుతంగా పాలిస్తున్నాడు.

"రఘూ, (transfer of power) అధికార మార్పిడి అనేదే గదా ప్రస్తుతం సిమ్లా సమావేశాలకు ప్రాతిపదికగా ఉంది, మరి మన దేశంలో ఎవరికీ అధికారప్రదానం?" అని సంశయాన్ని వెలిబుచ్చారు లక్ష్మి.

"మరెవ్వరికీ, కాంగ్రెస్ పార్టీకే" అన్నారు రఘురామయ్య,

"దేశమంటే కాంగ్రెసేకాదుగదా?" అంది లక్ష్మి.

"నీవు ఏదో కొత్త మడత పేచీ పెడుతున్నావ్!" అన్నారు రఘురామయ్య నవ్వుతూ.

అయితే క్విట్ ఇండియా ఉద్యమపురోజులనుంచి, సిమ్లా సమావేశాలు జరుగుతున్న సమయంవరకు, మహమ్మదాలీజిన్నా నిశ్శబ్దంగా ఎత్తుగడలు వేసుకుంటూనే ఉన్నాడు. ముస్లిం రాష్ట్రాలకూటమిగా పాకిస్థాన్ అవతరించాలనే తన అభిప్రాయానికి మద్దతు సంపాదించు కుంటున్నాడు. తొలుత హాస్యాస్పదంగా తోచి నవ్వుకున్నవారికే, జిన్నా అభిప్రాయం చివరకు భయంకరంగా తోచటం మొదలైంది. ఈ దేశం చీల్చబడటం తప్పదా అనే భయం ఏర్పడటంగూడా ఆరంభించింది. దేశ జనాభాలో ఈ రాజకీయనాయకుల ప్రవర్తనలవల్ల ఒకరంటే ఒకరికి అనుమానాలు పొడసూపడంగూడా మొదలైనాయి. కాంగ్రెస్ ముస్లింలీగులకు సమాధానాలు కుదిరేకన్నా, కాంగ్రెస్ వారికిగానీ, ముస్లింలీగువారికిగానీ, మూడవవారైన ఇంగ్లీషువారితో సమాధానపడుటకు చాలా సులభంగా కనపడుతుంది.

విజయవంతమవబోతుందనుకున్న సిమ్లా సమావేశానికిగూడా ముహూర్తబలం లోపించింది. తిరిగి ప్రతిష్టంభన ఏర్పడింది. ఇదే సమయానికి బ్రిటన్‌లో, ఆంగ్ల సామ్రాజ్యాన్ని దివాళా తీయించను అని గర్వంగా చెప్పుకున్న చర్చిలును సార్వత్రిక ఎన్నికలలో ప్రధానిగా నిరాకరించారు. ఆయన పార్టీని త్రోసిరాజన్నారు. ఆంగ్లేయ ఓటర్లు భారతదేశంపట్ల సుహృద్భావత ఉన్న క్లెమెంట్ అట్లేని ప్రధానమంత్రిగావరించారు.

వెంటనే (High Power cabinet mission) ఉన్నతాధికార మంత్రివర్గ రాయబారం ఒకటి భారత రాజకీయ సంక్షోభాన్ని పరిష్కరించేందుకు సన్నిద్ధమై వచ్చింది. తిరిగి చరిత్రగతినిమార్చే రాజకీయ సంచలనం దేశంలో ప్రారంభమైంది.

సుదీర్ఘమైన చర్చల అనంతరం విధిలేనిపరిస్థితుల్లో భారత ఉపఖండం, రెండు చెక్కలుగా చీల్చబడి, మనదేశం స్వతంత్ర భారతంగా ఆవిర్భవించింది. మరోచెక్క రెండు ముక్కలుగా ఏర్పడి, తూర్పు, పశ్చిమ పాకిస్థానులుగా అవతరించాయి.

అరవై సంవత్సరాలనాడు ఆంధ్రదేశపు నడిబొడ్డు బెజవాడలో తయారించిన మువ్వన్నెల పతాకంలోని రాట్నానికి బదులు పదిహేడువందల సంవత్సరాలనాటి అశోకుని ధర్మచక్రం ముద్రితమైన జండా ఎర్రకోటపై సగర్వంగా ఎగిరింది. రెపరెపలాడింది ఆ ఆగష్టు నెలలోని ఆ అర్ధరాత్రి.

* * *

# కమల పునర్వివాహం నాడు

'హరి' కీ కమలకు ఆ రోజు సాయంత్రం వివాహం జరిగింది. ఆ వివాహానికి శ్రీమతి లక్ష్మి హాజరయ్యారు. దీనిని వితంతు పునర్వివాహమన్నారు.

వీరిద్దరితో హరి విధురుడా, కమల వితంతువా అన్నది ఎవరూ శ్రద్ధగా తేల్చలేదు. ఆ మాటకొస్తే అసలు హరి, భార్యారహితుడా, కుటుంబీకుడా అనేది గూడా సదస్సుల ఆలోచనకు ఎంతమాత్రం వచ్చినట్టులేదు. చీమకుట్టినంత అనుమానం గూడారాలేదు. హరిని ఉన్నపాళంగా వరుడుగా — నవవసుడుగా — అర్థం జేసున్నట్లుంది సదస్యబృదం.

కానికమల వివరాలుమాత్రం చాలా ఆసక్తికరంగా తెలుసు కున్నారు. పెండ్లిపందిరిలో చాలాసేపు గుసగుసలు సాగాయి. కొందరు మరీ ఉత్సాహవంతులు ఒకవృద్ధుణి దగ్గరకు పిలిపించుకొని కమలయొక్క గతించినభర్త డాక్టరా లేక ప్రభుత్వోద్యోగా అనే వివరాలు ఆప్యాయంగా అడిగి తెలుసుకున్నారు. ఆతని రూపు రేఖలూ ఆర్థికస్తోమతలతో బాటు కమలతో ఎన్నిరోజులు కాపురం జేశాడు అనేదిగూడా గుచ్చిగుచ్చి అడిగి మరీ తెలుసుకున్నారు.

ఈదేశంలో సంకుచితదృష్టి ఎంతగా ప్రబలిందో అక్కడే కూచొని ఉన్న శ్రీమతి లక్ష్మికి అర్థమయింది. 'ఎంతపతనం'! అని ఆమెకు అనిపించింది.

అయితే అందరూ కమల అందానికి ముగ్ధులయ్యారు. అక్కడ కూడిన వారిలో చాలా మంది కమలను చాల రోజులుగా చూస్తున్న వారే. వారికి ఏనాడూ కమల ఇంత అందంగా కనిపించలేదు. అసలే

అందమైనపిల్ల కమల, పూర్ణ యౌవనవతియై పెండ్లి జేసుకోబోతూన్న ఈ రోజున సౌందర్యవతిగా భాసించటంలోఆశ్చర్యం ఏమీలేదు.

"నిస్సారంగా వితంతువుగా నిన్నటివరకూ బ్రతికి, నేడు నవ వధువుగా మారి భవిష్యజ్జీవితాన్ని శోభాయమానంగా సుఖవంతం జేసుకోబోతున్నాననే మానసిక భావనే, ఈ అమ్మాయి ముఖార విందం వెలగటానికి కారణం"—అని సదస్యులలోని వామపక్షీయులు పలికారు. "అసలు, ఆనొసట దిద్దిన కుంకుమ, నేత్రాల కంచున అంటినకాటుక, బుగ్గన అంటించిన కళ్యాణపుబొట్టు, కాళ్ల పారాణి కమల అందాన్ని ఇనుమడింపజేయటానికి కారణాలు"—అని దక్షిణపక్షీయులు అన్నారు.

ఈ వామ దక్షిణ పక్షీయుల అభిప్రాయాలు ఏమైనా కమల మాత్రం వివాహమంటపంమీద అందంగా కనిపించింది. తృప్తిగా కనిపించింది.

సరే! కమల వివాహం పూర్తయింతర్వాత, వధూవరులను ఆశీర్వదించి ఇంటికి వచ్చింది శ్రీమతి లక్ష్మి. విందుముగిసేప్పటికే బాగాప్రొద్దుపోయింది. ఇంటికివచ్చి విశ్రాంతిగా మంచంపై వ్రాలిన తదుపరి కమలజ్ఞాపకాని కొచ్చింది. వివాహ వేదికపై కమలమొఖం అందంగా వెలగటం జ్ఞాపకాని కొచ్చింది. ఆ అమ్మాయి కన్నుల్లో తృప్తిజ్ఞాపకాని కొచ్చింది. శ్రీమతి లక్ష్మి మనస్సులో ఆలోచనలు ముసురుకున్నాయి. పరిపరి విధాల ఆలోచనలు సాగాయి.

ఏదో అదృష్టం ఉండి కమలకు నేడు వివాహం జరగబట్టి ఆ కోమల వదనం చిరునవ్వులతో వెలిగింది. కన్నులలో తృప్తి తొణికిసలాడింది.

మరిమన భారతదేశంలో ఎందరు వితంతువులున్నారు? వారి జాతకాలు ఎన్ని నిష్కారణంగా మాసిపోయాయి? వారి జీవితాలు ఎన్ని నికృష్టంగా సాగుతున్నాయి?

నిన్నటిరోజున ఈ కమలే దారిలో ఎవరకు ఎదురైనా చీదరించుకునేవారు. ఛీత్కారం జేసేవారు. అపశకునం అని తలచేవారు. ఇంట్లోకి తిరిగి వెళ్ళేవారు. కాళ్లు కడుక్కునేవారు. పుక్కెడు నీళ్లు ఉమ్మివేసి గుక్కెడు నీళ్లు గుటకవేసేవారు. కూచొని లేచేవారు. తిరిగి బయటకు ప్రయాణమై వెడలేవారు.

కొందఱు మొగంమీదనే అనేవారు, "దౌర్భాగ్యురాలు ఎదురైంది, ఇంకేంపని జరుగుతుంది?"—అని.

ఈవాళ వివాహం అయింది కనుక కమలకు పట్టిన ఈ దౌర్భాగ్యం తొలగింది. ఈమె ఎదురైతే నిన్న చీదరించుకున్న వాళ్ల నోళ్లు నేడు మూతపడి ఉండి; ఈనాడు నిర్వర్తించే కార్యక్రమాలలో, ఎదురైన అపజయాలకు, ఏ అభాగ్యురాలు కారణమో, సాయంత్రానికి ఇంటికిజేరిన తదుపరి తాపీగా తేల్చుకుంటారు. అది వేరే విషయం.

ఇంతకూ నిన్నటివరకు కమల 'దౌర్భాగ్యురాలు' అని ఛీత్కారాలు చేయబడటానికి కమల ఎంతవరకు కారణం? నిన్నా-నేడు-రేపు-కమలలాంటి విధవలు చీదరించబడటానికి ఆ అభాగ్య సోదరీమణులు ఎంతవరకు కారణం?

శ్రీమతి లక్ష్మిఆలోచనలు ముందుకు సాగుతున్నాయి. మంచం మీదినుంచి లేచి ప్రక్కకిటికీ తెరచింది. ఆకాశం ఎంతో నిర్మలంగా ఉంది. చంద్రుడు నడినెత్తిపై నిలిచి ఎర్రటి కుతుబ్ మినార్‌ను తెల్లబరుస్తున్నాడు. నల్లటి యమునానదీ జలాలలో అసంఖ్యాక తారాగణంతో దోబూచులాడు కుంటున్నాడు. ప్రక్కగదిలో రఘురామయ్యగారు ప్రభుత్వ ఫైళ్లను ఏకాగ్రతతో వ్రాసుకుంటున్నారు.

తిరిగి ఆలోచనలు......

వీళ్లభర్తలు మరణించుటకు వీరు కారణమా? కాగా వీరు ఎదురైతే పనులు జరగవా? ప్రొద్దున్నే వీరి మొగంజూస్తే ఆరోజు సక్రమంగా గడవదా? ఆపదలు ఎదురౌతాయా?

సంఘంలో వీరికున్న సహజ సామాన్య ప్రతిపత్తి ఒక్క సారిగా, భర్తృవిహీన అయినంతమాత్రాన, వీరి పాపం ఏమాత్రం లేకుండానే పోతుందా ?

భర్తృహీన మొగమున సింధూరం ఉంచుకోనగూడదు. కేశములు తైల సంస్కారానికి నోచుకోనగూడదు. పువ్వులను ముడుచుకొన గూడదు. ఆభరణములు పనికిరావు. అనువైన దుస్తులు నిషిద్ధములు. వదనములలోచిందే సహజసిద్ధ చిరునగవులు సయితం అప్రకటిత యోగ్యములు. వీధికి మొగంచూపరాదు. వంటగదులలోనే పెరడులయందే రోజులు తెల్లవారవలె. జిహ్వాలు రుచులు కోరగూడదు. శరీరం శుష్కించబడవలె. ప్రతిదినం ఏకాదశిగానే భావించాలి. దేహపు ఆకలిని ఆధ్యాత్మిక భోజనాలతో నింపుకోవాలి.

ఆహా ! పుణ్య భారత ధరయిత్రీ ధన్యోస్మి !!

మరణించిన భర్త చితాభస్మంలోనే, బ్రతికున్న భార్య వ్యక్తిత్వం మసైపోయిందా ఈ పుణ్యభూమిలో !

కాదామరి! విగతజీవులైన పురుషుల శవాలు భగభగ మండుతూన్న చితులపై, ఆచారం పేరిట, మతధర్మం పేరిట, పుణ్యలోకాల పేరిట, పాతివ్రత్యం పేరిట, బ్రతికున్నవారి భార్యలకు బలవంతంగా గూడా భంగుత్రాపి, కల్లు త్రాగించి, ఉమ్మెత్త రసం ఎక్కించి, ఆ అభాగినుల ఆక్రందనలు బయటకు వినిపించకుండా రాంఢోళ్లను, తప్పెట్లను, బాజాభజంత్రీలను మోగిస్తూ సతీ సహగమనం సాగింప జేసి సంతసించిన జాతిగదూ మనది !

రాజా రామ్ మోహన్ రాయ్ నిరంతర కృషి ఫలితంగా ఆనాటి ఆంగ్ల ప్రభుత్వం సహగమనాన్ని నిషేధిస్తే, లండన్‌లో సుప్రీం కోర్టుకు అప్పీలు జేసి, ఈ అనాగరిక ఆటవిక చర్యలకు మతధర్మ సూత్రాలను జోడింపజేస్తూ వాదించ ప్రయత్నించి, సభ్య ప్రపంచం ముందు అపహాస్యం పాలయిన జాతిగదూ మనది !!

తరతరాలుగా స్త్రీకి పురుషుడు చేస్తూన్న అన్యాయాలలో భాగం ఇది. యుగయుగాలుగా స్త్రీని పురుషుడు నిశ్శబ్దంగా క్రమంగా చేస్తూన్న హత్యాకాండలలో భాగం ఇది.

అయితే స్త్రీజాతి ఎప్పటికప్పుడు మోసపోతూనే ఉంది. మాయజేయ బడుతూనేఉంది. అందుకూ కారణముంది. భారత దేశములో స్త్రీమూర్తి ఆరాధ్య, పూజనీయ అనిఅంటుం ఎన్నో ప్రసంగాల, ఎన్నో ధర్మపన్నాల విపుల ప్రచారం అనాదిగా జరుగుతూ ఉండటమే ఆ కారణం.

'స్త్రీని చిన్నతనంలో తండ్రి పోషించి పెంచుతాడు. తదుపరి భర్త పోషణలో సుఖపెడతాడు. అనంతరం కొడుకు పోషణలో ఆదరిస్తాడు. ఇంకేంగావాలి స్త్రీకి ?'

ఎంత అపహాస్యపు వాదన ఇది !

శ్రీమతి లక్ష్మికి తన చిన్నతనంలో దుగ్గిరాలలో వారింట్లో ఉన్న ఆవు జ్ఞాపకానికొచ్చింది. ఎంతో అందంగా ఉండేది ఆవు. మంచి బలిష్టంగానూ ఉండేది. బాగా పాలుపితికేది. కోడెదూడలను కనటందానికి ఆనవాయితీ అయింది. పుట్టిన ప్రతికోడెదూడా వంద వరాలు అమ్మేది ఆ రోజుల్లో. కుటుంబమంతా దాన్ని చక్కగా పోషించేవాళ్ళు.

అంతేనా స్త్రీజాతి ప్రయోజనం దేశానికి ? మా కుటుంబానికి ఆ ఆవు ప్రయోజనం ఎంతో, ఈ దేశానికి స్త్రీ ప్రయోజనం గూడా అంతేనా? మరీ మరీ ప్రశ్నించుకుంది లక్ష్మి.

ఇంతకూ అసలు స్త్రీ పూజనీయ అని అనమన్న దెవరు ? పూజించమన్నదెవరు ? పూజించిందెక్కడ? ఎప్పుడు ?

శ్రీమతి లక్ష్మి ఆలోచనలు సాగుతూనే ఉన్నాయి. అవి వేగంగానూ ఉన్నాయి. ఆ ఆలోచనా ప్రవాహంలో ఆమెకు సీతాదేవి ఎదురైంది. మూర్తిదాల్చి ప్రత్యక్షమైంది.

మొదట భూమాత శిశువుగా కనపడింది.

తదుపరి నాగలిదున్నిన జనకరాజు పుత్రికగా అగుపించింది.

అనంతరం పుష్టిగా పెరుగుతూ దీప్తిగా వెలుగుతూ ధైర్య స్థైర్యాలుగల బిడ్డగా మొగరాయుళ్లు ఎత్తలేని శివధనుస్సును మునివ్రేళ్లతో ఆవలకు నెట్టిన బలశాలిగా దర్శనమైంది.

అంతలోనే ఇక్ష్వాకు వంశపుకోడలిగా, పట్టాభిషేకం జేసుకో పోతూన్న శ్రీరాముని అర్ధాంగిగా దోపట్టింది.

మరోక్షణంలో వనవాసినిగా పతిదేవుల పదగామినిగా నార బట్టలతో అగుపించింది.

ఇంకోక్షణంలో సతీత్వాన్ని రుజువుచేసుకొనుటకు భగభగమండే అగ్ని గుండంలో నడిచి అరికాలుకు పొక్కైనా లేకుండా బయటకు వచ్చిన సాధ్విగా రూపొందింది.

కడకు కాననమధ్యంలో వాల్మీకి ఆశ్రమ ప్రాంగణంలో కవల పిల్లలతల్లిగా ప్రత్యక్షమైంది.

శ్రీమతి లక్ష్మి హృదయం సీతమ్మను జూచి క్షోభిల్లింది. గుండె బరువెక్కింది. తిరిగి ఆలోచనలు ముసురుకున్నాయి ఆమెను.

లక్ష్మి అమ్మగారు చిన్నతనంలో రామాయణం కథాగానం చేసినపుడు తల్లి గొంతుక ఎందుకు గాద్గదికమయ్యేదో అర్థమయింది అప్పుడు. తనతల్లి కన్నులవెంట అశ్రుబిందువులు ఎందుకురాలేవో అర్థమయింది అప్పుడు. తన తల్లి కథాగానాన్ని తృటికాలం ఆపి శోకాన్ని ఎందుకు ఎక్కిళ్ల రూపంలో బహిర్గతం జేసుకునేదో అర్థ మయింది అపుడు. ఇదంతా వింటూ చూస్తూన్న తన తండ్రి వెంక టేశంగారు, "సీతబ్రతికి ఉన్నంతకాలం ఆమెను బాధ పెట్టడమే గాక, ఆ కథ చదువుతూన్న వాళ్లకుగూడా ఎంత బాధగల్పిస్తు న్నాడు రాముడు,'' అని పలుకుటలోని బాధ అర్థమయింది అపుడు.

ఒక్క క్షణం మానసిక అలసట నుంచి సేదదీరి తన ఆలో చనా ప్రవాహంలో సాగిపోయింది. తిరిగి తన ఆలోచనా క్రమాన్ని అందుకుంది.

'స్త్రీని పూజించమన్న దెవరు? పూజించిం దెక్కడ? ఎందుకు?'

తన జీవితమంతా కాపురం జేసి, కాపురమంతా కండగండ్ల పాలైనా, మొక్కవోని ధైర్యంతో అరణ్యామధ్యాన ఏ అండా లేకుండా ఇరువురు కవలపిల్లలనుగని వారిని సుక్షాత్రవర్యులుగా మహా వీరులుగా తీర్చిదిద్ది సూర్యవంశానికి ప్రసాదించినప్పటికీ, సీతా దేవి పాతివ్రత్యాన్ని రుజువు చేసుకుంటే నేగాని తాను ఆమెనుస్వీకరించ గలనని తనదూతలతో వాల్మీకికి కబురుచేశాడు శ్రీరామచంద్రుడు. ఆకబురు విన్న వాల్మీకి, ఆశ్రమపు వాకిట్లో నిలచి ఈ రామసందే శాన్ని పూర్తిగావిన్న సీతమ్మకేసి చూశాడు.

"ఇన్నిసంవత్సరాల సీతారాముల వియోగం నేటితోపూర్తవు తుంది. ఈ మహాసాధ్వి ఇక్కట్టులు నేటితోగట్టెక్కుతాయి." అని ఆశించి ఎదురుచూస్తున్న వాల్మీకిమహర్షి రామదూత తెచ్చిన సందే శంతో తనకు తాను కుంచించుకపోయాడు.

కొండంత ఆశతో, తన కష్టాలు గట్టెక్కుతున్నాయనే కాంక్షతో, తన పతిదేవుడు తన్ను సగౌరవంగా, ప్రేమాదరాలతో స్వీకరిస్తాడనే హృదయపూర్వక విశ్వాసంతో క్షణమొకదినంగా, దిన మొకయుగంగా ఎదురు తెన్నులుచూస్తూ సంతోషాతిశయంలో ఉజ్వలంగా ప్రకాశిస్తూన్న సీతమ్మమొగం నిస్తేజమయ్యింది. క్రిందకు వ్రాలింది. నేలచూచింది.

"సీతమహాసాధ్వి-రాముడుకోరిన విధంగానే తన పవిత్ర శీలాన్ని ఋజువు చేసుకుంటుంది. రేపురాముడు నిర్ణయించిన వేళకు అతని సమక్షంలోనే"—అని వాల్మీకి రామదూతకు తన ప్రతిసందేశం పంపిస్తాడు. సీతమ్మకు ఉత్సాహాన్ని ధైర్యాన్ని, అందజేస్తున్నాననే

పంతో, తనకుతాను నీరసపడకుండానూ; తననుతానే ఉత్సాహపరుచు కుంటూను.

సీతాదేవి తనపాతివ్రత్యాన్ని ఋజువు జేసుకోవాలని ఉత్సుక తతో ఎదురుచూస్తుంటాడు శ్రీరాముడు. ఫలానావిధంగా ఋజువుచేయి అని చెప్పగలిగిన మానసిక దార్ఢ్యం ఈయనలో లేదు. ఏడాదిపాటు లంకాపురిలో, కాకుల్లాంటి లోకులనుకున్నట్లు, రాక్షసులమధ్య బ్రతికి, రావణుని బందీయైఉండీ గూడా తన ఆదేశంమేరకు తనగురు వుల ఆజ్ఞలమేరకు, అగ్నిపరీక్షకు తట్టుకొని మహా సాధ్విగా నిరూ పించుకున్న సీతాదేవిని పరీక్షించేందుకు పరీక్షాపత్రం ఆయనవద్ద మరి మిగిలిఏమీలేదు.

కనకనే తన నిజాయితీని సీతే ఋజువుచేసుకోవలసిందిగా రాముని వాంఛ. అదేబహుశా, ఆలోచనా సూన్యులైన రామ హితుల సూచన గూడానేమో !

తెల్లవారుతుంది. నియమిత సమయానికి నిర్ణయమైన స్థల ములో రామరాజు సపరివార సమేతంగా వచ్చినిలుస్తాడు.

అదేసమయానికి బ్రహ్మతేజస్సు వెలుగొందుతూ వాల్మీకి మహర్షి ఆరంగస్థలప్రవేశం చేస్తాడు. వెంట అవనతముఖియై, బాట వెంట బరువుగా అడుగులిడుతూ, సీతాదేవి నడుస్తుంది. వాల్మీకి మహర్షి శ్రీ రాముని ఎదుట నిలిచి, తాను సహస్రవత్సరాలు చేసిన తపఃఫలం ఆధారంగా సీతాదేవి మహాసాధ్వి అని ప్రకటిస్తున్నానని ఎలుగెత్తిచాటుతాడు. అందుకు ఫణంగా తన తపోఫలమంతా వడ్డ గలనంటాడు. త్రికరణ శుద్ధిగా సీత పరమఇల్లాలు అనిప్రకటిస్తాడు. ఇంతకన్నామించి మరేమి పరీక్షగావాలని రాముని ప్రశ్నిస్తాడు.

రాముడు వాల్మీకిమహర్షి వాగ్ధోరణికి జోతలర్పిస్తూనే, ఆయన వాదనను అంగీకరించుటకు తనకు లేశమాత్రం సంశయం లేదంటూనే, ప్రజాభిప్రాయం కొరకు సీతను శీలవతి అని రుజువు చేసుకోవలెనని అభిభాషిస్తాడు.

అది విన్న వాల్మీకి మరొకసారి శీతమొగంకేసి చూస్తాడు. అవనతవదనయై ఉన్న సీతాదేవి అప్పుడు తలఎత్తుతుంది. ఎదురుగా చూస్తుంది.

ఎదురుగా తనప్రాణనాధుడున్నాడు. ఎవరికోసరమైతాను పదునాలుగేండ్లు కందమూలములు తింటూ, కడుఇక్కట్లు పడుతూ స్వీయనాధుడే తన దైవంగా భావించి బ్రతికిందో ఆమహానాధుడే ఎదురుగా ఉన్నాడు, తనశీల పవిత్రతకు ఋజువు అడుగుతున్నాడు. ఆయన ప్రక్కప్రక్కనే వశిష్టుడున్నాడు. జాబాలిఉన్నాడు. ఇంకా తాను ఎరిగిన ఎందరో ఉన్నారు. గతించిన రోజుల్లోని తన పరివార ముంది. తన మరుదులు ఉన్నారు. చివరకు తను కన్న కవలబిడ్డలు గూడా తన వెనుకనిలిచి ఉన్నారు. ఇందరి ఎదుట తన మనోనాధుడు తన సర్వస్వంగా, తన దైవంగా నమ్మినవాడు తన శీల పవిత్రతను ఋజువు జేసుకోమ్మంటున్నాడు.

ఒక్కసారి సీతాదేవి ఒళ్ళు పులకరించింది. జలదరించింది. మనస్సు విరాగమయింది. తాను విరాగిఅయింది.

"అమ్మా !" అని తల్లి భూదేవిని పలకరించింది సీతాదేవి.

"చూస్తున్నావా అమ్మా! నీ కూతురి పరిస్థితి !" అని వాపోయింది తన జీవన వేదన ఒక్కసారి స్ఫురింపజేసికొని సీతాదేవి.

"అమ్మా ! భూదేవమ్మా ! ఇకనాకు ఈ జీవితం చాలు. పతియే దైవమనితలచి అంతఃపురాన్ని వీడి అడవులకు వెళ్లానే! పతి దేవుల పాదములనంటి నడచానే! నిక్కచ్చిగా నిప్పులాగా బ్రతికానే ఇసుమంతైనా నాదోషంలేకున్నా నా మనోనాధుడు నన్ను అగ్ని పరీక్షకు గురికమ్మన్నప్పుడు చిరునవ్వుతో అగ్ని ప్రవేశంచేసి, అమ లినంగా బయటికొచ్చానే!

తిరిగి మరల పరీక్షా తల్లీ ! నన్ను నేను రుజువుచేసుకోవాలా ! ఈ బ్రతుకు ఇకచాలు తల్లీ. జీవితమంతా ఎన్నో కష్టాలు భరించాను గాని ఈ అవమాన భారాన్ని భరించలేనమ్మా ! ఆడుదానిని అనుమా

నించడంకన్నా అవమానించటం మరి లేదమ్మా!! నన్ను నీలో ఇముడ్చుకో, ననుగన్నతల్లీ! నీవైనా నాకాశ్రయమివ్వు నాప్రియ మైన తల్లీ!" అని ఆక్రందించింది సీతాదేవి.

సమస్త సృష్టి స్తబ్ధీభూతమయింది ఆక్షణంలో.

ఓర్పుకు మారుపేరుగా విరాజిల్లే భూదేవి సయితం ఈ అబల ఆక్రందనను తన హృదయంలో ఇముడ్చుకోనలేక తన గుండె చీల్చుకొని భూమిని బ్రద్దలు చేసుకొంది. రత్నఖచిత తేజోమయ సింహాసనంపై కూర్చొని భూమిపైకి వచ్చింది. అటునిటుచూడ లేదు. ఎదురుగా నిలిచిన తన బిడ్డను సీతను రెండుచేతుల్లోకి తీసుకొంది. హృదయానికి హత్తుకొంది. మగడైన మగవాని మూర్ఖతకు రెండు కన్నీటి చుక్కలు రాల్చుకుంటూ అనుంగు బిడ్డ ఆడది సీతాదేవిని పక్కన చేర్చుకొని, వచ్చిన దారినే అదృశ్య మయింది.

అప్పటినుంచే గదా సీతమ్మకై ఏడ్పులు. ఆనాటినుంచేగదా ఆమెకు పూజలు.

లక్ష్మి ఆలోచనలు ఇంకా సాగుతూనే ఉన్నాయి. ఇంకా ఒక కొలికికి రాలేదు. ఆలోచనలు ముందుకు ఉరుకుతున్నాయి.

జీవితమల్లా వట్టి తిరుగుబోతుగా వాంఛాపూరితుడుగా పచ్చి వ్యభిచారిగా సంచరించి, ఫలితంగా కుష్ఠురోగిగామారినా కోరికలు తీరక సానివద్దకు నడవలేనిస్థితిలో గంపలో కూర్చొని, ఆడదానితో మోయించుకొంటూ పోతున్న మనిషి లక్ష్మికి మనోవీధిలో ఎదురయ్యాడు.

"ఎవరవు నీవు?"-అని ప్రశ్నించింది లక్ష్మి.

గంపలోకూర్చున్న పెద్దమనిషి కిసుక్కున ఒక నవ్వునవ్వాడు.

"నన్ను నువ్వు తెలుసుకొని ఉండకపోవచ్చు. నాపేరు నీకు తెలియకపోవచ్చు. కాని నన్నూ, నేను కూర్చున్న గంపనూ మోస్తూన్న ఈవిడనడుగు నీకే తెలుస్తుంది." అన్నాడు.

"ఓహో! కౌశికుడవా" అనుకొంది లక్ష్మి.

ఆగంప మోస్తున్న ఆ పడతికేసిచూసింది లక్ష్మి. బక్కచిక్కిన శరీరంతో, కండ్లల్లో ప్రాణాలు పెట్టుకొని, ఊపిరి బిగపట్టుకొని, శక్తినంతా కూడదీసికొని, తన తలపైని బరువును ఎక్కడ పడవేస్తానోనసే భయంతో నెమ్మదిగా నడుస్తూంది ఆ పడతి.

వెంటనే స్ఫురించింది లక్ష్మికి ఆమె సుమతి అని.

'అయ్యో! సుమతీ' అని ఈమె మనస్సు రోదించిది. 'ఆమె పతివ్రత!' అని లోకంవేసిని కేకలు చెవులకు తాకాయి. 'అవును- ఆమె పతివ్రతే నేను ఒప్పుకుంటాను. అయితే పతివ్రత అంటే పతికి బానిస అనే నాభాష్యాన్నిగూడా మీరు ఒప్పుకోండి అన్నది లక్ష్మి మనస్సు.

ఇంకా లక్ష్మి ఆలోచనలు ముందుకు సాగుతూనేఉన్నాయి.

"కనక ఈ దేశంలో ఎలాంటి స్త్రీలు పూజింపబడుతున్నారో ఎలాంటివారలు గౌరవింపబడుతున్నారో సులభంగానే అర్థ మౌతుందిగా" అని ప్రశ్నించుకొంది లక్ష్మి మనస్సు.

"అవును అర్థం అవుతూనేవుంది" తల ఊపింది లక్ష్మి.

వ్యక్తిత్వాలను లేకుండా జేసుకొని, భర్తల అడుగులకు మడుగులొత్తి, మగళ్ళ వ్యక్తిత్వాల వికాసాలకూ, భౌతిక వాంఛల పరిపూర్తికి, జీవితాలను సమిధులుగా వెచ్చించిన నారీమణులు శ్లాఘించబడుతున్నారు. ఎందుకు? అందరుస్త్రీలు అలాగే అవాలని. ఆశ్లాఘించబడే స్త్రీల అడుగుజాడల్లో వీరూ నడచి పురుష పుంగవుల ఆధిక్యం కలకాలం నిలపాలని. స్త్రీ జాతికి బానిస మనస్తత్వం ఉగ్గు బాలనుంచి రంగరించి పోయటమంటే ఇదే గదూ!

సర్వేశ్వరుని సృష్టిలో స్త్రీ పురుషులు సమానంగాదా?

లక్ష్మి మనస్సు మరోప్రశ్న వేసుకొంది. సమాధానంగా ఆమెకు భగవద్గీత జ్ఞాపకంవచ్చింది. కృష్ణభాగవానుని ఉవాచ స్ఫురించింది. "నేనే సృష్టిని. సృష్టంతా నేనే. నాలో నీవుచూచే సమస్తప్రాణి కోటిలో, పిపీలకాది బ్రహ్మాండ పర్యంతం నేనేనై ఉన్నాను." మరి

ఆ గీతను నిత్యమూ పారాయణ జేస్తూ కలకాలంగా ప్రచారం చేసిన పురుష పుంగవులకు, ఆదేవదేవుని సృష్టిలో పురుషులకు ఎందులోనూ ఎంతమాత్రం తీసిపోని ఆడవారిని ప్రత్యేకంగా ఎందుకు చూడాలి. ఒకరిసుఖానికి మరొకరిని బలిచేయటం ఏనాటిన్యాయం."

ప్రశ్నగా రూపొందింది లక్ష్మి ఆలోచన, "ఆటవికన్యాయం. భయంకర అన్యాయం." సమాధానం చెప్పుకొంది తన ఆలోచనతనకే.

ఏకవస్త్రఐన ద్రౌపది శరీరంపైని వలువలు వొలుస్తున్నదృశ్యం లక్ష్మి మనస్సులో స్ఫురించింది. అవమానభారంతో మూర్తీభవించిన దైన్యంతో సభామధ్యంలో నిలిచిన ద్రుపదపుత్రిక ఈమె మనస్సులో మెదిలింది. లక్ష్మిమనో నేత్రాలు సభనంతా కలయజూచాయి. కురుపాండవ బంధువర్గమంతా అక్కడే ఉన్నారు. అతిరథ మహారథులందరూ అక్కడ ఉన్నారు. ఉద్దండదండనాయకులందరూ అక్కడ ఉన్నారు. రాజకీయ దురంధరులందరూ అక్కడ ఉన్నారు.

అది నిండుపేరోలగం. 'స్త్రీ ఆరాధ్య, పూజనీయ' అని ప్రకటించు కుంటూన్న దేశమది.

అయినా ఏ ఒక్కరూ ఆ వస్త్రాపహరణం కూడదనలేదు. ఒరలలోని కత్తులను బయల్వెలవరించలేదు. గదలను కదిలించలేదు.

వికర్ణుడు బాలకుడు కనక అతని మాటలను ఈ పూర్ణ పురుషులు పట్టించుకొనలేదు. తమ కండ్ల ఎదుట జరుగుతూ, మానవజాతికి తలచుకున్నపుడల్లా సిగ్గు జనింపజేసే పరమ అవమానకర దృశ్యాన్ని, హేమాహేమీలంతా ఉండి అరికట్టలేకపోయారు.

"ఎంతటి జుగుప్సాకరమైన సంఘటన!" అని అనుకొంది లక్ష్మి మనస్సు.

ఈ అవమాన భారాన్ని మనసులో దాచుకొని సమయం కోసరం వేచిఉండి, మహాబలుడైన భీమునితో ప్రతిజ్ఞ చేయించుకొని ఎప్పటికప్పుడు కురుపాండవ రాజకీయాలలో పాల్గొంటూ, కృష్ణ రాయబార సమయంలో మహారాజనీతి విశారదుడు ఘటనా ఘటన

సమర్థుడుగా, తనకు మాన సంరక్షణం గావించిన శ్రీ కృష్ణుని అర్థంచేసుకొని, "రాయబారం ఎటులయినా పొసగనీయకు అన్నా !" అని ప్రార్థించి, కడకు తన కసిదీర్చుకొని, దుశ్శాసన రక్త తప్త హస్తాలతో సిగముడుచుకొని, సర్వకాలాల మహిళలకు ఆదర్శంగా నిలిచిన ద్రౌపదికి ఎక్కడా పూజలు జరుగుట లేదేమి ?

భారతాన్ని పవిత్ర గ్రంథంగా నిత్యం పారాయణ జేసే ఈ పుణ్యభూమిలో ద్రౌపదికి ఏ ఒక్కచోటా ఇంతగుడి కట్టి ఒకింత విగ్రహాన్ని ప్రతిష్టించలేదేం ?

"కనుక స్త్రీ పొందిన అవమానానికి కసిదీర్చుకొనడం మన వారికి హర్ష యోగ్యముగా లేదని అనుకోవచ్చుగా ?" ప్రశ్నించు కొంది శ్రీమతి లక్ష్మి.

తాను స్వంతంగా పాపంచేయలేదు. అద్భుత సౌందర్యవతి అయినా జటా జూట ధారియైన ఋషిసత్తముని కుటీరంలోనే బ్రతుకుతూ, నిత్యసేవలు సలుపుతూ తన భర్తృదేవుని ఆధ్యాత్మిక ఔన్నత్యానికీ, పరలోక పుణ్యప్రాప్తికి ఓపినంతసేవ నడుంవంచి చేస్తూనేఉంది అహల్య.

దేవలోకాధిపత్యాన్ని సర్వవిధ కుహనామార్గాలద్వారా నిలుపు కుంటూ, రంభోర్వశీ తిలోత్తమాది నర్తకీ మణుల పరిష్వంగ సుఖాలతో కాలం వెళ్లబుచ్చే ఇంద్రుడు భర్తవేషంలో వచ్చి అనుభవించిన కారణంగా, ఏ పాపమూ ఎరుగని ఈ నాతిరాతిగా మార్చబడటం గూడా స్త్రీ జాతికి జరిగిన అఘాయిత్యాల చరిత్రలో ఒక ప్రముఖ ఘట్టమే అవుతుంది.

తనపొందుగోరి వచ్చింది తనభర్తే అనుకొని దేహాన్నిసమర్పిం చింది గాని వేరుకాదుగదా ! అట్లా మోసంచేసింది వేరు పురుషుడు దేవేంద్రుడుగదా!.

మరిచేతిలో వజ్రాయుధం ఉంటుందని ఇంద్రుడ్నివదలి, రాయి అయినా చేతబట్టని అబల అహల్యను తన పుణ్యబలంతో రాయిగా మార్చటం ఎంతటి యోగ్యత!

ఆలోచించిన కొద్దీ జుగుప్సాకరమైన ఈ లాంటిసంఘటనలు పురాణ ఇతిహాసాల నిండా కోకొల్లలుగా లక్ష్మికి స్ఫురించాయి. అన్నింటా కానవచ్చేది స్త్రీ పట్ల పురుషజాతి ద్రోహము.

దేశవిభజనకాలంలో, కొందరు ముసల్మాను ముష్కరుల పాల బడి, తమభర్తలు భీరువులై పారిపోగా, తమ సర్వస్వాన్ని పోగొట్టు కొని శరణార్థులుగావచ్చిన ఎందరో స్త్రీలను తిరిగి తమ తమ కుటుంబాలలో జేర్చుకుంటానికి దాదాపు అందరూ వెనుకాడిన సంఘటన జ్ఞాపకం వచ్చినపుడు పైని చెప్పుకున్న పెద్దల వారసులే వీరు అని గూడా అర్థమౌతుంది. ఆ ఆర్యఋషుల రక్తమే ఈ దేశపు ప్రజల్లో ప్రవహిస్తుందని గర్వంగా వీరుచెప్పుకునేది. ఆ రక్తబాంధవ్యం ఎంతవరకు నిజమో చెప్పలేము నిర్ధరింపలేముకాని వారి మానస పుత్రులుగా చెప్పుకుంటానికి మాత్రం ఈ నాటికీ చాలా మందికి హక్కుంది.

*　　　*　　　*

స్త్రీకి పాతివ్రత్యానికి మించినది మరొకటిలేదని మనదేశంలో పురుషపుంగవులందరూ అంగీకరిస్తారు. పురుషుల దృష్టిలో తమ భార్యలద్వారా తాముపొందే గౌరవాలన్నింటిలో ఇదే పెద్దగౌరవమనీ ప్రకటించుకుంటారు. అనగా తనభర్త ఎంత దుష్టుడైనా ఇంకెంతటి నికృష్టుడైనా, అతని ఆజ్ఞను జవదాటడంకన్నా అతని అధికారాన్ని ఎదిరించడంకన్నా, అతని హీనచర్యలను ప్రశ్నించడంకన్నా, మించిన దోషం స్త్రీకి మరేమిఉంది?

ఈ పాతివ్రత్యము ఆడదానికి ఎంత ముఖ్యమో మన పురాణ ఇతిహాస గ్రంధాలనిండా వివిధ సందర్భాలలో రమ్యంగా ఉటంకించబడేఉంది.

అయితే ఈ పాతివ్రత్యం ఒక్క స్త్రీలకే నియమితమైఉందా? అనేది శ్రీమతి లక్ష్మి ప్రశ్న.

పాశ్చాత్య దేశాల్లోగూడా సౌశీల్యానికి గౌరవంఉంది. అక్కడగూడా అందరూ సౌశీల్యాన్నే కోరుకుంటారు. అంతేగాదు ఆ దేశాల్లో స్త్రీపురుషులు సౌశీల్యాన్ని కోరుకుంటమేగాక నిలుపుకుంటానికిగూడా కృషిజేస్తారు. మరిమనదేశంలో ఇది ఒక్కస్త్రీలకే పరమధర్మంగా ఉద్ఘోషించబడింది.

వాస్తవానికి ఈ సౌశీల్య పరిపోషణా బాధ్యతలను ఒక పక్షంపై అమితంగా తీవ్రం చేయడంద్వారా, అన్యపక్ష బాధ్యతలు సులభంగా శిథిలంగావడం మనదేశంలో జరిగింది. సంయమన రహితులై పురుషులు విచ్చలవిడిగా స్వైర విహారం జేస్తుంటే స్త్రీలు ఏ విధంగా పాతివ్రత్యాన్ని పరిపోషించుకుంటూ బ్రతుకుతారో ఊహించడం కష్టంగానే ఉంటుంది.

పాతివ్రత్య ధర్మాన్నుండి చ్యుతి పొందటానికి పురుష ప్రమేయం లేకుండా స్త్రీకి ఎట్లాంటి అవకాశాలున్నయో లక్ష్మికి అనూహ్యంగానే ఉంది.

స్త్రీని వశపరచుకుంటానికేగా నాగరికతలతో విలసిల్లే లంకా రాజ్యం నేలకూలింది. ట్రాయ్‌రాజ్యం సర్వనాశన మయింది. చరిత్ర గ్రంథాలలోనికి ఎక్కినవీ, ఎక్కనివీ ఎన్నో చిన్నపెద్ద రాజ్యాలు స్త్రీలకొరకు ధరాతలంలో కలసిపోయిన విషయం గుర్తుకు తెచ్చుకుంటూ పోతుంటే వరుసక్రమంలో ఒక పెద్ద జాబితా తయారవుతుంది.

ఒక వైపున స్త్రీని వశపరచు కొనుటకు పురుషునికి సర్వస్వేచ్ఛతాయిచ్చి, స్త్రీని పాతివ్రత్యం చేయమని అదే పరమోత్కృష్ట కర్తవ్యమని శాసించడం ఎంత అసహజంగా కనిపిస్తుందో అంతటి అవివేకంగానూ స్ఫురిస్తుంది వాస్తవ దృష్టికి. పురుషాధిక్యత ఇందులోనూ ఉంది.

భార్యావియోగం పొందిన పురుషునకు ఎన్నిసార్లయినా వివాహం జేసుకునే లై సెన్సు సంఘం దఖలుచేసినపుడు, స్త్రీ పునర్వివాహం జేసుకుంటానికి చట్టరీత్యా ఏ అడ్డంకులు లేకపోయినా సంఘం కొరకొర జూడటంలో పురుషాధిక్య దృష్టి సమాజాన్ని ప్రభావితం జేస్తుండటమేకారణం.

మనదేశంలో వితంతువు లెందరున్నారో అన్న సరైన లెక్కలు లేవు. ఈమధ్య తీసిన లెక్కలప్రకారం షుమారు కోటి మంది ఉన్నారని అంచనా. మరి వీరిలో వివాహ యోగ్యులెందరు? లెక్కలు లేవు. వారికోసం మన ఆధునిక సమాజం చేస్తున్న దేమిటి? అది గూడా అంతగా అంతుబట్టదు.

గత రెండు దశాబ్దాలుగా మనదేశంలో వితంతు వివాహాలు కొంచెం అధిక సంఖ్యలోనే జరుగుతున్నాయి లోగడకంటే. సాంఘిక శాసనాలు ఈ దోహదానికి కొంతవరకు కారణం. యితర నాగరిక ప్రపంచంతో మనకున్న రాకపోకలు వాటి ప్రభావమూ కొంత వరకుకారణం. కాగా మనజాతీయ స్వాతంత్ర్య పోరాటకాలంలో మన స్త్రీలు ముందుకువచ్చి, వివిధ పోరాటాలలో పాల్గొని అనేక త్యాగాలుచేసి, కారాగార క్లేశాలను అనుభవించి, దృష్టిని వికసింప జేసుకొని, నూతన దృక్పథంతో సంఘాన్ని పరివీక్షించటమూ కారణమౌతుంది. తదుపరిదేశంలో వచ్చిన మార్పులు, ముఖ్యంగా వివిధ రాజకీయ వామపక్షాలు అనేక ఉద్యమాలలో స్త్రీలను ఆకర్షించటమూ ఒక కారణం. అన్నింటికన్నా ముఖ్యం, స్త్రీజనంలో విద్యాశాతం ఎక్కువైనకొద్దీ, ఉన్నత విద్యలు చదివిన వారి సంఖ్య పెరిగినకొద్దీ, సనాతన ఛాందసాలకు స్వస్తి సహజంగానే జరగటంతో పాటు ఆర్థిక స్వయంపోషకత్వ అవకాశాలు లభ్యంగావటంతో, ఆ ప్రభావం మిగిలిన సమాజంమీద పడటంగూడా ప్రధాన కారణాల్లో ఒకటిగా కన్పడుతుంది.

పత్రికా పఠనం, రేడియో ప్రోగ్రాములు, విహార యాత్రలు గూడా వితంతు వివాహాల వ్యాప్తికి తోడ్పడి ఉంటాయి. ఏ ఒక్క

కారణం గాకపోయినా అనేక పరిస్థితులను, వివిధ కారణాలను పురస్కరించుకుని మనదేశంలోని వితంతు స్త్రీలు పునర్వివాహం జేసుకోవాలనే అభిప్రాయానికి దగ్గరౌతూ వచ్చారు.

వితంతువంటే ఎవరు ? పునర్వివాహమంటే ఏమిటి? ఆలోచిద్దాము. చనిపోయిన భర్త అని చెప్పబడే ఒక పురుషుని, చూచి నప్పైనా జ్ఞాపకంలేని, పది, పద్నాలుగేండ్లపిల్ల వితంతువా? గర్భాదానం కాకుండా భర్త మరణించినా స్త్రీ వితంతువౌతుందా? మొన్నటి పాకిస్తాన్ యుద్ధంలో, చాలామంది సైనికులు, అధికారులు, కొద్దిరోజులక్రితమే వివాహమాడిన భార్యలను వీడి యుద్ధరంగానికి వెళ్లినట్లు మనం విన్నాము. అలాంటివారు ఆయుద్ధంలో మరణిస్తే వారు వితంతువులేనా ? వారి వివాహం గురించి ఆలోచిస్తే వారిది పునర్వివాహంగా పరిగణించాలా ?

మౌఢ్యాచారాలకు, మూఢనమ్మకాలకు ఆలవాలమైన మన దేశంలో, ఈ లాంటి వితంతువుల మచ్చలేని బ్రతుకులకు ఆస్కారముందా ? యంగ్ ఇండియా పత్రికలో, గాంధీజీని ఉద్దేశించి ఒక విలేఖరి "మీరు మీ వ్యాసంలో ఒకచోట. పవిత్రవివాహబంధంలో, ముఖ్యమైనది శరీరాల కలయికేగాదు. ఆత్మలకలయిక ప్రధానమైంది. ఆకలయిక మరణానంతరంగూడా విడదీయ బడలేనికలయిక. వాస్తవంగా ఈ కలయిక ఉన్నచోట్ల, వితంతువులకు, స్త్రీకి గానీ, పురుషునికి గానీ పునర్వివాహమనేది ఊహించటానికి గూడా వీలులేనిది, అక్రమమైనది. అనిఅన్నారు."

"అదేవ్యాసంలో వేరొకచోట మీరే అన్నారు, భర్తృసాంగత్యం లేని వితంతువులకు వివాహం జరగటం అనేది వాంఛనీయమే గాక, తల్లిదండ్రుల కర్తవ్యం గూడా, అని రాశారు. మరి ఈ రెండు విషయాలను ఎలా సమన్వయ పరుస్తారు?"

దానికి గాంధీజీ ఇలారాశారు. "ఈ రెండు విషయాలకు సమన్వయం కుదర్చటం నాకు ఏమీ కష్టంగా కన్పించటంలేదు.

హృదయంలేని తల్లిదండ్రులు, కూతురు వాంఛితం తెలుసుకోకుండా, ఆమె అంగీకారం లేకుండా చేసినవివాహం వివాహమే గాదు. నిశ్చయంగా అది పవిత్రబంధనం కానేరదు. కనక అలాంటి అమ్మాయికి వివాహం చేయటమనేదే పవిత్రకర్తవ్యం. యిలాంటి సందర్భాలలో పునర్వివాహ మనే మాటే తప్పుగా ఉపయోగించటం. ఈ కన్యకు అసలే పెండ్లి కాలేదనేది వాస్తవం. కనక మరణించిన భర్తస్థానంలో యోగ్యుడైన మరో సహచరుణ్ణి వెతకటం ముఖ్యకర్తవ్యం.'' అని రాశారు.

దేశపితగా పరిగణించబడుతూ, మేధావిగా పేరొందినగాంధీజీ గర్భాదానం గాకముందు వివాహానికిపవిత్రత ఆపాదించబడదన్నారు. అది పూర్తి వివాహమే గాదన్నారు.

న్యాయధర్మసూత్రాల ప్రప్రథమభాష్యకారుల్లో ఒకరైన వశిష్టుడు పునర్వివాహాలను అంగీకరిస్తూ, ఆ సంతానానికి చట్టసమ్మతిని ప్రసాదించారు.

పునర్వివాహమంటే ఆయన రెండు నిర్వచనాలు చేశారు. ఏ స్త్రీ అయితే తన యౌవనకాలపు భర్తను వదలి పరులతో కొంత కాలం ఉండి, తిరిగి మొదటిభర్త యింటికి జేరునో ఆస్త్రీని పునర్వివాహితగా పేర్కొన్నాడు. (పునర్భ) భర్త నపుంసకుడు, పిచ్చివాడూ అయిన పక్షంలో గాని, భర్త చనిపోయినపుడుగాని మరొకతనిని జేరినపుడు దానిని పునర్వివాహ మన్నాడు. ఆపస్తంభ సూత్రాలలో, ప్రాచీన న్యాయ నిర్ణేతలయొక్క సన్యాసధోరణి మిక్కుటంగా కన్పిస్తుంది. అంతకుముందున్న సాంఘిక న్యాయాలు, నూతన తరాలకు పనికిరావనే సంస్కర్తల్లా వారు వ్యవహరించారు. కలియుగంలో పూర్వయుగాల సూత్రాలు అక్కరకు రావనీ, పాతతరాల వారు అతీతశక్తులు గలిగినవారు కాన వారికి పాతకాలపుసూత్రాలు ఉపయోగించవచ్చుగాని, కొత్తతరాలవారు విలువలు కోల్పోయిన వారైనందున వారికి కొత్తసూత్రాల అవసరమయినాయంటూ పేర్కొని; స్త్రీ స్వాతంత్ర్యాన్ని సంకుచిత పరస్తూ,విధవావివాహాలను

ఎంత మాత్రం ప్రోత్సహించని కొత్తసూత్రాలను అమలు పరచేట్టు చేశారు.

ఇదీ వసిష్టుని ధర్మసూత్రాలకాలానికీ, ఆపస్తంభుని సూత్రాల కాలంనాటికీ సమాజంలో స్త్రీలపట్ల మారినవైఖరి. వసిష్టుని కాలంలోఉన్న స్వేచ్ఛకుసయితం సమాధిరాళ్ళు పాతపడ్డాయి. తిరిగి మనువు, యాజ్ఞవల్క్యుల కాలంనాటికి సన్యాసుల దృక్పథం మరీ జిడ్డుపారి, సంకుచితమై స్త్రీని నిస్తేజ పరిచింది.

తదుపరి రంగంమీద కన్పించే (క్రీ. శ. 3 వ శతాబ్దిలో మౌర్య యుగంలో) కౌటిల్యుడూ, వాత్స్యాయనులు సయితం స్త్రీ స్వాతం త్ర్యానికి గట్టిగా అడ్డుగోడలు కడుతూ, విధినిషేధాలు మిక్కుటంగా ఏర్పాటు చేశారు. కౌటిల్యుడు (నియోగతను) వితంతు వివాహాన్ని గుర్తిస్తూ, భర్తృమరణానంతరం స్త్రీ ఏడుమాసాల గడువుదాటిన తదుపరి, చనిపోయినభర్త సోదరుణ్ణి, అలాంటి వాడెవడూ లేకపోతే, ఆ గోత్రానికే సంబంధించిన మరెవరినైనా వివాహమాడవచ్చన్నాడు. దానర్థంఏమంటే, ఉత్పత్తి జేసేసంతానం, ఆ కుటుంబాలకే చెందా లనేది.

వీటన్నింటినిబట్టిచూస్తే వివాహకాలంలో గానీ, విధివశమున వైధవ్యం ప్రాప్తించిన వితంతువుకు పునర్వివాహసమయంలో గానీ, స్వేచ్ఛ అనేది ఎంతమాత్రం లేక, పురుషులకు ఉపయోగించే ఒక ఉపకరణంగానే స్త్రీని భావించినట్లు కన్పడుతుంది. దీనికి చాలా కార ణాలు చెప్పవచ్చు. "హిందూ కుటుంబములో భర్తభార్యను దేవీ అని పిలుస్తాడు. భార్యభర్తను స్వామీ అని పిలుస్తుంది. అలాంటప్పుడు అంత అన్యోన్యంగా సహజీవయాత్ర కాలంపుట్టినప్పటినుంచి, ఈ పుణ్యభూమిపై చెల్లుబాటు అవుతుండగా, అసలు స్త్రీకి స్వేచ్ఛఅవ సరమెక్కడుంది ?" అని ప్రశ్నించవచ్చుగూడా.

"నాకుమాత్రం పౌరాణికనాటకాలలో మినహా, ఏ హిందూ కుటుంబంలోగూడా, భర్త భార్యను దేవీ అనిగానీ, భార్యభర్తను నాథా! అని గాని పిలవటం వినపడలేదు''-అనుకొంది శ్రీమతి లక్ష్మి.

అయినా సృష్టిలో స్త్రీ పురుషులు సమానమని తలచినప్పుడు స్త్రీకి స్వేచ్ఛ గూడా సహజంగానే, పురుషుని లాగానే ఉండాలిగాని అడ్డుగోడలు, నిర్ణయించవలసిన అవసరమేముంది ? పురుషప్రభువుల సంకుచిత దృష్టికాక.

హిందూ వితంతు పునర్వివాహచట్టం (1956) హిందూ వితంతువు పునర్వివాహంచేసుకునేందుకుఉన్న చట్టబద్ధమైన ఆవాంతరాలను తొలగించింది. ఈ పునర్వివాహం ద్వారా ప్రాప్తమైన బిడ్డలు చట్టసమ్మతమైన సంతానంగానే పరిగణించబడేట్టుగా చట్టం రూపొందించబడింది. దాదాపు 20 సంవత్సరాల క్రితం వరకు ఎక్కువ మంది వితంతువులు వివాహం జేసుకుంటానికి సిద్ధపడేవారు గాదు, వారి అంతరాంతరాలల్లో చేసుకోవాలనే వాంఛ ఉన్నప్పటికీ.

సాంఘికంగా అవమానానికి గురిఅవాలసివస్తుందేమోననే భయంగూడా ఉండేది. దగ్గరబంధువులు గూడా వాళ్ళశక్తి మేరకు పునర్వివాహ అభిప్రాయంనుంచి విముఖతగల్గించే వారు. ఫలితంగా గర్భస్రావాలు, ఆత్మహత్యలు, శిశుహత్యలు వగైరా. స్వర్గీయ కందుకూరి వీరేశలింగం గారు లాంటి సంఘసేవాతత్పరులు, ఎన్నో ప్రతిఘటనలను ఎదుర్కొని, దీనిని ఒక ఉద్యమంగా తయారుజేసి సంఘదృష్టిని కొంతవరకు ప్రభావితం జేసిన ఫలితంగా ఈ నాటికి ఈ మాత్రమైనా, వితంతువులలో చైతన్యంవచ్చింది. కొందఱు సంఘ సంస్కర్తలు స్వయంగా తామే వితంతువులను వివాహమాడుట ద్వారా పలువురకు ఆదర్శంగానిలిచారు. ఎందరో వితంతువులకు,

అనాథశరణాలయాలను స్థాపించి, విద్యాప్రదానం గావించి, వారి పురోభివృద్ధికి కృషి జేశారు.

అయినప్పటికీ ఇంకా ఎందరో జీవిత పునరావాస ప్రాప్తికి నిరీక్షిస్తున్నారు. వారికి చదువుకునే సౌకర్యాలు లభ్యం గావటం లేదు. వివాహంజేసుకునే అవకాశాలు మృగ్యంగా ఉన్నాయి. స్వయంపోషణ ఉపాధి సౌకర్యాలు బొత్తిగా కన్పడవు. ఈ లాంటి వారి పరిస్థితి మరీ దుర్భరంగా కన్పడుతుంది. ఈ దురదృష్ట జీవులను, వీరి ముఖ్యబంధువులే తమ అవసరాలకు నిర్దాక్షిణ్యంగా ఉపయోగించుకుంటారు. ఈ నాటి హిందూ సమాజంలో బావలు, మరుదులు, మామలు వీరిజీవితాలకు పెక్కుచోట్ల పెనుభూతాలుగా ఎదురౌతారు. సోదరులూ, వారి భార్యలుగూడా వారిని న్యూనతపరచటంలోగానీ, వంటమనుష్యులుగా ఉపయోగించు కొనుటలోగానీ, వారి బిడ్డలకు ఆయాలుగా వాడుకొనుటలోగానీ ఒకరికొకరు తీసిపోరు. కాగా మరదళ్లు, వదినలు గర్భవతులుగా ఉండే సమయాల్లో ఈ స్త్రీల విలువ మరీ పెరుగుతుందినోటిమాటల్లో. ఆ అవసరాలు తీరంగానే, మూటముల్లెసర్దుకోవలసిన అవసరాలను గూడా ఆ నోటిమాటలతోనే బహిర్గతం చేస్తారు నిర్దయగా.

పాపం మరి వితంతువులు ఏమిజేయగలరు ?

సుదీర్ఘంగా సాగిన, శ్రీమతి లక్ష్మి దేశవ్యాపిత పర్యటనలలో, వివిధ రాష్ట్రాలలో అనేకమంది ఈ అభాగ్య సోదరీమణులను కలుసుకున్నారు. ఎన్నోఅనాథ శరణాలయాలను సందర్శించినపుడు, వారి వ్యక్తిగత విషయాలతోపాటు, సమిష్టి సమస్యలను అర్థం జేసుకుంటానికి ప్రయత్నంచేశారు. అది కేరళ రాష్ట్రంగానీ, తమిళ నాడుగానీ, కర్నాటక రాష్ట్రంగానీ, తెలుగు దేశంగానీ, బంగాళంగానీ, మహారాష్ట్రంగానీ, మరే భాగమైనాగానీ, మనదేశంలో ఈ

వితంతువుల సమస్య ఒకే విధంగా ఉంది. భాషాప్రాంత భేదాలు లేకుండా, బాధల్లో ఒకరికొకరు తీసిపోని విధంగా అవిముక్తంగానే ఉన్నారు. వారితో జరిపిన సంభాషణలు, వివిధ రాష్ట్ర ప్రభుత్వ స్త్రీ సంక్షేమ శాఖా చోదకులకు ఈమె ముఖ్యమైన సూచనలు చేయటానికి, ఉపయోగపడ్డాయి. ప్రత్యక్షంగా వీరితోగల్గిన పరిచయాలు, ఈ దీన వనితల పురోభివృద్ధికి కొంతమేరకైనా ఉపయోగపడటానికి శ్రీమతి లక్ష్మికి అవకాశం లభించింది.

ఇంతకూ అసలు సమస్య సమస్యగానే మిగిలింది. భర్తృహీన స్త్రీకి, భార్యహీన పురుషునకు వ్యత్యాసం ఎందుకుండాలనేది లక్ష్మి సమస్య. ప్రపంచం ఎంతో విజ్ఞానాన్ని సముపార్జించుకొని, ఆగ మేఘాలపై అభివృద్ధిపథంలో పయనిస్తుండగా, భారత స్త్రీజనావళిలో దరిదాపు ఒక కోటి మంది ఉన్న ఈ వర్గానికి ఈ శిక్ష ఎందుకు? నివృత్తికి మార్గమేది?

భార్యను కోల్పోయిన పురుషుడు ఎన్నిసార్లయినా వివాహమాడవచ్చు. అతనివైపు సంఘం చిటికెన వ్రేలైనా ఎత్తదు. కాని భర్తనుగోల్పోయిన స్త్రీ వివాహం తలపెట్టేటప్పటికి, సమాజం తన ముఖంలో వికృతాన్నంతా ఇముడ్చుకుని, హావభావాలను బహిర్గతం జేస్తుంది. ఈ దేశంలో స్త్రీలు జేసుకున్న పుణ్యాఫలం!

ఐచ్ఛికంగా వైధవ్యాన్ని అనుభవించే స్త్రీ బ్రతుకు నిజంగానే గౌరవనీయమైంది. ఉన్నత ప్రమాణంలో ప్రకాశిస్తుంది. జీవిత భాగస్వామిని గోల్పోయిన తాను, తన జీవిత వాంఛలను సంయమనం జేసుకొని, గతించిన భర్తపైనపెంచుకున్న అపార ప్రేమ గౌరవాలను సాంఘికంగా తనకన్న ఇబ్బంది పరిస్థితులలో బ్రతుకుతూన్న అభాగినుల కన్నీరును తుడిచేందుకు కృషిజేయటంద్వారా ధర్మపథంలో అగ్రగామిగా నిలుస్తుందనటంలో సందేహంలేదు.

అయితే, మతం పేరిటో, ఆచారం పేరిటో బలవంతపు బ్రాహ్మ ణార్థంగా రుద్దబడినపుడే వితంతువుల జీవితం దుర్భరంగా తయారవు తుంది. అవాంఛనీయమైన వివిధ దుష్ఫలితాలకు దారితీస్తుంది. గృహస్థ జీవితం విచ్ఛిత్తికి గాకపోయినా అపఖ్యాతి పాలవటానికి దోహదం గల్గుతుంది......

ఎంతోసేపు లక్ష్మి మనస్సు ఎక్కడెక్కడో సంచరించింది. తనువు పక్కపైకి జేరింది. నిద్రాదేవి కౌగిలిలో ఒదిగేముందు లక్ష్మి అనుకొంది, "బహుళ కమల కొత్త జీవితంలో ఈ రాత్రి గడిపి, కొద్ది గంటలలో సూర్యోదయాన్ని సరికొత్తగాగమనించవచ్చు," అని.

* * *

# మహాత్ముడు మరణించిన రోజు

1948 జనవరి 30వ తేదీ,

సాయంత్రం మద్రాసులో ఆంధ్ర మహిళా సభ కార్యాలయం నుంచి లక్ష్మి ఇంటికి వచ్చేప్పటికి అయిదున్నర అయింది.

పుత్రిక దివ్యజ్ఞాన సరోజినితో ఆరుగంటలకు టీ త్రాగి ముందు గదిలో రేడియోదగ్గిర కూర్చున్నారు.

ఆల్ ఇండియా రేడియో ఆంగ్లవార్తా ప్రసారం ప్రారంభ మైంది.

"మహాత్ముడు కాల్చి చంపబడ్డాడు" అనే వార్త వెలువడింది.

"ఏమిటీ నేను విన్నది?"...త్రుళ్ళిపడింది లక్ష్మి.

"మహాత్ముడు బిర్లా భవన ప్రాంగణంలోని ప్రార్థనా సమావేశానికి వచ్చినవెంటనే 5-30 గం॥లకు పిస్తోలుతో కాల్చిచంపబడ్డాడు" రేడియో వార్తలు చదువుతుంది.

"ఎవరినీ చంపింది?" తననుతానే ప్రశ్నించుకుంది లక్ష్మి.

"మోహన్‌దాస్ కరంచంద్ గాంధీని చంపిన హంతకుణ్ణి బిర్లా భవనతోటమాలి, కొందరి సహాయంతో పట్టుకొని పోలీసులకు అప్ప గించారు." రేడియో చెబుతూనే ఉంది.

గాంధీజీ ఆఖరి మాటలు,"హేరామ్-హేరామ్," రేడియో చెప్పింది.

"హేరామ్, హేరామ్" లక్ష్మి పెదాలూ అవే పలికాయి.

వివర్ణమైన తల్లి మొఖాన్ని, మనిషిలో వచ్చిన మార్పునూ గుర్తిస్తూ, వార్తలువిన్న బేబీ కండ్ల వెంట నీరు గిర్రున తిరిగాయి.

అది గమనించిన లక్ష్మి కండ్లు తమలోని అశ్రువులను నెమ్మదిగా టపటపా రాల్చు కుంటున్నాయి.

వార్తలు ముగిశాయి. రేడియోని ఆపివేసింది.

కదలక మెదలక కూర్చున్నది లక్ష్మి రేడియో ప్రక్కసోఫాలో. బేబీ, అరచేతిలో గడ్డం ఉంచుకొని ఎదురుగా ఎటో చూస్తోంది. అంతే అలా ఎంతసేపున్నారో, ఇరువురూ మరచిపో యారు. ఏ ఆలోచనలు ఈమె మనస్సులో మెదిలిందీ మరచిపో యింది. తన్నుతాను మరచింది. ప్రపంచాన్ని మరచింది. బహుశా ఏ ఆలోచనారాని, మనస్సుకు శూన్యత అవహించిన సమయం అంటే అదే నేమో!

గేటులోగుండా కారువచ్చిన శబ్దం వినిపించింది లీలగా; గారే జిలోనికి కారు నడిచినట్లనిపించింది. కొంతసేపటికి, ముందు వరం డాలో బూట్ల టకటక వినపడింది. వరండాలో లైటు వెలిగింది. హాలులో బూట్ల టకటక వినపడింది. హాలులో లైటువెలిగింది. తల్లి బిడ్డ కూచున్న గదిలోకి బూట్ల టకటక వచ్చింది. గుమ్మం ప్రక్కనే ఉన్న స్విచ్ టక్‌మన్నది. ట్యూబ్‌లైట్ తెల్లగా వెలిగింది. తల ఎత్తి చూచింది లక్ష్మి.

రఘురామయ్యగారుఎదురుగా ఉన్నారు రెండుక్షణాలు లక్ష్మి కేసిచూచారు. ఒకక్షణం బేబీవైపు చూచారు. ఆయన మొఖం వాడిపోయి ఉంది. కండ్లలో అరుణిమగన్పిస్తోంది. మనిషి నీరసంగా ఉన్నారు.

లక్ష్మినీ ఆ ప్రక్కన ఉన్న రేడియోనూ గమనించినట్లుంది. నిశ్శబ్దంగా వెళ్లి సూటుమార్చుకొని, వచ్చారు.

"లక్ష్మి" అనిపిలచారు.

తలఎత్తి చూచింది లక్ష్మి.

"వారం రోజులనాడు మన సంభాషణలోఒకసారినీవు గాంధీజీకి ప్రమాదం ఉండవచ్చేమోనని మాట్లాడావు. నీకు ఆ అభిప్రాయం ఎట్లావచ్చింది?" అని ప్రశ్నించారు.

గంటసేపట్నుంచి ఎదురుచూస్తున్న రఘు వచ్చాడు. హృదయావేదనను ఎవరిమోల వెలిబుచ్చుకోగలదో ఆయన సమీపించి ప్రక్కనే కూర్చొని, భుజంపైచేయి ఉంచారు. ఈమె ఏ విషయం చెప్పాలనుకున్నారో అదే ప్రస్తావన ఆయన చేశారు. ఆయన దారిలోనే విన్నారు మహాత్ముని మృత్యువార్తను.

ఇందాకటినుంచీ గుండెల్లో పేరుకున్న దుఃఖం, ఒక్కసారి పెల్లుబికి బయటపడింది. కన్నీరు మున్నీరుగా మారింది.

తల్లి వేదనను చూస్తున్న దివ్యజ్ఞాన సరోజిని తల అటు త్రిప్పుకుంది. సోఫాలో ఆ మూలకు జరిగింది. వెనుక నుంచి ఈమె పెడుతూన్న వెక్కిళ్ల బరువుకు వీపు కదలటం కనపడుతుంది. ఈ బిడ్డను ఓదార్చే శక్తి ఆ తల్లికి లేదు. ఆ తల్లిని ఓదార్చేశక్తి రఘూకులేదు. రఘూ తననుతాను ఓదార్చుకుంటూనికి పది రోజులనాడు ఒకరాత్రి భోజనాలయింతర్వాత ఇంటిముందరి తోటలో, సిమెంటు బెంచీలమీద, కూర్చొని గాంధీజీ పరంగాసాగిన వారి సంభాషణను ఆశ్రయించాడు.

* * *

దంపతులిద్దరే కూర్చున్నారు ఆరోజు.

ఢిల్లీ రాజకీయాలు ప్రస్తావనకొచ్చాయి. విజృంభించిన మత కల్లోలాలు, అటు పశ్చిమపాకిస్తాను నుంచీ, ఇటుతూర్పు బెంగాలు నుంచీ అనంతంగా సాగుతున్న శరణార్థుల వలస ప్రవాసాలూ లక్ష్మిని ప్రతిరోజూ ఉద్విగ్నను చేస్తున్నాయి. పత్రికాముఖంగా వీరు పడుతూన్న బాధలు, పోగొట్టుకొన్న ఆస్తులు, నిరాశ్రయులై మన దేశానికి రావటం ఈమెను కలవరపెడుతున్నాయి. ఈమె మనస్సును సంక్షోభపెడుతూన్నాయ్. కొన్నికొన్ని వార్తలు విన్నపుడు ఒకోరోజు మరీ అతలాకుతలమయ్యేది లక్ష్మి.

పుట్టినదాది తమది అనుకుని, బ్రతుకుతున్న ఇల్లూవాకిలీ, భూమి పుట్రా నగానట్రా గొడ్డూగోదా అన్నీ వదలుకొని ప్రాణాలు గుప్పిటపట్టుకొని పుట్టిమెట్టిన ప్రదేశాలనుంచి అజ్ఞాతంలోకి పారిపోవట మంటే ఏమిటి ?

ప్రాణంకన్నా మించి ప్రేమించే తన ఆప్తులచిత్రవధ తన కండ్ల ఎదుటే జరుగుతుంటే చూడటం అంటే ఏమిటి ?

తల్లి దండ్రుల ఎదుట కన్నబిడ్డలనూ, భార్యల సమక్షంలో ప్రియ భర్తలనూ నిలువునా చెట్లకుగట్టి దహనంచేయటాన్ని చూస్తూ బ్రతకటం అంటే ఏమిటి ?

ఇటుక ఇటుకా ప్రోగు చేసుకొని, గోడగోడా నిలబెట్టుకొని, గది గదీ తయారు చేసుకొని తమ జీవితాలకుపైని ఆచ్ఛాదనను గల్పించుకొని, చమటోడ్చి నిర్మించుకున్న గృహాలు, అస్తారబతంగా, అమర్చుకున్న ఆగృహంలోని సామాను, కసాయిమూకల దహన కాండకుగురై, ఫెళఫెళార్భటులతో అగ్నిదేవునికి ఆహుతౌతూంటే, ఎదురుగా దూరంగా ఉన్న ఏ చెట్టు చాటునుంచో గుట్టచాటు నుంచో చూస్తూ నిలబడటం అంటే ఏమిటి ?

ఆకలితో ఏడుస్తూన్న పసికూన నోటికి స్థనాన్నందించి, ఆ బిడ్డడి సుఖాలకై సుదూరభవిష్యత్తులో ఆశాజనకంగా ఆలోచించు కుంటూన్న మాతృదేవిని హఠాత్తుగా ముష్కర బృందం చుట్టు ముట్టి, ఆకలి అర్థమన్నా తీరని ఆ బిడ్డడిని అవలకు నెట్టేసి, ఆమెపై పడి, ఆరోమ్ముని గుద్దుతూ, ఒకరివెంట ఒకరు మానభంగం చేస్తుంటే కలిగిన మూర్ఛలోనే ప్రాణాలను వదలటం అంటే ఏమిట ?

ఒంటరిగా ఉన్నప్పుడు ఈ ఆలోచనలు లక్ష్మికి వచ్చేవి. ఆలో చనలు పెరిగేవి. ఆలోచించిన కొద్దీ హృదయం భారంతో పరితపిం చేది. తనలోతాను కుమిలిపోయేది. నిశ్శబ్దరోదనంతో చాలా సేపటికి గాని మనస్సు మనసయ్యేదిగాదు. మనిషిఅయ్యేదిగాదు.

ఈమె భావోద్వేగాన్ని, హృదయపరితాపాన్ని అర్థంజేసుకున్న రఘు, అనేవారు, "you are too sentimental Lucky" అని. అది తప్పో ఒప్పో ఈమెకు తెలియదు. తెలుసుకోవాలని ఈమె ప్రయ త్నించనూ లేదు. కాని తనను ఓదార్చటానికి మాత్రమే రఘు ఆ మాట అన్నాడని మాత్రం లక్ష్మికి తెలుసును.

అలాంటి సందర్భాలలో రఘూ మళ్లా అనేవాడు. "ఇది ప్రపంచం, ఇది జీవితం. దీనికి మనమెంతవరకు బాధ్యులం" అని.

''ప్రపంచమంటే ఇదా? జీవితమంటే ఇదాండీ?'' అనేది లక్ష్మి.

"దీనికి మీరూ నేనూ నేరుగా బాధ్యులం కాకపోవచ్చు. ఎవరు బాధ్యులో వారికీ మనకూ ఏ రకంగానూ సంబంధంలేదా? ఒకే నెత్తురు ప్రవహిస్తూన్న మన దేహాలకూ, ఒకే విజ్ఞాన నాగరికతలలో ప్రభవిస్తున్న హృదయాలకు సంబంధంలేదా రఘూ?" అనేది లక్ష్మి.

రెండుక్షణాలు లక్ష్మికేసిచూచి రఘురామయ్యగారు రెండు చేతులూ వెనకకు కట్టుకొని, చూపును ముందుకు సారిస్తు ఈమె ముందుగా ఏదో ఆలోచించుకుంటూ అటూఇటూ నడకలు సాగించే వారు. నిత్యమూ వింటున్న ఈ వార్తలకు ఆయన హృదయంగూడ బాధపడేది. దిగులంతా మనస్సులోనే దాచుకునేవాడు.

"ఈ మహాపాపం ఈనాడు మనదేశానికే సంప్రాప్తమైంది గాదులక్కీ, నిన్నమొన్న నాజీ సైన్యాలు యూరప్‌లో జేసిం దేమిటి? ఎన్ని దహనకాండలు, ఎన్ని మానభంగాలు, జరగలేదంటావ్? ఎందరు నిరాశ్రయులవలేదంటావ్ లక్కీ,'' రఘు అన్నాడు. అదీ ఈమెను ఓదార్చటానికే. ఈమె మనస్సు బరువును తగ్గించటానికే.

''రఘూ నేననేది, ఈ మహాశాపం మన దేశంపైనే విరచుక పడిందనిగాదు. ఈలాంటి ఘోరఘాతుకాలు ఏ దేశంలోనైనా జరగనీయ్, ఏ కాలంలోనైనా జరగనీయ్‌గాక, స్థలకాలభేదాలు లేకుండానే ఈ అమానుష కృత్యాలకు నా మానస్సుఖేదపడుతుంది. నేను దుఃఖపడతాను. దుఃఖపడటం ఎందుకంటావా నేను వాటిని అరకట్టలేను గనక.'' అని లక్ష్మి పలికింది.

రఘురామయ్యగారు తిరిగి తన పచార్లు సాగిస్తూనే ఉన్నారు.

మనస్సులోనే లక్ష్మి అనుకొంది, "ఓదేవా! ఈ మనుష్యు లను ఎంత చిత్రంగా సృష్టించేవయ్యా, నిన్నమొన్నటిదాకా ఒకే చోట కలసిమెలసి జీవించినవారు, వ్యక్తిగత కారణాలు ఏవీ ప్రకో పింప జేయకండానే, ఒకరినొకరు ఘోరంగా చంపుకుంటున్నారు. దీనికిగూడా మర్మార్థం ఏమన్నా ఉంటే ఈ దీనురాలికి తెలివిడ చెయ్యి"—అని.

అప్పటినుంచి, ఇప్పటివరకు ఏదేవుడూ ఆదుష్కృత్యాలకు ఏ అర్థమూ లక్ష్మికి తెలివిడిచేయలేదు.

దేశం ఈ ఘోర కృత్యాలతో అట్టుడికినట్లు ఉడికిపోతూన్న సమయంలో పదిరోజులనాడు, రఘూతో ఆరాత్రి తోటలో సంభా షణ జరిగింది.

"రఘూ, నాకెందుకో మహాత్ముడు మనకు దక్కడేమో నని పిస్తుంది.'' అన్నది లక్ష్మి.

ఉలిక్కిపడ్డట్టయి, రఘు, "అంటే ఏమిటలక్ష్మీ?, what do you mean,'' అన్నారు. స్వరం తీవ్రంగా పలికింది.

"మహాత్ముణ్ణి ఎవరో ఓ కిరాతకుడు పొట్టన పెట్టుకుంటాడేమో నని భయంగాఉంది" అన్నది లక్ష్మి.

అప్పటికే మదన్‌లాల్ అనే ఒక యువకుడు బిర్లా మందిర్ ప్రాంగణంలో చేతి బాంబు విసరిన సంఘటన ఆమెకు జ్ఞాపకంవచ్చి ఉంటుంది. అఁ! ఏమిటీ ఆలోచన! ఉలిక్కిపడ్డట్టు అన్నారు రఘు రామయ్యగారు. వాక్యం తీవ్రంగాఉంది. ఆమాట ఈమె అనటం రఘూకు ఇష్టంలేదు వినటం అంతకన్నా ఇష్టంలేదు.

ఆ సంభాషణ అంతటితోనే ముగిసింది. ఎవరి ఆలోచనలు వారిలోనే ఉండిపోయాయి.

సరిగ్గా పదిరోజులకు ఈ ఘోరం జరిగింది. దేశంపై ఒక పెద్ద .పిడుగు పడింది. ఆరాత్రి మరునాడూ, ఆసేతుశీతనగ పర్యంతం

భారతీయాత్మ శోకించింది. ప్రపంచం దిగ్భ్రాంతి చెందింది. క్షణం పాటు కాలచక్ర గమనమే స్తంభించినట్లనిపించింది.

"Too much goodness is dangerous." అన్నాడు బెర్నార్డ్ షా గాంధీ మరణాన్ని విని.

'అది సాధారణ మానవులపట్ల నిజమే గావచ్చుగాక. కాని మహాత్మునిపట్ల ఆ వ్యాఖ్యానం ఎలా సరిపోతుంది!' అనుకున్నది లక్ష్మి. తెల్లవారి రేడియోలో 'షా' మాటలువిని.

"మరొకసారి మానవత సిలువ వేయబడటం" అని వ్యాఖ్యానించింది నోబుల్ ప్రైజ్ గ్రహీత, ప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి పెరల్ బక్.

"ఈ మానవ దేవుడు నడయాడిన ఈ భూమిని గురించి, ఈ తరాన్ని గురించి, శతాబ్దాల అనంతరం గూడా భావి తరాలవారు గుర్తుంచు కుంటారు. ఈయన దివ్యజ్యోతి లక్షలాది ప్రజాహృదయాలలో నిత్యమూ, తరతరాలూజ్వలిస్తూనే ఉంటుంది కనక."

అంటూ మూడు రోజుల తర్వాత భారత రాజ్యాంగ నిర్ణయక సభలో ప్రసంగిస్తూ పలికారు జవహర్ లాల్.

జపాను రంగంలో మిత్రరాజ్యసైన్యాల సర్వసేనాని, సీసపు హృదయుడని పేరుగాంచిన జనరల్ డగ్లస్ మెక్ ఆర్థర్, "కాలానికన్నా చాలా ముందు నడచినవ్యక్తి" అని గాంధీజీని అభివర్ణించారు.

అమెరికన్ నీగ్రో మహిళా నాయకురాలు మిసెస్ మేరీ బెథూన్ గాంధీజీ మరణంపై తన అభిప్రాయం వెలిబుచ్చుతూ, "ఒక వెలుగు దివ్వె ఆరిపోయింది. తుపాకీల ప్రమేయం లేకుండా, రక్తపాతం అవసరం లేకుండా ప్రపంచాన్ని జయించటానికి ఆయన ఆత్మ నక్షత్రమండలాలకేసి ఎగిసింది. అటంబాంబులు, జెట్ విమానాలు, క్రిమి యుద్ధాలతో నిత్య భయకంపితులమై ఈ భూమిపై బ్రతుకుతూన్న తల్లులమైన మనం, ఆశాజనక భవిష్యత్తుకోసరం ఇక తూరుపు

ఆకాశంలో ప్రకాశించే మహాత్ముడనే సూర్యునివైపు చూడాలిసి ఉంటుంది." అని అన్నది.

*　　　*　　　*

నిజమే ప్రపంచానికి ఆయన ఒక నూతన వెలుగు ప్రసాదించాడు. క్రొత్త బాటను చూపించాడు. అది సత్యపూరితమైనది. విశుద్ధవంతమైనది. అహింసాయుతమైనది. అనుకున్నది శ్రీమతి లక్ష్మి.

ఆ మార్గంలో పయనించాలంటే నీకు కర్ర, కత్తులు అక్కర లేదు. బాంబులు తుపాకులూ అనవసరం. ఆర్భాటం హడావుడీవొద్దు. మంచి మనస్సుతో సత్యవాక్కుతో నిర్భయంగా ఎంత దూరమైనా ప్రయాణించవచ్చు. నీవు సుఖపడవచ్చు. ప్రపంచాన్ని సుఖవంతం చేయవచ్చుననిగూడా అనుకొన్నది శ్రీమతి లక్ష్మి.

అది ఆయన చూపిపోయిన మార్గం.

అనుసరించవలసిన కర్తవ్యం ప్రజలది.

*　　　*　　　*

ప్రపంచ దేశాలలో చాలాసార్లు ప్రఖ్యాతపురుషులు ఉద్భవించారు. ఆయాదేశాల ప్రజావిముక్తి పోరాటాలలో అగ్రభాగాననే ఉండి అనేక విధాల పోరాడారు. తమ జీవిత కాలాలలోనే వారిధ్యేయాలను సాధించినవారుగూడా మనకు కనుపిస్తారు. జార్జి వాషింగ్‌టన్, అబ్రహాం లింకన్, లెనిన్, గాంధీజీ, మాసియాంగ్, మొదలైన ప్రముఖులు ఈ కోవలో మన దృష్టికి వస్తారు. జాతికి వైతాళికుల్లా ప్రభాసించినవారే వారంతా.

వారందరు తమతమ దేశాల ప్రజల భాగ్యోన్నతికి విపులమైన సంగ్రామాలు జరిపి విజయాలను సాధించినవారే.

అయితే, వీరికి గాంధీజీకి మౌలికమైన ఒక భేదం ఉంది. వారందరూ వారి పోరాట విజయంతో అధికారాన్ని స్వీకరించారు. గాంధీజీ దానికిదూరంగా జరిగిపోయారు.

తన దేశపు స్వాతంత్ర్య పోరాటాన్ని వెన్నుగాచి, ముందు నడిపి, కడకు దేశానికి స్వాతంత్రప్రాప్తి లభించిన 1947 ఆగష్టు 15 అర్ధరాత్రి సమయానికి, దేశస్వాతంత్ర్య మహత్తర విజయోత్సవంలో ఈయన పాల్గొనలేదు. దిక్కులు పిక్కటిల్లునట్లుగా, భూనభోంతర ములు ఏకమగునట్లుగా వినవచ్చిన జయనినాదములను విన కుతూహల పడలేదు. భారత దేశానికి ప్రథమ అధ్యక్షుడో, లేక మొదటి ప్రధా నియో కావాలని కోరలేదు. ఆయన చిటికినవ్రేలు వాంఛించినా, ఈ విశాల దేశపు ఉన్నతోన్నత అధికార భద్రపీఠము ఆయనకు అగ్రతాంబులంగా లభించి ఉండేది. కాని గాంధీజీ అదేసమయంలో భారత రాజధానికి సుదూరంలో నౌఖాళీప్రాంతంలో తమ క్రౌర్యా లతో తల్లడిల్లుతున్న తల్లులను బిడ్డలను ఓదార్చటానికి కాలినడకన ప్రయాణం సాగిస్తున్నాడు. తోటిసోదరుల కన్నీరు తుడవటానికి తపించిపోతున్నాడు. మనిషిలోని క్రౌర్యాన్ని మార్చి అతణ్ణి కరుణా మయునిగా చేసేందుకు ప్రయాణిస్తున్నాడు.

"ఈయన ఋషిపుంగవుడా ? అత్యద్భుత రాజకీయవేత్తా?"

చాలాసార్లు శ్రీమతి లక్ష్మికి అనుమానం వచ్చింది.

చివరకు ఋషులలో రాజకీయవేత్త. రాజకీయవేత్తలలో ఋషి పుంగవుడు అని అనిపించింది కాని ఈ వాళ ఈమె అంటారు "ఆయన రాజకీయ ఋషిపుంగవుడు" అని.

గోధుమరంగు శరీరం, తెల్లగా మెరుస్తున్న చిరువెంట్రుకల శిరస్సు, బోసినోరు, పెద్దవయిన చెవులు, అడ్డంగా ముడతలతో గీతలు గీయబడిన నొసలు, దయను వర్షించే నయనాలు, పెద్ద ముక్కు, పొడవు కత్తిరించిన తెల్లమీసాలు, నున్నగా చేసుకున్న

గడ్డం, ఛాతిపై పొడుచుకొస్తూన్న ఎముకలు, గోచీపెట్టి ధరించిన పరిశుభ్ర ధవళ వస్త్రం.

దీర్ఘములైన చేతులూ, సన్నని పొడవుగా కన్పించే కాళ్లు, ప్రక్కనే కర్ర, బాచీపట్టు పెట్టుకొని కూర్చొని ధ్యానముద్రలో మనస్సును లగ్నంచేసుకునిఉన్న మూర్తిని మెరీనా సైకత స్థలిలో, అతిసమీపంలోఉండి చూచింది లక్ష్మి మద్రాసులో. ఎల్లెడలా నిశ్శబ్దం ఆవరించిన ఆ ప్రదేశంలో ఈమె మనస్సు ప్రార్థనవైపు మరలలేదు. ప్రార్థన చేసుకుంటూన్న ఆ మహానాయకుని పైననే లగ్నమయింది. చూపులు ఆయన ముఖారవిందపైననే కేంద్రీకరించబడినాయి. ఆ ప్రశాంత వాతావరణంలో ఆ శాంతమూర్తిని అదేపనిగా చూస్తుంటే సార్ నాథ్‌లో శిష్యులకు ధర్మప్రబోధం చేస్తున్న బుద్ధ భగవానుడు మనోనేత్రంలో మెదిలాడు శ్రీమతి లక్ష్మికి ఆనాడు.

బాపూ ప్రార్థన ముగించుకొని కండ్లు తెరిచాడు. గాంధీజీని సందర్శించుకోవాలని ఆ సాయంత్రంవేళ తూర్పు సముద్రంలోనుంచి వేనకువేల ఉత్తుంగతరంగాలు ఒకదానివెంట ఒకటి హోరుపెట్టు కుంటూ నురగలు గ్రక్కుకుంటూ పరువులతోవచ్చి, ఆయనకూర్చున్న ఆ సమావేశ ప్రదేశాన్ని ముద్దిడుకొని సంతృప్తిచెంది తెల్లగా నవ్వు కుంటూ సముద్రంలో కలసిపోతున్నాయ్.

ఎదురుగా కనుచూపుమేర ఇసుక రేణువులకన్నా మందంగా ఒరుసుకుంటూ కూర్చున్న జన సముద్రంలో మహాత్మాగాంధీకిజై, భారత్ మాతాకుజై అనేనినాదాలు, ఒకదానివెంట ఒకటి ఆ సముద్ర తరంగాలలాగానే వచ్చి సభాస్థలిలో మార్మోగుతున్నాయ్. దిగంతా లలో ప్రతిధ్వనిస్తున్నాయ్.

బాపూ చేయి పైకెత్తారు. అంతటా నిశ్శబ్దం. ఎత్తుగా నిర్మించిన వేదికపై నిలబడ్డారు. ప్రసంగం ప్రారంభించారు. ఆకు కదిలినా సవ్వడనిపించే ప్రశాంతత. నాగస్వరానికి ఆడే నాగు బాములా ప్రజాసందోహం మంత్రముగ్ధమయ్యింది. మహాత్ముని

అభిభాషణలను అర్థం జేసుకుంటోంది. మననం జేసుకుంటోంది. గంట సేపు సాగిన ఆ ప్రసంగంలో గాంధీజీ ఎన్నో విషయాలను వివరించారు. అందులో రాజకీయాలున్నాయి, మతమున్నది, దేవుడున్నాడు, హరిజనులున్నారు, స్త్రీలున్నారు, పల్లెపట్టులున్నాయి, చరఖా ఉన్నది, గ్రామాల స్వయం పోషకమున్నది, మత సామరస్య మున్నది.

ఆయన నోటినుంచి వెలువడిన ప్రతిమాట దైవవాక్కుగా గ్రహించారు ప్రజలు. ఆ చూపుల్లో దయ వెల్లువికింది. ఆ పలుకుల్లో సత్యం ప్రస్ఫుటమైంది. ప్రతిమాటా హృదయపు లోతుల్లోంచి వెల్లువికి వచ్చింది.

శ్రీమతి లక్ష్మి, గాంధీజీని అంతకుముందు రెండుమూడుసార్లు చూడటం తటస్థించిందిగాని, ఆరోజు మెరీనా బీచ్ సభలో మాత్రమే చాలా సమీపంగా కూర్చొని ఆయన్ను శ్రద్ధగా దర్శించుకోవటం జరిగింది. మాటలను వినటమూ జరిగింది. ఆ మాటలు మనుష్యుల్లో ఎలాంటి ప్రభావం గలిగించేదీ తెలిసింది.

* * *

లక్ష్మి చిన్నతనంలో గాంధీజీ ఆంధ్రదేశం ఒకసారి వచ్చినపుడు వారు విజయవాడ నుంచి బందరు వరకూ ప్రయాణం చేశారు. మధ్యలో చాలా గ్రామాలు చూచారు. ఆ రోజల్లా యావదాంధ్ర దేశ ప్రజలతో కృష్ణా జిల్లా తీర్థయాత్రాస్థలమైంది. పల్లెటిగ్రామాల నుంచి లభ్యమైన అన్ని ప్రయాణ సౌకర్యాలను వినియోగించుకొని ప్రజానీకం బారులుతీరి నడచింది. బండ్లు కట్టుకొని స్త్రీజనం పసి బిడ్డలతో సహా గాంధీజీని దర్శించుకోటానికి విచ్చేశారు.

లక్ష్మి నాన్నగారు ఆరోజుల్లో చల్లపల్లి సంస్థానంలో దివాన్‌జీగా పనిజేస్తున్నారు. బందరులో లక్ష్మి, చెల్లి కృష్ణ అమ్మనాన్నగారలతోసహా ఒక మహా మానవ సముద్రం మధ్య గాంధీని దర్శించుకున్నారు. ఆయన హరిజన నిధికై చేయిచాచి విజ్ఞప్తి జేశారు. కొంగుజాపారు. కొంగుబంగారు మయమయింది. పురుషులు

జేబుల్లో ఎంత డబ్బు ఉంటే అంతా ఆ నిధికి సమర్పించారు. డబ్బులు మరిన్ని లేనివాళ్లు వ్రేళ్లకున్న ఉంగరాలు సమర్పించారు. స్త్రీలు బంగారు నగలు యిచ్చారు. చేతి గాజులు యిచ్చారు. మెడల్లోని హారాలు యిచ్చారు. ఆ ఇవ్వటంలోనే తమజీవితాలు కృతార్థత చెందుతాయని యిచ్చారు. పోటీలుపడి ఇచ్చారు.

మహాత్ముని మాటల ప్రభావం అది. ఆయన వ్యక్తిత్వ విశేషమూ అది.

*　　　*　　　*

గాంధీజీ రాజకీయాలలో నైతిక ప్రసక్తి తీసుకొచ్చి రాజకీయాలకు ప్రప్రథమంగా గౌరవం తెచ్చిపెట్టారు అని కొందరంటారు. మరి నైతిక విశుద్ధతల్లేని రాజకీయాలు ఎందుకు? ఎవరి కొరకు? తెలివిగలవారు తెలివిలేనివారిని వివిధ నామధేయాలుగల పార్టీలను పెట్టుకొని పీడించటానికా? తనకు తానే చెప్పుకునేది లక్ష్మి.

అంతేగాదు గాంధీజీ, మనిషి జీవితంలో మరువబడ్డ మరుగున బడ్డ నైతిక విలువలను ఆయన జీవితమంతా కష్టాలుపొంది, పునరుద్ధరించాడు. జాతీయ అంతర్జాతీయ విషయాల నెన్నింటినో, ఆ విలువలతోనే సరిపోల్చుకొని, రూపకల్పనలు జేసుకున్నారు. ప్రజలకు ప్రబోధించారు.

మహాత్ముని గురించి ఆ విధంగా అర్థం జేసుకుంది లక్ష్మి.

లక్ష్యానికి సాధనకూ విలువలు ఉండాలని నిర్ధరించిన మహా రాజకీయవేత్త మహాత్ముడు. అట్టి మహాత్ముడు, నేడు కనుమరుగైనారు. అందుకే ఆమె కన్నీరు మున్నీరైంది.

ఢిల్లీకి వచ్చిన మొదటిరోజు, రాజ్‌ఘాట్ సమాధివద్ద దేశపిత గాంధీజీకి పుష్పమాల సమర్పించి-పినతులర్పించింది శ్రీమతి లక్ష్మి.

# నైలూ - మా సలామాలేకుం

ఈజిప్టు ముఖ్యపట్టణం కైరో. నైలునదికి తూరుపు ఒడ్డున ఈ మహానగరం వుంది.

ఈజిప్టు కలాగానే కైరోలో శ్రీమతి లక్ష్మి రఘురామ్ విడిది చేసిన 'షెప్పర్డ్ హోటలు"కూ ఒక చరిత్రవుంది. వంద సంవత్సరాల వయస్సుగల ఈ హోటలు ప్రపంచ ప్రఖ్యాతవీరుడు నెపోలియన్ తన జైత్రయాత్రలో కొంతకాలం పాటు తన స్కాంధావారంతో విడిదిచేసిన ప్రదేశంలోనే ఈ హోటలు నిర్మించబడింది.

ఆ రాత్రి ఆ హోటలు భవనం ఆఖరు అంతస్తుపై అనంత ఆకాశంక్రింద కూర్చున్నారు శ్రీమతి లక్ష్మి. ఎదురుగా నిండుగా వయ్యారంగా నీలిమ రంగులో నైలునది ప్రవహిస్తోంది. మర్మ గర్భితమైన ఎన్నో రహస్యాలను తనలో ఇముడ్చుకొని నిశ్శబ్దంగా గమనం సాగిస్తోంది. నింగిపై ఉదయించిన పూర్ణచంద్రుడు ఏ విషయమూ తనకు పట్టనట్టు తన ప్రయాణం తాను సాగిస్తున్నాడు. లే మబ్బుతునకన్నా అడ్డులేని ఈ అరబ్ ఆకాశం వజ్రవైఢూర్య మణిమయ, రత్నఖచిత లేకెంపురంగు మహావస్త్రాన్ని కప్పుకొని నైలు నదిలో తన అందాలను చూచుకొంటోంది. ఆ నక్షత్ర కాంతులను ప్రతిబింబిస్తూ ఈ మహానది తనకు తాను మురుసుకొంటోంది.

శ్రీమతిలక్ష్మికి ఒంటరిగా ఆ నిశ్శబ్దంలో కూర్చోవటం ఎంతో బాగుంది. వేగంతో ముడిపడి ప్రతిరోజుకూ గంటలను, ప్రతి గంటకూ నిముషాలను గుణించుకుంటూ బ్రతకటానికి అలవాటుపడ్డ ఆమెకు ఆ సమయం, ఆ ప్రదేశం, ఎంతో హాయినిచ్చింది. ఎంతగానో సేద దీరినట్లయింది.

ఎన్నో ఆలోచనలు ధారావాహికంగా శ్రీమతి లక్ష్మి మనస్సుకు తాకుతున్నాయి. అన్ని ఆలోచనలూ నైలునదివైపు తిరిగాయి. నైలునది ఈమె మనస్సును ఆవహించింది.

"నైలు" ఎంత చక్కని పేరు! ఈపూట జ్ఞాపకం వస్తోంది. మానవ జీవితంలో నదులపాత్ర ఎంతో!! పురాణ కాలంనుండీ నదులు మానవుణ్ణి బ్రతికిస్తూనే ఉన్నాయ్. బట్టకట్టిస్తూనే వున్నాయ్. తీర్చిదిద్దుతూనే ఉన్నాయ్. నదినిచూచి మానవుడు ఎంతో నేర్చు కొన్నాడు. కృతజ్ఞుడుగా వుంటూనేవున్నాడు. అర్చిస్తున్నాడు. పుష్కరాని కొక్కసారన్నా ఏ ఒక్క నదికన్నా ఏదో పేరిట భక్తితో నమస్కరిస్తున్నాడు గూడా.

"ఆదికాలం నుంచీ, మనిషి నదినిఎంత ఆప్యాయంగా చూచు కుంటున్నాడో, ఆలోచిస్తుంటే అశ్చర్యమేస్తుంది! ఎంత చక్కని పేర్లతో పిలుచుకుంటున్నాడు!! గంగ, సింధు, కృష్ణ, నైలు, ఘోవోల్గా, కావేరి!!! వెతకి వెతకి అందమైన పేర్లతో నదులను పిలి చాడు! కవనం అల్లాడు!! కమ్మగా గానం చేశాడు!!!"

కమ్మని ఆలోచనలు లక్ష్మి మనస్సును ఆకట్టుకుంటున్నాయి.

గంభీరవదనయై, తేజస్వినిగా ఈజిప్టు ఎడారులలో భూత కాలం నుంచీ భవిష్యత్తులోకి విశ్రాంతి లేకుండా ఈ మహానది తన అనంత యాత్ర సాగిస్తూనే ఉంది. నైలునదీతీరనాగరికత ప్రాచీనమయినదా, గంగాతీర నాగరికత ప్రాచీనమైనదా అనే మీమాంస చారిత్రక పరిశోధకులకు వదిలితే, ఈ రెండు మహానదుల తీరస్థ నాగరికతలూ, మానవ నాగరికతా విజ్ఞాన చరిత్రలో రెండూ రెండు మహా అధ్యా యాలుగానే భాసిల్లుతాయి. ఆఫ్రికా ఖండానికి అడ్డంగా ఏడువందల మైళ్ళ పొడవునా ప్రవహించే ఈ నదీమ తల్లి, ఆ ఖండవాసుల నిత్య జీవితంలో పెనవేసుకొని పోయిందనే మాట మాత్రం సత్యం.

ఈ ఆఫ్రికా ఖండంలోనే అనంతమైన సహారా ఎడారి సృష్టిపై చిత్రాలలో ఒకటిగా నిలిచింది, ఇజ్రాయిల్ దేశీయులు సహారా ఎడారిని సస్య శ్యామలం చేశారనీ, పుష్కలంగా పంటలను పండించు కుంటున్నారని విన్న శ్రీమతి లక్ష్మి ఇజ్రాయిల్ వెళ్ళాలను కొన్నారు. వారు సాధించిన ఆ మహాద్భుతాన్ని చూడాలనే కోరిక చాలా రోజులుగా వుంది. అయితే ఈజిప్టులోనే సహారాను సస్య శ్యామలం చేసిన పద్ధతి ఆశ్చర్యకరంగా ఈమెకు కనిపించింది. ఒకటి

రెండు దశాబ్దాల క్రితం ఇసుక ఎడారులుగావున్న నైలునదీ తీర ప్రాంతం నేడు పచ్చటి పైరులతో కనుల విందుచేస్తోంది. సువిశాల విస్తీర్ణాలు నైలునదినానుకొని మామిడి తోటలు, నిమ్మతోటలతో కళకళలాడు తున్నాయి. ఎడారి భూములను పంటలకు మళ్ళించడం అనేదే అద్భుతం. శ్రీమతి లక్ష్మికి నిజంగా మొదట్లో నమ్మశక్యం కాలేదు గూడా. ఈజిప్టు ప్రజలకు వర్షమంటే ఏమిటో తెలియదు. కొందరు వాళ్ళ జీవితకాలంలో ఏ ఒక్కసారో వర్షాన్ని చూసి ఉంటారు. ఈజిప్టు పురాతన గ్రంథాలలో. "ఆకాశంనుండీ నైలునద భూమి మీదకు పడిపోతుంది" అంటూ వర్షాన్ని గురించి వ్రాశారు. ఎందు కంటే వాళ్ళకు తెలిసింది నైలునదీ, దానిలోని నీరే. వర్షమంటే తెలియని ప్రజ వర్షాన్ని ఎపుడో జీవితకాలంలో ఒక్కసారిచూచి నైలునది ఆకసంనుంచి పడుతుంది, అని అభివర్ణించుకున్నారు.

ఎడారిని పంటభూములుగా మార్చుకునేబృహత్ ప్రయత్నము 1954 లో ప్రారంభమయింది. ప్రథమంలో ప్రభుత్వఎడారిని సర్వే చేయించింది. ఒయాసిస్సులు ఉన్న ప్రాంతాన్ని లోగడఉండి ఎండి పోయిన స్థలాలను గుర్తింపించింది. ఎందుకంటే ఈ చోట్ల అడుగున నీరు తప్పక ఉంటుందని నమ్మకం. ఈ స్థలాలు నైలునది సమీపం లోనూ ఉన్నాయి. నదికి దూరంగా మైళ్ళ ఆవలా వున్నాయి. కొన్ని ప్రత్యేక పద్ధతులద్వారా ఈ భూముల్లో చాలా ఎక్కుగా నీరుప్రవహించేట్టు చేశారు. ఈ ప్రాంతమంతా గట్టిపడేదాక ఈ నీరు పెట్టడం జరిగింది. తరువాత రక్కిస పొదలు, మొక్కలు నాటారు. చుట్టూరా సర్వి మొక్కలు నాటారు. మరల ఇసుక జేరుకొనకుండా ప్రతి రెండు మూడేండ్లకు ఒకసారి నాటిన రక్కిస పొదలు తీసి కొత్తవి నాటేవారు. ఇలా ఒక పదేండ్లు పాటు శ్రమించిన తరువాత ఆ భూమి వ్యవసాయ యోగ్యమైంది. సుదీర్ఘమైన సన్నని సిమెంటు కాల్వలు కట్టారు. నీటి పారుదలకోసం కొన్నిచోట్ల మైలునుంచే నేరుగా నీరు పారుదల ఆయ్యేట్లు చేసుకున్నారు. యీ రకమైన సిటి కాలువలను తయారుచేసుకుంటమే ఒక ఘనకార్యం. వెంటనే

మొక్కజొన్న వేశారు. గోధుమ వేశారు. పొలాలను సశ్యశ్యామలం చేసుకున్నారు. గాదెలను గోధుమలతో నింపుకున్నారు.

* * *

అక్కడ మామిడితోటలను, మాల్ట్ తోటలను శ్రీమతి లక్ష్మి చూచారు. డబ్బాల్లో నిల్వఉండే మామిడిరసాలను రుచిచూశారు. వ్యవసాయ క్షేత్రాల్లో డబ్బాల్లో మామిడిరసాన్ని నిల్వచేసే కానింగ్ పరిశ్రమ చాలా ప్రాముఖ్యంవహించింది. ఎక్కువవిస్తీర్ణాలలో మిక్కిలిగా మొక్కజొన్న, ఆముదాలు, నిమ్మలు పండిస్తున్నారు. ఎడారిని బాగుచేసుకున్న ప్రాంతాల్లో 1250 గ్రామాలుఏర్పడ్డాయి. వాటిల్లో ఒకటి గాంధీజీ పేరిట నిర్మితమయింది. మహాత్ముని శతజయంతి సందర్భాన్ని పురస్కరించుకొని గాంధీజీ పేరు ఆ ఊరుకు పెట్టుకున్నారు.

తహ్రీర్ రాష్ట్రంలో ఈమె ఒక గ్రామాన్ని వివరంగా సందర్శించారు. కైరోకు నూరుమైళ్ళదూరంలో ఈఊరు ఉంది. అయితే మన గ్రామాలున్న దుస్థితిలోనే ఈ ఊళ్ళు ఉన్నాయని ఎవరూ అనుకోనక్కరలేదు.

ఈ గ్రామాలన్నీ మోడలు గ్రామాల పద్ధతిలో నిర్మించబడ్డాయి. ప్రతిగ్రామానికి స్కూలు, వైద్యాలయం, క్లబ్బు ఉన్నాయి. రోడ్ల సౌకర్యం, విద్యుద్దీకరణం లాంటి దైనిక అవసరాలను గురించి ప్రత్యేకించి చెప్పపనిలేదు. ఈమెచూచిన గ్రామంలో రెండు క్లబ్బులున్నాయి. ఒకటి ఆరుఅంతస్థుల భవనం. ఈ క్లబ్బులన్నీ బాల బాలికల ఆటస్థలాలుగా తీర్చిదిద్దారు. అన్ని ఆధునిక సౌకర్యాలు కల్పించారు. టెలివిజన్ లాంటివి ఏర్పాటుచేశారు. అపుడపుడు వినోద కార్యక్రమాలు ఈ క్లబ్బుల్లో జరుగుతుంటాయి.

గ్రామల్లో గొర్రెలఫారాలు, బాతుఫారాలు, కోళ్ళఫారాలు మిక్కిలిగా ఉన్నాయి. వ్యవసాయమంతా ఆధునికపద్ధతుల పై

నిర్వహించ బడుతుంది. పురుషులూ, స్త్రీలూ, పిల్లలూ మామూలుగా గాడిదలమీద స్వారిచేస్తున్నా, పొలల్లోమాత్రం ట్రాక్టర్లు, కుప్పకోసే యంత్రాలు, ఇతరవ్యవసాయిక యంత్రసామగ్రి విస్తృతంగా పని చేస్తూ ఉండటం కనిపిస్తుంది.

ఈ ఎడారిభూములను సాగుచేసుకొని జీవించాలని కోరే ప్రతి వారికి ఈపొలాలను ఉచితంగా యిస్తారు. పాలస్తీనా నుంచి యుద్ధ కారణంగా, శరణార్థులుగా వచ్చినవారికి ఈ గ్రామాలు నివాస యోగ్యమయ్యాయి.

ఒక శరణార్థులశిబిరాన్ని శ్రీమతి లక్ష్మి సందర్శించినప్పుడు, పురుషులైతే ఉత్సాహంగానే ఉన్నారుగానీ, స్త్రీలూ పిల్లలుమాత్రం విచారంగా కన్పడ్డారు. యుద్ధభీభత్సం వారివదనాలలో దీనంగా ప్రస్ఫుటమయింది.

* * *

ఈజిప్టుదేశీయులు - రాజకీయ కారణాలవల్లనే గామోసు అరబ్బులుగా పిలిపించుకోటానికి మక్కువ జూపిస్తారు. ఇజ్రాయిల్ తో వారికి యుద్ధం తటస్థించినా సరిహద్దుల్లో ఉద్రిక్తతఉన్నా అరబ్బులు సంతోషంగానే కన్పడుతారు.

విమానాశ్రయంనుంచి శ్రీమతిలక్ష్మి విడిదిచేసిన మెప్పర్డు హోటలు వరకూ పరిశీలించి చూడగా ప్రతివారూ ఆరోగ్యంగా ఉన్నారు. ఉత్సాహంగా కన్పించారు. నీరసించిన మనిషిగానీ, బిచ్చకుడుగానీ ఈమె దృష్టికి తగులలేదు. ఇది ఆశ్చర్యాన్నే కలిగించింది. విచారిస్తే తెలిసిందేమంటే సాధారణంగా ఈజిప్టుదేశీయునిలో సంతృప్తి ఉందని ! ఏ పట్టభద్రుడూ నిరుద్యోగిగా లేడని. ముప్పయి పైసలకు కడుపునిండా భోజనందొరుకుతుంది. అయితే ఈ వచ్చే నష్టాన్ని ప్రభుత్వం భరిస్తుంది. ఎందరో విద్యాధికులకు ఉద్యోగాలు లభ్యమైనాయి. కనుకనే వారిజీతాలు తక్కువగానే ఉంటాయి. అయితే ఒకరు చేయగలపనికి ముగ్గురు నియుక్తులయ్యారు. ఫలితంగా

ఎంతో ఆరోగ్యకరమైన ఈజాతికి సోమరితనం అబ్బింది. ఇది విచార పడదగ్గ అంశం. యుద్ధమున్నా లేకున్నా ప్రతివారికి తిండి ఉంది, గుడ్డ ఉంది. చింకిపాతలతో ఉన్న పురుషుడుగానీ, స్త్రీ గానీ, పిల్లాడు గానీ శ్రీమతి లక్ష్మికి కనుపించలేదు.

అయితే ఉత్పన్నమయ్యే ప్రశ్న ఏమిటంటే ప్రభుత్వం ఇదంతా ఎలా సమకూర్చగలుగుతుంది అని. ఈజిప్టు ప్రభుత్వం సంపన్నమయినదని ఈమెకు తోచింది. లోటుబడ్జెట్లతో ఆ ప్రభుత్వాన్ని నడపరు. ప్రతిఎకరంలో మనకన్నా రెట్టింపుపంటను పండిస్తారు. మరీ తృణధాన్యాలు వగైరా మూడురెట్లు ఎక్కువ పండిస్తారు.

పిరమిడ్లను దర్శించకుండా ఈజిప్టుయాత్ర పూర్తి గాదు.

ఒకటిరెండు దశాబ్దాలక్రితం పిరమిడ్లను దర్శించాలంటే ఒంటెపై స్వారీచేయాలిసిందే. ఈ గతకాలంలో ఈజిప్టులో వచ్చిన అభివృద్ధిమూలంగా శ్రీమతి లక్ష్మి పిరమిడ్ల వద్దకు కారులోనే ప్రయాణించారు.

* * *

పిరమిడ్ల సందర్శనం ఒక నూతనానుభూతి !

చరిత్ర లోతుల్లోకి నెమ్మదిగా ప్రయాణించి సలభై ఆరు వందల సంవత్సరాలనాటి పాతగాధల్లోని నాయకీనాయకులతో పరిచయం కలిగించుకుంటూన్న ఓ ప్రత్యేకానుభూతి మనస్సుకు కలుగుతుంది.

ఒకచోట మనస్సు ఉద్విగ్నమౌతుంది. మరోచోట మనస్సు సంశయాత్మకమౌతుంది. ఇంకోచోట మనస్సు విచారం పొందుతుంది. మొత్తంమీద మానవ నిర్మిత ఈ మహానిర్మాణాలను చూచిన తరువాత సంభ్రమాశ్చర్యాలతోపాటు ఒకరకమైన శూన్యత గూడా మనస్సుకు ఆవహిస్తుంది.

ప్రాచీన ఈజిప్టుచరిత్రలో స్వర్ణయుగంగా విరాజిల్లిన ఈ పిర మిడ్లకాలంలో (క్రీ. పూ. 2780 - 2100) ఫారోలు ఈ దేశాన్ని ఏలారు. నైలునదికి పశ్చిమతీరాన మెమ్ఫిస్‌ను రాజనగరం జేసుకుని పాలించారు. దీనికి ఎదుటిగట్టున 'సక్కారస్మశానం' ఉంది! ఇక్కడే మొదటిపిరమిడ్ నిర్మింపబడింది. ఈ స్థలమే ప్రాచీన ఈజిప్షియ మహారాజుల, మహారాణుల, ఉన్నతాధికారుల ఖనన ప్రదేశం.

కైరోపట్టణం నిర్మించబడ్డ నైలునదీ తూర్పుతీరప్రదేశంలో మూడు ముఖ్యమైన పిరమిడ్లు ఉన్నాయి. వాటిల్లో పెద్దగాకన్పించేదే 'గ్రేట్ పిరమిడ్' అని పిలువబడుతుంది. ఖిపాన్‌సమాధి అది. దాని తరువాతది ఆయనకుమారునిది. దానిప్రక్కది ఆయన మనుమని సమాధి.

ఈ పిరమిడ్ల ప్రవేశద్వారంవద్ద గంభీరంగా నిలిచిఉన్న ఆకృతి స్ఫినిక్స్. ఆ పిరమిడ్లను అనంతకాలంవరకు రక్షణగా నిలిచి కావలికాస్తున్నట్లు జూపట్టుతుంది ఈ ఘనవిగ్రహం. మరొకటి నాల్గవది చిన్న పిరమిడ్ గూడా ఆ వరుసలోనే ఉంది. ఆ నాలుగు తరాలతోటే ఫారో రాజులవంశం అంతరించింది. అయితే వారు కోరుకున్నట్లు వారి సమాధులు మాత్రం అక్కడే చిరంజీవత్వం సంతరించుకున్నాయి.

పిరమిడ్లు ఈజిప్షియన్ మహారాజుల సమాధులు. అతి పెద్ద చెక్కడపురాళ్ళతో నిర్మించబడ్డ నిర్మాణాలు. ఒక్కొకటి రెండున్నర టన్నుల బరువుగల ఇరవై అయిదులక్షుల రాళ్ళతో గ్రేట్ పిరమిడ్ నిర్మిండబడింది. ప్రతిరాయి ఏ మాత్రం భేదంలేనివిధంగా నైజువారిగా చెక్కబడి, ఈ బృహత్‌నిర్మాణంలో ఉపయోగించబడ్డాయి. దిక్సూచియంత్రాల లోపాలనుగూడా సరిచేసుకోగలంతటి, అద్భుత నైపుణ్యంతో, వీసమెత్తు వ్యత్యాసాలులేని చెక్కడాలతో, రాళ్ళను తాపిన మహానిర్మాణం ఇది. 19 వ శతాబ్దం ప్రారంభంవరకూ నాల్గు వేల అయిదువందల సంవత్సరాలపాటు ఈ భూగోళంపై అత్యంత ఉన్నతంగా నిలచిన ఈ కట్టడం నిర్మించటానికి ఇరవై సంవత్సరాలు

పట్టింది. క్రేన్లూ, జాకీలు, లాంటి ఏ యంత్రపరికరాలు, సౌకర్యాలు లేకుండానే ఆ రోజుల్లో మనిషి కేవలం తన రెక్కలతోటి ఇంతటి నిర్మాణం గావించటం వీక్షించిన మనం మానవశక్తికి ముగ్ధులంగాక మానము.

జీవితం అల్పకాలికమయిందనీ, మృత్యువు దీర్ఘకాలికమనీ ప్రాచీన ఈజిప్షియన్ల పరమవిశ్వాసం. కనకనే వారు జీవిత నివాస గృహాలకన్నా మరణానంతర సమాధులపై శ్రద్ధాసక్తులు మిక్కుటంగా జూపించారు. ఆసమాధులపై గన్పించే అసంఖ్యాక చిత్తరువులు చెక్కడముల ద్వారా ద్యోతనమయ్యే అభిప్రాయాలు గూడా మనకు ఈ భావాన్నే స్పష్టంచేస్తాయి.

ఈ సమాధులకు కేంద్రస్థానంలో ఈ రాజుల మరణానంతరము వారి భౌతిక కాయాలను మమ్మీలుగా తయారుచేసి శాశ్వతంగా ఉండేట్టుగా భద్రపరిచారు. వారితోపాటు వారి అవసర వస్తువులను, ఆయుధాలను, ఆభరణాలను, సింహాసనాలను చివరకు ఆటవస్తువులను గూడా వారి ప్రక్కనే సమాధిచేశారు.

కాలపు వైపరీత్యాలనుంచీ, దోపిడిదొంగల బారినుంచీ ఈ భౌతిక కాయాలను, యితర విలువగల వస్తువులను కాపాడుటయే ఈ సమాధుల బృహత్ నిర్మాణాల ఉద్దేశ్యంగా కన్పడుతూంది. ప్రేతాలకు భోజనాదికములను సమకూర్చటమేగాక అవి ప్రయాణాలు చేయటానికి బోట్లనుగూడా ఈ సమాధుల్లో ఉంచారు.

వీరికి సూర్యుడు ప్రధానదైవము, నక్కదేవుడు, పిల్లిదేవుడు గూడా ఉన్నారు. సర్పం, సింహం, గ్రద్ద దేవుళ్ళుగూడా ఆరాధ్యులే. ఈజిప్షియన్సు మెడలోని గొలుసులోనో, వ్రేలి ఉంగరంలోనో ఒక పచ్చరాయి పొదిగించుకుంటారు. అది చెడును నివారిస్తుందని వారి నమ్మకం.

భారతీయుల్లాగానే వీరికి మూఢవిశ్వాసాలు మెండు. కాగా ఈ విశ్వాసాలకు సామీప్యతగూడా ఉన్నట్లు శ్రీమతి లక్ష్మికి అర్థమయింది.

* * *

ప్రస్తుతము ఈజిప్టులో అత్యధికసంఖ్య ముస్లిములదే. అయితే ఇతరత్రా ముస్లిం ప్రపంచంలోని వారిలాగా మొండిరకం కాదు. రుద్రాక్షమాలలను చేతితో త్రిప్పుకుంటూ ఉండేవారిని ఈమె చాలా ఎక్కువగానే చూసింది. విమానాశ్రయంలోనూ పెద్దపెద్ద హోటళ్ళలోనూ వారు ఈమెకు తారసపడ్డారు. టెలివిజన్, రేడియోలలో తప్పనిసరిగా మతైక కార్యక్రమాలు ప్రసారం గావించబడతాయి. ప్రతిపని ఖురాన్ పఠనంతో ప్రారంభించబడుతుంది. ప్రతి శుక్రవారం వారికి సెలవు.

ఇచ్చట స్త్రీలు పొడ్డూ పొడుగూ గలిగి విప్పారిన గౌరవర్ణ నేత్రాలతో బహుఆకర్షనీయంగా ఉంటారు. దుస్తులన్నా, ఆభరణాలన్నా మోజు ఎక్కువ. భోగజీవితంపై ఆసక్తిమెండు. పశ్చిమదేశ స్త్రీలలోని విస్తృతస్వేచ్ఛాభిలాష, ప్రాచ్యదేశ మహిళల్లో ఉండే సంయమనం సమ్మిశ్రితంగా యీ దేశస్త్రీలలో కన్పడుతుంది.

ఆధునిక ఈజిప్టుదేశ మహిళ సర్వస్వతంత్రాలను కలిగిఉంది. పాశ్చాత్యపద్ధతిలో దుస్తులుధరిస్తుంది, అలంకరించుకుంటుంది. 1969వ సంవత్సరంలో వారు ఈజిప్టుమహిళాదినోత్సవం జరుపుకున్నారు. ఆ ఉత్సవాలకు శ్రీమతి లక్ష్మీమహోజరయ్యారు. నలుగురు జాతీయనాయకురాండ్రకు దేశాంతరశిక్ష విధించినందుకు నిరసనగా 1919 మార్చిలో కైరోలో, శ్రీమతి హోడాషరావి నాయకత్వాన బురఖాలుధరించిన స్త్రీలు గొప్ప ఊరేగింపు జరిపారు. దేశబహిష్కారశిక్ష విధించబడ్డ ఆనలుగురు స్త్రీ నాయకురాండ్రలో ఒకరు ఈజిప్టుకేగాదు, యావత్తు అరబ్ రాజ్యాల మహిళాఉద్యమానికి అధినేతఅయింది. ఈ మహిళా ఉద్యమనిర్మాత అద్భుతసౌందర్యంతోపాటు, అధిక శ్రీమంతురాలూ దూరదృష్టి గల నాయకురాలు.

1952 లో ఈజిప్టులో విప్లవంప్రారంభమైంది. 1956వ సంవత్సరంలోస్త్రీలకు ఓటుహక్కులభించింది. నిన్నటివరకు తల్లిగా భార్యగానే జీవితాలు కొనసాగిస్తున్న ఈజిప్టు నారీలోకం నేడు ప్రభుత్వపాలనలో

అన్నిరకాల ఉన్నతపదవుల నధిష్టిస్తున్నారు. మహిళామండలినుంచి మంత్రులున్నారు, గొప్పరచయితలున్నారు, విద్యావేత్తలున్నారు. ఉన్నతాధికారులున్నారు. ఐక్యరాజ్యసమితిలో శ్రీమతి అజీజాహు స్సేన్ ప్రాతినిధ్యం వహిస్తుంది. కొద్ది కాలం క్రిందట డా॥ హక్మత్ అబుజేద్ సాంఘిక సంక్షేమశాఖా మంత్రి పదవి నిర్వహించారు. ఇచ్చటి స్త్రీలు సుఖంగానూ స్వేచ్ఛగానూ ఉన్నారు.

ఒక ప్రఖ్యాత పత్రికా సంపాదకుడు శ్రీమతిలక్ష్మితో అన్నారు "మగవారికన్నా ఆడజర్నలిస్టులు చాలా మేలు" అని.

"ఎందుకని?" అని ప్రశ్నించింది శ్రీమతిలక్ష్మి.

"వారిలో నిజాయితీ మిక్కుటంగాఉంది. ఉత్సాహం అధికంగా ఉంది. వేగమూ ఎక్కువే." అన్నాడు ఆ పత్రికాధిపతి.

"నిజమేనా? అన్నది లక్ష్మి." "అంతేనా...?" అని గూడా అన్నది. ఇంకా ఏదోసమాధానం పూర్తిగానట్లు. "నిజమేమాడం. నిజంనిజం" అవును. అంతేగాదు మహిళాజర్నలిస్టుల పరిశీలనాశక్తి ఎంత సున్నితమో అంత తీక్షణముగూడా!" అనితత్తరపడ్డాడు, పత్రికాసంపాద కుడు. ఇద్దరూ నవ్వుకున్నారు.

కైరోపట్టణంలో మన ఢిల్లీలోలాగానే అసంఖ్యాకంగా సమాధులు కన్పిస్తాయి. కైరోలోని మ్యూజ్యియం తప్పక చూడ వలసిన స్థలం. సువిశాలమైన ఆ మ్యూజియంలో గతించిన శతాబ్దులు జీవం పోసుకొని మనకు ప్రత్యక్షమౌతున్నట్లు భావనగల్గుతుంది. అచ్చం బంగారంతో నిర్మించిన శవపేటికల నుంచి, చెక్క పేటికల వరకు రకరకాల సుందర ఆకృతులు ఆకర్షిస్తాయి.

నగల నమూనాలు తెలుసుకోవాలంటే కైరో మ్యూజియంలో నమ్మశక్యంగాని అత్యద్భుత ఆభరణాలను సందర్శించినప్పుడే తెలుస్తుంది. ఆభరణాలంటే ఏమిటి, డిజైన్సు ఎలా ఉంటాయే నన్న విషయం.

ఆధునిక కట్టడాలలో 'కైరోటవర్' చాలా ఆసక్తిదాయక మయినది. అరవై అంతస్థులుగల యీ గోపురంనుంచి, కైరో పట్టణం యావత్తు గోచరమౌతుంది. 15 వ అంతస్థులో ఒక విలాస భోజనశాల 14 వ అంతస్థులో రివాల్వింగ్ ఉపాహారశాలా ఉన్నాయి. మొత్తం గోపురం పద్మాకారంలో నిర్మించబడింది. సమైక్య అరబ్ రిపబ్లిక్ ప్రభుత్వచిహ్నమైన గద్దవిగ్రహం ఈ గోపుర ముఖద్వారాన్ని అలంకరిస్తుంది.

ప్రఖ్యాతివహించిన అబు-సంబెల్, రామ్‌సెస్ II రాతిదేవాల యాలు కైరోదేవళం చూడలేకపోయారు శ్రీమతిలక్ష్మి. ఇప్పటికే వారంరోజులయింది ఆమె ఈ విచిత్రభూమికి వచ్చి. సమయం, అవ కాశం లేకపోయింది.

అయినా ఈజిప్షియనులకు ఓనమ్మకం ఉంది. "నైలునది నీరు త్రాగినవారు మరోసారి తప్పక నైలువద్దకు వస్తారు" అని. అదేనిజ మైనపక్షంలో ఈమె రెండోసారి నైలును దర్శించినప్పుడు, ఆ పై రెండుస్థలాలను తప్పక సందర్శించాలని శ్రీమతిలక్ష్మి నిశ్చయించు కొన్నారు.

* * *

శ్రీమతిలక్ష్మికి ఆతిధ్యమిచ్చినవారు "ఇంటిపై బెంగపెట్టు కున్నారా" అని అడిగారు. నిజానికి ఈమె ఏ దేశంలో పర్యటిస్తున్నా ఇంటిపై బెంగ ఉండేదికాదు. ముఖ్యంగా ఈజిప్టు దేశంలో అసలే కలుగలేదు. నైలునది, ఆచారాలు,నమ్మకాలు అన్నీ పరిచయమైనవి గానే కనపడ్డాయి. ఈజిప్టు పురుషుల్లో కొందరు ఇండియన్లలాగానే ఉంటారు. కాని స్త్రీలు మాత్రం పాశ్చాత్య దుస్తుల్లో, వైవిధ్యంగా కనపడుతారు. అయితే వాళ్ళు "సుక్రా" గూడా మామూలుగా మనం వినే "సుక్రియాకు" దాపుగానే ఉంటుంది.

ఈజిప్టునంతా పర్యవేక్షించి తన పర్యటననంతా సమీక్షించిన మనస్సు చివరకు హోటలు బాల్కనీ ఎదురుగా గంభీరముద్ర వహించి ప్రయాణంసాగిస్తున్న నైలుమా వైపు మళ్ళింది.

మరి ప్రయాణం ఈమే చేయాలిగదా! ఆ నిశ్శబ్ద నిశీధిలో విశాల గగనతలం క్రింద ఏకాంత ప్రశాంతతను తనివితీరా ఆస్వాదించిన శ్రీమతిలక్ష్మి, "నైలూ మా నమస్కారం" అంటూ సెలవు తీసుకున్నది.

మరునాడు విమానంలో శేషయాత్రకు ఇతర దేశాలకు బయలుదేరారు శ్రీమతిలక్ష్మి. ఉదయ సూర్యుని అరుణకిరణాలతో నిండి దివ్యకాంతులతో నైలునది పశ్చిమాభిముఖంగా ప్రవహిస్తోంది. విమానపు కిటికీ ప్రక్కనే ఆశీనురాలైన లక్ష్మి క్రిందకు నైలునదికేసి చూసింది. మనస్సులోనే సెలవు తీసుకొంది, ఫిర్ మిలింగే "నైలూమా సలామాలేకుం" అంటూ.

# పరాసు దేశంలో

'ఇంటర్నేషనల్ ఎలయెన్స్ ఆఫ్ ఉమెన్' అనే సంస్థ 1918వ సంవత్సరములో జర్మనీ దేశములో స్థాపించబడింది. ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో యుద్ధబాధలతో విసిగివేసారిన జర్మన్ మహిళా లోకంలో వచ్చిన నిస్పృహ ఫలితంగా, కొందఱు జర్మనీ మహిళా మణులు భవిష్యత్తులో యుద్ధాలను నివారించ కృషి జేసే తలంపుతో ఈ అంతర్జాతీయ సంస్థను స్థాపించారు.

తదుపరి ప్రపంచవ్యాప్తంగా వివిధ దేశాల మహిళా ఉద్యమాలతో పొత్తు కుదుర్చుకొని వివిధ కార్యక్రమాలను సమన్వయ పరచుకొని, అంతర్జాతీయంగా మహిళల శ్రేయస్సుకు పాటుపడాలనే ధ్యేయంతో ఈ సంస్థను ప్రపంచ మహిళాలోకానికి ఒక అంతర్జాతీయ వేదికగా రూపొందించారు.

తర్వాత ఈ అంతర్జాతీయ వేదిక ప్రధాన కార్యస్థానాన్ని లండనుకు మార్చారు. ఐరోపా ఖండంలోని అన్ని దేశాలు ఇందులో సభ్యత్వం కలిగి ఉన్నాయి. క్రమంగా అమెరికా ఆఫ్రికా ఆసియా ఖండాలలోని దేశాలుగూడా ఈ సంఘంలో సభ్యత్వాలను స్వీకరించాయి. షుమారు యాభయి ఆరు ప్రముఖ దేశాలలోని మహిళా సంఘాలు అధికారికంగా ఈ ప్రపంచ సంస్థలో ప్రధాన భూమికలను నిర్వహిస్తున్నాయి.

మూడు సంవత్సరాల కొకతూరి ఇంటర్నేషనల్ కాన్ఫరెన్సు జరుపుతారు. అమెరికా, యూరప్, ఆసియాలను ప్రాంతీయ విభాగాలుగా విభజించి, ఒక్కో ప్రాంతానికి ఒక్కో డైరక్టరును ఎన్నుకొని ప్రధానబాధ్యతలు నిర్వర్తించుకునేట్లు చేస్తారు.

ఆసియా ఖండ దేశాల ప్రాంతీయవిభాగానికి శ్రీమతి లక్ష్మి రఘురామ్ 1967 లో డైరక్టరుగా ఎన్నికయ్యారు. పారిస్‌లో జరిగిన సభకు ఆ హోదాతోనే వీరు హాజరయ్యారు.

మరో రెండు వారాలకు ఫ్రాన్సుదేశం వెళ్తాననంగానే, లండన్‌లో వీరి స్నేహితురాలు శ్రీమతి సుమతికి ఉత్తరం రాశారు, తన పర్యటనను గురించి. తాను ఫ్రాన్సులో ఉండే రోజుల్లో ఆమెను గూడా అవకాశం తీసుకొని పారిస్ రావలసిందిగా కోరారు. ఈ సభల కార్యక్రమాలు పూర్తవంగానే మరికొన్ని రోజులు ఫ్రాన్సులో గడపాలని లక్ష్మి రఘురామ్ ఉద్దేశ్యం. శ్రీమతి సుమతి సంతోషంతో ఈ సూచనకు అంగీకరిస్తూ జవాబురాసింది.

అనుకున్న రోజుకు, పారిస్‌లోని ఆర్లె విమానాశ్రయంలో శ్రీమతి లక్ష్మి దిగారు. సుమతి రావలసిఉన్న విమానం మరో పదహేను నిముషాలు లేటయింది. అందాకా విమానాశ్రయంలోనే గడిపి, ఆమె రాగానే ఇద్దరూకలసి పారిస్ పట్టణం జేరారు. మొదట మూడు రోజులు ఈమె ఎడతెరిపిలేని కార్యక్రమాలతోనే సరిపోయింది. వివిధదేశాల ఉద్యమాల ప్రగతిని సమీక్షించు కుంటంలోనూ రానున్న సంవత్సరంలో జరుపుకోవలసిన కృషిని నిర్ణయించుకోవటంలోనూ పగలల్లా సరిపోయేది. మూడవరోజు డైరక్టర్లబోర్డు మీటింగుతో వీరి సమావేశాలు ముగిశాయి.

ఈ మూడు రోజులూ సుమతి తనకున్న ఒకటి రెండు పనులూ పారిస్‌లో ముగించుకొంది. హోటల్ లా-లామెట్రీలోని తమ విడిదిలో రాత్రిళ్లు వివిధ విషయాలు ముచ్చటించుకునేవారు.

ఫ్రాన్సు దేశాన్ని సందర్శించాలనే కోరిక సహజంగానే శ్రీమతి లక్ష్మికి చాలా కాలంగా ఉంది. నాగరికతకు ఫ్రెంచి దేశం పెట్టింది పేరనేది ఈమెకు చిన్ననాడే తెలుసు. కాగా ప్రజాస్వామిక భావాలకు ఫ్రాన్సు పుట్టినిల్లనిగూడా విద్యార్థినిగా ఉన్ననాడే ఈమెవిన్నారు. ప్రపంచవ్యాప్తంగా ఎన్నో విప్లవాలకు కారణమైన ఆదిబీజం ఫ్రెంచి విప్లవంలోనే మనకు దొరుకుతుంది. కళా సాహితీ రంగాలలో ఫ్రెంచి

దేశం చిరకాలంగా పేరు పొందింది. ఎంతో ఔన్నత్యాన్ని పొందిందిగూడా.

ఈలాంటి అన్ని కారణాలతో ఫ్రాన్సు సందర్శించే అవకాశం కోసం ఎదురుచూస్తున్న శ్రీమతి లక్ష్మికి ఆ అవకాశం రానే వచ్చింది.

ఈ అంతర్జాతీయ మహిళా సమావేశం చివరిరోజు, ఒక చిన్న సంఘటన జరిగింది. వచ్చే సంవత్సరం వీరి సభలను జర్మనీ దేశంలో జరుపవలసిందిగా అభ్యర్థన వచ్చింది. జర్మను ప్రతినిధులు తమ ఆహ్వానాన్ని వీరి డైరక్టర్ల బోర్డు మీటింగుకు సమర్పించారు. వీరు 'సరే' నందామను కుంటున్నారు. ఇంతలోనే వీరి ఆతిథేయ దేశమైన ఫ్రెంచి ప్రతినిధి ఆ సూచనకు సుతరామూ అంగీకరించలేదు. కాగా తీవ్రంగా వ్యతిరేకించిందిగూడా. ఆమె వ్యతిరేకతకు శ్రీమతి లక్ష్మి ఆశ్చర్యపోయారు. నిర్ణయం తీసుకోవలసిన ముగ్గురు డైరక్టరులలో ఒకరుగా కొంచెం ఇరుకున పడ్డారు శ్రీమతి లక్ష్మి. ఆ సమావేశానికి అధ్యక్షురాలుగాఉన్న పాకిస్థాన్ ప్రతినిధి మిసెస్ అహమద్ వీరి ఇరకాటాన్ని గమనించింది. ఆమే ఇరకాటంలో చిక్కుకొంది. కొంచెం తెలివిగా ఆ నిర్ణయాన్ని వాయిదావేసింది.

ఆ సాయంత్రం ఆ ఫ్రెంచి ప్రతినిధి శ్రీమతి లక్ష్మిని తన యింటికి తేనీటికి ఆహ్వానించిన సందర్భంగా తిరిగి ఇందాకటి ప్రస్తావన వచ్చింది. ఇంతకూ జర్మనీ అంటే ఆమెకు మిక్కుటమైన ద్వేషం ఉంది. ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో తన భర్తనూ, బిడ్డల్ని పోగొట్టుకొంది. అమిత దుఃఖాన్ని పొందింది. నిరాధారఅయ్యింది. ఆర్థికంగా మంచి స్థితిగతులు ఉన్నా ఆమె స్వయంగా న్యాయవాద వృత్తి చేస్తుంది గూడా. అయినా స్వల్పవ్యవధిలో భర్తా బిడ్డల మరణానికి కారణమైన యుద్ధాన్ని, దాని ప్రారంభకులైన జర్మనులను ఆమె ఎంతమాత్రం క్షమించలేదు. కాగా వారంటే ఆమెకు ఎంతో కసి. ఆకారణంగానే వీరి అంతర్జాతీయ సమావేశం తరువాతసంవత్సరం జర్మనీలో పెట్టాలి అనే దానికి అంత ప్రతిఘటన చూపించింది.

ఆమెతో మాట్లాడినంతసేపూ సామాన్య ఫ్రెంచి పౌరులు యుద్ధాలను ఎంతగా ద్వేషిస్తారో అర్థమయింది శ్రీమతి లక్ష్మికి. ఆమెలాగా ఎందరు గృహిణులు, తమ తమ భర్తలను బిడ్డలను మిగిలిన ఆప్తులను పోగొట్టుకున్నారో! తమ తమ ప్రియమైన ఇండ్లు వాకిండ్లు ఎన్నెన్ని యుద్ధ భీభత్సకాండకు బూడిదపాలయ్యాయో! ఆలోచిస్తే ఆమెకు జర్మనులంటే ఉన్న విద్వేషానికి కారణం తేటతెల్లమవుతుంది.

నిన్నటికినిన్న, పాకిస్తాన్ మనమీద దండయాత్ర జేసినప్పుడూ బంగ్లాదేశ్ మీద సైనిక పాశవికతలను ప్రదర్శించినపుడూ మన ప్రజల్లో పాకిస్థాన్ అంటే గల్గిన అభిప్రాయంగూడా ఇదే గదా! వందలాది తూర్పుబెంగాల్ మేధావులను మట్టుబెట్టిన దృశ్యాలనూ, ఢాకాలో విశ్వవిద్యాలయ విద్యార్థినీ హాస్టల్సుపై పశ్చిమ పాకిస్తాను సైనిక బృందాలు స్వైరవిహారం జేసిన తీరూ, జరిపిన మానభంగాల వైనం, ఆ ముష్కరులబారినుండి తప్పించుకొనుటకు యువతులు పై అంతస్థుల కిటికీలలోంచి దూకి ప్రాణాలు పోగొట్టుకున్న కథలు తెలుసుకున్నాక మనకు సయితం పాకీస్థానీయులంటే ద్వేషం కలిగింది కదా!

అలాగే మానవ మారణహోమాలను ప్రారంభించి ప్రోత్సహించిన కిరాతకులంటే స్వచ్ఛంధ మనస్కులైన సామాన్య ప్రజానీకానికి విద్వేషం గలగటం సహజం.

ఆ సోదరి హృదయ బాధను అర్థంజేసుకున్న శ్రీమతి లక్ష్మి ఆ విషయాన్ని తప్పించి, మనస్సును మార్చి ఇతర విషయాలను ప్రసంగంలోనికి తెచ్చి ఆమెకు ఊరట గల్గించారు. అందుకు ఈమె భారతదేశం పేరొందిన "పురాకృత కర్మ విజ్ఞానాన్ని" ఆశ్రయించవలసి వచ్చిందిగూడా!

ఫ్రాన్సు దేశచరిత్ర అంతా యుద్ధకాండలతోనే ఎక్కువగా నిండి ఉంది. అటు జర్మనీతోనో, హాలెండుతోనో, ఇటలీతోనో,

దాదాపు ఎప్పుడూ ఏదోఒక దేశంతో యుద్ధానికి తలపడుతూనేఉంది. అయితే ఫ్రెంచి ప్రజలు యుద్ధోన్మాదులా అంటే, చరిత్ర ఎంత శోధించినా జనాన్ని తప్పుపట్టలేము. ఆ మాటకొస్తే, ఏ దేశంలో గూడా, ఏ జనానిదీ ఎప్పుడూ తప్పుగా తోచదు. జన నాయకులూ, ప్రభుత్వాధినేతలే ఏదిచేసినా! మంచి చేసినా చెడు చేసినా వారే కారకులూ. ప్రథమ ప్రపంచసంగ్రామం, మరి పాతికేండ్లకు ద్వితీయ ప్రపంచయుద్ధం - ఇక దేశం కోలుకునేదెట్లా? ఎప్పుడు?

అందుకేగా మోసు ఫ్రెంచి ప్రజలు చాలావరకు సుఖజీవన ప్రియులు జీవితాన్ని సీరియస్‌గా తీసుకోరు. ఇదే తరహా ఇటలీ ప్రజల్లోగూడా శ్రీమతి లక్ష్మికి కన్పించింది.

అయితే సాంప్రదాయ బద్ధమైన రాజరిక భోగవిలాసాలకు ఫ్రెంచి చరిత్ర ఆటపట్టు. అచ్చోట మహారాజులు, మహారాణులు, నోబుల్సు, బారన్స్, ఎక్కడికక్కడే ఒక గిరి గీసుకొని, జీవితాన్ని అనుభవించటంలో ఒకరికొకరు పోటీపడటమేగాక, వారంతటవారు 'నిన్నటి'తో పోటీపడి "నేడు" సుఖించిన సంఘటనలు ఫ్రెంచి చరిత్ర నిండా మనకు కనిపించకమానవు.

సామాన్య మానవులను అక్కడి రాజులు. రారాజులు యువ రాజులు ఏనాడూ లక్ష్యంజేసినట్టు గన్పట్టదు. ప్రజల సాధకబాధ కాలను విచారించడంగానీ, కష్టాల నివారణకు కృషిచేయడంగాని ఫ్రెంచి రాజరిక ప్రభుత్వాలకు అలవాటులేని పనిగా గూడా మనకు తెలుస్తుంది.

కనకనే చరిత్ర పుటలలో అత్యంత భయంకరంగా అభివర్ణించ బడి నిక్షిప్తంచేయబడ్డ పరాసు విప్లవం ఆ దేశంలో వచ్చింది.

సహజమేగదా రబ్బరు బంతిని నేలకేసి ఎంత గట్టిగా కొడితే అంతవేగంగా అంతపైకి లేస్తుంది. సీసాలో నీరుపోసి బిర్రుగా బిరడా బిగించి క్రింద మంటపెడితే జరిగేదేమిటి? నీరు బాగా వేడెక్కి కుతకుతలాడి ఉక్కిరి బిక్కిరై, ఆవిరై శక్తి పుంజుకొని బిగించిన

బిరడాను ఒక్క తన్నుతన్ని ఆ అకసంలోని ఎగిరి పడేట్టుచేస్తుంది. సీసాను తుత్తునియలు చేస్తుంది. ఢాం అని ప్రేలిపోతుంది.

సరిగ్గా ఫ్రాన్సులో అదే జరిగింది. సామాన్యజనంలో చిర కాలంగా పేరుకుని పాలకులయెడ రగుల్కొన్న విద్వేషాగ్ని మహా విప్లవరూపంలో బయటపడింది. ప్రభుత్వాన్ని తలక్రిందులు జేసింది. దేశాన్ని ఒక ఊపుఊపింది. ప్రపంచాన్నే కదలించి పారవేశింది.

ప్రజల్లో విప్లవమంటూ బయలుదేరాలేగాని, దానిని ఆపటం గానీ, ఒక మార్గంలోనే నడపటంగానీ ఎవరకూ చాతగాదు. రాజులూ మహారాజులూ, రాజబంధువులూ పరిమార్చబడ్డారు. ఎక్కడికక్కడే ప్రజా కోర్టులువెలసి, ప్రజా ద్రోహులంటూ నేరమారోపించారు. కంటకాధికారులను గిలటైన్‌చేశారు.

తర్వాతవచ్చిన వివిధదేశాలలోని విప్లవపోరాటాలకు ఈ ఫ్రెంచి విప్లవంలోనే బీజాలు నాటపడ్డాయి. ప్రపంచ ప్రజల దృక్పథంలో ఒక విశిష్టమైన మార్పురావటానికి ఈ ఫ్రెంచి విప్లవపు ప్రభావం చాలా ఉంది. శ్రీమతి లక్ష్మి ఉద్దేశ్యంలో కారల్ మార్క్సు గూడా ఈ విప్లవ ప్రభావంతోనే మార్క్సిజాన్ని ఊహించాడని, సిద్ధాంతాన్ని రచించాడనీ తలుస్తుంటారు.

*　　　*　　　*

అంబరాన్ని చుంబించాలని అకాంక్షిస్తుందా అని తలపింప జేసే ఈ ఫెల్‌టవర్‌పై ఒక ప్రదక్షిణంచేసి, ఈ ఐరోపీయ పురాతన నగరాన్ని శ్రీమతి లక్ష్మి వీక్షించినప్పుడు ఆశ్చర్యంగలిగింది. పరాసు దేశ చరిత్రలోని పెక్కు సంఘటనలు ఆమె మనోవీధిలో మెదిలాయి.

శ్వేతాశ్వంపై వాయువేగాన్ని మించి ఉరుకులెత్తుతూన్న ఒక వీర పురుషుడు కనిపించాడు.

అసంఖ్యాక సైనిక పారావారానికి ఆజ్ఞలిడుతూ, "పదండి ముందుకు పదండితోసుక ఐరోపా అంతా మనదే! అంతేగాదు

ఆవల భూఖండాలన్నీ ఆక్రమిద్దాం పదం డంటూ." కుడిచేత ఖడ్గాన్ని ముందుకు దూస్తూ, అందరికన్నా ముందు పరువులిడుతూన్న చరిత్ర పురుషుడు శ్రీమతి లక్ష్మి మనోఫలకంపై ప్రత్యక్షమయ్యాడు.

"ఎవరాయన!" అనుకొంది శ్రీమతి లక్ష్మి.

"నెపోలియన్ బోనాపార్టీగదూ!'' అనుకొంది శ్రీమతి లక్ష్మి.

"ఇంత వేగంగా పరువులెత్తి బావుకుండే దేమిటంటా?" అని ప్రశ్నించుకొంది శ్రీమతి లక్ష్మి.

"అనంత సామ్రాజ్య విస్తరణ కాంక్షతో, భూగోళాన్ని కౌగలించు కోవాలని అర్రులుచాచి, గుప్పెటల్లోని అధికారాన్ని పొగొట్టుకోవడం-'' అని సమాధానం చెప్పుకుంది శ్రీమతి లక్ష్మి.

''ఏమిటో! ఈ మానవ మస్తిష్కపు విచిత్రకథ!! అంతా గొడవ గొడవ!!!" అనుకొంది శ్రీమతి లక్ష్మి.

* * *

కళాపరిమళాలు అనునిత్యమూ. గుబాళించే పారిస్ మహా నగరంలో ఏ వైపు ప్రయాణించినా ఎన్నెన్నో మనలను ఆకర్షిస్తాయి. మనలో నిద్రాణమైఉన్న కళాభిరుచులను నిద్రలేపి ఉజ్వలింప జేస్తాయి.

ఆ సాయంత్రం 'షాజ్ ఎలీజ్' రోడ్డు గుండా వీరి కారు ప్రయాణించింది. ఆ రోడ్డులోనే ఫ్రెంచి ప్రభుత్వ ప్రధాన కార్యాలయాలూ, ప్రసిడెంటు భవనం ఉన్నాయి. విశాలంగా పరచుకొని, నునుపులు తేలుతూ, మెరుస్తూన్న ఆ రాజవీధి కిరుప్రక్కలా నిలచి ఉన్న అందమైనచెట్లు ఆ వసంత ఋతువులో విరగబూచి ఉన్నాయి. కమ్మని సువాసనలను వెదజల్లుతున్నాయ్. రోడ్డుకు రెండు వైపులా పేవ్‌మెంటుకు ఆనుకొని బారులుతీరి రోడ్డుపొడవంతా పోషించబడు

తూన్న పలురకాల పూలమొక్కలనిండా పుష్పగుచ్ఛాలు విచ్చుకొని కలకలలాడుతున్నాయ్. ఛాంప్స్ ఇలిసీస్ (Champs Elyseas) దగ్గిర కారు దిగారు లక్ష్మీ సుమతు లిర్వురూ. పేవ్‌మెంటు మీద కెక్కి ఒక్కసారి ఎదురుగా కన్పిస్తూన్న కట్టడంకేసి చూచారు. ఫ్లడ్‌లైట్ల కాంతిలో ఆ ఎవిన్యూచివర, 'Are - De - Triomphe' వెలిగిపోతుంది. ఆ సుందరకట్టడ నిర్మాణానికి మంత్రముగ్ధు రాంద్ర య్యారు. నిదానంగా నడుచుకుంటూ ఆ ఆర్చిని సమీపించారు. దగ్గిరైనకొద్దీ దానిఅందం వందరెట్లు పెరిగింది. ఫ్రెంచి పౌరుల ఉత్తమోత్తమ సౌందర్య పిపాసకు చిరంజీవత్వం సిద్ధింపజేసే విధంగా ఆ కట్టడం తీర్చి దిద్దబడింది. ఇక్కడే అజ్ఞాత యోధుని స్మారక చిహ్నం ఉంది. ఎపుడూ ఎవరో ఒకరు ఈ చిహ్నం ఎదుట పుష్ప గుచ్ఛాలను ఉంచుతూనే ఉంటారు.

ఆ స్మారక చిహ్నం ఎదుట రెండు నిముషాలు వీరిరువురూ నిలిచారు. మౌనంతో ఆ అజ్ఞాతయోధునికి నమస్సులందజేశారు. అసంఖ్యాకంగా కార్లు ఈ ఆర్చిక్రిందనుంచి విరామంలేకుండా ప్రవ హిస్తూ ఉంటాయి.

సరిగ్గా ఎదురుగా ఉన్న రోడ్డు చివరే, "ప్లేస్-డి-లా కాంకోర్డ్" (Place de la concorde.) ఉంది. ఇది మన చౌరాస్తా లాగా నాలుగు రోడ్లకూడలి. ఈ కూడలి విశాలమైన వలయాకా రంలో ఉంది. చుట్టూరా నిలువెత్తు సుందర శిలావిగ్రహాలు అమ ర్చారు. మధ్యగా ఎత్తుగా నిలిచి ఒక రాతి స్తంభం ఉంది. విద్యు ద్దీప కాంతితో ఈ కూడలి మెరిసిపోతూ ఉంటుంది. వలయం మధ్య రంగురగుల పూల మొక్కలు అమర్చబడి చూచేవారి మనస్సులలో స్థానమొనర్చుకొని, ఆ ప్రదేశాన్ని చిరకాలం మరచిపోకుండా జేస్తాయి. ప్రేక్షకులను, తన్మయపరుస్తాయి.

రాత్రి వేళల్లోనే పారిస్ నగర వీధులు రమ్యంగా రంజిల్లు తాయ్. కెఫేలు జనసమ్మర్ధంతోనిండి ఉంటాయి. నైటు క్లబ్బు లకు ఈ మహానగరం ప్రసిద్ధి. వీటిల్లో నృత్యగానాలు ఉంటాయి.

మనం అక్కడగడిపే సమయాన్నిబట్టి క్లబ్బుల్లో టిక్కెట్లు జారీ చేస్తారు. ఒక్కోటికెట్టు ఖరీదు షుమారు మన 100 రూపాయలకు తక్కువగాకుండా సరిపోతుంది. ఆ ఖరీదులోనే డ్రింకులు సర్వు చేస్తారు. అందంగా రంగస్థలాలను అలంకరిస్తారు. అంతకన్నా అందంగా అలంచరించుకున్న స్త్రీలు పలువర్ణ శోభితములైన విద్యుద్దీప కాంతుల్లో, ఆర్కెస్ట్రా ఆలాపనలమధ్య నృత్యం జేస్తారు. పేరెన్నికగన్న అప్సరసలను చూడాలంటే మనదేశంలో, మనం చచ్చి స్వర్గానికేపోవాలి. కాని పారిస్‌లో ఓ వంద రూపాయిలు పెట్టి టిక్కెట్టు కొంటే, మన ఊహాలోకపు అప్సరసలను మించిన అపురూప సౌందర్యవతులు మనకు సాక్షాత్కరిస్తారు.

ఎంతమాత్రం సంకోచం లేకుండానే నగ్న నృత్యాలు ప్రదర్శిస్తారు.

అన్ని దేశాల నుంచి, వచ్చిన, టూరిష్టులు ఈనృత్యాలకు హాజరవుతారు. అసలు పారిస్‌లో టూరిష్టులే ఎక్కువేమోనని గూడా శ్రీమతి లక్ష్మికి అనుమానం వచ్చింది. ఈ కాబెరీ నృత్యాలు ప్రదర్శించే నైటుక్లబ్బులు వివిధ అంతస్థుల వాళ్లకు, విభిన్నరుచులు గల వాళ్లకు అనువుగా ప్రత్యేకలతో ఉంటాయి. నవాబులకు గరీబులకూ గూడా అందుబాటులో ఉంటాయి.

ఈ జిప్షియన్, ఇటాలియన్, ఇంగ్లీషు, చైనా, జపాన్ సాంప్రదాయాలప్రకారం కొన్ని కొన్ని కాబెరీలు నడుపుతారు. ముస్లిం సాంప్రదాయక క్లబ్బుల్లో, పరుపులూ, దిండ్లూ, జాలీసులూ, వగైరా లాంఛనాలతో, ఆ దేశాల కనువైన పరివారపు వేషాలతో అతిధిమర్యాదలతోనే ప్రేక్షకులను ఆదరిస్తారు. అలాగే ఆయాదేశపు అలవాట్లతో ఆయాక్లబ్బులు నిర్వహించబడతాయి.

మరురోజు మధ్యాహ్నం శ్రీమతి లక్ష్మి ప్రపంచ ప్రఖ్యాతిగన్న లౌవ్రె (Lowvre) మ్యూజియం సందర్శించటం జరిగింది.

16వ లూయీ ప్రభువు నివసించిన రాజ ప్రసాదంలో ఈ మ్యూజియం నెలకొల్పబడింది. సుదీర్ఘమైన కారిడార్స్ గుండా విశాలమైన హాల్సులో ఎంతో ప్రతిభతో అమర్చబడిన ఈ కళాఖండాల సందర్శనం ఒక ప్రత్యేకమైన అనుభూతి. మరవురాని అనుభూతిగా మనస్సులో మెదులుతుంటుంది.

శ్రీమతి లక్ష్మికి లాౌవ్రేలో ప్రవేశించినదాది, బయటకు వచ్చేంతవరకు, మిగిలిన జగత్తు స్ఫురణలో లేదు. కాల గమనం అంతకన్నా లేదు. మనస్సు పలురకాల కళాఖండాలపైననే నిమగ్నమయింది. ఆ అపురూప కళాఖండాల సృష్టికర్తలు ఈమె మెదడులో మెదిలారు. వారు మహా తపస్వులుగా ఈమెకు గోచరించారు. లియోనార్డోడావిన్సీ; మైఖలాంజిలో, ఎల్ గ్రాసో, ప్రభృత మహనీయులు చరిత్ర పురుషులు. సృజనాత్మకమైన వాళ్ల సృష్టి సర్వకాలాలలో మానవాత్మలను ఆకట్టుకుంటుంది. ఒక విచిత్ర మహానుభూతిని గలిగిస్తుంది. ఆ మహాకృషికి స్థల కాలఅవధులూ సంకుచిత మానవ, వర్ణ, వర్గభేదాలు ఉండవు. మానవాత్మే వారి చిరంతన కృషిలో ప్రతిఫలిస్తుంది. అవి చిరాయువులు. వారు చిరంజీవులు.

కళల పరమార్ధమేమిటీ అన్న మీమాంస చిరకాలంగా వింటూనే ఉన్నాము. కళలు కళలకోసమా? ప్రజా ప్రయోజనంకోసమా అనే వాదవివాదాలు జరుగుతూనే ఉన్నాయి. ఇరుపక్షాల వారికి వాదించుకోవటానికీ చాలాకాలం శ్రమచేసిన ఫలితంగా సామగ్రి చాలా ప్రోగుచేయబడి ఉందిగూడా.

అయితే ఇన్నిటికీ ప్రయోజనం అనే మాటకు నిర్వచనం ఏమిటి? ఆ నిర్వచించబడే ప్రయోజనం, క్షణికమా, శాశ్వితమా, తత్క్షణ ఫలితాలను ఇచ్చేదిగా ఉండాలా?

ఎదగని, ఎదిగీ ఎదగని, ఎదిగిన మనస్సులకు ఒకే రకమైన ప్రయోజనం సరిపోతుందా అనేదిగూడా ఈ వాదనకారులు నిశితంగా అర్థంచేసుకొని ఉండాలిసింది.

ఏమైనా ఈ మహత్తర కళాఖండాల సృష్టి ఏ వాదానికి ఇంత వరకూ అందలేదు. ఇక ముందుగూడా అందదనేది శ్రీమతి లక్ష్మి దృఢమైన అభిప్రాయం.

'లియోనార్డో-డా-విన్సి విరచితమైన 'మొనాలిసా' చిత్ర లేఖనం ఎప్పటికీ కన్నులకు గట్టినట్లుగా తనకు కన్పిస్తుంటుంది'. అంటారు శ్రీమతి లక్ష్మి ప్రపంచ విఖ్యాత మేధావి లియొనార్డో సున్నిత హస్తాలలో జనన మందిన ఈ మోనాలీసా సుందరి, ఆమెను సందర్శించిన లక్షలాది ప్రజలకు తలో సందేశం ఇస్తూనేఉంది. కొందరకు, ఆమె కన్యగా, మరికొందరకు ముగ్ధగా, ఇంకొందరకు కౌమారిణిగా, వేరొకకొందరకు ఇంకో విధంగా, చూచిన వారికి చూచిన విధంగా గన్పడుతుంది. ఆ పెదాల కొసన తిరిగిన మలుపులో బహిర్గతమయ్యే భావాన్ని అర్థంచేసుకుంటంలోనే ఎందరో ప్రసిద్ధ చిత్రకారులు పోటీ పడ్డారు. విభేదించారు, ఎవరకువారు వారి అభిప్రాయమే సరయినదనుకున్నారు. చిత్రలేఖనంలో మొనాలిసా చిత్తరువుపై అసంఖ్యాకంగా పుస్తకాలు వివిధ భాషల్లో వెలువడ్డాయి. ఇంకా వెలువడుతూనే ఉన్నాయి.

'మొనాలిసా' అసలు చిత్రానికి నకలు కాపీలు తయారుచేసి అవే నిజమైన లియొనార్డో బొమ్మలని లక్షల డాలర్లకు అమ్మిన విషయాలు మనం విన్నాము. ఈనాడు అసలుచిత్రం అమ్మకానికి పెడితే ఎన్నోకోట్ల డాలర్లకు పెరుగుతుందో.

నిండు గడ్డంతో, విశాల ఫాలంతో, చురుకైన చూపులతో మెరిసే లియొనార్డో రూపం లక్ష్మిమనస్సులో మెదిలింది. అతని సృజనాత్మకశక్తికి ఈమె నమస్కరించి ముందుకు నడిచారు.

ఎల్ గ్రేసో విరచితమైన ఎత్తుగా సాగదీయబడిన క్రీస్తు చిత్రం "Le victoire de samothrace" అను పేరిట ప్రసిద్ధిగాంచిన విగ్రహం ఒక్కసారే చూపరుల మనస్సులను ఆకట్టు కొంటుంది. దీనికే 'winged victory' అనే పేరుగూడా ఉంది.

* * *

చిరకాలంనుంచి మానవజాతి మస్తిష్కంలో ప్రేమతత్వానికి ఆరాధ్య చిహ్నంగా విభాసిల్లుతూన్న వీనస్ దేవత (Venus de Milo) విగ్రహాన్ని చూచినప్పుడు తన్నుతానే మరచిపోయారు లక్ష్మి. అంతకుముందు ఎన్నోసార్లు ఈ సౌందర్యదేవత ప్రతిమా చిత్రాలను ఎన్నో చూచారు. చూచిన ప్రతిసారి ఆ చిత్రాలకేసి మరోసారి చూడబుద్ధయ్యేది వీరికి.

యదార్థ చిత్రాన్ని ఆవేళ లావ్రే మ్యూజియంలో చూచినపుడు ఒక్కసారి లక్ష్మి హృదయం పొంగింది. తన్మయత చెందింది.

ఆ హాలులో, కొంచెం దూరంలో ఉండగానే ఆ విగ్రహాన్ని వీనస్‌గా పసికట్టిన ఈమె అక్కడే నిశ్చలంగా నిలబడ్డారు. కొంతసేపు తదేకంగా ఆ విగ్రహంపై తన చూపులు లగ్నమయ్యాయి. నిదానంగా, పాదాలు ముందుకు సాగాయి. ఎటూ మరల్చకుండా తన దృష్టి ఆ ముగ్ధమనోహర సౌందర్యరాణి విగ్రహంపైనే నిలిపి నిశ్శబ్దంగా సమీపించారు. నిముషంపాటు అదే ఏకాగ్రతతో ఆ సుందరి ముందర నిలిచారు. క్రమంగా కదిలారు. ఆమె చుట్టూ ప్రదక్షించారు. మహాశిల్పి తన ఉలి ఆడించినరీతి ఈమెను ఆశ్చర్యపరచింది. కొంచెం మందమనిపించే ఆ మెడ కొంచెం వంపుతిరిగి ముందుకు వంగినట్లు చూపెట్టే వెన్నుపూస, తలకట్టు, ఫాలభాగం, సుదూర భవిష్యత్తులోనికి నిశ్చలంగా దృష్టిని సారిస్తూన్న ఆ అందమైన నయన ద్వయం, నిశ్శబ్దాన్ని సయితం వింటూందేమోనని తలపించే ఆ కర్ణ ద్వయం, ఏ భావాన్నీ ప్రకటించని ఆ పెదాల కలయిక, జగత్సృష్టిలో మనిషి-మనుగడకు తొలిగుటకనింపే సుతి మెత్తంగా, నవనీత సమానమని తోపించేట్టు మలచబడిన ఆ పాలిండ్ల వొంపు సొంపులూ, అన్నింటినీ ఆమె మనస్సు నిదానంగా ఒకదానివెంట ఒకటిగా గాఢంగా ముద్రించుకుంది. మొత్తం స్వరూపాన్ని మెదడు ఆకళింపు జేసుకుంది. ఒక్కక్షణం కన్నులు మూసుకున్నారు శ్రీమతి లక్ష్మి.

ఆ దివ్యమూర్తి ప్రతిరూపం కండ్లు మూసుకున్నా అంత దివ్యంగానే కనపడింది. ఇక వెనక్కుతిరిగారు.

ప్రక్కనేఉన్న సుమతి అంది. "ఏమిటీ అంత దీర్ఘంగా మనస్సు లగ్నమైంది." అని ఆమె గమనిస్తూనే ఉంది ఈ విగ్రహాన్ని సమీపించి నప్పటినుంచి లక్ష్మి మౌనాన్నీ, ఈమె భావోద్వేగాన్నీ. కనకనే ఈమెను ఎంతమాత్రం పలకరించలేదు. ధ్యానంతో సాగుతూన్న ఈమె అన్వేషణకు ఎట్టి అవాంతరాన్నీ గలిగించలేదు సుమతి.

వెనుకకు తిరిగింతర్వాతనే లక్ష్మిని పలకరించింది సుమతి. "అవును. నాకు తెలియదు ఎందుకు మనస్సు అంతలగ్నమైందో!" అన్నారు లక్ష్మి,

"ఇంతకూ ఆ శిల్పి పేరు బయటపడలేదుగదా?" అని సుమతి అన్నది.

నిజమే! ఈ మహాశిల్పాన్ని మలచిన మహాభావుకుడు ఎవరో ఇంతవరకూ తెలియదు. ఎందరో ఎన్నో సంవత్సరాలు పరిశోధించి గూడా ఇదమిద్ధమని నిర్ణయించ లేకపోయారు.

"ఈ శిల్పసృష్టికర్త పేరు అట్లా అజ్ఞాతంగా ఉండటమే మేలు." అన్నారు లక్ష్మి.

"ఎందుకని అంటావ్?" అన్నది సుమతి.

"ఈ అజ్ఞాత శిల్పిని సృష్టించిన అసలు సృష్టికర్తకే మనం ధన్యవాదాలు చెప్పుకోవచ్చుగా," అన్నారు శ్రీమతి లక్ష్మి.

ఎంతటి భావావేశం!

సుమతి ఒక్కసారి ఎందుకో ఈమె కండ్లలోకి చూచింది. ఆమెకేమి అనిపించిందో ఆ హాలుదాటిందాకా ఏదో ఆలోచిస్తూనే ఉంది.

* * *

కళాయుతంగానేగాక మతపరంగాకూడా పేరు గాంచిన నోటర్‌డామ్ కెతేడ్రల్ చూచినపుడు, విక్టర్ హ్యూగో విరచితమైన 'హంచ్ బేక్ ఆఫ్ నోటర్‌డామ్' నవల జ్ఞాపకం వచ్చింది. శ్రీమతి లక్ష్మికి గూనివాడూ, జిప్సీ అమ్మాయి జ్ఞాపకం వచ్చారు.

గోథిక్ కళను నిర్దుష్టంగా అనుసరించి నిర్మించిన చర్చిలలో ఇది ప్రపంచప్రసిద్ధి వహించింది. 12వ శతాబ్దంలో నిర్మించిన ఈ క్రైస్తవ దేవాలయపు అద్భుత నిర్మాణం, ఆ స్థంభాల పైని శిల్పకళా నైపుణ్యంచూచి శ్రీమతి లక్ష్మి అబ్బురపడింది.

పారిస్ నగరంగుండా ప్రవహించే సీన్ నదిపైని కట్టిన నోటర్ డామ్ వంతెననుదాటి ఈ కెతీడ్రెల్‌కు వెళ్లాలి. ఆనది మధ్యలో ఒక చిన్ని ద్వీపం ఉంటే, ఆ ద్వీపంపై ఈ దేవాలయం నిర్మించారు.

* * *

ప్యారిస్‌లో చాలా వీధుల్లో ఆర్ట్ విక్రయశాల లున్నాయి. ఐరోపా ఖండంలోని పలుదేశాలనుంచి ఔత్సాహిక కళాకారులెందరో ఇక్కడకు వచ్చి తమ అభిమాన కళలను అభ్యసిస్తారు. పూర్వ కళాకారుల రచనా వైదగ్ధ్యాన్ని ధ్యానించుకుంటూ కళలకు కొత్త రూపులు సంతరించు కుంటుంటారు. అలాంటి వారిని ప్రోత్సహించేందుకు కొన్ని విక్రయ శాలలున్నాయి.

అలాగే పుస్తకాల దుకాణాలకూ లెక్కలేదు. పారిస్ నగరం ప్రపంచంలో సాహిత్య, కళా, రంగాలలో అనధికార అత్యుత్తమ విశ్వవిద్యాలయం అనటంలో ఎంతమాత్రం అనౌచిత్యంలేదు.

* * *

పారిస్‌ను మూడు రోజులు ఎంత చుట్టపెట్టినా, సహజంగా శ్రీమతి లక్ష్మికి గ్రామసీమలపై ఉండే మక్కువ తీరలేదు. పల్లెలను ప్రదక్షిస్తేనే ఆ దేశం పూర్తిగా అర్థమౌతుందని శ్రీమతి లక్ష్మి అభిప్రాయం.

సరే ఒకపూట పారిస్ నగరాన్ని వదలి హైరోడ్డు పట్టుకొని పల్లెసీమల వెంటపడ్డారు శ్రీమతి లక్ష్మి.

ఫ్రాన్సులో ఎక్కడో ఒకచోటతప్ప మనలాగా గ్రామాలకు గ్రామాలు కనిపించవు. రోడ్డు ప్రక్కనే విశాలమైన వ్యవసాయ క్షేత్రాలుంటాయి. వాటి మధ్యలోనే రైతుల ఇండ్లుంటాయి. అక్కడే పనిపాటల్లో సహాయపడే వ్యవసాయ కార్మికులకూ వసతి ఇండ్లు ఉంటాయి. అసలు అక్కడి వ్యవసాయమంతా పారిశ్రామికీ కరణ క్రిందికే వస్తుంది. ఒక్కో రైతుకు వెయ్యి ఎకరాల వరకు భూకమతం ఉంటుంది. కనీసం రెండు మూడు వందల ఎకరాలకు తక్కువ కమతాలు వీరికి కన్పించలేదు. అంతకు తక్కువైతే అక్కడ వ్యవసాయం గిట్టుబాటుకాదు. ప్రతిపనీ యాంత్రికంగానే జరుగు తుంది. దున్నటం, నాటటం, కలుపులు, కోయటం, నూర్చటం లాంటి పనులన్ని యంత్రాలే చేస్తాయి.

వ్యవసాయకూలీలు చాలా తక్కువ. అందుకనే భూకామం దులు స్వయంగానే ఈ భారీ యంత్రాల సహాయంతో ఎక్కువభాగం తమపనులు తాము చేసుకుంటుంటారు. రైతాంగ స్త్రీలు గూడా పురుషులతోపాటు పొలంపనులలో శ్రద్ధతీసుకుంటారు. శ్రమిస్తారు. చదువుకునే బిడ్డలు గూడా విరామసమయంలో పొలంలో తల్లిదండ్రు లకు సహకారాన్ని అందిస్తారు. వ్యవసాయిక కుటుంబీకుల్లో తమ కుటుంబసభ్యులందరూ కమతంలో కృషిచేయటం వారి విద్యుక్త కర్తవ్యంగా భావిస్తారు.

ఎక్కడో ఒక చోట చెదరివేసినట్లుగ్రామాలు కన్పిస్తాయి. వంద ఇండ్లకన్నా సంఖ్యలో మించవు ఈ ఊళ్లు. అయినా చక్కని రోడ్డు, విద్యుచ్ఛక్తి, రక్షిత మంచినీటిపథకం, పసిబిడ్డలకు స్కూలు, గ్రామ సామూహిక కార్యాలయం, వైద్యాలయం, స్టోర్సు, పోష్టు ఆఫీసు, టెలిఫోను టెలిగ్రాఫ్, కార్యాలయాలు, బ్యాంకు తప్పక ఉంటాయి. ప్రతి ఆదివారం ఆటవిడుపు. అందరూ పూర్తి విశ్రాంతి

తీసుకుంటారు అనాడు. సాయంత్రానికి దగ్గిర బస్తీలకు పోయే ఏ కొద్ది మందో తప్ప, ఎక్కువమంది ఆగ్రామంలో ఉండే గ్రామ సామూహిక హాలుకువస్తారు. అక్కడే నృత్యాలు చేస్తారు. కబుర్లాడుకుంటారు. ఆడుకుంటారు. పాడుకుంటారు. ఆనందంగా కాలక్షేపం చేస్తారు.

ఫ్రెంచి దేశంలో గ్రామాలన్నీ సహకారసంఘాలకు అనుబంధంగానే ఉన్నాయి. కావలసిన ప్రతివస్తువూ గ్రామష్టోర్సులోనే లభ్యమౌతుంది.

చివరకు రైతులకు భారీగా గావలసిన, విత్తనాలూ, ఎరువులు క్రిమిసంహారక మందులన్ను గూడా, ఈసహకారసంస్థలే సీజనుప్రారంభానికిముందే సేకరించి నిల్వ జేస్తాయి.

ఈ దేశంలో రైతులకున్న సౌకర్యాలుచూస్తే శ్రీమతిలక్ష్మికి నిజంగానే నోరూరింది. అందుకనే ఒక్కపూటలోనే ముగించుకోవాలను ఈ గ్రామీణ పర్యటనా కార్యక్రమాన్ని మరోపూటకు పొడిగించుకున్నారు. కావాలని ముందుగా చెప్పాపెట్టకుండా ఆకలయ్యే వేళకు ఒక రైతు భవంతికి వీరి కారు మలిపారు.

వీరి కారు ఆవ్యవసాయ క్షేత్రంలో మధ్యగా ఉన్న ఆ భూకామందు ఇంటిముందు ఆగంగానే, పై అంతస్థులో నుంచి వీరి ఆగమనాన్ని గుర్తించి, ఆదరాబాదరా ఆ గృహిణిబయటకువచ్చింది. సుమతికి కొంచెం కొంచెం ఫ్రెంచిభాషవచ్చు. తామెవరో చెప్పింది. లక్ష్మిని గూర్చి పరిచయం చేసింది. ఆపరిచయంలో దక్షిణ హిందూ దేశపురైతుకుటుంబంనుంచి ఫ్రెంచిదేశ రైతుల పరిస్థితితులను తెలుకునేందుకు వచ్చారని తెలిపింది.

భారతదేశంనుంచి వచ్చామనీ, అందునా ఈమె రైతుకుటుంబానికి చెందాననీ తెలియగానే ఆ రైతు ఇల్లాలి మొగంలో ఒక్కసారి చిరునవ్వు చిందులాడింది. ఆప్యాయంగా లోనికి ఆహ్వానించింది. మేడ మీదికి తీసుకొనిపోయి కూర్చోబెట్టింది. ఎదురుగదిలో

ఉన్నతనకూతుళ్ళు నిద్దరనూ పరిచయం చేసింది ఒకమ్మాయికి పన్నెండేండ్లు, రెండో పిల్లకు ఎనిమిదేండ్లు ఉంటాయి. ఆరోగ్యంతో పిల్లలు మెరుస్తున్నారు.

ఇంతలో ట్రాక్టరు మోత క్రింద వినిపించింది. కొద్దినిముషాల్లోనే యజమాని పైకి వచ్చాడు. ఆ గృహిణి గదిలోంచి బయటకు పోయి మమ్మలను గురించి చెప్పింది గా మోసు భార్యాభర్తలిద్దరూ లక్ష్మి, సుమతి కూచున్న గదిలోకి వచ్చారు. పరిచయాలయిన తర్వాత ఆ రైతు ఎంతో హృదయపూర్వకంగా వీరి రాకకు తనూ, తన భార్యసంతోషిస్తున్నామని తెలిపాడు. ఆయనకు ఆంగ్లేయ భాషవచ్చు. అనర్గళంగా మాట్లాడాడు.

భోజనాల సమయం వాళ్ళకు చాలా ముఖ్యమైనది. అతినిదానంగా భోజనం చేస్తారు. అనేకవిషయాలు ఆసమయంలో ముచ్చటించుకోటం వాళ్ళకు పరిపాటి. ఆరోజు వీరి భోజనాల దగ్గిర మన ఇండియా వ్యవసాయ పరిస్థితులను గురించి చాలా విషయాలు లక్ష్మిని అడిగి తెలుసుకున్నారు.

శ్రీమతి లక్ష్మి అడిగిన వాటన్నింటినీ ఎంతో ఓపికగా వివరించాడు.

అక్కడ పొలాలన్నీ సర్వేచేయబడి కొన్నిభాగాలుగా విభజింపబడుతాయి. ప్రతిభూమీ రసాయనికంగా పరిశోధించబడి ఏ భూమిలో ఏ పంటలు వేయటానికి అనుకువుగా ఉంటుందో ప్రభుత్వ వ్యవసాయశాఖ ముందుగానే నిర్దేశిస్తుందట. అంతేగాక ప్రతిసంవత్సరం, ఏరువాకసాగేముందు గానే, ప్రభుత్వఉద్యోగులు రైతుల భూముల మట్టిశాంపిలుసితీసుకొని వాటిని పరిశోధించి, రైతులు ఏ పంటలు వేయబోతున్నారో ముందుగా అడిగి తెలుసుకొని, ఏ భూమిలో, ఏ పంటకు ఎంత నత్రజని వేయవలసింది, ఎంత భాస్వరపు ఎరువులు వేయవలసింది, పొటాష్ ఎంత మోతాదుగావలసింది ఒక స్లిప్పుమీద రాసిపెట్టిపోతారట. ఇంత పనీ ప్రతిసీజనుకూ జరుగుతుం

దట. భూసార పరిరక్షణ బాధ్యతకు ప్రభుత్వం ఎంతశ్రద్ధ వహిస్తుందో ఆ రైతునోట విని ముగ్ధురాలయ్యారు శ్రీమతిలక్ష్మి.

అలాగే ఎరువులు, సస్యరక్షణమందులూ గూడా, ఏ ఏ పైరుకు ఏ రకం ఎంతెంత గావాలో ఆ స్లిప్పులను బట్టి గుణించుకొని ఆయారైతులకు సీజనుకుముందుగానే అందజేస్తుంది ప్రభుత్వం. నీటి పారుదల విషయంలోనూ ఇతర రైతుల అవసరాలకు ఆదుకునే విషయంలోనూ ప్రభుత్వం గ్రామసీమలకు అగ్ర ప్రాముఖ్యం ఇస్తుంది.

పంటలు అమ్ముకోనడంలోనూ, గిట్టుబాటు ధరలను స్థిరీకరించడంలోనూ గూడా రైతుల వాణిని ప్రభుత్వం గౌరవిస్తుంది.

ప్రతి రైతుకూ, కోళ్లఫారం, ఆవుల ఫారం ఉంటుంది. పందులూ, కోడె దూడలను గూడా పెంచుతారు. మాంసాహారానికి పనికివచ్చే దూడలను బలిష్టంగా పెంచి పట్టణాలకు ఎగుమతిచేస్తారు. వాళ్ల పశువులు చాలా పుష్టిగా ఉంటాయి. మిశ్రమజాతి ఆవులు, జెర్సీఆవులు, సగటున 30 లీటర్ల పాలను పితుకుతాయి. గృహయజమానురాలు కోళ్లఫారం, డైరీలపై ఎక్కువ కాలాన్ని వినియోగిస్తుంది. వాళ్ల ఫారాలలో ఉత్పత్తిఅయ్యేపాలు, గ్రుడ్లు వారి యింటికే వచ్చి పాలవానులు తీసుకపోతాయి. అలాగే వీరికి కావలసిన పశువుల ఆహారంగూడా ఇంటికి తెచ్చియిచ్చిపోతారు.

అవసరమనుకున్నపుడు వ్యవసాయ పెట్టుబడులకు కోఆపరేటివ్స్ పై ఇచ్చటి రైతులు ఆధారపడతారు. వారి సరకులు నిల్వ ఉంచటానికి వ్యవసాయ శాఖవారి గోదాములు రైతులకు సులభంగా అందుబాటైన విధంగా నిర్మించబడి ఉన్నాయి.

హృదయపూర్వకంగా ఆతిధ్యమిచ్చినందుకు శ్రీమతి లక్ష్మి కృతజ్ఞతలు చెప్పినపుడు ఆభార్యాభర్తలు ఎంతో తబ్బిబ్బయ్యారు. "ఏ దేశంలోనైనాసరే కష్టించి పనిచేయటము ప్రపంచానికి ఆహారం అందించటమనే ఉత్తమకర్తవ్య నిర్వహణలో రైతులు మునిగి

ఉంటారు. మీ దేశ రైతు ప్రజలకు ధన్యవాదాలు అందజేయండి" అని రెండుచేతులుఎత్తి నమస్కరించాడు ఆ గృహస్థుడు.

ఆ మాటలు అనేటప్పుడు ఆయన ముఖంలో సంతృప్తి వెల్లి విరిసింది.

'నిజంగానే అన్నిదేశాలలోని రైతులు అనాదికాలంగా చేస్తూన్న ఉత్తమోత్తమమైన కృషే గదా ఇది' అని అనిపించింది శ్రీమతి లక్ష్మికి.

చీకటిపడే సమయానికి తిరిగి హోటలుకు చేరుకున్నారు. పగలల్లా తిరటగంతోనూ, వైనుయార్డులవద్ద ఆగి ద్రాక్షతోటలు చూడటంలోనూ, షాంపైను పరిశ్రమగూర్చి వివరాలను తెలుసు కుంటంతోనూ దైహికంగా గూడాశ్రమ గలిగింది.

తెల్లవారి లండన్‌కు ప్రయాణ మవ్వాలనుకున్నారు. ఆ రాత్రి ఆదమరచి నిద్రపోయారు.

శ్రీమతిలక్ష్మి నిద్రలేచి కాల్యకృత్యాలు ముగించుకొని ప్రయాణానికి సన్నాహ మౌతుండగా, హోటలు రిసెప్షను దాకా పోయి తిరిగివచ్చిన శ్రీమతి సుమతి చిన్నగా అసలువార్తను చెప్పింది.

అదేమిటంటే పారిస్ అంతటా విద్యార్థులు ఆందోళనచేస్తు న్నారని. ఏదో ఒక వర్గం ఎప్పుడూచేసే ఆందోళనలకు మన దేశంలో అలవాటుపడ్డ శ్రీమతి లక్ష్మి ఆ వార్తను అంతగాఖాతరు చేయ లేదు. నిజంగానే మన దేశంలో కొంతకాలంగా జరుగుతూన్నన్ని ఆందోళనలు మరి ఏ దేశంలోను జరిగినట్లుగానీ, జరుగుతున్నట్లు గానీ స్ఫురించదు. ఈ ఆందోళనలు న్యాయవిహితమైనవా, న్యాయ రహితమైనవా అన్నదికాదు ఇక్కడిప్రశ్న. మన దేశజీవిత విధానం లోనే ఈ ఆందోళనలు ఒక భాగంగా రూపొందుతున్నాయా అనేది

ఈమెకు పదేపదే తోస్తుండేది మన దేశపు అత్యాయిక పరిస్థితికి ముందు.

ఇంతలో రేడియోలో మూడవ వార్తా ప్రసారంలో గూడా పారిస్ నగరంలో చెలరేగిన అలజడులను గురించి ప్రస్తావించారు. విశ్వవిద్యాలయ విద్యార్థుల్లో ప్రారంభమైన ఈ అలజడి నగరమంతా ప్రాకినట్లు వార్తలు చెప్పాయి. పట్టణంలో రాకపోకలు స్తంభించినట్లూ వార్తలువచ్చాయి. విద్యార్థులకుతోడు యువజనమంతా ఈ ఆందోళనలో పాల్గొంటున్నట్లు గూడా తెలిసింది.

"మరి మన ప్రయాణంఎట్లా ?" అన్నది సుమతి.

"అసలు పరిస్థితిఏమిటో తెలుసుకుందాము పదా !" అంటూ బయలు దేరారు శ్రీమతిలక్ష్మి.

"ఒక వైపునపట్టణంలో ఆందోళన ముమ్మరంగా జరుగుతూంటే బజారులలోకెళ్తానంటావేమిటి రైతుయువతీ?"అన్నది సుమతి నవ్వుతూ. నిన్నటి ఆ రైతుకుటుంబంతో లక్ష్మి పెంచుకున్న ఆప్యాయత సుమతికి జ్ఞాపకం వచ్చినట్లుంది. "రైతుయువతులకు భయం ఉండదులే పద!" అన్నారు శ్రీమతి లక్ష్మి.

ఇద్దరూ బయటికొచ్చారు. బజారున నడుస్తున్నారు. నిజంగానే రాకపోకలులేవు. రైళ్లు ఆగిపోయాయి టాక్సీలులేవు. బస్సులు కదలటంలేదు. ఇతర ప్రయాణ సౌకర్యాలూ మృగ్యం. విద్యార్థులూ యువజనులు ఒక్కుమ్మడిగా ప్రభుత్వానికి వ్యతిరేకత చూపిస్తున్నారు.

ప్రసిడెంటు డీగాల్‌కు ఈ యువతరం అంతా ఎదురు తిరిగింది. ఫ్రాన్సుదేశాన్ని అభివృద్ధి పథంలో నడపటంలేదనేది వీరి ప్రధాన ఆరోపణ. డీగాలు దిగిపోవాలి అనేది వీరి నినాదం. రాచబాట ప్రక్కన పేవ్‌మెంటుపై విద్యావంతులైన ఇద్దరు ముగ్గురు యువకులతో సంభాషించారు లక్ష్మి. వాళ్లు వెలిబుచ్చిన అభిప్రాయం ఇదే. "నిరుద్యోగ సమస్య ఎక్కువగాఉంది. దేశంలో పారిశ్రామికాభివృద్ధి మరీ మందకొడిగాఉంది. విద్యాలయాలనుంచి ప్రతిసంవత్సరం బయటి

కొచ్చే వేలాది యువజనులకు వృత్తి దొరకటంలేదు. డీగాలు గత వైభవాలను తలచుకుంటూ ప్రసిడెంటు ప్రాసాదంలోనూ, కౌంటీ కౌన్సిల్‌లోనూ కులుకుతున్నాడేతప్ప సామాన్య ప్రజల జీవన సరళిని వర్తమాన జన గతిని గుర్తించటంలేదు. కనకనే అతను దిగిపోవాలని మేము కోరుతున్నాము. పోరాడుతున్నాము. డీగాల్ దిగిందాకా విశ్రమించము" అని అన్నారు ఆ యువకులు.

మా చీరలను చూచి, ఇండియన్సని మమ్ములను గుర్తించి, పరాయిదేశస్థులకు వారిపోరాటకారణాలు అర్ధంగావడం అవసరమని తలచే కాబోలు ఆయువకులిద్దరూ ఆవేశంతో శ్రీమతి లక్ష్మికి తెలిపారు వారిపోరాట వివరాలను.

"మీరు చెప్పింది నిజమే" నన్నారు లక్ష్మి. మీకు నా సాను భూతి" అని గూడా అన్నారు.

"Thanks" అంటూ వారు ఉద్యమంలోకి వెళ్ళిపోయారు.

"ఇంతలో ఇదిచల్లారేట్టులేదే!" అందిసుమతి.

"చూస్తుంటే అట్లాగేఉంది." అన్నారు లక్ష్మి. ఎలక్ట్రికల్ పోల్స్, టెలిగ్రాఫ్ స్తంభాలు పడవేసి ఎక్కడనుంచో ఆయిల్ డ్రమ్ములు దొర్లించుకొచ్చి, రోడ్లకు అడ్డంగా బారికేడ్లు నిర్మిస్తున్నారు. పోలీసుశకటాలు తిరగటానికి వీలులేకుండా అవరోధాలు కల్పిస్తున్నారు.

తిరిగిహోటలుకువచ్చి, లాంజిలో కూర్చున్నారు. ఒకరిద్దరు ఫ్రెంచిదేశస్థులు అక్కడే వీరి ప్రక్కకూచొని ఉన్నారు.

లక్ష్మివారిని అడిగారు, "ఆ ఉద్యమస్వభావం ఏమిటి. డీగాలును ఎందుకు ప్రజలు వ్యతిరేకిస్తున్నారు?" అని. ఆపెద్దమనిషి నిదానంగా ఈమె కేసి తేరిపారజూచి, ప్రసిడెంటు డీగాల్‌ను ఫ్రెంచి ప్రజలంతా వ్యతిరేకించడంలేదే ?" అన్నాడు.

—"మరి ఈవాళ నగరంలో జరుపుతూన్నదెవరు ?" అనడిగారు శ్రీమతి లక్ష్మి.

"వాళ్లు స్టూడెంట్సు, యూత్", అన్నారాయన.

"మరి మీరేమంటారు ?'' అన్నారు లక్ష్మి కుతూహలంగా.

"చూడు మాడం- నేను ఏమన్నా, నన్నూ నాలాంటి వయస్సు మళ్ళినవారి మాటనూ ఖాతరు జేసే వాళ్లెవరూ లేరు. మాతరం మాత్రం జనరల్ డీగాల్‌కు ఎంతమాత్రం వ్యతిరేకత ప్రోత్సహించదు. అతను గొప్పసేనాని. రెండవ ప్రపంచ యుద్ధంలో మా దేశాన్ని మాకు ప్రసాదించింది జనరల్ డీగాలే. ఈ కుర్రకుంకలకేమి తెల్సుఉండేలు దెబ్బ.'' అన్నారు. ఆ మాటల్లో, ఆయన పెదాల విరుపులో ఓ రక మైన నిర్వేదం నిండి ఉంది. నిబిడమై ఉంది.

కొంచెం ఆగి, ఎదురుగాఉన్న గ్లాసునిండా, సీసాలోంచి ద్రాక్ష సారాయం వొంచుకొని గడగడా రెండు గుక్కలు త్రాగాడు. కోటు జేబులోంచి చేతిగుడ్డలాగి మూతి తుడుచుకున్నాడు. మీసాలు తుడుచుకున్నాడు. వెనక్కు బాగా వంకతిరిగిన మీసాలు చెదరినా యేమోనని ఒకసారి రెండుచేతులతో వాటిని సరిజేసి వంకలు త్రిప్పాడు.

మళ్లీ మొదలు పెట్టాడు.

"చూడండి మాడం! ఏమిచెప్పాను నేను. డీగాల్ చాలా గొప్పవాడనికదూ! నిజంగానే చాలా గొప్పవాడు. నాకేగాదు ప్రపంచయుద్ధం జ్ఞాపకంఉన్న ప్రతిఫ్రెంచి దేశీయుని దృష్టిలో ఆయన గొప్పవాడే. సందేహంలేదు." అని కొంచెం ఆగాడు. కోటు రెండో జేబులోంచి, బంగారు వన్నెతోఉన్న పెద్దకేసు ఒకటి తెరచి, ఒక చేరూట్ బయటకు తీశాడు. జాగ్రత్తగా దానిని క్లిప్పర్‌తో కత్తిరించాడు; టేబల్ మీదఉన్న లైటర్‌తో వెలిగించి, చుట్టముట్టించాడు. నోటినిండా పొగపీల్చి చెప్పడం మొదలెట్టాడు.

"చూడండి మాడం! ఆ రోజుల్లో మా డీగాల్ గాబట్టి ఆ జర్మన్‌లను ఎదుర్కొన్నాడు. అవిరామంగా శత్రువిమానాలు కురిపిస్తూన్న బాంబుల దాడులనుంచి సాధ్యమైనంతవరకు మా ప్రజలను

రక్షిస్తూనే, మా దేశంలోనే, మాకు శత్రువుగా తయారైన ప్రధాని పెటాన్ దేశద్రోహశక్తుల బారినుంచి తప్పుకుంటూ, "రెసిస్టెంట్ మువ్మెంటు" అంటూ ఒకదానిని స్థాపించి, దానికి ప్రజల్లో మద్దతు సంపాదించి పోరాడింది ఈ డీగాలేగాదూ ?

ప్రజానీకంలో పిరికిదనం ప్రాకకండా, డీమోరలైజేషన్ లేకండా నిలిపింది డీగాలేకదూ ?

అమెరికాచేత సెకండ్ ఫ్రంట్‌కు ఒప్పించిందాంట్లో డీగాలుది ఎంతపాత్రఉంది! చర్చిలుకు ఎంత ఊతం ఇచ్చాడనీ! అసలు సెకండు ఫ్రంటు ప్రారంభమైంది ఫ్రాన్సులోనేగదా ! దానికి నాయకత్వం వహించింది డీగాలేకదా ! మరి ఆ డిగాల్‌ని దిగిపొమ్మంటం ఏమి న్యాయం మాడం ! అందుకే మాకు ఈ ఉద్యమం అంటే ఎంత మాత్రం సానుభూతిలేదు." అన్నాడు ఆ పెద్దమనిషి.

కనక ఈ ఉద్యమవ్యాప్తిలో తరాల తారతమ్యం లక్ష్మికి దృగ్గోచరమైంది.

"నిన్ను కన్నదీ, పెంచిందీ, పోషించిందీ, ఇంతవాణ్ణి జేసిందీ నేనేగదరా. ఇవాళనన్ను ఎదిరించి నాకు ఇంటి పెత్తనం ఉండగూడదంటావా ?'' అని ఎదురుతిరిగిన కొడుకును వాళ్ల ఊరిలో రామయ్యతాత అనడం జ్ఞాపకం వచ్చింది. శ్రీమతి లక్ష్మికి.

"నీవు నన్ను కనలేదనీ, పెంచలేదనీ, ఇంతవాణ్ణి చేయలేదనీ నేను అనలేదుగా! ఇవ్వాళ నీ పెత్తనంక్రింద ఇల్లుగుల్ల అవుతుందని అంటున్నాను. క్రొత్తరకంగా వ్యవసాయం చేయటం నీకు తెలియదంటున్నాను. బస్తీలోకెళ్లి మార్కెటురేట్లు తెలుసుకొని ఒక రూపాయి ఎక్కువకు పంటలు అమ్మడం నీకు తెలియదని అంటున్నాను. డబ్బు సంపాదించడంగానీ కుటుంబాన్ని సుఖపెట్టటం గానీ, నీకు తెలియదంటున్నాను. అందుకే పెత్తనం నుంచి తప్పుకొని విశ్రాంతి తీసుకోరాదా ? అంటున్నాను.'' అన్నరామయ్యతాత కొడుకు శివరామయ్య జ్ఞాపకం వచ్చాడు. వాళ్ల ఊరిలోని

తగాదా ఒక ఇంటికి సంబంధించింది. పారిస్‌లోని సంఘర్షణ ఒక దేశానికి సంబంధించింది.

*　　　　*　　　　*

ఆరోజుల్లా విమానాలులేవు. రెండో రోజు చాలా ఎక్కువ బాడుగఇచ్చి మారుమూల సందులుగొందులు తిరిగి టాక్సీలో విమానాశ్రయానికివెళ్లారు. విమానాలు ఎపుడుంటాయో చెప్పలేమన్నారు అధికారులు. ఒకవేళ ఏదైనా బయలుదేరినా, ముందు బుకింగ్ చేసుకున్న లిస్టు చాలా పెద్దదిగా ఉందనీ, మరో రెండు రోజులవరకు ప్రయాణ హామీ ఇవ్వలేమని తెలిపారు.

"సుమతీ! ఏమిచేద్దామంటావ్?" అన్నారు లక్ష్మి.

"ఏమిచేద్దామో మీరే చెప్పండి లక్ష్మి" అన్నది సుమతి.

"ఏమీ చేయవద్దు! ఆ ఎదురుగా ఉన్న సోఫాల్లో కూర్చుందాము పద" అన్నారు లక్ష్మి,

"ఇది నిర్లిప్తయోగమా లక్ష్మి!" అన్నది సుమతి.

"ఏది జరగాలినుంటే అదేజరుగుతుంది లేరా!" అన్నారు లక్ష్మి.

"దానినేగా నిర్లిప్తయోగమనేది!" అన్నది సుమతి.

ఇద్దరూ నవ్వుకున్నారు.

శ్రీమతి సుమతి లక్ష్మికి మంచి స్నేహితురాలు. ఉత్తమ వ్యక్తి. బహు ఉదారురాలు. బాగా చదువుకున్నది. డిగ్రీలేకాదు. జీః తాన్నిగూడా మనుష్యులను గూడా చదవగలదు. వీరిద్దరూ ఒక చోట ఉంటే మనుష్యులూ, మనుష్యుల మనస్సులూ, మనస్సుల లోతులూ చాలా చాలా, గిర్రున తిరుగుతుంటాయి వీరి సంభాషణల్లో.

ఇంతకూ తిరిగి హోటలుకు పోవాలన్నా టాక్సీలు దొరకవే! సామానంతటితో వచ్చేశారే!!

అందుకే ఆ నిర్లిప్తతాయోగం!!

ఇంతలోనే ఒక నవయువదంపతులు జంట వేగంగా వచ్చారు. కౌంటర్ దగ్గరకు పోయారు. మాట్లాడారు. లండన్ అనే మాటలు లక్ష్మికి వినపడ్డాయి. రిసెప్షనిష్టు వీరికి చెప్పిన సమాధానమేవాళ్ళకూ చెప్పింది. అందుకు నిదర్శనంగా వీరివైపు వ్రేలు చూపించి, 'మీరే గాదు వారుగూడా లండన్ ప్రయాణీకుల జాబితాలో చివరనున్న వారు' అని అన్నది. ఆ యువకుడు విసుక్కున్నాడు. బైముచూచు కున్నాడు. కొంచెంసేపు గుణించుకున్నాడు. భార్యతో ఏదో సంప్ర దించుకున్నాడు. తిరుగుముఖం పట్టాడు. పోతూపోతూ వీరిద్దరనూ చూచాడు. సమీపించి 'Bon Jour'అన్నాడు.

మేమూ "Bonjour Monsieur" అని ప్రత్యుత్తరమిచ్చారు అంటే గుడ్ మార్నింగ్ అని ఆయనంటే, "గుడ్ మార్నింగ్ మిష్టర్" అని వీరన్నట్లు.

"మీరూ లండన్ వెళ్ళాలనుకుంటున్నారట గదా" అన్నాడు. "అవును. విమానాలు లేక ఆగిపోయాము—" అన్నది సుమతి.

"అవును. ఎప్పుడు ఉండేది గూడా చెప్పలేమంటున్నారు. ముందు బుకింగ్ చేసుకున్నవాళ్ల లిస్టు చాలా పొడవుగా గూడా ఉంది." అని కొంచెం ఆగి, "మీకు అభ్యంతరం లేకపోతే నేను నా భార్యను మా ఇంటివద్ద దింపివస్తాను. కారులో బ్రెజిల్ మీదుగా వెళ్దాము. మీకు యిష్టమేనా అన్నాడు.'' ఆ యువకుడు.

"చాలా సంతోషం— మెనీ మెనీ థాంక్సు''— అన్నారు లక్ష్మి. వెంటనే ఆ దంపతు లిరువురు వెళ్ళిపోయారు.

అనడమైతే అన్నారేగానీ, తీరా అతను అంగీకరించి, కారు తీసుకొని విమానాశ్రయానికి వచ్చి మమ్ములను బ్రెజిలు మార్గం గుండా లండన్ జేరుస్తానని అనడంతో, లక్ష్మికి ఏదో భయం పట్టు కున్నట్లయింది.

అతనా పరాయి కుర్రవాడు. వీరా విదేశీయులు. అందులా ఆడవారు. ఇదేమన్నా పన్నాగంకాదు గదా అనిపించింది. సుమతి గూడా ఇదే అభిప్రాయానికి వచ్చినట్లుంది. ఈమె మనస్సులో అను మానమే ఆమె బయటపెట్టింది.

"మరి ఏమి చేద్దాము? ఎన్నిరోజులని ఈ ఆర్లే విమానాశ్ర యంలో గడుపుతాము! సరేపద ఏమవుతుందో చూద్దాము." అన్నారు లక్ష్మి.

ఇంతలో ఆ యువకుడు కారులోరానే వచ్చాడు. పాపం వీరి సామానులు కారులో పెట్టడంలో సహాయంచేశాడు. వెనుకసీటులో వీరు కూర్చున్నారు. కారు బయలుదేరింది. చాలా స్పీడుగా పరు గెడుతోంది.

ఇంకా మనస్సులోని అలంకు అలాగే ఉంది. కాలం గడిచిన కొద్దీ, మైళ్లు నడచినకొద్దీ, ఆ అబ్బాయి అప్పుడప్పుడు ప్రసంగించిన తీరును చూచినకొద్దీ, అనుమానం అనవసరమనిపించింది. అసలు మనస్సుల్లోకి అతన్ని గురించి అనుమానం వచ్చినందుకే సిగ్గుకలిగింది.

మంచి వానిని గురించి అనుమానిస్తే, నిజంగానే అతని మంచి తనం గురించి తెలిసింతర్వాత బాధపడతాము గదా! లేకుంటే వీరెవ రనీ! 'ఏదో విదేశస్థులు. సౌకర్యాలు లేక విమానాశ్రయంలో చిక్కు బడిపోయారు తోడ్పడదామనే' ఉత్తమభావనే గదా తనంతట తాను వీరిని ఆహ్వానించి, తన కారులో తీసుకొస్తుంది. మనిషిలోని మంచి తనం బయటపడేది యిలాంటి సమయాల్లోనే గదా! అనుకున్నారు శ్రీమతి లక్ష్మి.

చివరకు చీకటి పడబోతున్న సమయానికి, బ్రెజిల్ సరిహద్దులు సమీపించారు. చెక్‌పోస్టు వద్ద కారు ఆపారు. తనిఖీలు చేశారు. అన్నీ సక్రమంగానే ఉన్నాయి. కాని దురదృష్టవశాత్తూ అతని డ్రైవింగ్ లైసెన్సు, ఈ ప్రయాణం హడావుడిలో ఇంటిలో మరచిపోయి వచ్చాడు. పాపం ఒక్కసారి బిత్తరపోయాడు. చెక్‌పోస్టుఅధికారులు డ్రైవింగు లైసెన్సులేనిదే వాళ్లదేశంలోకి కారుని అడుగుపెట్టనీయ

మన్నారు. నిజంగా లక్ష్మికి విచారమేసింది, అతని ప్రయాణానికి ఇబ్బంది కలిగినందుకు.

ఈమె జోక్యంగలిగించుకొని పొరపాటును వివరించారు.

అయినా చెక్‌పోస్టు అధికారి. "No Madam! rules are rules to all" అన్నాడు.

ఈలోగా ఒక టూరిష్టువాను పారిస్‌నుంచి, బ్రెజిల్ ముఖ్య పట్టణం బ్రెసెల్సుపోతూవచ్చి ఆగింది చెకింగుకోసం. తక్షణం ఆ వాన్ వద్దకు ఈ యువకుడువెళ్లి, తన పరిస్థితి జెప్పి, ఈ యిద్దరి ఆడవారిని బ్రెసెల్సుకు జేర్చమనికోరాడు.

తాను టెలిఫోనులో అధికారులతో సంప్రదించి అవసరమైన పనిచేసుకుంటాననీ, వీరిని వానులో వెళ్లమనీ కోరాడు. కాగా మధ్యలో ఈ చీకాకు వీరికి గల్గించినందుకు క్షమించమని గూడా కోరాడు.

ఆ అబ్బాయి మంచిదనానికి ధన్యవాదాలు అర్పించి, వానులో ఎక్కి బ్రెసెల్సు రాత్రి 9 గం॥ లకు జేరారు లక్ష్మి సుమతులు. అక్కడినుంచి, ముందుకు సాగటానికి ఇక ఆ రాత్రి సౌకర్యాలేమీ లేవు. ఒక ఇన్‌లో ఆ రాత్రి గడిపారు.

తెల్లవారి అక్కడ మనదేశపు రాయబారి మిష్టర్ స్వామి నాధన్ ఇంటికి టెలిఫోను చేశారు లక్ష్మి. ఆఫీసుకు బయలుదేర బోతున్న స్వామినాధన్ లక్ష్మి టెలిఫోను అందుకుని ఆశ్చర్య పోయాడు.

"ఏమిటి - ఇంత అకస్మాత్తుగా మీ గొంతు ఇక్కడ ఈతీగలో వినపడుతుంది మాడం!"—అంటూ నిజంగానే ఆశ్చర్యపోయాడు. జరిగిన పరిస్థితి వివరించారు శ్రీమతిలక్ష్మి.

స్వామినాధన్ కుటుంబం చాలారోజులనుండి, లక్ష్మికి పరిచయం. రఘురామయ్యగారికి స్వామినాధన్ మంచి స్నేహితులు.

రఘురామయ్యగారు కేంద్ర ప్రభుత్వంలో న్యాయశాఖపై కొన్ని రోజులు ఆధిపత్యం జేశారు. ఆ రోజుల్లో శ్రీ స్వామినాథన్ రఘు రామయ్యగారికి శక్రటరీగా ఉండేవారు.

పది నిముషాలలో ఒక పెద్ద కారులో శ్రీమతి స్వామినాథన్ వీరి ఎదుట ప్రత్యక్షమైంది. సంతోషంతో వాటేసుకొంది. రాత్రి వీరు ఆ 'ఇన్' లో గడిపినందుకు విచారపడింది. రాత్రే టెలిఫోను చేయనందుకు నొచ్చుకొంది.

ఆ రోజు ఇక ప్రయాణం చేయనీయనన్నది. రోజల్లా తనకు అతిథులుగా ఉండాలన్నది.

చాలా రోజులకు మళ్లీ, శ్రీమతి స్వామినాథన్ వంట రుచి చూచాము. భోజనం జేశారు. భుక్తాయాసం వచ్చిందాకా మెక్కారు. ఆ రోజల్లా బ్రెసెల్సు నగరాన్ని శ్రీమతి స్వామినాథన్ వెంట ఉండి చూపించారు.

ఆ రాత్రి డైనింగు టేబుల్ దగ్గర శ్రీ స్వామినాథన్‌తో సంభాషణలో యూరప్ దేశాల పరిస్థితులు చాలా వచ్చాయి. మన దేశరాజకీయాలు, మద్రాస్ వార్తలూ చాలా దొర్లాయి.

దంపతులిద్దరూ తెల్లవారి విమానాశ్రయంలో వీడ్కోలు చెప్పారు. కృతజ్ఞతలు చెప్పుకొని లండను నగరాభిముఖంగా విమానంలో ప్రయాణించారు స్నేహితురాండ్రిద్దరూ.

* * *

# పల్లెటూరి మహిళాసభ

శ్రీమతి లక్ష్మి ఒకరోజున ఆంధ్ర దేశంలో అభివృద్ధి చెందిన ప్రాంతమని పేరొందిన జిల్లాలో ఒక ఊరికి వెళ్లారు.

వారం రోజులపాటు సాగిన ఆ పర్యటనలో అనేక గ్రామాలు ఆమె సందర్శించారు. వివిధ వర్గాల ప్రజలను కలుసుకున్నారు. ముఖ్యంగా అన్ని వర్గాలలోని స్త్రీలనూ పనిగట్టుకొని కలిశారు. అరమరికలు లేకుండా వారితో సంభాషించారు. ఎన్నెన్నో విషయాలు ఆ గ్రామీణ సోదరీమణులనుంచి వీరు తెలుసుకొన్నారు. మరెన్నెన్నో సంగతులు ఆ పల్లెల ప్రజకు ఈమె తెలిపారు.

రాజ్యపాలన గావిస్తూన్న శ్రీమతి ఇందిరాగాంధీ నుంచి, ఆడవారి హక్కులగురించి, వస్తూన్న మార్పుల గురించి, మిరప తోటల్లో పత్తిచేలల్లో పనిజేసే ఆడ కూలీల సాధకబాధకాల దాకా వివిధ విషయాలు వారి సంభాషణలలో దొరిలాయి.

అఖిలభారత గ్రామీణ మహిళా మహాసభవారు, దేశంలోని గ్రామీణమహిళల వాస్తవ స్థితిగతులను ఆకళింపు జేసుకొని, సమస్యల పరిష్కారానికి మార్గాలను వెతకాలనే ఉద్దేశ్యంతో, ప్రముఖ మహిళోద్యమ కార్యకర్తలకు ఒక కార్యభారం అప్పగించారు. సుదీర్ఘమైన ఒక ప్రశ్నావళిని తయారుజేశారు. ఆ ప్రశ్నలకు తాము దేశవ్యాపితంగా కలుసుకోవాలనుకుని పర్యటన కార్యక్రమాలు నిర్ణయించుకున్న గ్రామాలలోని ఆడవారిలో ప్రతి ఒక్కరినుంచీ, విడివిడిగా సమాధానాలు రాబట్టుకోవాలనుకున్నారు. తదుపరి సమగ్ర నివేదికనొకదానిని రూపొందించుకొని, పూర్వాపరాలు చర్చించుకోవాలనుకున్నారు. పరిష్కార సూచనలను తిరిగి మహాసభ పునఃపరిశీలించి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు నివేదికలందజేసి, గ్రామీణ మహిళల

పురోభివృద్ధి కార్యక్రమాలలో ఒక శాస్త్రీయ ప్రణాళికను అమలు జరిపించాలని తీర్మానించుకున్నారు.

సహజంగా గ్రామసీమలన్నా, గ్రామీణ మహిళలన్నా ఎంతో ఆపేక్ష గలిగిన శ్రీమతి లక్ష్మీ రఘురామ్, అఖిలభారత మహిళా సభ అధ్యక్షురాలై నప్పటికీ ఒక మహిళా కార్యకర్త బాధ్యతలను తనకుతాను స్వీకరించుకొని, స్వయంగా కొన్ని గ్రామాలు సందర్శించి గ్రామీణ వనితల పరిస్థితులను తెలుసుకొనేందుకు జరిపిన పర్యటనలోని భాగమే ఈ గ్రామానికి ఆమె ఆగమనం.

ఈ గ్రామాలలో ప్రజకు రఘురామయ్య, లక్ష్మీరఘురామ్ గారలపేర్లు కొట్టినపిండి. ఈ దంపతులంటే ఈ గ్రామీణులకు ఎనలేని అభిమానమూ, అంతులేని గౌరవమూనూ. గత పదిహేను సంవత్సరాలుగా అత్యంత ఉత్సాహంతో శ్రీ రఘురామయ్యను తమ పార్లమెంటరీ అభ్యర్థిగా ఎన్నుకొంటూ, ఆయనకు అఖండ విజయాన్ని సమకూరుస్తున్న గ్రామాలివి.

రఘురామయ్యగారు ఈ ప్రాంతం వస్తున్నారంటే, పనిగట్టుకుపోయి ఆయన్ను దర్శించుకొని వస్తుంటారు. ఆ ఊళ్లకే వస్తున్నారని తెలిస్తే పనిమానుకొని ఆయన రాకకు ఎదురుతెన్నులు చూస్తుంటారు.

గ్రామాలను అలంకరించుకుంటారు. తోరణాలను కట్టుకుంటారు. స్వాగతద్వారాలను నిర్మిస్తారు. మేళతాలాలను ప్రోగు చేస్తారు. బాణసంచాలను అంటిస్తారు. ఒక వాహనాన్ని రథంగా మారుస్తారు. అందంగా అలంకరిస్తారు. దానికి మేలుజాతి కోడెలను పూన్చుతారు. "హర,హరో" అంటారు.

రఘురామయ్యగారు ఊరిపొలిమేరల్లోకి రాగానే వారికి బ్రహ్మరథంపడతారు. జే, జే,లు చెబుతారు, జై, జైలు పలుకుతారు. ఊరంతా ఒక కొలిక్కి తెస్తారు. తామంతా బజారులు నిండుతారు. ఒకవెల్లువలా పొంగుతారు. ఆనందంతో గెంతుతారు.

ఆడామగా తేడా ఉండదు. ఆబాలగోపాలం చేతులుఎత్తి నమస్క-రిస్తారు. గొంతులువిప్పి స్వాగతంపలుకుతారు.

అలాంటిది రఘురామయ్యగారిపట్ల ఆ అభిమానం! అదీ ప్రజాభిమానం!! నిస్వార్థ హృదయాభిమానం!!!

రఘురామయ్యగారు ఆ గ్రామీణ ప్రజకు ఆరాధ్యుడు. పూజనీయుడు.

అలాగే శ్రీమతి లక్ష్మికి ఆ గ్రామీణ మహిళాలోకం, మన సారా నివాళులర్పిస్తుంది. ఆమె రాకకు హృదయపూర్వక సంత సాన్ని అందరూ వెలిబుస్తారు. సుస్వాగతాన్ని ప్రకటిస్తారు.

ఆమె గొప్పతనంలో తమ గొప్పతనాన్ని చూచుకుంటారు! ఆమె ఆనందంలో తమ ఆనందాన్ని ఊహించుకుంటారు!! ఆమే తామూ మమేకమని భావిస్తారు!!

శ్రీమతి లక్ష్మిని అపురూపంగా గౌరవిస్తారు.

* * *

ఆ మధ్యాహ్నం శ్రీమతి లక్ష్మి విడిది చేసిన మిత్రుల ఇంటిలో, ఆ గ్రామమహిళల సమావేశం ఏర్పాటు చేశారు విశ్వ విద్యాలయంలో, కాలేజీలలో, హైస్కూలులో చదువుకుంటున్న విద్యార్థినులు.

పెద్ద అట్టహాసంతో ఈ సభనుజరపాలనీ, అఖిలభారత మహిళా మహాసభకు రెండవసారి కూడా, అధిక మెజారిటీతో ఎన్నికై, భారత దేశ మహిళా ఉద్యమానికి దేశమంతటా లభించిన గుర్తింపుకూ, అంతర్జాతీయంగా, లభించిన గౌరవ పరిగణనకూ కారకురాలైన శ్రీమతి లక్ష్మీరఘురామ్‌ను ఘనంగా సన్మానించుకోవాలనీ ఎంతో కుతూహల ఉత్సాహాలతో నిర్ణయించుకున్నారు ఆ గ్రామీణ నవ యువతులు.

కరపత్రాలనూ, ఆహ్వానపత్రాలనూ, స్వాగత సన్మానపత్రాలను అస్తార్యతంగా వ్రాసుకొని అచ్చువేయించుకోవాలనే సమయంలో శ్రీమతి లక్ష్మినుంచి కబురు తెలిసింది: వాటన్నింటినీ తాను మెచ్చునని. జనంలో ఒకరిగా, జనం మనిషిగా, జనంలోకలిసి ఆ రోజల్లా ఆ ఊరిలో గడపడం ఆమె అభిమతమనీ, శ్రీమతి లక్ష్మి, ఈ నవయువతులు జేయతలపెట్టిన సంబర సంరంభాలను విని కబురు పెట్టింది.

ఆమె ఆజ్ఞ ఈ బిడ్డలకు సుగ్రీవాజ్ఞ అయింది. వారి ఉత్సాహం నీరుగారింది! రెండు అరచేతుల్లోకి తలలు వాల్చుకున్నారు!!డామిట్! కథ అడ్డం తిరిగిందనుకున్నారు!!!

కథానాయకురాలు విజయలక్ష్మి అన్నది తాను పోగుజేసిన తన సహాధ్యాయినులతో. "మాడం అన్నమాటకు ఇక తిరుగు ఉండరాదు. మన కార్యక్రమాలన్నీ బంద్. రేపు ఉదయం ఆమె వచ్చే సమయానికి అందరూ రెడీగా ఉండండి. మదాం కోరినట్లు, మనం నిరాడంబరంగానే రిసీవ్ చేద్దాము. ప్లీజ్ డిస్పర్స్." అంటూ కేకేసింది. నొసలు కొట్టుకొంది. తల పట్టుకొంది.

నిరామయంగా వింటూన్న ముప్పై ఆరుగురు సహాధ్యాయినులూ, ఒకరినొకరు చూచుకున్నారు. అందరూ కలిసి విజయకేసి చూచారు.

"ఒసే! విజయా! నీ మాటలు నమ్మి, గులాబీమాల అందంగా కట్టి లక్ష్మీరఘురామ్ మెడలో నా స్వహస్తాలతో అలంకరించాలనే కుతూహలంతో, అన్నయ్యను బుట్టెడు గులాబీలు తెమ్మని చెప్పానే! వాటిని ఏమి చేయమంటావ్?"— అడిగింది భారతి.

"నేను బుట్టెడు మల్లెపూలకు ఆర్డరిచ్చాను! వాటిని ఏమి చేయమంటావ్?"— అడిగింది ఉషారాణి.

"నేను రాసిన పంచరత్నాల సంగతేమిటి?"— ప్రశ్నించింది భానుమతి.

"ఊరేగింపును ఫోటోలు తీయాలని నా కెమెరా లోడ్ చేసుకొని కూచున్నానే దానిగతేమిటి?" అడిగింది జమునారాణి.

"చక్కని పాటలు రెండు కమ్మగా గొంతెత్తి గానం చేయాలనుకున్నానే, మరి నా సంగతో?" అడిగింది రాగరాగిణి.

"ప్రత్యేక వ్యాసం వ్రాసి అన్ని పత్రికలకూ పంపించాలని ఉవ్విళ్లూరాను. మరి నేను?"— అన్నది సుమిత్ర.

రెండు రోజులనుంచీ లక్ష్మీరఘురామ్‌ను తమ తృప్తిమేర గౌరవించుకోవాలనుకొని తయారై, అక్కడ కూడిన ప్రతి యువతీ విజయలక్ష్మిమీద యుద్ధం ప్రకటించింది.

"Please shut up— I said, disperse— all of you" పెద్దగావు కేకపెట్టింది విజయలక్ష్మి. వాళ్లనడిమి ఇల్లంతా ప్రతిధ్వనించింది ఆ కేకసు. వాళ్లందరకూ ఆ అమ్మాయి నాయకురాలు. ప్రియమైన విజయ.

"మీరంతా, మీమీ దండలతోరండి. ఎంతమాత్రం నిరుత్సాహపడవద్దు. మాడంగారి నిరాడంబర కార్యక్రమం అంతా ముగిసింతర్వాత మన ఇంటిముందు, మన పందిరిలో మనం సభజరుపుదాము. మన దండలు మనం సమర్పించుకుందాము. మన అభిమానాన్ని మనం మాటలతో చెప్పుకుందాము. మనహర్షాన్ని మనమొగంలో ద్యోతకం చేద్దాము. వీటిపై ఆమెగారి పెత్తనం లేదుగా! సన్మానపత్రాలు, స్వాగతతోరణాలు, బాజాభజంత్రీలు, ఊరేగింపూ, ఇవేగా మాడం కూడదన్నది.

"సరే కానివ్వండి. మదాం మాటను మనం గౌరవించాలి", అన్నది విజయలక్ష్మి. స్నేహితురాండ్ర బృందమంతా ఆసక్తితో వింటున్నారు విజయను.

"డామిట్! ఈ దేశంలో ఆడదాని సంగతేఇది. అన్నీ అడ్డంకులే!!" అనిగూడా విసుక్కుంది విజయ.

రఘురామయ్యగారు వస్తున్నారని తెలిసీ తెలియకముందే ఈ మొగవారంతా, ఆయనకు బ్రహ్మరథం పడతారే!

మాడం రఘురామయ్య వస్తూంటే మనకు ఆమెగారిని, తృప్తిమీరా గౌరవించుకునే అవకాశం లేదా! డామిట్, డర్టీకంట్రీ, అండ్ డర్టీమెన్!" అని కసురుకొంది విజయ.

"ఇందులో మెన్ ప్రమేయమేముందే అక్కా", అని ప్రశ్నించింది ఉషారాణి.

లేకపోతే, ఈ మగాళ్ళే వెళ్ళి, మా ఆడవాళ్లు ఇలా చేయాలనుకుంటున్నారు మాడం అని ఆమెగారితో చెప్పిఒప్పించగూడదా? ఆమెగారు ఆర్భాటం వద్దన్నారట, వీరు నోరు మూసుకొని వచ్చి మనకా సందేశం అందించారు. అసలు వీళ్లకు మాత్రం నిజంగా మన మహిళలు సంబరం చేసుకుంటం ఇష్టం ఉందా అని నాకు అనుమానమొస్తుంది. ప్రతిచోటా మగవారి ఆధిక్యతే, అందుకేనే ఈ సంఘవ్యవస్థే పూర్తిగా మారాలని నేను మీకు నెత్తీ నోరూ కొట్టుకొని చెప్పేది. రైట్. మీరంతా ఇకవెళ్లండి. రేపటికి తయారుగండి!" అంటూ అందరనూ పంపింది విజయ.

శ్రీమతి లక్ష్మి తమ పర్యటనలో ఏమాత్రం ఆర్భాటాలనూ, కోరుకోరు. అసలు వాటిని మన్నించరు. ప్రజాధనాన్ని హడావుడుల కోసం దుర్వ్యయం చేయటం చాలా అనవసరమంటారు ఆమె.

కేవలం ఇష్టాగోష్టిగా మాట్లాడుకోవాలనే ఈమెఅభీష్టానుసారం అంగీకరించి అతికష్టంమీద సన్మాన పత్రాలు వగైరా నిలిపివేశారు.

తలమునిగేటట్టు రకరకాల దండలు మాత్రం వేసి తమ ఆప్యాయతను ప్రదర్శించుకున్నారు.

గ్రీష్మఋతువు అపుడే ప్రవేశించింది. సూర్యతాపం ఆరంభమైంది. చల్లని తాటాకు పందిరిక్రింద సమావేశం ప్రారంభమైంది.

చాలా విషయాలు ముచ్చటించిన తర్వాత, సమీపంలో కూర్చొని, శ్రద్ధాసక్తులతో ఇందాకటినుంచి ఆలకిస్తోన్న స్వరాజ్య లక్ష్మి ఒక ప్రశ్న అడిగింది శ్రీమతి లక్ష్మిని.

స్వరాజ్యలక్ష్మి ఆ ఇంటివారి పెద్దకోడలు.

"సామ్యవాదం గావాలని జనంలో పెద్ద వెల్లువ వచ్చినట్టు కన్పిస్తోందిగదా ! మరి ఉన్న వారిది కొంత తీసి లేనివారికి ఇవ్వటమే గదా దీని అర్థం. దీనిని గురించి తమ అభిప్రాయమేమిటండీ ?" — అంటూ ప్రశ్నించింది.

శ్రీమతి లక్ష్మి చిరునవ్వునవ్వుకొంది. ఆమె పర్యటనలో చాలాచోట్ల, దాదాపు అన్నిచోట్లా ఈ ప్రశ్న ఏదోరూపంలో తనకు ఎదురౌతునే ఉంది.

ఎదురుగా కూర్చున్న వసుమతి కేసి చూచారు శ్రీమతిలక్ష్మి.

"నీవు చెప్పమ్మా, ఆ ప్రశ్నకు నీజవాబేమిటో ?" అని అడిగారు.

"అన్నిటికన్నా సులభమైంది ఉన్నది పంచటమే గదా అమ్మ గారూ !" అని నవ్వింది వసుమతి. "నా అభిప్రాయమంటారా, అది న్యాయమైన పనిగాదని" అన్నది. జంకూగొంకూ లేకుండా కుండ బద్దలు గొట్టినట్టు చెప్పింది.

"ఎందుకని వసుమతీ ! లేనివాళ్లకుగూడా కూడూ గుడ్డా దొరకటానికి ఒక కుంటో, గొర్రో పొలం ఉండాలిగదా! వాళ్లుగూడా పస్తులతో పడుకోగూడదుగదా !"—అన్నారు శ్రీమతి లక్ష్మి.

"నిజమేనమ్మా ! కూడూ గుడ్డా రావాలంటే కష్టించి పని జేయాలి. పనిజేయాలంటే పొలం ఉండాలి. మరి మా ఊళ్లో మా అందరకూ పొలం ఎవరిచ్చారమ్మా. మా నాన్నకు మేము నల్గురం పిల్లలం. 12 ఎకరాలు ఉండేది. కొద్దిగా తల్లిదండ్రులకు మిగిల్చి మేము నలుగురం తలా కాస్త తీసుకొని తలోదారి పొయ్యాము.

నాకు నాపెండ్లయ్యేనాటికి మూడెకరాలు మాత్రమే పొలం ఉంది. ఆనాటినుంచి, ఈనాటివరకు విధివిరామం లేకుండా కష్టించి పని జేసుకుంటున్నాము. విధివైపరీత్యాలకు తలఒగ్గుతూ, అనేక సాధక బాధకాలను తట్టుకుంటూ, అప్పుల పాలుగాకుండా మరో ఆరు ఎకరాలు కొనుక్కున్నాము. పిల్లలను చదివించుకుంటు న్నాము. అలాగే నాతోబుట్టినవారుగూడా కష్టించి ఆర్జించుకొని పరులను ఆశ్రయించకుండా ఒకరి దయా దాక్షిణ్యాలపై బ్రతకకుండా వాళ్ల బ్రతుకులు వారు బ్రతుకుతున్నారు." చెప్పుకుపోతోంది వసుమతి.

"మీదిగాదు వసుమతీ గవర్నమెంటు తీసుకొని పంచాలనుకునేది. బాగా కలిగిన వాళ్లది" అని అందించారు శ్రీమతిలక్ష్మి.

"బాగా కలగటం అంటే పన్నెండెకరాలు దాటటమేగా. కాకపోతే మరో రెండుమూడెకరాలు కొసరుక్రింద మిగులుస్తారు. అయినా మరో రెండేళ్లు పోయింతర్వాత ఈ సీలింగును తగ్గించరనే గ్యారంటీ ఏముంది? కుటుంబానికి ఏమూడు ఎకరాలు పరిమితో విధించరనే గ్యారంటీ ఏముంది?" అని ప్రశ్నించింది వసుమతి. అక్కడ ఉన్న ఆడవారి ముఖాలను చదువుతున్నారు శ్రీమతి లక్ష్మి.

ఏమి చెప్పాలా అని ఆలోచిస్తున్నారు.

వసుమతే మళ్లీ అందుకుంది; "కష్టించి పనిచేసేవాడు ముఖ్యంగా మా పల్లెటూళ్లల్లో ఏదో విధంగా బ్రతుకుతాడు. బాధ్యతలు తెలియనివాడు, దురలవాట్లకులోనై ఉన్నది పోగొట్టుకుంటూ తలక్రిందులౌతున్నాడు. గవర్నమెంటు లేనివాళ్లకు ఇవ్వటం వరకే చేస్తుంది. గానీ, విధిగావాళ్లచేత బాధ్యతలు గుర్తింపచేయలేదుగదా! వాళ్ళొళ్ళొంచి పనిజేసేట్టు చేయలేదుగదా!" అని ప్రశ్నించింది.

"కాగా - అమ్మగారూ నాకొక సందేహముంది. మీరు ఏమి అనుకోనంటే అడుగుతాను" అని సంకోచం వెలిబుచ్చింది.

"తప్పక అడుగమ్మా! ఎంత మాత్రం సందేహించకు." అన్నారు శ్రీమతి లక్ష్మి. నవ్వుతూ వసుమతిని ప్రోత్సహిస్తూ.

"అమ్మా, మీ నుం జేతులకు ఆ సువర్ణ కంకణాలున్నాయి. చాలా ఖరీదైనవని వాటిని చూస్తేనే తెలుస్తున్నాయి. మీ వ్రేళ్ల కున్న వజ్రపుటుంగరాలు గూడా మాకు కన్పడు తున్నాయి. అవీ విలువలో తీసిపోవు. మరి నాచేతికి ఉన్నవి మామూలు మట్టిగాజులే. నేను, 'అమ్మా మీచేతికి ఆరు కంకణాలున్నాయిగదా, ఒక రెండు నాకివ్వగూడదా' "అని అంటం ఎంతన్యాయ మంటారు?" సూటిగానే అడిగింది వసుమతి. ఆ పలుకుల్లో తీక్షణత లేదు. ఈర్ష్య లేదు. అత్యంత సహజంగా అడిగింది.

"కాని అమ్మగారూ. నేను మిమ్ములను ఇలా అడిగినందుకు మరేమీ అనుకోవద్దు. కాని అలా అడగటంతప్పని మీకు తెల్పటమే నా అభిప్రాయం. అన్యాయమని తెల్పడమే నా అభిప్రాయం. అట్లా ఊహించటమే పాపమని నా అభిప్రాయం.

"ఈ సువర్ణ కంకణాలు ధరించటానికి, ఆ కంకణాలు చేయించుకుంటానికీ, ఈ ఉన్నతస్థితిలో మీరు ఉండటానికీ, వెనుక ఉన్న మీ శ్రమ, మీ చదువులు, మీ నాన్నగారి పరిశ్రమ, మీ భర్తగారి కృషి మీ జాగ్రత్త ఇవన్నీ లెక్కవేసుకుంటే, మీ ఆభరణాలలో పాలు పంచుకోవాలనే కోరిక నాకు గలుగుతుందా! ఆ అర్హతనాకు ఉందా!! అందాకా ఎందుకు ఇప్పుడు మనం ఉన్న ఈ ఇల్లు మా తండ్రిగారి అన్నదమ్ముల సంతతిది. నాకు అన్నగారు అవుతారు ఈ యింటి యజమాని. మేడఉంది. తగు మంచి భూవసతీఉంది. పిల్లలందరనూ చిన్నతనంనుంచీ, కష్టించి చదివించారు. క్రమశిక్షణతో పెంచారు. అందరూ ప్రయోజకులయ్యారు. చాలా మందికన్న మా ఊరిలో సుఖంగా బ్రతుకుతున్నారు. మరి "వారికి మేడ ఉందే, వారి పిల్లలు శుభ్రంగాఉంటారే, చదువుకున్నారే, ఉద్యోగాలు చేసుకుంటున్నారే. ఎక్కువ కట్నాలు తెచ్చుకుంటున్నారే, అని భావించి,

ఈవాళ వారి సంపదలో ఎవరైనా వాటా అడిగితే ఏమిన్యాయ మంటారు.'' అన్నది వసుమతి.

'That is exactly the feudal out look.' భూస్వామ్య దృక్పథం మాడం అన్నది నా ప్రక్కనే కూచున్న విజయలక్ష్మి. బి.ఎ. పరీక్షలు వ్రాసివచ్చిన ఆ యింటివారి అమ్మాయి.

"నేనేమీ భూస్వామినికాదుగా విజయా! నాకున్న భూమి ఎంతో నీకు తెలుసుగదా!" అని నవ్వింది వసుమతి.

"వందలెకరాలుంటేనేగాదు అత్తయ్యా భూస్వామ్యదృక్పథం ఉండేది! ఏ కొంచెం భూమి ఉన్నా అలవడుతుంది ఆ మనస్తత్వం. అసలు భూమి లేకపోయినా కొందరకు ఈ మనస్థత్వం ఏర్పడటంలో ఆశ్చర్యంలేదు. అసలు 'తనది' అనే భావం ఉండటమే భూస్వామ్య పెత్తందారీవ్యవస్థకు నాంది అవుతుందత్తయ్యా!" అన్నదివిజయలక్ష్మి.

వసుమతీ, విజయలక్ష్మి వరుసకు మేనత్తా, మేనకోడళ్లవుతారు.

అసలు తనదనేది లేకుండానే బ్రతుకులు సాగాలంటావా పిచ్చి విజయా! అలా ప్రపంచం నడవాలంటావా కోడలా?'' నవ్వుతూ అడిగింది వసుమతి.

''అవును తనదేమిటి? తనది కానిదేమిటి? ఉన్నదంతా సంఘానిది. మనమంతా సంఘం. అందరం కలసి పనిచేద్దాము. అందరి అవసరాలు తీర్చుకుందాము. అందరం కష్టిద్దాము. అందరం అనుభవిద్దాము. అపుడు ఏ సమస్యా ఉండదు.'' అన్నది విజయలక్ష్మి తీక్షణంగా.

వసుమతి పకపకా నవ్వింది.

"బి. ఎ. చదువుకున్న నా మేనకోడలు బుట్ట తీసుకొని రేపు మిరపకాయలు కోయటానికి నాతోపాటు వస్తుందిగా మోసు!" అని మళ్ళీ నవ్వింది. "అంతగా ఆ మోజు ఉంటే, నాన్నగారిచేత అందమైన

ప్లాస్టిక్ బుట్ట డబ్బు ఖర్చు పెట్టించి కొనిపించబోకు. నా దగ్గిరే ఇంకో బుట్టగూడా ఉంది నీవు చేనికి రావాలనిపిస్తే'' అనిగూడా నవ్వింది. శ్రీమతి లక్ష్మి నవ్వారు. అక్కడ ఉన్నవారంతా నవ్వారు.

"ఇరవై ఏళ్ల ప్రాయంలో సోషలిస్టు భావాలు మనిషికి గలగక పోతే, అతనికి హృదయం లేదన్నమాట. నలభై ఏండ్లకు ఆ భావాలు ఇంకా అలానే ఉంటే అతనికి తలకాయ లేదన్నమాట.''— అని ప్రసిద్ధ రచయిత అన్నమాట జ్ఞాపకం వచ్చింది శ్రీమతి లక్ష్మికి, నవ్వువచ్చింది. విజయలక్ష్మికి ఇరవై సమీపిస్తున్నాయి. వసుమతికి నలభై సమీపిస్తున్నాయి.

నిజమే, వసుమతి చెప్పుకున్నట్లు ఆమె భూస్వామ్యవర్గానికి చెందిందిగాదు. విజయలక్ష్మి వర్ణించినట్లు ఆమెది భూస్వామ్య దృక్పథమూ గాకపోవచ్చు. ఆమెకున్న ఆస్తి అంతా ఏడెనిమిది ఎకరాలు మాత్రమే. ఒక యిల్లూ, కొద్ది పశుసంపద మాత్రమే. రెక్కాడితే గాని డొక్కాడని పరిస్థితి ఏ రోజు కారోజు గాకపోయినా, ఒక సంవత్సరం పంటలు పోతే శిస్తులు చెల్లించటానికి అప్పులు చేయాలిసిన పరిస్థితే.

'విజయ' అభిప్రాయం తెలుసుకుందామని అదేమాట అడిగారు శ్రీమతి లక్ష్మి. "వసుమతిది బూర్జువా దృక్పథం ఎలా అవుతుంది!" అని.

"బూర్జువా దృక్పథం గాకపోతే, పెట్టీ బూర్జువా దృక్పథం మాడమ్" అన్నది విజయ. ఇది మరీ ప్రమాదకరమైంది. బూర్జువాలు ఎవరో తెలుస్తుంది మనకు. వాళ్ల ధ్యేయమేమిటోగూడా తెలుస్తుంది మనకు. ఈ పెట్టీ బూర్జువాలున్నారే!"

"నా దృష్టి నాకు గాకుండా నీ యిష్టం వచ్చిన పేర్లు పెట్టుకుంటూపో కోడలూ!" అంది వసుమతి నవ్వుతూ. "చూచారా మాడమ్— ఆమె దృష్టికిగూడా ఒక వ్యక్తిత్వం ఉండాలనే వాంఛ అత్తయ్య మాటల్లో ఎలా ధ్వనిస్తుందో. సామూహిక దృక్పథానికి

మా పల్లెలు పనికిరావు ఎవరిపొలం వారికే. ఎవరి ఇల్లు వారికే, ఎవరి గొడ్డూ గోదా వారికే. ఇదంతా మనందరిది. మనందరం ఒకటి అనే భావం గ్రామసీమల్లో కలిగించడం దుర్లభం మాడం,'' అన్నది విజయ.

అంటూ, "మాడం! కారల్ మార్క్సు ఈ రైతులను గురించి ఏమన్నాడో తమరు ఏనాడో తెలుసుకొని ఉంటారు 'వీరు, ఇసుక రేణువుల వంటివారు. వీరిని గుప్పిటిలో బిగించుదామంటే చేతికున్న అయిదువ్రేళ్లు ఎంత ముడుచుకున్నా చల్లగా జారిపోతారు. విప్లవానికి పనికిరారు.' అని అన్నారు " అంది జయ.

భారతదేశపు గ్రామాలను ఉత్తరాదినుంచి, దక్షిణ తీరం వరకు సంచారం జేసి, ప్రజలలో కలసి మెలసి, వారిని అర్థం చేసుకున్న గాంధీజీ వద్దకు ఒకసారి 15 మంది నవయువకులు వచ్చారు. వారంతా ఉన్నత విద్యాభ్యాసం చేస్తూన్నవారే. సోషలిష్టు భావావేశానికి ప్రభావితులై మహాత్మునితో చర్చించటానికి సేవాగ్రాం వెళ్లారు.

గాంధీజీగూడా వర్గరహితమైన, ఆర్థిక భేదరహితమైన సంఘాన్ని వాంఛించేవారే. ఒకచోట పనిచేయటం మానుకున్నవాడు, తిండి తినకుండాగూడా మానుకోవాలసి ఉంటుంది, అనేంత వరకు గూడా పోయాండు. ("If a man work not neither shall he eat")

ఆ విద్యార్థి బృదం ప్రశ్నలకు గాంధీజీ ఒక కాగితం ముక్కపైన జవాబులు రాసి యిచ్చారు. ఆరోజు సోమవారం. సోమవారం నాడు గాంధీజీ మౌనాన్ని పాటించేవారు.

"శారీరకశ్రమఅంటే బద్ధకంగానీ, విముఖతగానీ, ఉండగూడదనేది సోషలిస్టుల ప్రధాన దృక్పథంగదా. మీలో ఎవరెవరిండ్లలో ఎందరు పనిమనుష్యులు మీ పనులు చేస్తున్నారో నాకు చెప్పండి?" అని ప్రశ్నించారు, గాంధీజీ ఆ విద్యార్థి బృందాన్ని.

ప్రతివాని యింట్లో కనీసం ఒక్కో నౌకరన్నా ఉన్నారని వారంతా అంగీకరించారు.

"మీరు మీ పనులకై ఎవరిచేతనో ఊడిగంచేయించుకుంటూ, మీరు సోషలిష్టులని చెప్పుకుంటున్నారన్నమాట!" అని గాంధీజీ అన్నారు.

ఇంకా మాట్లాడుతూ, "ఇదిఒక విచిత్రమైన సోషలిజం. మీరు ఏది వాంఛిస్తున్నారో, మీరు ఏదిగా మారాలని కోరుకుంటున్నారో, దానిని మీ అంతట మీరు అనుసరించకుండా మీరు ఎట్లా మారగలరు? మీరు వాంఛించేది ఎలా సాధించగలరు?

"మీరు నామాట వినదలచుకుంటే ఒకమాట చెబుతాను. మీరు ఏ ఇజానికి తాకట్టు పడవద్దు. ప్రతి ఇజాన్ని గురించీ క్షుణ్ణంగా చదవండి. చదివింది జీర్ణించుకోండి. అపుడుమీకు ఏది అభిలషణీయంగా ఉంటుందో దానిని స్వీకరించండి. దానిని మీరు మీ వ్యక్తి పరంగా అమలు పరచండి. అంతేగాని ఏదో ఇజాన్ని భుజాన వేసుకో వద్దు. మీరు వ్యక్తిగతంగా అనుసరించలేనిది ఇతరులకు ప్రబోధం చేయడంవల్ల జరిగేదేముంది. వాళ్లూ అనుసరించకుండా ప్రబోధం చేయడమే పనిగా పెట్టుకుంటారు. అందరూ చెప్పేవారే అయి ప్రబోధకులేఅయితే ఆచరణలో పెట్టేవారెవరువుండరు. అవివడకకుర్చీ రాజకీయాలవుతాయేగాని ప్రజలనుద్ధరించే రాజకీయాలుగానేరవు. సోషలిజం మొదట పాఠాలలో, మనం మన చేతులకు, కాళ్లకు పని గల్పించాలి. కష్టించి పనిజేసి, ఇతరులకు ఆదర్శకంగా, కృషిజేస్తూ సంఘంలోని హెచ్చుతగ్గులను, తగ్గించుకుంటమే నిజమైన సోషలిజ మౌతుంది. సంఘంలోని హింసాకాండను, పీడిత విధానాన్ని నిర్మూలించటానికి ఇదే సరైనదారి" అని అన్నారు గాంధీజీ.

సమయానికి శ్రీమతిలక్ష్మికి మహాత్ముడు సోషలిజాన్ని గురించి ఇచ్చినఈ అభిప్రాయం గుర్తుకు వచ్చింది. అదే అక్కడి వారికి చెప్పారు. ఎంతో ఆసక్తిని వారందరకూ గలిగించింది, విద్యార్థులతో గాంధీజీ సంభాషణను (శ్రీ)మతిలక్ష్మి ఉదహరించినతీరు.

ప్రతివారూ గాంధీజీ వెలువరించిన అభిప్రాయాలు యదార్థాలని అనుకుంటున్నట్లు వారి మొగాలలో తెల్లమయింది.

విజయలక్ష్మితో పాటుగా హైస్కూళ్లలో కాలేజీలలో చదువుకుంటున్న ఓ యాభయిమంది ఆడపిల్లలు ఆసమావేశంలో ఉన్నారు.

వారిలో భారతి అనే అమ్మాయి అడిగింది.

"గాంధీజీ ఇంకా ఏమని ఆ విద్యార్థులకు సలహాయిచ్చారు మాడం!" అని.

"అవును అదీ చెబుతాను. వారికి ఆచరణ యుక్తమైన సోషలిజమంటే ఏమిటో వివరిస్తూ కొన్ని విధులను ఆ విద్యార్థి బృందానికి సూచించారు మహాత్ముడు. (1) ప్రొద్దున్నే నిద్రలేవంగానే వారి ప్రక్కచుట్టలనువారే చుట్టుకోవాలి. (2) ఇంట్లోవారికి ప్రొద్దునే కాఫీలవీ తయారు చేయటంలో చేయి అందించాలి. (3) ఇంటిలో కసవు ఊడ్చటానికీ, శుభ్రం చేయటానికి సాయపడాలి. (4) మీ బట్టలు మీరే ఉతుక్కోవాలి. (5) అంట్లు తోమటంలో మీ అమ్మగార్లకు, అక్కలకూ మీ తోడ్పాటు ఉండాలి. (6) మీకు అవసరమైన బట్టలు మీరు పొందటానికి రోజూ మీరు కొంతసేపు నూలు వడకాలి. (7) మీ పుస్తకాలు, పేపర్లు శుభ్రంగా ఉంచుకోవాలి. (8) మీరు వ్రాసుకుంటానికి యాభయి రూపాయిల ఖరీదు చేసే కలం కొనే బదులు, రెండణాల పాత కలం ఉపయోగించండి.

అని గాంధీజీ ఆ సోషలిస్టు విద్యార్థులకు హితవు చెప్పారు. ఆ రకంగావారు జీవితంలో ఈ సూత్రాలను అమలుపరిస్తే సామ్యవాద సమాజం, నీ యింట్లో ముందు వస్తుంది. నీ చుట్టుప్రక్కల వస్తుంది. గ్రామానికంతటికి ప్రాకుతుంది. అదే దేశానికి వ్యాపిస్తుంది. మీ రెవ్వరను మార్చవలసినపని ఉండదు. మిమ్ములను, మీ మంచి కార్యక్రమాలను ఉదాహరణగా తీసుకొనే సంఘం బాగుపడుతుంది. అన్నింటికన్నా ముఖ్యం మీ తల్లిదండ్రులు సుఖపడతారు.

సంతోషిస్తారు. మీకోరకై వారు మోస్తూన్న భారాన్ని మీరు తగ్గించినవారౌతారు.'' అని గాంధీజీ అన్నారు. అని శ్రీమతి లక్ష్మి చెప్పింది.

వసుమతి అన్నది; "ఇక్కడికొచ్చిన ఈ మా పిల్లలందరిలో మార్పువచ్చి గాంధీ మహాత్ముని మాటల ప్రకారం నడచుకుంటే చాలు మా ఊరిలో కావలసినంత మార్పువస్తుంది. అమ్మగారూ, గాంధీజీ యిచ్చిన సలహాలు మగపిల్లలకయి ఉంటాయి కాని, ఈ మా ఆడపిల్లలన్నా వాటిని అమలుపరిస్తే ముందు మా ఇండ్లన్నా బాగు పడతాయి" అని అన్నది.

ఎదురుగా ఒకచోటే కూర్చున్న ఆడపిల్లల్లోగూడా ఆలోచన వచ్చింది. వారు శ్రీమతి లక్ష్మి చెప్పేదానిని తీవ్రంగానే ఆలోచిస్తు న్నట్లుగా కనిపించింది.

విజయలక్ష్మి లేచి నిలుచుంది, "నిజమే మాడం! మీరు గాంధీజీ పరంగా తెలిపిన విషయాలు, మా అంతట మేము అమలు పరచుకుంటే మా కుటుంబాలు ఎంతో సంతోషిస్తాయి. ఇప్పటి దాకా మా విధికృత్యాలు కనీసంగానైనా అర్థంగాలేదు. మీకు కృతజ్ఞులు మాడం!

"మాలో దాదాపు అందరమూ, మా అమ్మలు ఉదయం వంటింట్లో కాఫీలు తయారుజేసి, మేము నిద్రించే మంచాల దగ్గిర కొచ్చి, ఒకటికి పదిసార్లు లేపితేనేగాని లేవని అలవాట్లు గలవారము. పరీక్షల రోజుల్లో రాత్రిళ్లు చదవటానికి అమ్మలు టీలు, హార్లిక్సులూ కలిపి అందివ్వాలసిన పరిస్థితులు మావి. మా బట్టలు మేము ఆడ పిల్లలమై ఉండికూడా ఉతుక్కుంటం నామోషి మాకు. టెర్లిన్, టెరికాట్ సిల్కులులాంటి వస్త్రాలమీద నుంచి దాటి మామూలు గుడ్డల వైపు మా చూపు మరలదు. కుటుంబంలోనివారు మాకోసం అది చేయాలి, ఇది చేయాలి అనుకుంటూ, ఇది చేయలేదే, అదిచేయ లేదే అని గొణుక్కుంటంతోనే మా ఆలోచనలు ఆగిపోతున్నాయే

గాని, మేము కుటుంబానికి ఏమి చేస్తున్నామనే ఆలోచనలు మాకు గలగవు.

"వసుమతి అత్తయ్య అన్నట్లు గాంధీజీ బహుశా మగపిల్లలకు ఆ సలహా లిచ్చి ఉండవచ్చు. కాని ఆడపిల్లలమైన మేము ఈ వాళ మీ ద్వారా ఈ విషయాలు విని సిగ్గు పడుతున్నాను" అని పలికింది, విజయలక్ష్మి.

ఆ అమ్మాయి మాటల్లో అక్కడ చేరిన యువతులందరి అభి ప్రాయాలకూ ప్రాతినిధ్యం ఉన్నట్లు శ్రీమతి లక్ష్మికి తోచింది.

"అక్కరలేదు విజయా, సిగ్గుపడవలసిన పనిలేదు. గాంధీజీ ఏమనేవారో తెలుసా, తప్పులు చేయటం మానవ సహజం. తప్పేదో ఒప్పేదో తెలుసుకున్నాక మాత్రం ఒప్పు చేయటంలో మనిషి నిజాయితీ బయటపడుతుందనేవారు !" అన్నారు శ్రీమతి లక్ష్మి.

"Thanks Madam" అన్నది విజయ. ఆమె గొంతుతోపాటు యాభయిమంది ఆడపిల్లలూ తమ గొంతుకలు కలిపారు.

"Wish you all good luck my girls" "మీ అందరకూ నా శుభాకాంక్షలు" అని శ్రీమతి లక్ష్మి వారికి చెప్పారు. పెద్ద లందరివద్ద సెలవు తీసుకొని వారందరు గ్రామానికి ప్రయాణమయ్యారు.

# సోవియట్లు భూగడ్డపై

గంగా నదీతీరంనుంచి సోవియట్ల ఎయిరోఫ్లాట్ విమానంలో, బయలుదేరి ఆకాశమార్గంలో వోల్గానదీ తీరానికి వెళ్లటం ఏమీ శ్రమ అనిపించలేదు గాని, ఆ విమాన ప్రయాణంలో ఆ మార్చి మాసపు తొలిరోజు ఉదయాన, ఆ ఆకాశంనుంచి వెండిపిండిలాగా మంచు కురుస్తూంటే తెల్లనిదూది గుట్టలక్రింద కప్పబడినట్లున్న మాస్కో విమానాశ్రయంలో శ్రీమతి లక్ష్మి ప్రయాణిస్తూన్న విమానం దిగ లేకపోయింది.. క్రింద టవర్ నుంచి వచ్చిన సందేశాన్ని తీసుకొని చోదకుడు విమానాన్ని లెనిన్‌గ్రాడ్‌కు మళ్లించాడు. కొద్దిసేపట్లో ఇంధనాన్ని సమకూర్చుకొని మరల గగనప్రయాణంజేసి యూక్రె యన్ రాష్ట్రంలోని 'నూకలావ్' విమానాశ్రయంలో విమానాన్ని దింపాడు. ఈదారి మళ్ళింపులతో తెగబారెడుసాగిన ప్రయాణంలో లక్ష్మి చేతిగడియారపు చిన్నముల్లు తన డయల్ చుట్టూ ఒక ప్రదక్షిణం చేసింది.

అయితే, హోటల్ 'యుకారినా'లో దిగగానే స్థానిక మహిళా సంఘమువారు ఇచ్చిన ఆప్యాయతలు వెల్లివిరిసే స్వాగతం, అన్ని సౌకర్యాలతో నిండి ఉన్న విడిదిగది చూచినతర్వాత ప్రయాణ బడలిక మరచిపోయారు. 'హమ్మయ్యా' అని అనుకున్నారు శ్రీమతి లక్ష్మి.

అసలు రష్యాదేశ పర్యటనకు శ్రీమతి లక్ష్మి ఇపుడు సంసిద్ధ మవుతాననుకోలేదు. సోవియట్ రష్యా మహిళా సంఘంవారు, అఖిల భారత మహిళా సభ ప్రతినిధిగా రష్యాపర్యటించవలసిందిగా శ్రీమతి లక్ష్మిని ఆహ్వానించారు. అయితే ప్రయాణ వ్యవధి మాత్రం చాలా స్వల్పంగా ఉంది. తీరాబయలుదేరాలసిన రోజులు సమీపించేటప్పటికి రఘురామయ్యగారు అనారోగ్యంతో ఉన్నారు. వారిని వదలి ఈమె

విదేశాలకువెళ్లడం ఎంతమాత్రం రుచించలేదు. దాదాపు ప్రయాణాన్ని విరమించుకున్నారు.

ప్రయాణపు హడావుడి ఏమీ ఇంటిలో కనుపించకపోయే టప్పటికి రఘురామయ్యగారు అడిగారు, "లక్కీ మాస్కోకు ప్రయాణ సన్నాహమంతా పూర్తిజేసుకున్నావా?" అని.

"లేదు. మానుకున్నాను. మీ ఆరోగ్యమూ బాగులేదు. వెళ్లవలసిందా దూరదేశం. నాకెంతమాత్రం ఇష్టంలేదు." అన్నారు ఆమె.

ప్రక్కమీదనుంచిలేచి దిండ్లమీద చేయి ఆనించి, ఏటవాలుగా కూర్చొని, "మానుకున్నానని వాళ్లకు చెప్పావా?" అని అడిగారు, రఘురామయ్యగారు.

"రేపుదయమే ఫోనుచేస్తాను," అన్నారు శ్రీమతి లక్ష్మి.

"అలాచేయకు. నా ఆరోగ్యానిదేముంది. రెండురోజుల్లో కుదుటపడదూ! ఇంతకూ నాకేమంత అనారోగ్యముందనీ నీబెంగ! భలేదానివి. ప్రయాణం మానుకునే ప్రయత్నం ఎంతమాత్రంచేయకు, లక్కీ రష్యాదేశం చూచిరా! నీవుతిరిగి వచ్చేటప్పటికి చిరునవ్వులతో నీకు విమానాశ్రయంలో స్వాగతంచెబుతానుగా. వెళ్లిరా! లక్కీ." అన్నారు రఘురామయ్యగారు.

అయినా ఈమె మనస్సెందుకో ఉత్సాహంగాలేదు. ఆరాత్రి రఘు చాలాసార్లు ప్రయాణాన్ని ఆపవద్దని అనేకరకాలుగా ప్రోత్సహించారు.

సరేనని ఒప్పుకొంది శ్రీమతిలక్ష్మి. మూడోరోజు వారివద్దనుంచి నిరుత్సాహంగానే సెలవుతీసుకున్నది. ఈమె నిరుత్సాహాన్ని గమనించిన రఘు-"ఏమిటి! లక్కీ, అంత బెంగపెట్టుకుంటావ్." అంటూ భుజంమీద చేయివేసి, ఆర్ద్రంగా వీపు నిమురుతూ, "భలేదానివి ఈ బెంగ మొగంతోనే ఈ అఖిలభారత మహిళా మహాసభ ప్రతినిధి ఆ

రష్యావెళ్తే మనదేశపు స్త్రీలనుగురించి చెప్పకనే తెలుసుకోని, మా పురుషులపై అక్కడనుంచే విప్లవం లేవదీస్తారు. మా మగవాళ్లను విప్లవపోరాటానికి గురిచేయవద్దు. మేముగోవులవంటి వారము. మీ మాటను సర్వదా ఔదలలుస్తాము" అంటూ గొంతునిండా నవ్వారు.

వారిమాటలకు లక్ష్మికి నవ్వువచ్చింది. ఉత్సాహం వచ్చింది. ఈసారి సంతోషంతో సెలవు తీసుకున్నారు రఘురామయ్యగారి దగ్గిర.

చాలా రోజులనుంచీ రష్యాదేశం చూడాలనే కోరిక ఉంది శ్రీమతి లక్ష్మికి.

ఇనుపతెరకావల ఏముందోచూడాలనే కుతూహలం గలగటం సహజమే. జాన్ గంథర్ దగ్గరనుంచి,సోవియట్ రష్యా దేశాన్నిగురించి ఎందరెందరో ఎన్నెన్నిరకాలుగానో రాశారు. అనుకూలంగానూ ప్రతికూలంగాను వచ్చినపుస్తకాలకు లెక్కలేదు. వాటిల్లో పదిపేజీల నుంచి వేయిపేజీలవరకు విస్తరించిన గ్రంథాలున్నాయి. 1917 సంవత్సరం అక్టోబర్ లో విప్లవ ప్రభుత్వం ఏర్పడిననాటినుంచి నేటివరకూ ఆ దేశం, దేశదేశాల మేధావి వర్గాల మెదడుకు మేతపెడుతూనేఉంది. ప్రపంచవ్యాప్తంగా దాదాపు అన్ని నగరాలలోనూ, అన్నిపట్టణాల లోనూ, సోవియట్ల దేశాన్ని గురించి వివిధ వేదికలు ఏర్పడి అనుకూల ప్రతికూల వాదనలు సాగుతూనే ఉన్నాయి, తర్జనభర్జనలు సాగుతూనే ఉన్నాయి.

సోషలిస్టు సూత్రాలతో ప్రభావితులైన పెక్కురు మేధావులు ప్రథమంలో రష్యాదేశాన్ని విప్లవాన్ని పొగడి తదుపరి దానిని 'God that failed' అన్నారు. "వరమీయని వేలుపు'' అని అన్నారు.

కమ్యూనిష్టు రష్యాతో ఆకర్షితుడైన సుప్రసిద్ధ అమెరికన్ రచయిత లూయీస్ ఫిషర్, 14 సంవత్సరాలుపాటు సోవియట్

దేశంలో ఉండి, బయటకువచ్చి, రష్యాను తీవ్రంగా విమర్శించాడు. అచ్చటి ప్రభుత్వాధినేతలను, క్రూరులుగా ఆరోపించాడు.

ఒకసారి మహాత్మాగాంధి లూయీస్ ఫిషర్‌ను అడిగాడు, సేవాగ్రమంలో, "నీవు 14 సంవత్సరాలపాటు రష్యాలో ఉన్నావా?" అని.

"అవును మహాత్మా—" అని అన్నాడు ఫిషర్.

"స్టాలిన్ గురించి నీ అభిప్రాయమేమిటి?" అని అడిగారు మహాత్మ.

"అతి సమర్థుడు, అతి క్రూరుడు కూడా," అన్నాడు ఫిషర్.

"హిట్లర్ అంత క్రూరుడా?" అడిగారు గాంధీజీ.

"కనీసం" అని సమాధానం చెప్పాడు ఫిషర్.

ఆర్థర్ కౌజలర్, రష్యాను నరకకూపంగానే చిత్రించాడు. 'Darkness at noon' 'పట్ట పగటికి పట్టిన చిమ్మచీకటి' అని రష్యాను అభివర్ణించాడు. కమ్యూనిస్టు వ్యవస్థ అంటే, స్వేచ్ఛా వాయువులు సోకని, ఊపిరి సలపని ఒక భయంకర జీవన స్థితిగా చిత్రించాడు. జడప్రాయమైన సాంఘికవ్యవస్థగా అభివర్ణించాడు.

ఇక జార్జి ఆర్వెల్ "animal farm" అనే అన్నాడు. మనుష్యులు అక్కడ నిలవలేరు జంతువులు వినా అని అన్నాడు.

ఇంకా ఎందరెందరో పలుదేశ ప్రఖ్యాతమేధావులు తమ తమ తీవ్ర నిరసనను కమ్యూనిస్టు రష్యాపట్ల వెలిబుచ్చారు.

ప్రపంచమేధావుల్లో ప్రముఖులుగా పరిగణించబడి, మనదేశానికి సంబంధించిన; స్వర్గీయ మానవేంద్రనాథ్ రాయ్‌గూడా కమ్యూనిజాన్నుంచి వేరుపడిపోయిన వారిలో ఒకరు. లెనిన్ ఆహ్వానంతో, ఆ దేశానికి సగౌరవంగా పిలిపించుకొనబడి, ప్రపంచ దేశాల, ముఖ్యంగా వలసరాజ్యాల కమ్యూనిస్టు ఉద్యమవ్యాప్తికి లెనిన్

కాలంలోనే బాధ్యత వహించిన శ్రీ రాయ్, లెనిన్ అనంతరం అక్కడ ఉత్పన్నమైన పరిస్థితులను హర్షించలేక ఆ దేశాన్ని వదిలారు. మార్క్సు ఊహించి సిద్ధాంతీకరించిన కమ్యూనిజానికన్నా మించి మరొక 'Beyond Communism' ను సుదీర్ఘ పరిణామ క్రమంలో ఊహించి, 'New **Humanism**' నవ్య మానవ వాదాన్ని ప్రవచించారు.

అలాగే జయప్రకాశ్, డాక్టర్ లోహియాలు ఒకానొక నాడు మార్క్సు, ఎంగిల్సుల సిద్ధాంతాలకు ప్రభావితులైన ఈ దేశపు మేధావులు, కొంతకాలంపాటు రష్యాలో సాగిన విప్లవ ప్రభుత్వ గమనాన్ని గమనించి, కమ్యూనిజానికి దూరంగా వచ్చారు. అసలు ఆ దారే తొలిగారు.

వీరంతా "అందరకూ, అన్ని వేళలా కమ్యూనిజం సరిపోదులే" అనే నిర్ణయానికి వచ్చారు.

ఆ రోజుల్లో ఉత్సాహంతో అంతర్జాతీయ కమ్యూనిస్టుఉద్యమ వ్యాప్తికి త్రికరణ శుద్ధిగా కృషి జేసి, తద్వారానే ప్రపంచ పీడిత మానవాళి ఇక్కట్టులు శాశ్వతంగా తొలగించవచ్చని ఆశించినవారే, అనుభవాలను సమన్వయం జేసుకొని, దేశపరిస్థితులకు అనుగుణ్యంగా ఎవరికివారు ప్రజలశ్రేయస్సుకు ప్రజాస్వామ్య పద్ధతిలో కృషి జేయటంలోనే పీడిత మానవాళి అభ్యుదయం ఇమిడిఉంది అనే నిర్ణయానికి వచ్చారు.

జవహర్ లాల్ నెహ్రూ గూడా, ఒకనాడు కమ్యూనిస్టు రష్యా ప్రభావానికి లోనైనట్లే గన్పించినా, తదుపరి ఎదిగిన మానసికస్థితిలో భారతదేశానికి ప్రజాస్వామ్యమే శరణ్యమని త్రికరణ శుద్ధిగా నమ్మి, ఈ దేశంలో ప్రజాస్వామ్యపాలనను రాజ్యాంగరీత్యా చట్టబద్ధము చేయటమేగాక, పరిపాలనను ప్రజాస్వామ్యబద్ధంగాకూడా సాగించారనేది శ్రీమతి లక్ష్మి అభిప్రాయం.

మనదేశ పరిస్థితుల కనువైనరీతిలో, ప్రజాసంక్షేమాన్ని ఆశించి "సోషలిజం, సెక్యూలరిజం, డెమోక్రసీ'' సిద్ధాంతాన్ని నెహ్రూ ప్రతిపాదించాడు.

అలాగే రష్యా అంటే భూతల స్వర్గమనీ, నీనా భేదాలు లేకుండా అక్కడి సమసమాజం సర్వసుఖాలు అనుభవిస్తూ అభివృద్ధి పథంలో అగ్రగామిగా ఎంతో చైతన్యవంతంగా ప్రగతిపథంలో నడుస్తుందని చెప్పిన, చెబుతూన్న వారూ అసంఖ్యాకంగానే ఉన్నారు. వెలువడిన రచనలూ అపరిమితంగానే ఉన్నాయి.

ఇవన్నీ తెలుసుకున్నాకనే రష్యాదేశం ఒకసారి చూచి, ఆ దేశపు పోకడలను అర్థం చేసుకోవాలనే కోరిక శ్రీమతి లక్ష్మిలో తల ఎత్తి, బలపడింది.

కాగా ఈ నూతన సమాజంలో స్త్రీ పాత్ర ఎలా ఉందో స్వంతంగా చూడాలని గూడా ఉంది.

మతాన్ని మరచిపోయి. దేవుణ్ణి విస్మరించి దేవాలయాలను విద్యాలయాలుగా మార్చిన ఈ జాతి ఎట్లా మసులుకుంటుందో గమనించాలని కుతూహలమూ ఉంది. సరే ఇన్ని కారణాలుగా కోరుకున్న రష్యా పర్యటన ఇప్పుడు తటస్థించింది. రఘురామయ్యగారి తీవ్రప్రోత్సాహంతో మరల బట్టలు సర్దుకున్నారు. రష్యాలో అడుగు పెట్టారు.

మరురోజు ఉదయంనుంచే ప్రారంభమైన ఈమె కార్యక్రమపు తొలిమజిలీనుంచే, యాభయి సంవత్సరాలుగా కొనసాగుతూన్న సోషలిస్టు రాజ్యాంగవ్యవస్థలో, ఎన్నో ఇడుములు కుడిచి, కష్టాలను సహించి, ప్రయోగాలు చేసుకుంటూ ముందుకు నడచి; ఇప్పుడు కుదుటపడిన సామ్యవాద సామాజిక వ్యవస్థను అర్థం చేసుకుంటం ప్రారంభమైంది.

మాస్కో నగరాన్ని పూర్ణంగా సందర్శించారు. వివిధ మ్యూజియాలను, స్మారక చిహ్నాలను చూచారు. వ్యవసాయశాఖోద్యోగులతోనూ, వాళ్ల డిప్యూటీ మంత్రితోనూ సుదీర్ఘంగా సంభాషించారు. నర్సరీ స్కూళ్లకు, బోర్డింగు స్కూళ్లకు, బట్టలు కుట్టు పారిశ్రామిక కేంద్రాలకు, శస్త్రచికిత్సా పరికరాల పరిశ్రమలకూ

వెళ్లారు. టౌన్ హాల్, పయనీర్స్ పాలెస్, ఫ్రెండ్ షిప్ హౌస్ లాంటి వెన్నో గమనించారు. దారేపోయేవారిని కలుసుకున్నారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని వారితో మాట్లాడారు.

ప్రభుత్వ క్షేత్రాలను అర్థంచేసుకున్నారు. వారి యిండ్లూ వాకిండ్లూ చూచారు. ఇండ్లలో వాడుకునే పరికరాల స్థితి గతులను పసిగట్టారు.

అంతా చూచినతర్వాత సోవియట్ సామ్యవాద వ్యవస్థను వాస్తవ రూపంలో సూక్ష్మంగానన్నా తెలుసుకుంటానికి దోహదం గల్గిందనుకున్నారు.

'కమ్యూనిజమో లేక లెనినిజమో పేరు ఏదైనా గానీగాక, అది రష్యాలో జనసామాన్యాన్ని ఉద్ధరించినట్లు చెప్పవచ్చు. స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ ఉత్సాహంగా కనిపించారు. సుఖంగాఉన్నారు. తృప్తిగా బ్రతుకుతున్నారు. ఆరోగ్యంగా ఉన్నారు. మొఖాల్లో సంతోషం కనబడుతూంది. అన్ని సౌకర్యాలుగల బ్రతుకులు వారు బ్రతుకుతున్నారు. అయితే ఈ సమాజ నిర్మాణానికి, చేసిన త్యాగాలను గానీ, అనుభవించిన బాధలనుగానీ వారు విస్మరించలేదు.' అనుకున్నారు శ్రీమతి లక్ష్మి.

సోవియట్ స్త్రీలు నేడు పురుషులతోపాటు చెట్టపట్టాలు పట్టుకొని ముందుకు నడుస్తున్నారు అన్నిరంగాలలో. తృప్తికరంగా జీవిస్తున్నారుకూడా. అయితే అర్ధశతాబ్దంముందు పురుషుని చేతిలో స్త్రీ తిన్న దెబ్బలుగానీ, పొందిన అవమానభారాలనుగానీ ఇంకా అక్కడి స్త్రీజాతి మరచిపోలేదు.

భర్తలు భార్యలపై చేయిజేసుకోవటమనేది గతించిన తరాలకు సంబంధించిన దుష్ట స్వప్నంగా మాత్రమే ఈతరము యువతులు తలుస్తారు.

ఒక డెబ్బది రెండేడ్ల స్త్రీ పాల్గోవాఎడ్గార్నాతో ఒక పావు గంట మాట్లాడటం తటస్థించింది శ్రీమతి లక్ష్మికి ఒక సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో.

దుబాసీద్వారా అడిగిన అనేక ప్రశ్నలకు ఆమె సమాధానాలు చెప్పింది. విప్లవానికి పూర్వం తన స్వంత కుటుంబపుగాధలే స్మరణకు తెచ్చుకొంది. వాళ్ల తల్లిని, వాళ్ల అక్కను, వారి భర్తలు నిష్కారణంగా హింసించినతీరు విశదంగా వర్ణించింది. సాయంత్రమల్లా బజారుల్లో త్రాగి, అర్ధరాత్రి వేళకు ఇంటికివచ్చి గిల్లి కజ్జాలు పెట్టుకొని ఆరోజుల్లో భార్యలను ఎలా చితక బాదేవారో ఆమె గత స్మృతులను జ్ఞాపకం చేసుకుంటూ బరువుగా చెప్పింది.

శ్రీమతిలక్ష్మికి మాక్సింగోర్కీ 'అమ్మ' పాత్ర జ్ఞాపకం వచ్చింది. 'అమ్మ' పుస్తకం భారతీయులలో స్వాతంత్రేచ్ఛ పెంపొందించటానికి ఎంతో దోహదపడిన ఉత్తమ గ్రంథం. అందులో పావెల్ తల్లి, కథానాయిక 'అమ్మ' తండ్రితో ఎలా ప్రతిరాత్రి దెబ్బలు తినేదో గోర్కీ అద్భుతంగా చిత్రించాడు. ఆనాటి సంఘంలో ఎందుకూ పనికిరాని మగవాడికిగూడ ఇంటిలో ఆడది అణగిపడి ఉండేది. వారి పశుతృష్ణకు నిత్యమూ బలికావటమేగాక, మానసిక చాంచల్యాలకు గురై భర్తచేతిలో ఏవస్తువుంటే ఆవస్తువుకు తమ దేహాలను అప్పజెప్పేవారు.

గోర్కీ అంటాడు, 'ఏరోజైన దెబ్బలు తగలకపోతే ఆరోజు ఆమెకు పెద్ద పండగ' అని.

మరొకచోట, "స్త్రీ ప్రొద్దున్నే దేవుణ్ణి తలచుకొని ప్రార్థించేది, తనను ఈరోజు తన భర్తనుంచి దెబ్బలు తప్పించమనే!" అని అంటాడు.

మగవారికి ఆడవారికి ఆనాడు ఉన్న సంబంధం యజమాని బానిస సంబంధంలాగే ఉన్నదనేది నిర్వివాదాంశం.

రష్యాదేశ స్త్రీల బాధలూ, దెబ్బలూ, వారు ప్రొద్దున్నే ఎంత ప్రార్థనలు జేసినా, ఏదేవుడూ తీర్చలేదుగాని, సోవియట్ ప్రభుత్వం ఏర్పడ్డాక మాత్రమే స్త్రీల బాధలూ అవమానాలూ కనుమరుగై పోయాయనేది గూడా నిర్వివాదాంశమే.

సామ్యవాద ప్రభుత్వంలో క్రమంగా స్త్రీకి చదువులు అబ్బాయి, సంస్కారం లభించింది. వ్యక్తిత్వం పెరిగింది. ఆలోచనలు వచ్చాయి. స్వయంకృషికి దోహదం గలిగింది. వ్యక్తిగత ఆర్జన లభించింది. ఆర్థిక స్వాతంత్రం వచ్చింది.

ఆర్థికంగా పురుషునిపై ఆధారపడటమే స్త్రీజాతి సర్వానర్థాలకు మూలమని శ్రీమతిలక్ష్మి విశ్వాసం.

సోవియట్ దేశంలో స్త్రీలకు ఆర్థిక ఇబ్బంది ఎప్పుడైతే తప్పిందో, స్వయాన ఆర్జనా సదుపాయాలు లభించాయో ఆనాడే ఆమెకు బానిసత్వం తొలగింది. స్వేచ్ఛ లభించింది.

పురుషులు బైటికి ఎన్నైనా చెప్పనీయండి. ఆంతరంగికంగా, స్త్రీలు సంపాదిస్తుంటే సంతోషిస్తూ ఉంటారు. అందులో అబ్బుర మేమీ లేదు. కుటుంబపోషణకు పురుషులతోపాటు స్త్రీగూడా సంపాదించటంవల్ల, కుటుంబ సౌఖ్యం మిక్కుటమౌతుందేగాని తగ్గదుకదా !

అలాగే తన భార్య సంపాదనాపరురాలై తనతో సమానంగా భాగస్వామినియై, జీవితాన్ని ప్రయోజకత్వంగా నడుపుకునే స్థాయికి వచ్చినందుకు ప్రతి పురుషుడూ తప్పక ఆనందిస్తాడనేదిగూడా శ్రీమతి లక్ష్మి నమ్మకం.

సంఘంలో గౌరవాన్ని, పరపతి పొందేదిగూడా ఆర్థిక స్వాతంత్రం ఆమెకుఉన్నపుడే. స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యంతోమాత్రమే, సంఘంలో ఉన్న వివిధ అవాంఛనీయ పరిణామాలు తొలగిపోతాయి. సోవియట్ దేశంలో, 'శ్రమించి సంపాయించే తల్లులు గౌరవించబడ వలసినవారని' పిల్లలకు చిన్నతనం నుంచే బోధన గావిస్తారు.

రష్యా వెళ్ళకముందు శ్రీమతి లక్ష్మి అనుకునేవారు, "అక్కడ జీవితం ఉరకలూ పరుగులూ పెడుతుందని. అమెరికాతో ఏర్పడ్డ చంద్రమండల ప్రయాణాల పోటీల్లో మునిగిన సోవియట్ ప్రజల నిత్యజీవితం గూడా రాకెట్ల వేగంతోనే ఉంటుందేమోనని అనుకునేవారు.

కాని తీరా మాస్కో లెనెన్‌గ్రాడ్ మొదలైన ముఖ్యపట్ట ణాలు చూచిన తర్వాత ఆ అనుకున్నదానికి ఆమె నవ్వుకున్నారు. అక్కడి ప్రజలు చాలా నిదానంగా ఉన్నారు. పిచ్చెక్కినట్లు, హారన్‌లను మ్రోగించుకుంటూ అక్కడి కార్లుగూడా హడావుడిగా ఒకదాన్ని త్రోసుకోని ఒకటి పరువెత్తడంలేదు. కాగా అక్కడి స్త్రీ జనంగూడా మునివ్రేళ్లపై తేలియాడుతూ నడయాడటమూ లేదు, ఒక్క బాలెట్ ప్రదర్శనాలలో తప్ప.

బహుశా నడకలలో ప్రస్ఫుటించే ఈ నిదానం, వారి జీవన విధానంలో కుదురుకున్న విశ్వాసం ఫలితమేనని అనుకున్నారు శ్రీమతి లక్ష్మి. అన్నీ క్రమబద్ధంగా, ఒక పద్ధతి మేరకు ఉన్నప్పుడు ఎవరు గానీ, ఎక్కడగానీ పరువులెత్తవలసిన పని ఉండదు. పడిపోయి మోకాళ్లచిప్పలు పోగొట్టుకోవాలసిన అవసరమూ ఉండదు.

*　　　　*　　　　*

సోవియట్ యూనియన్‌లో వ్యవసాయమంతా బృహత్తరంగా యాంత్రీకరణ చేయబడింది. వారి జాతీయ మూలనిధిలలోంచి 20 వ శాతం వ్యవసాయరంగంలో పెట్టుబడి క్రింద ఖర్చుపెట్టబడుతుంది అని తెలుసుకోని శ్రీమతి లక్ష్మి నివ్వెరపోయారు. అత్యధికంగా వ్యవ సాయోత్పత్తులు సాధించటం ద్వారానే ప్రజల జీవన ప్రమాణాన్ని పెంపుచేయగలమనే సత్యాన్ని గ్రహించిన సోవియట్ ప్రభుత్వం వ్యవసాయరంగంపైన అంతటి పెట్టుబడులు పెట్టింది. ఆ అధికోత్ప త్తుల ఫలితంగానే దేశంలోని వ్యవసాయరంగంపై ఆధారపడ్డ జనంతో పాటు, నగరవాసుల నిత్యఅవసరాలను సంతృప్తికరంగా అందించ టంలోగూడా ప్రభుత్వం విజయం పొందింది. అయితే ఈ విజయాల సాధనలో ఆ ప్రభుత్వం ఎన్నో సాధక బాధకాలను ఎదుర్కొన్న విషయం వాళ్లు ఎంతమాత్రం దాచరు.

కారల్ మార్క్స ఒకచోట, "ధనికవర్గం, 19 వ శతాబ్ద కాలంలో రైతుల గుండెలలోంచి రక్తాన్నీ, తలలలోంచి మెదడునూ

పీల్చే ఒక పెనుభూతంగా తయారయింది" అని అంటాడు. మళ్ళీ ఇంకోచోట, "పెట్టుబడిదారీవర్గం బలపడుతూన్నకొద్దీ, వారి ఆకాంక్షలకూ, శ్రమజీవులైన కర్షకుల కాంక్షలకూ వైరుధ్యం ఏర్పడుతుంది. అయితే పెత్తనం నిర్వహిస్తూన్న పెట్టుబడిదారీవర్గం ఈ శ్రమజీవులలో సులభంగా అనైక్యతను సృష్టిస్తుంది. పేద బూర్జువా వర్గంలో గూడా విడదీసి, తనపైకి రాకుండా ఎప్పటికప్పుడు జాగ్రత్త పడుతూనే ఉంటుంది. అందుకని ఈ గ్రామీణ పేద రైతాంగం తమ జానిసత్వంనుంచి, దారిద్రంనుంచి, దోపిడినుంచి బయటపడాలంటే వారంతటవారు సంఘటిత పడలేరు. ఎంతగా వారిని ఉద్యమోన్ముఖులను జేయాలనుకున్నా గుప్పెటిలోని ఇసుకరేణువుల్లాగా జారిపోతారు. నిత్యమూ చైతన్యవంతమై, ఎపుడూ తిరుగుబాటు ధోరణిని అవలంబించే పారిశ్రామిక కార్మిక వర్గంతో వారిని కలిపి, ఈ ఇద్దరి ప్రయోజనాలను ఉమ్మడి దృక్పథం క్రిందకు తీసుకరాగలిగినపుడు కాపిటలిష్టు వర్గానికి గోరికట్టే చారిత్రాత్మకమైన కృషి విజయవంతమౌతుంది. కమ్యూనిష్టు నవసమాజానికి పునాదులు ఏర్పడతాయి." అని అన్నాడు.

రష్యాదేశంలో వచ్చిన విప్లవానంతర పరిస్థితిని అవగాహన చేసుకుంటే, సరిగ్గా మార్క్సుపై అభిభాషణలను లెనిన్ అమలు పరచారనేది స్పష్టమౌతుంది.

విప్లవానంతరం లెనిన్ వ్యావసాయిక రంగంపై ఆధారపడిన కోట్లాది పేదరైతాంగాన్ని, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలపేరిట, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలపేరిట, ఒక కొలిక్కి తీసుకవచ్చాడు. సాధ్యమైనంతవరకు వ్యవసాయ ఉత్పత్తులను పెంపుజేయించాడు. పారిశ్రామిక కార్మికవర్గంతో సంధానం చేయించాడు. కనకనే అక్కడి విప్లవం విజయవంతమైంది. విప్లవోద్దేశ్యమూ సఫలమైంది.

* * *

విప్లవానికి పూర్వం ప్రధానంగా రష్యా వ్యవసాయదేశమే అయినా ఉత్పత్తుల్లో చాలా వెనుకబడి ఉండేది. 20 మిలియన్ల వ్యవసాయ క్షేత్రాలలో, 13 మిలియన్లు పేద రైతులకు చెంది ఉండేవి. 9 మిలియనుల కొయ్యనాగళ్లు, 18 మిలియనుల కొయ్య గొర్రులు, 7.8 మిలియనుల గుర్రాలు లాగే ఇనుప కర్రులు బిగించిన కొయ్య నాగళ్లు ఉండేవి. 1916 లెక్కల ప్రకారం 0.8 శాతం కోరముట్లు మాత్రమే యాంత్రికమైనాయి. 15 శాతం మంది వ్యవసాయ శ్రామికులకు స్వంతభూమి లేదు. 30 శాతం మందికి గుర్రాలులేవు. మరి 34 శాతం మందికి ఏవిధమైన వ్యవసాయ పరిక రాలు ఉండేవిగావు.

మొత్తం సాగు భూమిలో రై, బార్లీ, ఓట్సులాంటి ఆహారధా న్యాలు 90 శాతం భూమిలో పండించబడేది. అయినా చాలా తక్కువ పంట లభ్యమయ్యేది. ఆ పంటలోగూడా, తనదేశపు ప్రజలకు తింటా నికి ఉన్నదా లేదా అనే విచక్షణగూడా లేకుండా, జారు ప్రభుత్వం ఏడాదికి 500 నుంచి 800 మిలియన్ల పూడ్సు ధాన్యం విదేశాలకు ఎగుమతిచేసేది.

రైతులు పండించుకుంటానికి పనిముట్లులేవు, పశుసంపదా లేదు. పెట్టుబడులూలేవు. పేదరైతులకు జరుగుబాటు బహుకష్టంగా ఉండేది. పాలుత్రాగటంగాని, మాంసం తినటంగానీ, వారికి బహు అరుదుగా మాత్రమే సాధ్యమయ్యేది. పేదలకూ పశువులకూ అట్టేతేడాలేదు.

అలాంటి పరిస్థితుల్లో విప్లవం వచ్చింది. ఇక అసంఖ్యాక పేద ప్రజానీకం విప్లవంలో పాల్గొన్నది. పాల్గొనక ఎలా మాను కుంటుంది? కాగా అప్పటికే మార్క్సు ఇచ్చిన "ప్రపంచ శ్రామికు లారా ఏకముకండు. పోగొట్టుకునేందుకు మనవద్ద ఏమీలేవు బానిస బంధనాలుతప్ప" అనే నినాదం అంతర్జాతీయంగా పలుకుబడి సంపా యించింది.

దేశంలోని పేద ప్రజానీకమంతా ఆ విప్లవ పోరాటంలోనే తమ భవిష్యత్తు ఆధారపడి ఉందని పరమంగా నమ్మి లెనిన్ నాయ

కత్వాన ఎన్నో త్యాగాలు జేసి, విప్లవ విజయాన్ని సాధించు కున్నారు.

అనన్యత్యాగాల ఫలితంగా సాధించుకున్న విప్లవ ప్రభుత్వాన్ని రక్షించు కొనుటకుగూడా, తర్వాత ఎన్నో త్యాగాలు చేయవలసి వచ్చింది. కాపిటలిస్టు రాజ్యాలు, నూతనంగా ఆవిర్భవించిన ఈ శ్రమజీవుల ప్రభుత్వాన్ని ఎప్పటికప్పుడు కబళింప పొంచిఉండి, చేసిన అన్ని ప్రయత్నాలను, స్థిరచిత్తంతో ఎదుర్కొని, తమ రాజ్యాన్ని శ్రేయోదాయక రాజ్యంగా, శ్రమ జీవుల స్వర్గంగా నిర్మించు కున్నారు. అభివృద్ధి పథంలో వేగంగా పురోగమిస్తున్నారు.

* * *

శ్రీమతి లక్ష్మి కావాలని సమిష్టి వ్యవసాయ క్షేత్రం చూడటా నికి ప్రత్యేకం ఒక కార్యక్రమం గల్పించుకున్నారు. ఈమె పర్య టించిన ఏ దేశంలోనైనా అచ్చట వ్యవసాయ క్షేత్రాలను సంద ర్శించి, వ్యవసాయీకులతో మాట్లాడందే ఈమెకు తృప్తి ఉండదు.

సహకార వ్యవస్థ ప్రాతిపదికగా, ఈ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ఏర్పాటు చేయబడ్డాయి. రష్యాలోని భూమియావత్తు విప్లవానంతరం, లెనిన్ ప్రభుత్వం యిచ్చిన డిక్రీ ప్రకారం, సమాజ పరం అయింది. అంటే ప్రభుత్వపరం అయింది. ప్రభుత్వం ఈ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో కృషిజేసే కర్షకులకు వారి ఉపయోగా ర్థము ఉచితంగా ఇవ్వటం జరిగింది. ఈ క్షేత్రాలపై పనిజేసే వారంతా ఈ సంఘంలో సభ్యులుగా ఉంటారు. ఈ భూమితోపాటు, ఈ క్షేత్రంలో వ్యవసాయానికై ఉపయోగించే, ట్రాక్టర్లు, డౌజర్లు కోత నూర్పిడులకు ఉపయోగించే భారీయంత్రాల లాంటివి, పశు సంపద, గృహాలు, గోదాములూ ఇవన్నీ సమాజపరమైన హక్కునే గలిగి ఉంటాయి.

ప్రతిక్షేత్రానికి వ్యవహారాలు చూచుకోవటానికి ఒక మేనే జింగుబోర్డు ఉంటుంది, విధానాలను నిర్ణయించటం, ఉత్పత్తులను పెంచటం, లెక్కలు తనిఖీ లాంటివన్నీ ఈ బోర్డు బాధ్యతలో ఉంటాయి.

జనరల్ బాడీ సమావేశాలుగూడా జరుగుతుంటాయి. ఆ సమావేశాలలోనే, ఆ క్షేత్రం ఆర్జించిన. మిగులు నిధులు ఎలా ఖర్చు పెట్టాలో నిర్ణయిస్తారు. క్రొత్త పరికరాలు కొనటానికో, ఆహార గోదాములు నిర్మించటానికో లేక, అక్కడ పనిచేసే కర్షక కుటుంబాల సాంస్కృతిక వికాసాల కవసరమైన నూతన నిర్మాణాలకు, విద్యాలయానికో చేయవలసిన ఖర్చును నిర్ణయిస్తారు.

ఈ క్షేత్రాలలో జరుగవలసిన పనులన్నీ ఆ కర్షకులే స్వయంగా చేయాలి. వారు పడే శ్రమనుబట్టి వారికి వరుమానం ఉంటుంది. చేసిన పనియొక్క విలువనుబట్టి నైపుణ్యాన్నిబట్టి ఈ ప్రతిఫలం ముట్టచెబుతుంటారు.

ఇక్కడ పనిజేసే వారందరకూ అన్ని వసతులతో ఆరోగ్యకరమైన పరిసరాలలో ఇండ్లు నిర్మించబడ్డాయి. పసిపిల్లలకు విద్యాలయాలు, సామూహిక వైజ్ఞానిక సాంస్కృతిక కేంద్రాలు అమర్చారు.

వ్యవసాయ క్షేత్రాలలో ఉత్పత్తయ్యే అన్ని సరకులు కొనుగోలు చేయటానికి, వినియోగదారుల సహకారసంఘాలు ఏర్పాటయ్యాయి. అన్ని సీజనులలోనూ ఈ ఉత్పత్తులను వెనువెంటనే కొని వినియోగదారులకు అందజేయడం, ఈ సహకారసంఘాలపని. కాగా ఈలాంటి క్షేత్రాలలో తయారయ్యే వాణిజ్యపంటలు, పత్తి లాంటి వానిని కొని ఆయా నూలుమిల్లులకు గూడా ఈ సహకార సంఘాలు సప్లయిచేస్తాయి. దాని ఫలితంగా మధ్య దలారీలు సంఘ వ్యవస్థలోనుంచి పూర్తిగా తొలగించబడ్డారు. అలాగే గ్రామాల్లో నివసిస్తూ క్షేత్రాలలో శ్రమించే వ్యవసాయకుల దైనిక అవసరాలు, క్షేత్రాలకు అవసరమైన వినియోగ వస్తువులుగూడా ఇదే సంఘాలు అవసరంకొద్దీ సప్లయిచేస్తాయి.

ఈ సమిష్టి క్షేత్రాలలో కృషి జేసే శ్రామికులకు వృద్ధాప్యము పెన్షను ఉన్నది.

ప్రతి క్షేత్రానికి నిర్ణయించబడిన పరిమితులకు మించి ఉత్పత్తి అయిన సరుకులకు, గవర్న్మెంటు మామూలుకన్నా అధికధరలు ఇస్తుంది. ఈ పద్ధతిద్వారా అదనం ఉత్పత్తి చేయటానికి రైతులు కృషి జేయగలరని వారి అభిప్రాయం. అది నిజం గూడా.

1971 లెక్కల ప్రకారం 32.3 వేల సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు రష్యాలో ఉన్నాయి. ఒక్కొక్కదాని సగటు 439 కుటుంబ కమతాలు. ఆరువేల హెక్టారుల భూపరిమితి ఉంటుంది. మొత్తం సమిష్టి క్షేత్రాల క్రింద 983 వేల ట్రాక్టర్లు, 295 వేల ధాన్యం నూర్పిడి యంత్రాలు, 561 వేల లారీలు, ఇంకా పలురకాల వ్యవసాయిక యంత్రాలు పనిచేస్తున్నాయి.

మొత్తంమీద వ్యవసాయ పారిశ్రామిక రంగాలలో రష్యా దేశం, తనకాళ్ళమీద తాను నిలబడి, తన దేశప్రజలకు జీవితావసరాలను సంతృప్తికరంగా తీర్చే కార్యక్రమంలో కృతకృత్యురాలయిందన్న భావం, ఆ దేశపులెక్కలను చూస్తూనే గాక, వాళ్ల జీవితాన్ని చూచినా అర్థమైంది శ్రీమతి లక్ష్మికి. అక్కడి ప్రజాజీవనం ఆహ్లాద కరంగా ఉన్నట్లు అర్థమయింది ఆమెకు. ఏ మాత్రం ఒడు దుడుకులు లేని, బ్రతుకులు, నిండు విశ్వాసంతో గడుపుతున్నారనేది గూడా ఆమెకు అర్థమయింది.

రష్యాదేశపు డిప్యూటీ వ్యవసాయ మంత్రి 'అగీబాలోవ్' తో సుదీర్ఘంగా వ్యవసాయరంగంలోని వివిధ విషయాలను గురించి ఈమె చర్చించారు. అచ్చటి వ్యవసాయశాస్త్రవేత్తలలోగూడా చాలావిష యాలు చర్చించారు. వీరిలో ఎక్కువమంది స్త్రీలు. ఆ విషయం ఈమెను మరీ సంతోషపెట్టింది. న్యాయానికి, రష్యా జీవితవిధానంలో స్త్రీలు పాలుపొంచుకొనని బాధ్యత అంటూ ఏమీ లేదు.

ఆ మాటకొస్తే వ్యవసాయ క్షేత్రాలలో గానీ, పారిశ్రామిక రంగాలలోగానీ, చివరకు రోదసీయానాలలోగానీ రష్యా వనితకు సముచితస్థానం ఉంది. అంతరిక్ష రోదసీయానంచేసిన ప్రథమ మహిళ రష్యాదేశస్థురాలే.

శ్రీమతి లక్ష్మి వ్యవసాయ శాస్త్రంలోని కుతూహలాన్ని గుర్తించి (Best co-operative famrer) పతకాన్ని రష్యా వ్యవసాయశాఖ ఉపమంత్రి 'అగీశాలోవ్' బహూకరించినపుడు, అది ఈమెకు గర్వకారణమైంది.

*　　　*　　　*

1973 లో తిరిగి రష్యా సందర్శించారు శ్రీమతి లక్షీరఘురామ్. సరిగ్గా ఒక దశాబ్దం పూర్తయినాక ఈసారి రష్యాను పునర్దర్శించటంలో అక్కడి మార్పులు ఈమెకు స్పష్టంగా కనుపించాయి.

ప్రతివారి నడకలో నిదానం కనిపించింది. ఆహార విహారాలలో మార్పు గనిపించింది. వేషభాషల్లో సున్నితం అగపడింది. అభిరుచుల్లో నాగరికం స్పష్టమయింది.

ఇది పది సంవత్సరాలలో వచ్చిన పెద్దమార్పు.

ఈమె తన కాతిథ్యం ఇచ్చిన, 'నీనా పెట్రోవా'ను ప్రశ్నించారు. "నా ఈ రెండు పర్యటనలలో ఎంతో వ్యత్యాసం కనబడుతుంది. కారణం ఏమిటి?"—అని.

దానికి—'నీనా' "ఆరోజుల్లో మేము మాదేశాన్ని స్వయం పోషకం జేసుకోటానికి, ప్రపంచ రాజ్యాల సరసన భద్రతను నిలద్రొక్కుకుంటానికి నిరంతరం కృషి జేశాము. మాదేశ జనాభాకు అవసరమైన ఉత్పత్తులేగాక ఈనాడు ప్రపంచంలోని వివిధ దేశాలకు అవసరమైన వస్తువులను ఎగుమతులు చేసే సంపన్న స్థితికి వచ్చాము. ఇప్పుడు మా ప్రజలకు హెచ్చు విశ్రాంతి యివ్వగలము. హెచ్చు

సౌకర్యాలు అందించగలము. దృష్టిని వికసింపజేసుకొనే అవకాశాలు గల్గాయి. ఈనాడు ఇతరదేశ ప్రజలతో పెక్కు సంబంధ బాంధవ్యాలను గలిగించుకుంటున్నాము. ఇతరులను అర్థంజేసుకొంటున్నాము. ఇతరులకు మేము అర్థంగావాలని గూడా కోరుకుంటున్నాము." అని అన్నారు.

అది చాలా సత్యంగా కనిపించింది శ్రీమతి లక్ష్మికి.

ఈతఫా చాలామంది గృహాలు చూచారు. చాలా తక్కువ ఆర్జనగల కుటుంబాలలో సయితం, టెలివిజను, ట్రాన్సిష్టరు లాంటి ఆధునిక సౌకర్యాలన్నీ ఉన్నాయి. పుస్తకాలు, మాగజైన్లూ ఉన్నాయి. బట్టల బీరువాలున్నాయి. ఈతరం యువతీ యువకులందరూ, వారికి నిర్దేశించిన కార్యక్రమాలను చేసుకుంటూనే, జీవితం పైలావచ్చీసుగా గూడా గడపాలని ఉవ్విళ్లూరుతున్నారు. లిప్‌స్టిక్కులు వాడుతున్నారు. రంగురంగుల వస్త్రాలు, అతిసున్నితమైన రకాలు, టర్లిన్, నైలాన్ లాంటి సింథటిక్ వస్త్రాలు, సుఖమయ వస్తువులను కోరుకుంటున్నారు. ఒకనాడు దేశమంతా ముతక దుస్తులనే వినియోగించాలనే నిబంధనలను ప్రభుత్వం తొలగించింది. కనస్యూమర్ గూడ్సు ఉత్పత్తికిగూడా ప్రభుత్వం ఉత్తర్వులిచ్చింది. తదనుగుణంగా, వారి సప్తవర్ష ప్రణాళికలను సరిచేసుకున్నారు.

గత పర్యాయంకన్నా ఈసారి రష్యాను చూచినపుడు వారిలో ప్రధానమైన మానసిక మార్పుగూడా వచ్చింది.

'సంపద పెరిగేటప్పటికి సహజంగా మనిషిలోవచ్చే తృప్తేఅది' అనుకొంది శ్రీమతి లక్ష్మి.

ఆరోజుల్లో, విప్లవాల కారణంగా, యుద్ధాల కారణంగా, దేశ పునర్నిర్మాణ బాధ్యతల కారణంగా, దాదాపు స్త్రీలు ఇరవై ముప్ఫయ్ సంవత్సరాలూ ఇంకా పైబడి మాత్రమే వివాహాలు జేసుకునేవారు. ఈనాడు ఇరవై సంవత్సరాలలోపు వయస్సునుంచిగూడా వివాహాలు జరుగుతున్నాయి.

ఆశ్చర్యమేమంటే, యూనివర్సిటీ విద్యలు కొనసాగించే విద్యార్థినీ విద్యార్థులుగూడా చాలా సందర్భాలలో పెండ్లిండ్లు చేసుకుంటున్నారు. వారు హాస్టల్సులో ఉంటూగూడా కాపురం చేస్తున్నారు. సంతానం గలిగితే పిల్లలను వారి దగ్గరే ఉంచుకోవచ్చు. వారు వారివారి కాలేజీలకు వెళ్లేటపుడు, ఈ బిడ్డలను సంబాళించే గృహాలలో వదలివెళ్ళి సాయంత్రం తిరిగి రాగానే మరల తమ హాస్టల్సుకు పిల్లలను తెచ్చుకుంటారు. కొంచెం పెద్ద పిల్లలవంగానే వారికి కిండర్ గార్డెన్ స్కూళ్లలో ఏర్పాటుచేస్తారు.

అంత నిశ్చింతగా అక్కడి జీవితం సాగుతుంది.

మతైక దృక్పధంలో గూడా పెద్ద మార్పు వచ్చింది. కొన్ని చర్చీలను చూచారు శ్రీమతి లక్ష్మి. ప్రజలు ఎక్కువసంఖ్యలోనే చర్చీలకు హాజరవుతున్నారు. మసీదులలో ప్రార్ధనలు విస్తారంగానే సాగుతున్నాయి.

శ్రీమతిలక్ష్మి తన ప్రక్కనున్న రష్యా అధికారిని అడిగారు. "తిరిగి రష్యాలో దేవుడు ఉద్భవించాడా!" అని. ఆయన నవ్వుతూ, "దేవుడూ, మతం వ్యక్తిగతవిషయాలు, ప్రతి మనిషీ తన యిష్టం వచ్చిన విశ్వాసాలను కలిగిఉండటానికి హక్కుగలిగి ఉన్నాడు. ప్రభుత్వం ఎంతమాత్రం జోక్యం కలిగించుకోదు" అన్నాడు.

నిజంగా ఇది కమ్యూనిస్టు దృక్పధంలో ఎంతో పెద్దమార్పు.

ఒకనాడు తాను విన్నది. చదివింది. "మతం మత్తుమందు లాంటిది. ప్రజలను బానిసలుగా చేయటానికి ఒక పెద్ద ఉపకరణ" అని కమ్యూనిస్టులు అనటం.

మార్పులు సహజమేగదా అనుకున్నారు ఈనాడు శ్రీమతి లక్ష్మి.

కాగా అనేకమంది రష్యన్ వనితలు, ఆభరణాలపై గూడా మోజు చూపిస్తున్నారు. ఫేషన్లుతో తయారయ్యే నగలను వాడుతున్నారు. ఇది గూడా సరిక్రొత్త విషయము.

ఒక ఆమె అడిగింది, నవరత్నాలను గురించి, "మీ దేశంలో ఈ రత్నాలకు ఒక విశిష్టత ఉంటుందటగదా. జాతకాల ప్రకారం, జ్యోతిష్యశాస్త్రం ప్రకారం, ఈ రత్నాలను వాడాలట గదా?" అని గూడా అడిగింది.

వారికి జ్యోతిషశాస్త్రంలో గూడా అసక్తి గలిగింది. యోగా భ్యాసమంటే ఏమిటనీ, దీనివల్ల ఉపయోగాలేమిటనీ, కొందరు ప్రశ్నించారు.

రష్యన్ జాతి నవతరంలో వచ్చిన ఈ మానసిక మార్పుకు ప్రభుత్వం ఎంత మాత్రం అయిష్టత చూపటం లేదు. సహజ పరిణామంలో రావలసిన మార్పుగానే గ్రహించింది.

ఈమెకు ఆతిథేయవర్గం చూపిన 'Sisters' అక్కచెల్లెండ్రు అనే సినిమా సరిగ్గా ఈ తరాల తారతమ్యాన్నే సూచిస్తుంది.

రష్యాదేశంలో పెరిగిన జీవనప్రమాణం కూడా గ్రహించిన శ్రీమతి లక్ష్మి ఆశ్చర్యపోయింది. 1960 లో సగటు ప్రతిమాసపు ఆదాయం 63.9 రూబల్సు ఉంటే, 1970లో అది 110 రూబల్సుకు పెరిగింది. అది 1975 లో 150 రూబల్సుకు పెరగుతుందని అంచనా వేస్తున్నారు. ఇవిగాక ఉచిత విద్య, ఉచిత వైద్యం పెన్షన్లువల్ల దాదాపు మరో 50 శాతం వ్యయం ఉచితంగా అక్కడిప్రజలకు కలిసివస్తుంది.

మాక్సింగోర్కి ఒకచోట అంటాడు, "ప్రతిరోజూ, ఒక చిన్న జీవితమే" అని. అది రష్యనులపట్ల ఈనాడు ఎక్కువగా ఋజువవు తుంది. 1966 నుంచి వారానికి రెండురోజుల సెలవు యిస్తున్నారు. ఈ రెండు రోజుల్లో సామాన్య ప్రజలంతా, పలుయితర ప్రాంతాలకు పోయి సుఖంగా కాలం గడపటానికి ఉత్సాహ పడతారు. జీవితానికి భద్రత ఉన్నప్పుడు, పిల్లల భవిష్యత్తుకు భద్రత ఉన్నప్పుడు, విరామ సమయాన్ని విశ్రాంతిగానే మానవుడు సద్వినియోగం చేసు కుంటాడు.

* * *

"ప్రపంచం, చిరజీవియా" గాక అంటూ కోరుకున్న ప్రపంచమహా మానవుడు 'కౌంట్ లియోటాలుష్టాయ్' స్వంతగృహాన్ని చూచి ఆ మహాపురుషుని చిత్రపటాన్ని సందర్శించుకున్నపుడు చేతులు జోడించి నమస్కరించారు శ్రీమతిలక్ష్మి.

ఆయన సుప్రసిద్ధ ఉత్తమ గ్రంథం (War and Peace) 'యుద్ధమూ—శాంతి' లో 'ప్రతి మానవుడూ తనకు తానే ఒక విశ్వం' అంటూ మనిషి మరణం విశ్వమరణంగానే చిత్రిస్తాడు.

ఇంకాను, 'మానవులందరూ, ఎంతో స్నేహంగా ఉంటూ సుఖంగా జీవించవలసి ఉండగా, ఒకరినొకరు చంపుకుంటూ బ్రతుకుతున్నారు, అని ఈ ఉన్నతోన్నత మానవతావాది విలపిస్తాడు.

మనిషి ఉత్తమంగా జీవించాలనేది, టాల్ స్టాయి మూల సిద్ధాంతం. ప్రతివ్యక్తి నైతికవిలువలను పరిపోషించుకుంటూ ఉండాలనేది ఆయన ప్రగాఢవాంఛ. సమష్టి ప్రయోజనానికి మనిషిఇచ్చే సహకారం, తోటిమానవులను అర్థంజేసుకొనుటలోనూ, వారితో కలివిడిగా మసలుకుంటంలోనూ, అతను చూపే శ్రద్ధాసక్తుల ద్వారానే తన చుట్టూఉన్న ప్రపంచంలో ఏకత్వభావాన్ని పొందటం జరుగుతుందని అంటాడు టాల్ స్టాయ్. గర్వపోతులన్నా, స్వార్థపరులన్నా ఈ ఋషి సత్తమునకు ఏహ్యాము.

టాల్ స్టాయ్ ఆలోచనల ప్రభావం, జీవించిన బ్రతుకు తీరు గాంధీజీపై మిక్కుటంగానేఉంది.

టాల్ స్టాయ్ పొలమంతా, పేదరైతుల వినియోగార్థం వ్రాసి యిచ్చినపుడు, ఆయన ఆశ్రమవాసిగా బ్రతుకును వెళ్ల మార్చుకున్నపుడూ, మొదటి సోషలిస్టు టాల్ స్టాయేనంటాడు గాంధీజీ. ఏసిద్ధాంతం గూడా వ్యక్తిగతంగా అమలుపరచుకోకుండా కేవలం ప్రవచించబడటాన్ని గాంధీజీ ఎంతమాత్రం గౌరవంచేవాడుగాదు.

గాంధీజీ తన జీవిత కథలో టాల్ స్టాయ్ రచనలు ఆయన్ను ఎంతగా ఆకట్టుకున్నదీ వివరిస్తాడు. 'The kingdom of god

within us' అనే టాల్‌స్టాయ్ పుస్తకాన్ని ప్రత్యేకంగ ఉదాహరిస్తాడుగూడా.

ఆఫ్రికాలో గాంధీజీ ఆశ్రమాన్నిస్థాపించి కుష్టురోగుల నివారణకు కృషిజేసిన దానిలోగూడా టాల్‌స్టాయ్ ప్రభావం స్పష్టంగా ఉన్నట్లు మనకు అర్థమౌతుంది.

'యాస్నాయా పోల్యానా' ఆయన నివసించిన ఆ రెండు అంతస్థులభవనం, ఈవాళ జాతీయ మ్యూజియంగా పిలసిల్లు తుంది. అనుదినమూ, అనేక మంది ప్రజలు, భూమి నాలుగు చెరగులనుంచీ వచ్చి, ఆ పల్లెటూరిలో, ఆ పుణ్యమూర్తి నివసించి, ప్రపంచానికి ఎన్నో, విలువగల గ్రంథాలను, అభిప్రాయాలను అందించిన ఆయన ఇంటిని సందర్శిస్తారు. గదిగదీ తిరుగుతారు. ఆయన వ్రాసుకున్న బల్ల, కూర్చున్న కుర్చీ, శయనించిన పక్క, వ్రాసిన కలం, చలికాచుకున్న నెగడూ, అన్ని భక్తిభావంతో దర్శిస్తారు. ఆ మహనీయుని చిత్రానికి నమస్కరిస్తారు. మనస్సును విజ్ఞతపరచుకొని, దృష్టిని విశాల పరచుకొని హృదయాన్ని కరుణామయం జేసుకొని, నెమ్మదిగా సెలవుతీసుకుంటారు.

# సుశిక్షిత జాతి

కర్మ సిద్ధాంతాన్ని శరణుజొస్తే తప్ప, ఏ కారణంతో భగవంతుడు మానవజాతిపై ఒకోక్కసారి చిన్నచూపుచూచి పలురకాలైన కష్టనష్టాలను గలిగించే ప్రకృతి వైపరీత్యాలను గలిపిస్తాడో అర్థంగాదు. కాని మానవుడు మాత్రం, తనకు తెలిసో తెలియకో నిష్కారణంగా తన జాతికి అంతకుమించిన అరిష్టాలను స్వయంగా గలిగించుకుంటాడు.

పదిహేడు మిలియనుల జర్మనీ జాతిని రెండుగా, జర్మనీ దేశాన్ని సగంగా చీలుస్తూ,1381 కిలోమీటర్ల పొడవునా గీయబడిన గీతా దానిపై పాతబడిన ముండ్లతీగనూ చూచిన తర్వాత సరిగ్గా శ్రీమతి లక్ష్మీరఘురామ్‌కు అదే అభిప్రాయం గలిగింది.

ద్వితీయప్రపంచసంగ్రామపు చరమ అంకంలో ఆఖరిరంగం నాజీ నాయకుల పరాజయ గాథ. మూడేండ్లపాటు మూడు అంకాలలో ప్రపంచాన్ని గడగడలాడించి రోజుకో పట్టణాన్ని వారానికోదేశాన్ని కబళించి, నడిచిన బాటవెంట గడ్డిపోచన్నా మొలవకండాచేసిన భీభత్స భయానక దృశ్యాలతో పుటలనునింపిన నాజీ మిలటరీ నాయకుల విషాదాంత నాటకంలో, చివరిదీ నాలుగవదీ అయిన అంకంలో, అంత భీరువులుగానే పరాజయం పొందటం గూడా, శ్రీమతి లక్ష్మికి గలిగిన పై అభిప్రాయాన్నే బలపరిచింది.

యుద్ధంలో జర్మనీ సంపూర్ణంగా నాశనమయ్యింది. ప్రధాన నగరాలన్నీ భస్మీపటలములయ్యాయి. రవాణా కేంద్రాలన్నీ పాడుపడ్డాయి. రేవుపట్టణాలు మూత పడ్డాయి. పౌర జీవితం తలక్రిందు లయింది. ఆర్థిక వ్యవస్థ కూకటివ్రేళ్ళతో కుళ్లగించబడింది. దేశమే ఒక పెద్ద బందిఖానాగా మారింది. జనమంతా బందీలయ్యారు.

అగ్రరాజ్యాలు తమతమ సైనిక స్కాంధావారాలతో తరలి వచ్చి జర్మనీని ప్రాంతాలవారీగా పంచుకున్నారు. కడకు జర్మనీ తనదంటూ ఏమీలేకుండా నాలుగు అగ్రరాజ్యాలచే పంచుకోబడింది. అసంఖ్యాకంగా మిత్రరాజ్య బాంబరు విమానాలనుంచి విసరబడ్డ బాంబులు జర్మనీ నేలపై చేసిన అఘాతాలూ, కూల్చిన కట్టడాలూ నేలమట్టంచేసిన నిర్మాణాలూ తలచుకుంటానికే ఆ రోజుల్లో భయంగా ఉండేది.

ఈ సర్వనాశనమునకు అసలు కారణం నాజీలనీ జ్ఞాపకం వచ్చినపుడూ, ఫాసిష్టు యుద్ధోన్మాదానికి పెక్కు పచ్చని దేశాలు వల్లకాడుగా మారిన విషయం జ్ఞాపకం వచ్చినపుడూ శ్రీమతి లక్ష్మి హృదయం భగ్గున మండేది.

కనకనే కాలం జర్మనీపై పగతీర్చుకుందా అనిగూడా ఆమెకు అనిపించింది.

జర్మనీలో జరిగిన భీభత్స కర్మకాండకు పరాకాష్టగా జర్మను దేశ రాజధాని బెర్లిన్ నగరంతోసహా విభజింపబడింది. ముండ్లతీగలూ అడ్డుగోడలూ నిర్మించబడ్డాయి. ఒక బెర్లిన్ నుంచి రెండో బెర్లిన్‌కు, ఒక జర్మనీ నుంచి రెండోజర్మనీకి రాకపోకలు నిరోధించబడ్డాయి.

ఈ ముండ్లతీగలు జర్మను దేశంతోపాటు జర్మను జాతిని గూడా శాశ్వతంగా రెండుగా విభజించడమేగాక, అయినవారిని దూరంచేశాయి. బాంధవ్యాలను రూపుమాపాయి. ఆప్తులు తీగలకు ఈవలా, ఆవలా ఉండి చూచుకొనగలరేగాని సమీపించుకొనుటకు గానీ, ఆలింగనం చేసుకొనుటకుగానీ నోచుకొనలేదు, మనస్సులో ఎంత తపించినా!

కావాలని తీగెల అడ్డులను దాట ప్రయత్నించిన ఎందరో కాల్చివేయబడ్డారు. మరింకెందరో జైలువాతపడ్డారు. వారి బిడ్డలు రెండు వేర్వేరు జాతులుగా పెంచబడ్డారు. జర్మన్‌జాతి ఒకటే అనే భావనా సూత్రం తెగిపోయింది.

ఇవన్నీ చూచిన తదుపరి శ్రీమతి లక్ష్మి, "బహుశా క్రొత్త ప్రపంచంలో ఇదే వారికి మంచిదేమో! ఈ ఎడమబాటే మేలు చేస్తుందేమో!!"నని అనుకున్నారు.

1956 వ సంవత్సరములో నిర్మించిన ఈ ముండ్లతీగెను ఈవాళ ఎవరూ దాటాలని అనుకోవటంలేదు గూడా.

కాగా రెండు జర్మనీలు, వేరు వేరు దృక్పథంతోనేకాగాక, దీక్షగా కృషిచేస్తూ ప్రగతి పథంలో పరువులెత్తుతున్నాయి.

* * *

షీరో సాముద్రిక శాస్త్రం ప్రకారం 1969 వ సంవత్సరం జూన్ నెల 12 వ తేదీ శ్రీమతి లక్ష్మి రఘురామ్‌కు ఒక మంచి రోజే!

అదేరోజున ఆమె పశ్చిమ జర్మనీలోని 'కొలోన్' పట్టణ విమానాశ్రయంలో సంతోషంగా దిగింది. ఆ దేశపు మహిళాఉద్యమ కార్యకర్తల స్వాగత సత్కారాలు విమానాశ్రయంలో ముగిసిం తర్వాత, ఆ సంతోషం మాయమయ్యింది. కారణం ఆమె సూట్ కేస్ అంతర్ధానం గావటమే!

"ఇదేమిటి జర్మనీ దేశంలో సరుకులు తస్కరించబడటమా!" అని విస్తుపోయింది.

ప్రక్కనే ఉన్న ఆ ప్రతినిధివర్గంలోని తోటి దక్షిణాత్య ప్రతినిధులు, వారి చీరెలను ఈమెకు అందించడంలో ఇబ్బంది అప్పటికి తీరింది.

హోటల్లో, ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీకి అత్యంత ప్రముఖులుగా వీరు వారి ఆతిధ్యమర్యాదలు స్వీకరించిన తదుపరి, శ్రీమతి లక్ష్మి తన లగేజి పోయిందన్న విషయమే మరచిపోయారు. జర్మనుదేశంలో వారి కార్యక్రమాలు సత్కారాలూ వీరు చూడ దలచుకొన్న ప్రాంతాల వివరాలూ, ప్రయాణసన్నాహాలూ,

ఖర్చులూ, చెక్కుబుక్కులూ, రోడ్డుమ్యాపులూ అన్నీ సర్వసిద్ధమై సమకూర్చబడి ఉన్నాయి.

ప్రధానంగా ఈ యాత్ర స్త్రీల సమస్యల నధ్యయనం జేసు కొనుటకు ఉద్దేశించబడినప్పటికీ, శ్రీమతి లక్ష్మీరఘురామ్‌కు అధిక ఆసక్తికరమైన వ్యవసాయ విషయాలు తెలుసుకుంటానికి కూడా ఈ కార్యక్రమంలో అవకాశం గలిగించబడింది.

ప్రయాణ బడలిక తీరింతర్వాత, జర్మనీని గురించి వారి ముందుంచిన వివిధ సమాచారపత్రాలూ చదివారు. హోటల్ 'లాంజ్'ని దర్శించారు. రిసెప్షన్‌లో విషయాలు గ్రహించారు. బాల్కనీనుంచి పరిసరాలను గమనించారు.

ఇవన్నీ జర్మనుల సామర్థ్యాన్ని తెలియజేశాయి. అదేరోజు శ్రీమతి లక్ష్మి మొదటి తన కార్యక్రమాన్ని ముగించుకొని తన హోటలు గదికి వచ్చేటప్పటికి ఉదయం అంతర్థానమైన తన సూట్ కేసు టేబుల్‌పై ప్రత్యక్షమైంది. ఈమెకు సంతోషం ఆశ్చర్యం గలిగాయి.

సాధారణంగా విమానయానాల్లో ప్రయాణీకులు ఉపయో గించే సూట్‌కేసులన్నీ ఒకేవిధంగా ఉంటాయి. ఫ్రాంక్‌ఫర్టులో పొర పాటున ఒక పెద్దమనిషి దానిని తీసుకొని వెళ్లాడు. ఇంటికెళ్లి పెట్టె తెరవంగానే దర్శనమిచ్చిన చీరెలు వగైరాలుగాంచి ఆ పెద్దమనిషి ఒక్కసారి బిత్తరపోయి ఉంటాడు. ఆవులించి ఉంటాడు.

ఎలాగయితేనేం శ్రీమతి లక్ష్మి పెట్టె ఆమె గదికి భద్రంగా జేరింది. జర్మనుల సామర్థ్యానికీ, నిజాయితీకి ఈ చిన్ని విష యం కూడా నిదర్శనంగానే ఈమెకు కన్పించింది.

* * *

"పక్షపాతంతో చెబుతున్నాను అని అనుకోకపోతే, ఈ జర్మ నుల సమర్ధత వెనుక స్త్రీ శక్తి నిబిడమైఉందని తెలుపటానికి నాకు ఏలాంటి సంశయమూలేదు." అంటారు శ్రీమతి లక్ష్మి.

జర్మనుదేశ సర్వతోముఖాభ్యుదయానికి ఇచ్చటి స్త్రీజనం చూపిస్తూన్న పూనిక నర్థం చేసుకున్న తదుపరి, ఏ దేశ ప్రగతి కృషిలో స్త్రీలు విస్మరించబడతారో, ఆ దేశంలో ద్యోతకమయ్యే దరిద్రం, అజ్ఞానం ఈమె మనస్సు ముందు మెదిలాడింది.

ఏ చోట మహిళాలోకపు ప్రతిభను గుర్తించి, వారిసామర్థ్యాలకు ప్రోత్సహం గలిగించబడుతుందో, స్త్రీ శక్తికి గౌరవ పరిగణన లభిస్తుందో, ఆదేశ సిరిసంపదలూ, చిరునవ్వుల మొగాలూ ఈమె మనస్సులో చిందులాడాయి.

"అందాకా ఎందుకు? మనకుటుంబాల చరిత్రలు తీసుకున్నా, ఈ నిజం తెల్లమవుతుంది. ఏ కుటుంబంలోని స్త్రీలు వారి ఇంటి వ్యవహారాలలో శ్రద్ధాసక్తులను జూపి నడుపు బాధ్యతలు పురుషులతోపాటు పంచుకుంటారో, ఆ ఇండ్లు మన పల్లెలలోగూడా కలకలలాడుతూ ఉంటాయి." అంటారు శ్రీమతి లక్ష్మి.

*　　　*　　　*

జర్మనీలో స్త్రీ పురుష భేదం ఏ విషయంలోనూ లేదు. అన్ని సాంఘిక ప్రయోజక చట్టాలను జర్మన్ స్త్రీలు సద్వినియోగం చేసుకున్నారు.

గత ప్రపంచయుద్ధానికి పూర్వం మాత్రం దేశంలోని స్త్రీల పరిస్థితి, మనదేశపు స్త్రీల స్థితిలాగే ఉండేది. అయితే యుద్ధానంతర నూతన వ్యవస్థలో ఆ పరిస్థితి పూర్తిగా మారింది. గత రెండు దశాబ్దాలుగా జర్మనీ మహిళలకు వలసినంత ప్రోత్సాహం లభించింది. దేశీయ పునర్నిర్మాణంలో మహిళ తనవంతు బాధ్యతలను నిర్వహించేందుకు, చైతన్యం పొందారు.

దేశాన్ని అన్నివిధాలా ఉన్నతపథంలో నిలపాలనీ, తద్వారా తమ దేశీయప్రజ ఉత్తమంగా బ్రతకాలనే ధ్యాస, జర్మన్ స్త్రీల మనస్సులో సదా మెసలుతూ ఉంటుంది. వారి ముఖాలలో ఉత్సాహం వెల్లుబుకుతూ ఉంటుంది.

జర్మన్‌దేశపు సుప్రీంకోర్టులో 17 గురు మహిళలు న్యాయ దేవత ప్రతిమూర్తులుగా ఉన్నారని తెలుసుకొన్నప్పుడు శ్రీమతి లక్ష్మి హృదయంనిండా సంతోషం పొంగిపొరలింది. ఆ విషయాన్ని తెలిపిన జర్మన్ మహిళా ఉద్యమ నాయకురాలితో కరచాలనం జేసి జర్మను మహిళలు సాధించిన ప్రగతికి హృదయపూర్వక అభినందనలు తెలిపారు.

అయిదు శాతానికి మించి ఫెడరల్ కోర్టులలో స్త్రీలున్యాయ నిర్ణేతలుగా విధి నిర్వహణ జేస్తున్నారు. ఉపాధ్యాయవృత్తిని జర్మన్ మహిళలు అధికంగా అపేక్షిస్తారు. ప్రాథమిక ఉపాధ్యాయ వృత్తిలో నూటికి అరవైమంది స్త్రీలని తెలుసుకొని ఆశ్చర్య పోయారు ఈమె. జర్మను బాలురను తీర్చిదిద్దడంలో ఈ మహిళా ఉపాధ్యాయినులు గుర్తించిన బాధ్యతను తెలుసుకొని ముగ్ధురాల య్యారు.

పశ్చిమ జర్మనీలో వ్యవసాయవృత్తి ఇతర వ్యాపకాలతో పోల్చుకున్నపుడు ఏమంత లాభసాటిగా కన్పడదు. అయినా ఆ దేశపు అందమైన యువతులూ, ఉన్నత విద్యలు సాగించినవారూ, రైతు యువకులను వివాహం జేసుకోవాలని కోరుకుంటారు. నగర జీవితంకన్నా అక్కడ గ్రామీణ జీవితమే వారికి శోభాయమానంగా ఉంటుంది. సుఖప్రదంగా గనిపిస్తుంది. ఉత్సాహంగానూ ఉంటుంది. 1964 జనాభా లెక్కల ప్రకారం స్త్రీలు 21.2 శాతం వ్యవసాయ రంగంలో కృషి జేస్తున్నారు.

పశ్చిమ జర్మనీ మహిళోద్యమ నాయకురాలు ఒకరు ఒక పూట శ్రీమతి లక్ష్మిని తేనీటికి ఆహ్వానించారు. జర్మనీ మహిళా ఉద్యమపు వివిధ గతులను, చర్చించుకొని ప్రపంచవ్యాపిత మహిళా ఉద్యమంలో జర్మన్ మహిళలు నిర్వహించవలసిన పాత్రను సంభా షించుకున్న తదుపరి, ఆమె అన్నారు శ్రీమతి లక్ష్మితో, "మా దేశంలో మా ఆడవాళ్లం తలచుకుంటే ప్రభుత్వాన్ని స్తంభింపజేయ గలము. ఒక్క అడుగు ముందుకు జరుగనీయముగూడా!" అని.

ఆ మాటకు శ్రీమతి లక్ష్మీరఘురామ్ నవ్వారు.

అది సత్యంగూడా. ప్రభుత్వ నిర్వహణలో స్త్రీల పాత్ర అంత హెచ్చుగా ఉంది ఆదేశంలో. "ఈనాటికి ఈమాట మాటవరసకే వరకే సరిపోయింది. కాని వచ్చే తరంవారు, అవసరమనుకుంటే, వాళ్ల కోర్కెల సాధనకు ఒకపట్టు పట్టరని మాత్రం ఏముంది?" అంది శ్రీమతి లక్ష్మి.

నిజము గావచ్చుగూడానేమో !

ఒకనిముషం, ఈ ఇరుదేశాల మహిళా నాయకురాండ్రు నిశ్శబ్దంగా ఎవరికివారే ఆలోచించుకున్నారు. ఒక్కక్షణం ప్రపంచ మహిళోద్యమ భావిస్వరూపాన్ని మనోనేత్రంతో తిలకించు కున్నారు.

'అవసరమైతే ప్రభుత్వాన్నిగూడా స్తంభింపజేయగలం' అని ధీమాగా ఆమె పలకటానికి సరైన కారణమేఉందని శ్రీమతి లక్ష్మికి, ఎప్పుడుస్ఫురించిందంటే, ఆమె దగ్గిరనుంచే కొన్ని లెక్కలు సేకరించింది. 1964 లో తీసిన లెక్కల ప్రకారం పారిశ్రామిక రంగంలో 33 శాతం; వాణిజ్యరంగంలో 18 శాతం; వ్యవసాయరంగంలో 21.2 శాతం మంది స్త్రీలు నియుక్తులై ఉన్నారని, ఆమె సేకరించిన లెక్కలు తెలిపాయి. ఇంత విస్తృతంగా సామాజిక గమనంలో బాధ్యతలు నిర్వహిస్తూన్న మహిళలు, తలుచుకుంటే చేయలేనిదేముంది?'—అని అనిపించింది శ్రీమతి లక్ష్మికి.

ఈ దేశంలో మహిళలకు పలురకాల సంక్షేమ సంఘాలున్నాయి. అవన్నీ ప్రభుత్వ పోషణక్రిందనే నడుస్తున్నాయి. మన దేశంలోవలె ఐచ్ఛిక సంఘసేవా కేంద్రాలంటూ మచ్చుకైనాలేవు.

ఈ సాంఘిక సంక్షేమ శాఖవారి ఆధిపత్యంలోనే, వస్తు వినిమయదారుల సాధకబాధకాల పరిశీలన జరుగుతూంది. కల్తీసరకులు నకిలీ సరుకుల మాట జర్మనీ ప్రజలకు కొత్తమాట.

అన్ని రంగాలలోను, అధిక ఉత్పత్తికి, అధిక ప్రాముఖ్యం ఉంది ఈ దేశంలో.

జర్మనులు కేవలం వాస్తవిక వాదులు. నేలవిడిచి సాము చేయడం వారు ఎరుగని విద్య. ఒక ప్రఖ్యాత సైంటిస్టు శ్రీమతి లక్ష్మీరఘురామ్‌తో అన్నారు. "మేము మా దేశాన్ని, మా ప్రజానీకాన్ని బాగుచేసుకోవాలని చాలా తాపత్రయ పడుతున్నాము. చంద్రమండలానికి మనిషిని పంపడం మాకు చాలా అనవసరం." అని. ఈ మాటనుబట్టే జర్మను జాతి ఆలోచనా క్రమాన్ని అర్థం చేసుకోవచ్చు.

కనకనే ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామానంతరం, రెండు దశాబ్దాలుగడిచేసరికి, తిరిగి ఈదేశం మామూలు జర్మనీగా రూపొందింది. అంతకుమించిన శక్తిగల దేశంగాకూడా తలఎత్తింది. శిథిలాలలోనుంచి సౌధాలు లెగిశాయి. స్మశానాలలోనుంచి, జీవశక్తి ఆవిర్భవించింది. నిరాశా నిస్పృహలనుంచి, ఉత్సాహ ఉద్వేగాలు మొలకెత్తాయి. అపజయాల పరంపరనుంచి విజయాలు పునః ఆరంభమయ్యాయి. అవమానాలభారంతో నేలచూచిన తలలు, సగర్వంగా నింగిచూచే స్థితికి వచ్చాయి.

జనశక్తికి నిదర్శనంగా, క్రమశిక్షణకు పర్యాయపదంగా తొల్లిటి వైభవాలను తలదన్నే రీతిగా, దేశాన్ని తీర్చిదిద్ది ఐరోపా ఖండంలో అత్యంత సౌభాగ్యవంతమూ, పటిష్టవంతమూ అయిన దేశంగా పరిఢవిల్లింది. ఈనాడు ప్రపంచ సంపన్న అగ్రదేశాలైన మొదటి నాల్గింటిలో స్థానం ఏర్పరచుకొంది. ఆ స్థానం భద్రమైనది గూడా.

"ఈ దేశానికి శాపమేమన్నా ఉందంటే అది దాని క్రమశిక్షణే" అని అంటారు శ్రీమతి లక్ష్మీరఘురామ్.

"అయితే వరంగూడా అదేనేమో ఈ దేశానికి అని అనిపిస్తుంటుందినాకు." అనిగూడా అంటారు సాలోచనతో శ్రీమతి లక్ష్మీ రఘురామ్.

"ఆనాటి పాత జర్మనీ వినాశనానికీ, ఆనాటి నాయకులపట్ల ప్రజానీకం అకుంఠితంగా చూపించిన క్రమశిక్షణే కారణం. అలాగే ఈ నూతన జర్మనీ సౌభాగ్యవంతంగా అతిత్వరలో విలసిల్లటానికి గూడా కారణం ఆ క్రమశిక్షణే ఆధారమయిందనుకుంటాను." అని నిర్ణయిస్తారు శ్రీమతి లక్ష్మీరఘురామ్.

* * *

గత ప్రపంచ యుద్ధానంతరం జర్మనీలో ఎందరో బిడ్డలకు తల్లిదండ్రులు లేరు. ఆశ్రయం లేదు. వారికి ప్రభుత్వం అనూహ్యామైన సహాయమందించింది. పిల్లల యువకుల సంక్షేమ శాఖను ఏర్పాటు చేసింది.

చిన్నపిల్లలను అత్యాధునిక 'వికట నాగరికత' నుంచి కాపాడటానికి కొన్ని చట్టాలు చేసింది. ఆరు సంవత్సరాలలోపు బిడ్డలు సినిమాలు చూడరాదు. నగ్న అర్ధనగ్న శృంగారక సినిమాలూ, క్రౌర్య భయానక చిత్రాలూ వారికి నిషేధం. అసలు సినీ నిర్మాతలే ఐచ్ఛికంగా విధినిషేధాలను నిర్ణయించుకొని పాటిస్తారు. చట్టంగూడా ఈ విషయంలో ఏమాత్రం సల్లు పొల్లులు లేకుండా ఉంది. అవాంఛనీయమైన పుస్తకాలూ పత్రికలుగూడా నిషేధించబడినాయి.

యువకుల లేతమనస్సులను చెడగొడతాయనే భయంతో 12 మంది విజ్ఞులతో పుస్తకాలను పరిశీలించే సంఘం ఉంది. టెలివిజన్ కార్యక్రమాలు, పత్రికల్లోని అడ్వర్టయిజ్‌మెంట్లు గూడా నిశితంగా పరిశీలించ బడతాయి. పిల్లలు రాత్రి 9 గంటల అనంతరం టెలివిజన్ ప్రదర్శనలు చూడరాదు.

సాధారణ విద్యలతోబాటు, జాతీయ అంతర్జాతీయ రంగాలలో రాజకీయ పాఠాలుగూడా బోధిస్తారు. తల్లులకూ పిల్లలకూ మానసికోల్లాసాన్ని గల్గించేందుకు జర్మను ప్రభుత్వం చాలా ప్రాధాన్యం ఇస్తుంది. పిల్లలను వినోద కేంద్రాలకు తీసుకు వెళ్లేందుకై డబ్బును

మంజూరు చేస్తుంది. విద్యార్థుల మానసిక వికసనంకోసమై, విదేశాలకు అప్పుడప్పుడు పంపే కార్యక్రమాల నెన్నింటినో ప్రవేశపెట్టింది.

లైంగిక విజ్ఞానాన్ని పిల్లలకు సుబోధకం చేయడంలోగూడా జర్మనీ ముందంజవేసింది. పది సంవత్సరాల వయస్సుదాటిన పిల్లలకు సెక్సు విజ్ఞానం శాస్త్రీయపద్ధతిలో బోధపరుస్తున్నారు. తల్లులు,కడకు మతసంస్థలుగూడా పిల్లలకు సెక్సు విజ్ఞానం ఇవ్వాలని కోరుకుంటు న్నాయి. శారీరక శాస్త్రాన్ని పిల్లలకు బొమ్మలతో సహా విడమరచి తెలిపే పాఠాలు పాఠ్యగ్రంథాలలో విధిగా ఉంటాయి.

* * *

సంపదకూ చైతన్యానికీ జర్మనుల నిర్మాణాత్మక కృషికీ వారి దృఢ దీక్షకు నిదర్శనంగా, బెర్లిన్, కలోనో, ఫ్రాంక్‌ఫర్టు, హాంబర్గ్, కలోన్ పట్టణాలు ఎంతో వేగంగా అభివృద్ధి చెందుతు న్నాయి. దేశపు వాణిజ్యపంటంపై దిగుమతులను తగ్గించుకుంటూ ఎగిమతులను పెంచుకుంటూ ఏ సంవత్సరాని కాసంవత్సరం క్రొత్త రంగులతో సంపదను చిత్రించుకుంటున్నారు. ప్రజానీకంలో ఉత్సాహం వెల్లి విరుస్తూంది. జర్మను దేశాన్ని ఆర్థికంగా పటిష్టం జేసు కోవాలనే తపన వారి ప్రతిచేష్టలోను ద్యోతకమౌతుంది.

జర్మనీ దేశంలో 'బ్రిమెన్' ఒక నౌకా నిర్మాణ కేంద్రం. ఉత్తర సముద్రానికి 40 మైళ్ల దూరంలో ఉన్నప్పటికీ ఈ పట్ట ణాన్ని 'వెసెర్' నదిద్వారా సాగరజలాలతో కలిపారు. ఇచ్చటి ప్రసిద్ధ పురాతత్త్వ ప్రదర్శనశాలను, ఆధునిక పట్టణాన్ని చూచిన తర్వాత పాతకొత్తల మేలుకలయికగా ఈ పట్టణం పురోభివృద్ధి గాంచటం మనకు ప్రస్ఫుటం అవుతుంది. ఇది సంగీత నృత్యకళలకు కాణాచి. కాగా ఈ పట్టణంలో కావలసినంత విశ్రాంతి. అయితే ఇచ్చట ప్రజల్లో కనిపించే విశ్రాంతి సోమరితనంగాదనిగూడా వెంటనే స్ఫురిస్తుంది. ఈ విశ్రాంతే ఈ ప్రజల పురోభివృద్ధికి ఇచ్చట ఎంత గానో దోహదం చేస్తుంది. పరిశ్రమల్లో యాంత్రీకరణ, స్వయం

చలిత విధానం, శాస్త్రీయత, కావలసినంత విశ్రాంతిని ఇచ్చేటి పౌరులకు ప్రసాదిస్తుంది. ఆ విశ్రాంతికాలంలో, భవిష్యత్తును ఉన్నతంగా నిర్మించుకునే అనేక అవకాశాలను వారు శోధించుకుంటూ ముందుకు నడుస్తున్నారు.

570 సంవత్సరాల వయస్సున్న టౌన్‌హాల్ ప్రసిద్ధమైనది. ఉత్తమోత్తమంగా నడుపబడుతున్న ప్రాథమిక విద్యాలయాన్ని, కిండర్ గార్డెన్ స్కూళ్లను, వికలాంగులైన పిల్లల వసతిగృహాన్ని శ్రీమతి లక్ష్మి సందర్శించారు. అన్ని విధాలా కన్నుల పండుగగావిస్తూన్న ఒక వ్యవసాయక్షేత్రాన్ని పూర్తిగా చూచి, అక్కడి కార్యక్రమాలను తెలుసుకున్న పిదప వ్యవసాయదేశంగా పరిగణింపబడుతూన్న మనదేశపు వ్యవసాయరంగం ఎంతటి దౌర్భాగ్యకరంగా ఉందో అర్థమయింది ఈమెకు. మనదేశం దుర్భిక్షంతో ఎలా సతమతమౌతుందో గూడా అవగాహన అయింది.

ఇక్కడ ట్రేడ్ యూనియన్‌లలో ప్రత్యేకం మహిళా కార్మికుల ప్రయోజనంకోసం వేరే కమిటీలు ఉన్నాయి.

పశ్చిమజర్మనీని ఒకవారం రోజులపాటు సందర్శించి, ఆ దేశం సాధించిన అభ్యుదయాన్ని చూచిన తర్వాత, ఈ జాతిలో ఏదో ఒక గొప్పతనం మర్మగర్భంగా ఉందేమోననిపించింది శ్రీమతి లక్ష్మికి.

పాతికేళ్లనాడు ప్రపంచయుద్ధంలో సర్వం పోగొట్టుకోబడి ప్రపంచదేశాలలో అవమానాలపాలైన దేశం, తిరిగి ఇంత స్వల్ప వ్యవధిలో పుంజుకొని పూర్వంకన్న మించిన ఔన్నత్యంతో నేడు ప్రపంచ సంపన్న రాజ్యాల సరసన తులతూగటం నిజంగా ఒక అద్భుతంగానే తోచింది. జాతిలోని పట్టుదల, నిగ్రహం, సాధించాలనే వాంఛ, జాతిని ప్రతిక్షణాని కాక్షణం ఉద్దీప్తంజేసే నాయకత్వం లభిస్తే ఏ దేశమైనా ప్రగతి సాధించ వచ్చుగదా అని అనుకున్నారు శ్రీమతి లక్ష్మీరఘురామ్.

# ఎఱ్ఱ గులాబీ వాడిన నాడు

పందొమ్మిది వందల అరవై నాలుగవ సంవత్సరం మే మాసపు ఇరవై ఏడవ తేదీ: చరిత్ర ప్రసిద్ధిగాంచిన ఎఱ్ఱ గులాబీ వాడిపోయిందీ నాడు! ప్రసిద్ధ చరిత్రను సంతరించుకున్న ఎఱ్ఱ గులాబి ముకుళించుక పోయింది ఆనాడు!!

నిత్యయౌవన సజీవచైతన్యానికి, మందస్మిత సుందరహాసాలకు రూపం పోసుకొని, దేశీయ అంతర్దేశీయ రాజకీయాకాశంలో దీప్తితో వెలిగి, వెలుగులు ప్రసాదించిన ఒక మహా తేజస్వి కన్నుమూశారు.

ఆయన అంగారఖాను ప్రతిరోజూ ఉదయాన్నే అలంకరించి ఆనందించే ఎఱ్ఱ గులాబీ శాశ్వితంగా ముడుచుకొంది.

*　　　　*　　　　*

ఆరోజు ఉదయం దక్షిణభారతం నుంచి వచ్చిన ఇద్దరు నాయకులు రఘురామయ్యగారి ఇంటికి 'బ్రేక్‌ఫాస్టు'కు వచ్చారు. రఘురామయ్య దంపతులూ అతిధులూ, అనేక విషయాలు మాట్లాడుకుంటూ ఉపాహారాలు ముగించారు. లక్ష్మీరఘురామ్ తన గదిలోనికి వెళ్లి ఆ రోజు ఉదయపు టపాను చూచుకుంటున్నారు. రఘురామయ్యగారు అతిధులతో తన డ్రాయింగ్ రూములో రాజకీయాలు మాట్లాడుకుంటున్నారు.

శ్రీమతి లక్ష్మి ప్రక్కనే ఉన్న టెలిఫోను బజ్జర్ మ్రోగింది. దానిని రఘురామయ్యగారు మాత్రమే మోగిస్తారు. ఎంతో అవసర మైతేనే అది మ్రోగుతుంది.

చేతిలోని కాగితాలు అలానే పుచ్చుకొని, రఘురామయ్యగారి గదిలోకి వెళ్లారు. ఇంకా రఘురామయ్యగారు టెలిఫోనులోకి

మాటలు పంపిస్తూనే ఉన్నారు. మాటలతో ఆందోళన పోటీపడు తోంది. లక్ష్మిని చూచి చేతితో సంజ్ఞచేశారు. ప్రక్కనే సోఫాలో కూచున్నారు లక్ష్మి. రఘురామయ్యగారి మొఖం వివర్ణమైఉంది. అంతటి వివర్ణమైన స్థితి రఘురామయ్యగారిలో తాను ఎప్పుడూచూడ లేదు. ఈమెకు భయమేసింది. రిసీవరు పెట్టేటపుడు వారి చేయి కొంచెం వణకడం గమనించింది.

లక్ష్మివైపు చూడకండానే, "లక్కీ, పండిట్ జీ కిస్ట్రోకు వచ్చిం దట." అన్నారు రఘురామయ్యగారు.

"ఆఁ"—అన్నారు లక్ష్మి. ఒక్కసారి నవనాడులూ క్రుంగి పోయాయి.

"అవును. శక్రటరీ ఫోనులో చెప్పాడు. నేను వెళ్తున్నాను 'తీన్ మూర్తి'కి. నీవూ వస్తావా!" అన్నారు రఘురామయ్యగారు.

ఎందుకో ఈమెకు భయంవేసింది. వార్తవిని కొంచెం సేప యినా గూడా, ఇంకా మనిషి గాలేకపోయారు.

రఘురామయ్యగారు లేచి మరోమాటలేకుండా బయలుదేరి వెళ్లిపోయారు. ఎదురుగాఉన్న దక్షిణదేశ నాయకులుగూడా రఘు రామయ్యగారిని అనుసరించారు బయటకు.

లక్ష్మికి ఇంకా భయంగానే ఉంది.

"మనకు పండిట్ జీ దక్కరా?" మనస్సు తనకుతానే పలుసార్లు ప్రశ్నించుకుంటుంది; ఎంతపెద్ద స్ట్రోకో! మామూలుదయితే ఫర్వా లేదు. అయినా పెద్దపెద్ద వైద్యసహాయం ఉంది. ఈపాటికి ప్రముఖ వైద్యులు అటెండవుతుంటారులే! అనుకుంటూ మనస్సు అంతలో ఆశపడుతుంది. మరి అంతలోనే, "ఏమో - ఎలా ఉంటుందో" అని నిరాశపడుతుంది.

ఆ గదిలోనే కూర్చున్నారు ఒంటరిగా. మనస్సు ఎక్కడికో పోయింది.

సరిగ్గా రెండు సంవత్సరాలక్రితం, నెహ్రూ దాదాపు ఒక నెలరోజులు ఇన్‌ఫ్లుయంజాతో మంచంలో ఉండాలిసివచ్చింది. జ్వరం తగ్గి, కోలుకుంటూన్న రోజుల్లో, ఒకసారి దంపతులిద్దరూ వారిని పరామర్శించటానికి వెళ్లారు. సమీపంలో కూచొని పదినిముషాలు మాట్లాడారు. మామూలు పరామర్శలయింతర్వాత, రఘురామయ్య గారితో రాజకీయాలు కొంచెంసేపు మాట్లాడారు. వీరి పోర్టుఫోలియోకు సంబంధించిన రెండుమూడు సమస్యలపై వివరాలు అడిగి తెలుసుకున్నారు. తృప్తిగా That is good - అంటూ సంతోషపడ్డారు. ఇక వీరు సెలవు తీసుకుంటూండగా, లక్ష్మి వైపుచూసి, "Mrs. Lakshmi, how is your baby?" అని అడిగారు.

Thank you Panditji, she is happy." అన్నారు లక్ష్మి. "It is very nice to hear you say so - Thank you for your kind visit" అంటూ వీరికి ప్రతి నమస్కారం చేశారు.

యౌవనంతో తొణికిసలాడే, ఆ నిత్యజౌవ్వన వృద్ధ యువకుడు, ఒకనెల రోజుల్లోనే ఎంతగా మారిపోయాడు. వార్ధక్యం నిలువెల్లా కనిపిస్తూంది. ఎప్పటి చిరునవ్వులు ఆ సుందర వదనంలో చిందులాడుతూన్నా, కొంచెం కళా విహీనంగానే కనపడ్డాయి. భుజాలు క్రిందికి వ్రేలాడుతున్నట్లు కనిపించాయి. కను రెప్పల క్రింది ఉబ్బు కనపడింది. కనుగ్రుడ్లక్రింద ఎర్రని రక్త కణాలు స్పష్టంగా కనపడుతున్నాయి. నడకలో గట్టితనం సడలింది.

కారులో తిరిగి వస్తూ, ఈ విషయమే రఘూతో ప్రస్తావించారు లక్ష్మి.

రఘురామయ్యగారు, అవును, నెల రోజుల నుంచి దాదాపు జబ్బుతో ఉన్నారుగదూ! అయినా ఈ మందులు ఎక్కువ వేసుకుంటే ఆ కండ్ల క్రింద ఉబ్బులు వస్తాయి'' అన్నారు. అయినా వీరి మనస్సు బరువుగానే ఉంది.

తర్వాత కొన్ని మాసాలకే, భువనేశ్వర్‌లో కాంగ్రెస్ మహా సభలకు వెళ్లినపుడు మొదటిసారి నెహ్రూకు స్ట్రోకు వచ్చింది. హెలికాప్టర్‌లో విడిదికి తీసుకువెళ్లవలసి వచ్చింది.

అప్పటినుంచీ, నెహ్రూ గారి ఆరోగ్యం ఏమంత బాగుండటం లేదు.

అంతకన్నా ఆయన మానసిక స్థితీ ఏమీ బాగుండుటలేదు. ఇది గమనించిన పత్రికలు దేశ భవిష్యత్తును గురించి ఊహాగానాలు చేస్తున్నాయి. "After Nehru. Who?" అంటూ తమను తాము ప్రశ్నించుకొని పలురకాల సమాధానాలు రాస్తున్నాయి.

ప్రజానాయకులు, "నెహ్రూ తదుపరి, ఎవరు ?" అని వారిని వారే ప్రశ్నించుకొని, వారే సమధానం చెప్పుకుంటున్నారు. ఎదుటి వారిని ప్రశ్నించి వారి అభిప్రాయాలు తెలుసుకుంటున్నారు.

కొందరు ఆయన విశ్రాంతి తీసుకోవాలనీ, వారసునిగా, ఆయన యిష్టం వచ్చిన వారి పేరు చెప్పి, తన బాధ్యతలను వారికి అప్పజెప్పి, సలహాలు యిస్తుండాలనీ, అభిప్రాయాలు వెలి బుచ్చుతున్నారు.

పండిట్జీ, తన అభిప్రాయాన్ని స్పష్టం జేశారు. ఒక ప్రముఖ పాశ్చాత్య విలేఖరి ప్రశ్నకు సమాధానం యిస్తూ; "ప్రజా స్వామ్య వ్యవస్థలో ప్రధానిని ఎన్నుకోవలసింది ప్రజాప్రతినిధులే, నేను సంపూర్ణ ప్రజాస్వామ్యవాదిని. నేనంటూ వారసుని పేరు చెప్పట మనే ప్రశ్న ఉత్పన్నంగాదు" అని విశదంచేశారు.

ఆమాటతో పాలకవర్గ నాయకులలో సంచలనం ఎక్కువయింది. జ్యోతిష్కులకు గిరాకీ పెరిగింది. పెద్దనాయకులందరూ, తమ జీవిత రేఖల్లో మెరుపురేఖలు ఏమైనా ఉన్నాయా ! ఉంటే ఎప్పటితో ఆరంభమౌతాయి అంటూ గుణకారాలు చేసుకుంటున్నారు.

అయితే నెహ్రూ మనస్సు వేరే లగ్నమైఉంది. దేశీయ రాజ కీయరంగం చాలా ఈర్ష్య అసూయలతో నిండి ఉంది. కాంగ్రెస్

పార్టీలో తన అనుచరులలో అధికులు వ్యక్తిగత ప్రతిష్టలతో, స్వార్ధ ప్రయోజనాలతో కుమ్ములాడు కుంటున్నారు. వల్లభాయి పటేలు అనంతరమ్, అంతటి దేశభక్తుడు కార్యదక్షుడు, నెహ్రూకు దొరక లేదు. అనేక విషయాలలో వారిద్దరకూ అభిప్రాయభేదాలు ఎన్నో వచ్చినా, దేశక్షేమాన్ని ఇద్దరూ ప్రాణాధికంగా కాంక్షిస్తారు.

అనుకోకుండా, 1962, అక్టోబర్‌లో చైనా ఇండియాపై దండయాత్రచేసింది. శాంతి సహజీవన సూత్రాలను పెదాలపైపెవల్లిస్తూ నిశ్శబ్దంగా అన్ని ప్రయత్నాలు చేసుకొని చైనా ఆకస్మాత్తుగా ఇండియా ఉత్తర సరిహద్దుపై విరచుక పడింది. భద్రత విషయకంగా సుఖ నిద్రలో స్వప్నాలుగంటున్న సైన్యం, తెలివితెచ్చుకొని కండ్లు నులుముకొని తేరిపారజూచే సమయానికల్లా, 1200 చదరపు మైళ్ళ మేర భారత భూభాగం శత్రుహస్తగతమైంది.

నెహ్రూకు అసలు 'షాకు' అదే. చైనీయుల నుంచి, ఈ రక మైన దుడుకు ప్రవర్తన ఈ శాంతి కాముకుడు ఏనాడూ ఊహించి ఉండలేదు. ప్రపంచంలో, ఒక్క కమ్యూనిష్టు కూటమి విన్నా, మరే దేశమూ కమ్యూనిష్టు చైనాను గుర్తించటానికి సుతరామూ అంగీక రించని కష్టకాలంలో, వాస్తవపరిస్థితులను గుర్తించిన నెహ్రూ చైనా ప్రభుత్వాన్ని గుర్తించాడు. ఇతర అలీన రాజ్యాలచేత గుర్తింప జేశాడు. ఇది న్యాయసమ్మతమైన చర్యఅని, అమెరికా ఎంత ప్రతిఘటిస్తూన్నా, ఐక్యరాజ్యసమితిలో పెక్కుసార్లు తన ప్రతినిధుల చేత పాఠాలను వల్లె వేయించాడు.

బాండుంగులో ఒక అంతర్జాతీయ వేదిక ఏర్పాటు చేసి మొదట సారి చౌ-ఎన్-లే గొంతు ప్రపంచానికి వినిపించాడు. పంచ శీలను రచించాడు. అందరితో ఒప్పించాడు. ఒక చరిత్రను సృష్టిం చాడు.

అలాంటి చౌ-ఎన్-లే, ఇంత ద్రోహంచేస్తాడని నెహ్రూ ఏనాడూ తలచలేదు.

చాలా సార్లు రఘురామయ్యగారు, నెహ్రూ అభిప్రాయం ఇదేనని చెప్పేవారు.

"సామ్రాజ్య విస్తరణకాంక్ష చైనాకు లేదన్ పండిట్జీ అభిప్రాయం. అలాంటి అభిప్రాయం ఏమైనా ఉంటే ఈ బాండుంగ్ సమావేశంతో అందరూ వదలుకుంటారనీ, అభివృద్ధి పథంలో ఎంతో కృషి జేయవలసి ఉన్న ఆశియా దేశాలు యుద్ధ కృషిలో తల దూరిస్తే దేశ పురోగమనం కుంటుపడుతుందని నెహ్రూజీ విశ్వాసం" అని రఘురామయ్యగారు లక్ష్మి ప్రశ్నలకు సమాధానం చెప్పేవారు.

కాని పండిట్జీ విశ్వాసాలుచైనా దురాక్రమణతో తలక్రింద యినాయి. ఎంతో దూరదృష్టితో, ఒక్క భారతదేశ సుఖసౌభాగ్యాలే కాక, సర్వమానవాళి సుఖశాంతులను వాంఛించిన ఈ ఆదర్శవాది, తాను ఎంతో ఆత్మవిశ్వాసంతో పెంచి పోషించిన పంచశీల నినాదం వెల్రితలలేయటంతో నెహ్రూ క్రుంగి పోయాడు. తనవైదేశిక రాజనీతే దారి తప్పిందా అని మానసికంగా వాపోయాడు.

సడలిన దేహదార్ఢ్యంతోపాటు, చెదరిన మనోనిబ్బరం ఏకమై మనిషిని అతలాకుతలం జేశాయి.

ఇంకా ఆ గదిలో అలానే కూచునిఉన్నారు లక్ష్మి.

టెలిఫోను మ్రోగింది. "లక్ష్మీ!" అని వినిపించింది. అది రఘురామయ్యగారిగొంతుక. "పండిట్జీ మరిలేరు". టెలిఫోను పెట్టేశారు అటునుంచి రఘురామయ్యగారు. రిసీవరు ఆమె చేతిలోంచి జారింది.

* * *

ఆరు ఏండ్ల క్రితం, 14 - అశోకరోడ్డులోని వీరి నివాస గృహంలో, కళకళలాడే పెండ్లిపందిరి కింద శోభాయమానంగా అలంకరించిన వివాహ వేదిక ప్రక్క భాగంలో మంగళ తూర్యాలు మ్రోగుతున్నాయి. వైదిక బ్రాహ్మణుల మంత్రోచ్చారణ పరిసరాలకు పవిత్రతను ఆపాదిస్తున్నాయి. ఆజ్యాన్ని ఆరగించుకుం

టూన్న అగ్నిహోత్రుడు కమ్మని వాసనలను వెదజల్లుతున్నాడు, సుగంధద్రవ్యాల కమ్మతెమ్మెరలు పందిరంతా క్రమ్ముకున్నాయి. తెలుగు తమిళ దేశాలనుంచి వచ్చిన ముత్తయిదువుల, రంగురంగుల పట్టువస్త్రాలంకరణ ప్రత్యేకంగా కనుదోయిని అలరింపజేస్తోంది.

వరుడు చిరంజీవి, వరదరాజన్ పెండ్లి దుస్తులలో వేదికపై ఆశీను డయ్యాడు. వధువు వీరి ఏకైక పుత్రిక, గారాబాల బిడ్డ చిరంజీవి సౌభాగ్యవతి దివ్యజ్ఞాన సరోజనీదేవి పెండ్లికుమారుని ప్రక్కన ఆసీన అయింది. కన్యాదానం జరుపనున్న రఘురామయ్యగారూ లక్ష్మి వధూవరులకెదురుగా కూర్చుని యున్నారు.

ఇంతలో పందిరిముందు మిళమిళ మెరుస్తూ ఒకకారు దూసు కొని వచ్చి నిలిచింది. హాజరులో ఉన్న ఉన్నతాధికారులు తలుపు తెరచారు. నల్లని బూట్లూ, తెల్లని సుర్వా, అతి తెల్లని లాల్చీ అంత తెల్లని వేస్టుకోటు ధరించి తలపై మరీ తెల్లని టోపీతో, చేతిలో గోధుమరంగు చేతికర్రను ఊపుకుంటూ పండిట్జీ చకచకా నడచి, వేదిక వద్దకువచ్చారు. మొగమంతా కన్నులు చేసుకొని, చిరునవ్వు లతో కళ్యాణ వేదికను పరిశీలనగా చూచారు. పెద్దల మన్ననలను, కన్నెపిల్లలందించిన గులాబీపుష్పగుచ్చాలను సంతోషంగా స్వీకరించి, వాసనలు చూచుకుంటూ, వారికై ఏర్పరచిన ఆసనంపై సుఖాసీను లయ్యారు.

మంగళ సూత్రధారణంతో శుభప్రదమైన కళ్యాణ మహోత్సవంలో, పండిట్జీ వధూవరుల శిరస్సులపైన అక్షింతలు చల్లి చిరునవ్వులుచిందిస్తూ ఆశీర్వదించారు. రఘురామయ్య దంపతులకు అభినందనలు తెలిపారు.

పండిట్జీతో చాలాసార్లు అనేక సందర్భాలలో కలవటం సంభవించినా, ఆ కళ్యాణపు పందిరిలో ఆయన చూపిన, మైత్రీ పూరిత వాత్సల్యం లక్ష్మి మనస్సులో మరుపురాని ముద్రవేసింది.

ఇన్ఫ్లుయంజాతో ఆయన తీసుకుంటూన్న రోజుల్లో, లక్ష్మి భర్తతోపాటు వారిని దర్శించటానికి వెళ్ళినపుడు కూడా, అంతటి ఆదరణే కనిపించింది.

'బేబీ' గురించి పరామర్శించటంలో, లక్ష్మికి, ఒక్క కూతురున్న పండిట్జీ పుత్రికావాత్సల్యం ధ్వనించింది. ఆయన మనస్సులోని తన పుత్రికావాత్సల్యం ఈమె స్ఫురించినప్పుడు ఈమె గుండె చెరువైపోయింది. రోగశయ్యపై దిండ్లనానుకుని కూచున్న నెహ్రూను చూచి, మనస్సంతా గతస్మృతులతో నిండింది.

సాయంత్రం గుండెనిబ్బరం జేసుకొని, 'తీన్ మూర్తి'భవనానికి దారితీశారు. అసంఖ్యాక ప్రజావాహిని బారులుతీరి, శోకతప్తహృదయాలతో, తమ ప్రియతమనాయకునికి అశ్రుతర్పణం గావించుకుంటున్నారు. ఆ మహాజనసముద్రమంతా మౌనంగా రోదిస్తోంది. లోలోన ఎక్కిళ్లు బెడుతుంది. తీన్ మూర్తి భవనం ఎదుట విశాల వలయంలో రాతి స్తూపాన్ని ఆనుకొని నిలుచుండి మూడు దిక్కులా ఎంతో కాలంనుంచి పహారాకాస్తూన్న ఆ శిలాసైనికులు, నాల్గవ దిక్కునుంచి కాలపురుషుడే వచ్చి ఆ భవనాన్ని ప్రవేశించి భారతమాత అనుంగుపుత్రుని ప్రాణాలను చేజిక్కించుకొని అదృశ్యమైన యదార్థాన్ని చూచి నిస్తేజులైనట్లు గన్పడ్డారు లక్ష్మికి. భవనంలోనికి ప్రవేశించారు. లోపల విశాలమైన గదిలో ధవళ తల్పంపై జవహర్‌లాల్ చిరనిద్ర పోతున్నాడు. గంపలకొద్దీ తెచ్చి శరీరమంతా ఎత్తుగా నింపిన గులాబీ మల్లియ పుష్పాల అడుగున భారతజనయిత్రి ముద్దుల బిడ్డడు, భారతజనతా ప్రియతమనేత, అహరహ అవిశ్రాంత విశ్వశాంతి కృషీకారుడు, ప్రశాంతవదనంతో కనురెప్పలు మూసుకొని శాశ్వతనిద్ర పోతున్నాడు.

ఇందాక రఘురామయ్యగారు టెలిఫోనులో చెప్పినట్లు, "పండిట్జీ మరి ఇక లేడు." ఆఖరుసారిగా మూసుకున్న ఆ కనురెప్పలు ఇక తెరువబడవు. చివరిసారిగా మూసుకున్న ఆ పెదవులూ తెరవబడవు. భారతప్రజలకు ఆ దివ్యవాణి ఇక మూగవోయింది. ఆ రాత్రి భారత ఆకాశం శోకభారంతో కుండపోతగా వర్షించింది.

* * *

మరురోజున లక్షలాది తన ప్రియసోదరీసోదరులు అశ్రుపూరిత నయనాలతో చేతులు ముకిళించి, గాద్గదికస్వరాలతో వీడ్కోలుచెప్ప అమరంగా సాగిపోయే యమునా నది ప్రక్కనే, ఈ అమరజీవి భౌతికకాయం అనంతవిశ్వంలో అదృశ్యమయింది. నెహ్రూ ఆత్మ విశ్వాత్మలో లీనమయింది.

భారతావనికి పూజార్హాలుగా అస్థికలు మిగిలాయి.

* * *

# సోదరి మేనకకు ఓ పుష్పగుచ్ఛం

ఆ అమ్మాయిని చూడంగానే "మేనక" అని పిలువ బుద్ధి అయింది శ్రీమతి లక్ష్మికి. తనకు సంబంధించినంత వరకు ఆ అమ్మాయి ఈ పేరుతోనే స్థిరపడి పోయింది శ్రీమతి లక్ష్మి జ్ఞాపకాలలో.

ఆ అమ్మాయి మతమేదో జాతి ఏదో తెలుసుకోకముందే, పారిస్‌లోని ఒక స్నేహితురాలి వ్యవసాయ క్షేత్రం మధ్యలోనిపురాతన కుడ్యంలో తొలిసారిగా పరిచయం గలిగినపుడే ఈ పేరు ఎందుకో లక్ష్మి మనస్సులో స్ఫురించింది, "ఎందుకు ఈ పేరు స్ఫురించింది ?" అనటానికి ఏ కారణమూ లేదు కాని, కొందఱను చూడగనే ఒకో పేరు ఉంటే బాగుంటుందని పిస్తుంది.

అందమైన అమ్మాయి మేనక, మంచి పొడగరి. ఎత్తుకు తగిన లావు. హిమబిందువులాంటి ఛాయ. సుకుమారమైన తనూవల్లరి. విశాలమైన నొసలు. కమలముల లాంటి కన్నులు. సన్నగా తీర్చిదిద్దిన కనుబొమ్మలు. కొనదేరిన నాసిక. చిరుదొండ పండువంటి పెదిమలు. ప్రతి చిన్న కదలికకు కనుపించే అందమైన పలుదోయి, ఏ ఆకారంలో ముడుచుకున్నా రమ్యంగా కన్పించే శిరోజాలు. చక్కని చిరు గడ్డం. ఒక్కసారి చూస్తే చిరకాలం మనస్సులో మెదిలే ప్రతిమా సుందరి మేనక.

మోకాళ్ల వరకు జుబ్బాను, అడుగున షుర్వాను ధరిస్తే ఈ అమ్మాయిని మిస్ మినీవాలా అని పార్శీవనితగా పిలవవచ్చు. తలపై ఒక మేలిముసుగువేస్తే మసూమా అని ముస్లిం యువతిగా పరిగణించవచ్చు. సీలమండలం వరకు గౌనువేసి, తలపై హేట్‌పెట్టి వలను వ్రేలాడ వేస్తే 'మిస్ మార్గరెట్' అని ఆంగ్లనారిగా గుర్తించవచ్చు. చేతిలో ఒక గొడుగు, మంకుకోటు ధరిస్తే 'మేరియానా', ఫ్రెంచి

యువతిగా పిలవవచ్చు. మరికొంచెం లూజుగౌను తొడిగితే మనేచకా అని రష్యావనితగా పోల్చవచ్చు. జానెడు వెడల్పుజరీ ఆకుపచ్చరంగు కంచిపట్టు చీరె కట్టబెట్టి అదేరంగు బ్లౌజు తొడిగితే మీనాక్షీ అంటూ తెలుగు అమ్మాయిగా గ్రహించవచ్చు.

ఏ దుస్తులు ధరించినా, ఏ దేశంలో ఉన్నా, ఈ అమ్మాయిని ఆదేశపు అందమైన యువతిగానే భావించవచ్చు. సౌందర్యం విశ్వజనీనమైనదనీ, సౌందర్యానికి కాలం ప్రదేశం అనేవి అవధులుగా ఉండవనీ, మేనకను చూస్తేనే అర్థమౌతుంది.

మేనక చూపులుగూడా అసాధారణమైనవే. ఆ కన్నుల కాంతుల్లో అనవరత ప్రశాంతతే ఆవరించి ఉందో, నిరంతర అశాంతతే, దోబూచులాడుతుందో చూపరులకు సులభంగా అర్థంగాదు.

మేనక మొగంలో సదా చిందే చిరునవ్వుల లోతులలో విషాద గాథల బాధలు ఎన్ని ఇమిడిఉన్నాయోననే అనుమానం శ్రీమతి లక్ష్మికి తొలిసారి పరిచయంలోనే లీలగా గలిగింది. ప్రశాంతంగా వెలువడే ఆమె వాగ్ఝరిలో కొన్ని కొన్ని మలుపుల్లో ఎపుడో ఒక పరి ఒక విషాద ఛాయ తొణికిచూస్తున్నట్లుండేది. మరొక మలుపులో సంఘంపట్ల గూడుకట్టుకొని ఉన్న ద్వేషం పెల్లుబుకుతున్నట్లుండేది.

ఈ అమ్మాయితో పరిచయం శ్రీమతి లక్ష్మికి కేవలం తలవని తలంపుగా జరిగింది.

అప్పటికి శ్రీమతి లక్ష్మి లండన్ వచ్చి రెండు వారాలయింది. ఈ సంగతి తెలుసుకున్న పారిస్‌లోని లక్ష్మి పూర్వ మిత్రురాలు, మదాం హెష్టా ఆ వారాంతానికి, పారిస్ వచ్చి, ఒక రోజుకు అతిథిగా ఉండి పోవలసిందిగా ఆహ్వానించింది. శనివారం ఉదయం ఆమె స్నేహితురాలు కౌంటెస్ ఎడ్గార్నా తన స్వంత యాట్‌లో ఇంగ్లీషు ఛానల్ దాటి ఫ్రాన్సువస్తుందనీ, ఆయాట్‌లో ప్రయాణం సుఖవంతంగా జరుగుతుందనీ, సూచిస్తూ, ఎడ్గార్నాగూడా తనకు

ఆహ్వానం పంపిస్తుందనీ, దానిని మన్నించి ఈ ప్రయాణం సాగించ మనీ కోరింది శ్రీమతి లక్ష్మిని.

మదాం హెష్టా శ్రీమతి లక్ష్మి పరస్పరం హృదయాలు అర్థం చేసుకున్న స్నేహితురాండ్రు. మనస్సులు విప్పుకుని మాట్లాడుకునే హితురాండ్రు.

సహజంగా ఈ యాట్‌లపై విలాసయాత్రలంటే శ్రీమతి లక్ష్మికి ఇష్టం ఉండదు. తానేమో శాకాహారి. తన అవసరాలా అతిస్వల్పం. విలాస జీవితానికి అలవాటుపడ్డ అనేక మంది ఆప్త మిత్రులు చాలా దేశాలలో ఉన్నారు; లక్ష్మి తన అలవాట్లకు ఖచ్చితంగా కట్టుబడి ఉంటుందనే విషయం వారందరకూ తెలుసు. వారు వారి ఆతిథ్యాలపుడు ఆహార పానీయాలలో ఈమెను ఎంత మాత్రం నిర్బంధించక పోయినా, ఆ విందుల్లో ఈమె కొంచెం ఇబ్బంది పడుతుంటారు.

ఐనా, సరేననుకొని లక్ష్మి యాట్‌లో ప్రయాణించి, డోవర్ వద్ద ఫ్రాన్సుచేరి, రైలులో పారిస్ వచ్చారు. స్టేషన్‌లో హెష్టా హృదయపూర్వకంగా స్వాగతం చెప్పింది. ఆలింగనం చేసుకుంది. లక్ష్మి కోసం నిర్దేశించిన హోటల్ లా-డీ-మెర్రీ గదికివెళ్లి పిచ్చాపాటీ మాట్లాడు కున్నారు.

మదాం హెష్టా సంపన్న కుటుంబానికి చెందిన మహిళ. ఆమె తండ్రి తాతలు 'బారన్'లుగా ప్రసిద్ధికెక్కారు. చరిత్రపరంగాగూడా ఆమె పితామహునకు ఫ్రాన్సు చరిత్రలో సముచిత స్థానముంది. ఇప్పటికీ పెద్ద విస్తీర్ణాలలో ఆమెకు కమతం ఉంది.

ఏరికోరి వరించిన భర్త ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో చని పోయినప్పటినుంచీ, ఒకరకంగా ఆమె విరాగినిగా బ్రతుకుతోంది. పారిస్‌లో ఉన్నత కుటుంబాలు నివసించే పేటలోని ఆమె స్వంత ఇంటిలో ఉంటూనే, ప్రతి వారాంతానికి తన వ్యవసాయ క్షేత్రానికి

పోతుంది. ఎక్కువకాలం సాంఘికసేవా కార్యక్రమాల కేంద్రీయ కార్యాలయ పర్యవేక్షణలోనే కాలం గడుపుతుంది.

అనాథ శరణాలయాల నిర్వహణలో ఆమెకు బాధ్యత గల గౌరవ పదవీ ఉన్నది. ఫ్రెంచి దేశ రెడ్‌క్రాస్ సంస్థా నిర్వహణలో ఉన్నత పదవీ బాధ్యతలు నిర్వహిస్తుందామె. పతితలైన స్త్రీలను సంరక్షించటంలోనూ, వారికి ఏదో మార్గం చూపించి సాధ్యమైనంత వరకు పునరావాసం కల్పించడంలోనూ, ఆమెకు ఆసక్తిమెండు. అందుకోసం స్వంతంగా అనేక వ్యభిచార గృహాలను సందర్శిస్తుంది. ఎందరో పతితలతో స్వయంగా పరిచయం గలిగించుకొంటుంది. వారందరకూ బడదీదీగా మసలుకొంటుంది.

శ్రీమతి లక్ష్మి, పారిస్ వెళ్లినరోజు సాయంత్రం భోజనాల యాక ఆమె కాడిలాక్ కారులో అక్కడకు డెబ్బయిఅయిదు కిలోమీటర్ల దూరంలో ఉన్న ఆమె వ్యవసాయ క్షేత్రానికి బయలు దేరారు. దారిలో కాడిలాక్ ఒకచోట ఆమె ఆపి ఒక రెండు అంత స్థుల భవనంలోకి వెళ్లి ఈ అమ్మాయిని వెంటబెట్టుకొని వచ్చింది.

ఈ ప్రయాణానికి సిద్ధమై ఉన్నట్లుందేమో, చిన్న చేతిసంచితో సిల్కు మఫలర్ తలకు చుట్టుకొని ఎంతో నమ్రతగా ఆస్నేహితురాలు వెంట కారు సమీపించింది. లాంచన ప్రాయంగా జరిగిన పరిచయాలతోనే ఆ మొదటి సమావేశం ప్రయాణ రూపంలో సాగింది.

ఆ రాత్రికి స్నేహితురాలి పురాతన భవంతిలో గత శాతాబ్దపు ఫ్రెంచి దేశపు ఔన్నత్యాన్నీ, చారిత్రక వాస్తవాలనూ నెమరుకు తెచ్చుకుంటూ చక్కటి విశ్రాంతి తీసుకున్నారు శ్రీమతిలక్ష్మి.

ఆ మరురోజు మేనకతో అసలు పరిచయం అయింది.

పందొమ్మిది వందల పదిహేడు అక్టోబర్ విప్లవ కాలంలో రష్యానుంచి దేశ ప్రవాశితులైన ప్రముఖ కుటుంబాలలో ఈ మేనక కుటుంబంకూడా ఒకటి.

ఒకనాడు సర్వసౌఖ్యాలకూ నిలయమైన ఈ కుటుంబం రష్యా విప్లవంతో బజారు పాలయింది. ప్రాణాలు దక్కించుకోటమే ఎంతో అదృష్టంగా భావించిన ఈ అమ్మాయి తల్లిదండ్రులు. వెంట తమ సంపదను తెచ్చుకో లేకపోయారు.

జారు చక్రవర్తుల వంశంలోని ఒకానొక ఉన్నత వంగడానికి చెందిన ఈ యువరాజు, ఇరువదేండ్ల తన అందాలరాణిని వెంటబెట్టు కొని, ఒక అర్ధరాత్రి చీకటి మాటున క్రెమ్లిన్ గోడల నీడలుదాటి పగలేనాడూ తాను చూడని మురికిపేటల సందులగొందులు దాటు కుంటూ, వేగంగా బయట పడ్డాడు. వారు వదలి వచ్చిన రాజప్రసా దాల మార్గమంతటా చక్రవర్తి హర్మ్యాల ప్రాంతమంతటా, భయా నకంగా ప్రజల కోలాహలాలు మిన్నంటు తుండగా, వాటి మధ్య కొన్ని సున్నిత స్వరాల హాహాకారాలు వెన్నంటుతుండగా, ఈ యువరాజ దంపతుల పలాయనం సాగింది.

చిరకాలంగా ఈ కుటుంబాన్ని అంటిపెట్టుకొని బ్రతకిన ఒక పరిచారిక దూరదృష్టి కారణంగా, ఈ ప్రిన్సూ, యువరాణీ, ఆనాటి ఆ మాస్కో విలయంనుంచి బయటపడ్డారు. ఆ పరిచారిక ముందే ఏర్పాటు జేసిన అన్ని ప్రయాణ సౌకర్యాలను వినియోగించుకొని, మార్పులు చేయబడిన చిరునామా కాగితాలను చూపించుకుంటూ, ఎన్నో ఇడుములబడి ఫ్రాన్సు దేశం చేరుకున్నారు

తన మాతృదేవి స్వయంగా రాసుకున్న డైరీల పేజీలు చదువు కున్నపుడు మేనక తెలుసుకున్న సంగతులవి. మేనక తల్లిదండ్రులను వారి పరిచారిక శత్రువుల బారినుండి తప్పించిన వైనం వింటున్నపుడు శ్రీమతి లక్ష్మికి చరిత్ర ప్రసిద్ధమైన "పన్నా" పాత్ర జ్ఞాపకం వచ్చింది.

మాస్కో సివార్లు దాటి ఈ కుటుంబం తమ అజ్ఞాత యాత్ర సాగించేముందు, ఆ "పన్నా" కు కృతజ్ఞతలు తెలుపుకుంటూ, ఒక రత్నహారం, మాసిన గుడ్డల మూటలోంచి తీసిఇచ్చాడు యువరాజు.

ఆర్ద్రనయనాలతో ఆపరిచారిక దానిని సగౌరవంగా నిరాకరించడమే కాక, తనబొడ్డులో దాచుకొని తెచ్చిన ఒక బంగారు నాణాల చిన్న మూటను యువరాణి చేత ఉంచి, తనగుర్తుగా స్వీకరించమని నమ్రతగా వేడుకుందట. కొత్తదేశంలో కొత్త జీవితంలో బహుశా ఈ బంగారు నాణాలు ఏదో విధంగా ఉపకరించగలవని వత్తి పలికిందట. రాజదంపతులు తనకు ఇవ్వజూపిన రత్నహారం తనకు నిరుపయోగమనీ, రష్యాదేశంలో రత్నాల విలువలు క్షణాలమీద మారే రోజులు సంప్రాప్తమయ్యాయని నొక్కివక్కాణించి వారివద్ద సెలవు తీసుకుందట.

సరిహద్దు ప్రాంతంలో చాటుగా ఆ యువ దంపతులు సజల నేత్రాలతో తమ చిరకాల పరిచారికకు నతులర్పించి అజ్ఞాతంలోకి అడుగు పెట్టారు.

ఆ వియోగ గాథ, మేనక నోటినుంచి వింటూన్నప్పుడు మేనక మాత్రం, నిండుకుండలాగా శిలాప్రతిమలాగా మాటలను బయటకు వెల్వరించిందిగాని, వింటూన్న లక్ష్మిగుండె చెరువయింది. కండ్లు చెమర్చాయి. దీర్ఘనిశ్వాసం సభ్యను గూడా విస్మరించి బరువుగా బహిర్గతమైంది.

ఆ విధంగా పారిస్ జేరుకున్న ఆ రాజకుటుంబం, ఎన్నో ఏండ్లు మారుపేరుతోనే జీవించింది. తెచ్చుకున్న రత్నరాసులు హారించుకు పోయాయి. బంగారు కరిగిపోయింది. ఏ పని చేతగాని యువరాజు నిర్వ్యాపకత్వంతోనే జీవితాన్ని సాగించాడు. తనకున్న శక్తియుక్తులన్నీ, తమ బ్రతుకులు బయటపడకండా చాటుగా బ్రతకటానికే వినియోగించుకున్నారు. రష్యన్ సంగీతంలో అనుపమాన ప్రావీణ్యంగల యువరాణి మాత్రం, కొంతకాలం పాటు పారిస్‌లో బ్రతుకుదెరువుకై, సాంప్రదాయాన్నివీడి, కొన్ని పెద్ద కుటుంబాలలో ఆడపిల్లలకు సంగీతం చెప్పేందుకు కృషిచేసింది. సంపాదనయితే కొంతవరకు సరిపోయేదిగాని, తమ రహస్య ఉనికి బహిర్గత

పోతుందేమోననే సంశయం క్రమంగా బలపడగా ఆ అవకాశాన్ని గూడా వదలుకున్నారు.

ఒకనాడు రష్యాదేశంలో రాజవంశంలో, ప్రభువుల నెత్తురు నరాల్లో ప్రవహిస్తుండగా పుట్టి, అసూర్యంపశ్యగా పెరిగి వక్రించిన విధి వికృత వికటాట్టహాసానికి దూరంగా పారిస్‌లోకి విసిరివేయబడ్డ ఆ యువరాణికి ద్వితీయ ప్రపంచ సంగ్రామ ప్రారంభ కాలంలో మేనక పుట్టింది. అంతకుముందు సరిగా ఆరేండ్లనాడు పుట్టిన ఒక సోదరుడు ఇపుడు ఏమయిందీ మేనకకు తెలియదు. మాటలలో ఆ అబ్బాయి ప్రస్తావన వచ్చిన ప్రతిసారీ, ఆ గొంతులో ఒకానొక అనిర్వచనీయమైన దిగులు ధ్వనించేది. ఆ చూపుల్లో దీనత ప్రస్ఫుటించేది.

రాజభోగాలు అనుభవించినవారు, కాలదేవత గల్పించిన మార్పిడికి తట్టుకోలేక, కాయకష్టం జేసుకోలేక, తమతో తెచ్చుకున్న సొత్తు ఖర్చయిపోగా, ఏ కొద్దోగొప్పో అంతర్జాతీయ సహాయ సంస్థల విరాళాలపై పదేళ్లపాటు జీవచ్ఛవాల్లాగా ఫ్రాన్సు గడ్డపై బ్రతికి మేనక 12వ ఏట, ఒక సంవత్సరం వ్యవధిలో తలిదండ్రులు మరణించారు. నాటినుంచి, వెనకాముందూ ఏలాంటి ఆర్థిక స్తోమతలేని మేనక, జీవితంలో ఆదరణను గూడా కోల్పోయింది. ఆనాథ శరణాలయాలలో మరోఆరు సంవత్సరాలు గడిపింది.

తనవారు అనేవారు ఏ ఒక్కరూ లేని బ్రతుకు మేనకది. తన దనే దేదీ ప్రపంచంలోలేని మనుగడ మేనకది. ఎటుచూచినా ఏకాకిత్వం. ఒంటరిగా ఉన్నపుడల్లా తల్లిదండ్రులు జ్ఞాపకం వచ్చేవారు. తల్లి యిచ్చిపోయిన డైరీ పుటలు త్రిప్పుకుంటూ తన గతాన్ని గుర్తుకు తెచ్చుకుంటూండేది. తనకు తెలియని తనకుటుంబ గతాన్ని ఎంతో అందంగా ఊహించుకొనేది.

మాస్కో రాజప్రసాదాల్లో సిండరిల్లాలాగా తాను ఒక మేడపై నుంచి మరో మేడపైకి గెంతుతూన్నట్లు, వందలకొలది దాసదాసీజనం తనచుట్టూ పరివేష్టితులై తనను కొలుస్తున్నట్లు

ధిస్తూ, వ్యక్తిగతంగా తత్ నియమాలను ఉల్లంఘిస్తూ ఉన్నతికి చేరి భద్ర పీఠాలపై అధివసించిన పలురకాల సామాజిక నాయకులందరూ పతితులుగారా ?''

“మేనక పతితా ? పతితలంటే ఎవరు ?” ప్రశ్న చెవుల్లో గింగురు మంటూనే ఉంది లక్ష్మికి.

అనూహ్యమైన పరిస్థితుల్లో చిక్కుబడి, పలురకాల వ్యక్తులు, వ్యవస్థలు బిగించిన చిక్కుముడిలో జీవితం బంధించబడినపుడు, గతి గానక, హృదయాన్ని భగ్నంచేసుకొని, గుండెను ముక్కలు చేసుకొని, కన్నీటితో బ్రతుకుదెరువుకై విటుని పంచనో, మంచాన్నో ఆశ్రయించిన స్త్రీ పతిత అవుతుంది ! ! సంఘంచే ఈసడించబడుతుంది!!!.

హృదయమున్న ఏ ఒక్కరన్నా ఆ, ఈసడించబడే పతిత సాన్నిధ్యాన్ని చేరి, ఆమె హృదయాన్ని ఆర్ధించి, ఆమెకన్నీటిని తన చిరుకొనగోటితో తాకి, వెన్ను నిమిరి పలకరిస్తే ఆ పతిత దీన గాధ చెవులకు వినబడుతుంది. హృదయానికి సోకుతుంది. నిజమేమిటో అకళింపు అవుతుంది. పతిత నిజంగా పతితా, పతిత పతనానికి కారణమైన పదుగురు పతితులో తెలుస్తుంది. పతితను ఈసడించుకునే వారు సయితం ఎంతవరకు పతితులుగారో గూడా తెల్లమవుతుంది.

ప్రతి స్త్రీ, తనకు ఒక్క చక్కని జీవితం ఉండాలనీ, ఆ జీవితంలో, తనను అర్థంచేసుకొని. ఆదరించే భర్త లభ్యమవాలనీ, ఆరోగ్యకరమైన సంతానం కలగాలనీ, తన కుటుంబానికి, తన ఇరుగుపొరుగుకు ఎంతోకొంత ఉపయోగపడాలనీ, పరువుగా బ్రతకాలనీ కోరుకుంటుంది. అది సహజం. అందుకై బాల్యమాది ప్రతిస్త్రీ ఉవ్విళ్లూరుతుంటుంది. అవకాశమొచ్చినపుడల్లా భగవంతుని ప్రార్ధిస్తుంది. అందుకై, తల్లిదండ్రులకేసి ఎదురుచూస్తుంది.

కాని ఏవీ కలిసిరాక, కోరినవన్నీ దూరమై కడకు బ్రతుకే భారంగా తోచినపుడు, మనుగడకే ముప్పు వాటిల్లినపుడు నలుగురు

నడిచే దారి తప్పుతుంది. బ్రతికేందుకు, సృష్టికర్త ప్రసాదించిన శరీరాన్ని బట్టవిప్పి బేరానికి పెడుతుంది. ఆమె పెడుతుందో, ఆసక్తిపరులే బేరమాడి ఆమెను వంచించి ఇదే బ్రతుకుదెరువు మార్గమని చూపిస్తారో గూడా నిజం ఆలోచించగల వారికి తెలియకపోదు.

చిరకాలంగా ఈ భూమిపై కొందఱు పెద్దలు స్త్రీలను పతితలుగా చిత్రిస్తూనే ఉన్నారు. క్రైస్తవధర్మంలో పతితస్త్రీని, రాళ్లు విసరి చంపమన్నారు. మహమ్మదీయ రాజరికాలలో, కొరడాదెబ్బలూ బహిరంగ ప్రదర్శనలూ చాలక, చచ్చిందాకా నిలబెట్టి కొట్టమని నిర్దేశించారు.

హిందూధర్మం, పతితను చచ్చిందాక, నిత్యమూ హీనపరస్తూ, అవమానిస్తూ, ఉండమని ఆదేశించింది.

మరి ఏ ఒక్కరూ, స్త్రీ పతితగావటానికి ముఖ్యాంగమైన ఏ పురుషుణ్ణీ, ఏ రకంగా హింసించటంగానీ, అవమానించటంగానీ, ఏయుగంలోగానీ, ఏ ధర్మంలోగానీ చేయలేదేం ? స్త్రీ ఒంటరిగా పతిత గాలేదుగదా ? మరో పురుషుడు కారణంగానిదే, ఏ స్త్రీ పతితగా మారదుగదా ?

ఏది ఏమైనా మేనక పతిత అయింది. పతిత అని ఆమె చెప్పుకుంది. ఆమె శయ్య నలంకరించవచ్చిన వారిలో, వారు వీరను భేదం లేక, లాయర్లు, డాక్టర్లు, ప్రొఫెసర్లు, వ్యాపారదక్షులు, రాజకీయ దళారులు. ప్రజా ప్రతినిధులూ, ఉండేవారట. మారువేషంలో మతాచార్యులుగూడా ఈమె దేహాన్ని పవిత్రం చేయటానికి వచ్చినపుడు మాత్రం సంఘంపట్ల ఈమె ద్వేషం మిక్కుటమయ్యేది. తనదగ్గర కొస్తూ వేసుకున్న మారువేషం అంతరంగానికి సరిపోయిందా ! పగలల్లా సంఘానికి నీతులు వల్లిస్తూ వేసుకునే వేషం సరైందా నని తర్కించుకునేది. చివరకు "ఛ ! ఈ నీచులను గురించి నేను ఆలోచించటం ఏమిటి ?" అని అనుకునేది.

ఆనాటి రాత్రి వ్యభిచారిణిగా మారిన మేనక అయిదేండ్ల పాటు ఆ పతన జీవితాన్ని గడిపింది. ఈ అయిదేండ్ల కాలంలో

మేనక పలురకాల అనుభవాలను పొందింది. పురుషులలోని హైన్య తను, నైచ్యాన్ని బాగా గుర్తించింది. పురుషజాతి అంటేనే వెగటు గల్గింది.

తన వద్దకు, అపుడే యౌవనదశలో అడుగిడి, ఇంకా బుగ్గల లోని పాల మిసిమి తగ్గని కుర్రకుంకలు గుటకలు మ్రింగుతూ వచ్చే వారు. వాళ్లనుచూచి మేనక హృదయం ఆక్రోసించేది. ఆ బిడ్డలను చెడగొట్టడం యిష్టంలేక నాలుగు మంచిమాటలుచెప్పి, వాళ్లలో పొంగిపొరలే ఉద్రేకాలపై చన్నీళ్లు చల్లి పంపేది. వాళ్ల అక్కా చెల్లెండ్ర సంగతి ఎత్తేది! తల్లుల సంగతి లేవనెత్తేది!! ఇక ఆ నవ జవానులు తలలువంచుకునేవారు. కొందరు బుద్ధిమంతులు, దీనంగా క్షమించమని వేడుకనేవారు. ఓదార్చి నెమ్మదిగా, మనస్సుకు కష్టం గల్గించకుండా బయటకు అమలినంగా వాళ్లను పంపించేది.

తరువాత ఈ యువకుల తండ్రులు వచ్చేవారు. "పెళ్లాంబిడ్డ లతో సంసారం చేసుకుంటూనే,బుద్ధిపోగోట్టుకన్న గాడిదలు వాళ్లు", అంటూ వారిని మేనక అభివర్ణించింది. లొట్టలేసుకుంటూ ఈమెను వారు సమీపించేవారట. ఎన్నో నంగనాచి కబుర్లు చెప్పే వారట, తమ కుటుంబ జీవితం ఎంతో బాధాకరంగా ఉందని, శాంతి లోపించిందనీ, ఆ శాంతి అన్వేషణకై ఈ అర్ధరాత్రి నీ మ్రోల చేతులు కట్టుకొని వ్రాలేనని అభినయయుక్తంగా పలికేవారట. "నిన్ను నేను వ్రాలమన్నానా పశువా?" అని అందామనుకొని, "అలాగే ప్రియా" అని మేనక అనేదట.

వాడి మ్రొక్కుబడి చెల్లించుకొని అటు బయటికిపోగానే, వాడి తండ్రి వయసు గలవారు జారిపోయే పంట్లామును చొక్కా పైకి లాగుకుంటూ వచ్చేవారు. ఈ రకానికి మాటలు ఎక్కువ గావాలి. వారి వాగుడు ఓపిగ్గా వినాలి. "వాళ్ల మనుమరాలు వయస్సున్న యువతితో తాము రాత్రివేళ చీకటిలో ఈ నీచ కార్య నికి తలపడ్డామనే జ్ఞానమన్నాలేని పరమహీనులు వాళ్లు" అంటుంది మేనక ఈ జాతి వాళ్లను.

అనేక రకాలయిన నికృష్టులు ఈ అందాలరాసిని అనుభవించ టానికి బంగారు నాణాలను గలగల లాడించేవారు. కొంగ్రొత్త కరెన్సీ నోట్లను ఫెళఫెళ లాడించేవారు. దాదాపు ప్రతిఒక్కడూ, "నా ప్రియా, ప్రియాతిప్రియా! అంటూ సంబోధించేవాడు." "నిన్ను నేను ప్రేమిస్తున్నాను ప్రియతమా!" అని మొరపెట్టుకునే వారు. "ప్రేమంటే నీకు తెలుసా, పశువా?" అని అనాలనుకొని, "తెలుస్తూనే ఉందిగా ప్రియతమా" అనేది. ఆ మాటకు వాళ్లు నీరు కారిపోయేవారు. మేనకకు తెలుసు ఆ గంట దాటితే, తన గడప దాటతారనీ, తరువాత వారెవరో, తానెవరోనని! అయినా ఆకాసేపు ఆ జనమంతా ఆపసోపాలు పడేవారట.

"ఈ వాగుడంతా ఎందుకు కసాయి కుంకల్లారా? మీరు వచ్చింది ఒకందుకు. నేనున్నది ఒకందుకు. మీపని మీరు ముగించుకో రాదూ" అని మనస్సులోనే అనుకునేది. ఒక యంత్రంలా తన కర్తవ్యాన్ని నిర్వర్తించేది. పశువులు మృగతృష్ణను తీర్చుకొని మారుమాటన్నా లేకుండా మేడదిగి పరువులెత్తేవి.

ముందు విటుడు శయ్యపై వదలివెళ్ళిన వెచ్చదనమన్నా ఆరకముందే, తన వ్యభిచార గృహ యజమానురాలు క్రింది అంతస్థు లోని తన ఆఫీసు గదినుంచి గంట మ్రోగించేది. దాని అర్థం మరొక విటుడు సిద్ధంగా ఉన్నాడనీ, తనను సిద్ధం గమ్మ నీనూ......

ఇదీ మేనక జీవితం. ఆ భయంకర బ్రతుకుల భవనంలో, శ్లేష్మంలో చిక్కుకున్న ఈగలాగా ఈ జీవితంలో మేనక కొట్టు మిట్టు ఆడిపోయేది. సాలీడు గూడులో చిక్కిపోయిన పురుగులాగా వాపోయేది. పసిబిడ్డలను చంకనో, చేతుల్లోనో ఉంచుకొని నడు స్తూన్న స్త్రీలు ఈమెకు వీధుల్లో ఎపుడైనా ఎదురైనపుడు వారి వైపు అస్తార్భతంగా చూచేది. సుఖమయమైన, సంతృప్తికరమైన వారి జీవితాలలోకి తొంగిచూడాలని ఉవ్విళ్లూరేది. వెలుగులతో నిండిన వారి చిరునవ్వు వైశాల్యాలనూ, కాంతులీనుతూన్న వారి చూపుల లోతులనూ కొలవాలని అనుకునేది. అనుకొనీ, అను

భావించుకునేది. పచ్చుకుట్టులాంటి తనపొడుగాటి కురులను, ఒక వనకన్య సుగంధ ద్రావకాలతో తనిపి, నిత్యనూతన పద్ధతిలో ముడిచి నట్లు భావించేది. సన్నని పొడుగాటి తన చేతి వేళ్ళకు మరో అందాల రాసి నవరంగులను పూత్తుతున్నట్లు ఊహించేది. పట్టువస్త్రాలతో తన దేహాన్ని మరో లలన అలంకరిస్తునట్లు కలలుగనేది. రత్నఖచిత ఆభరణాలతో, ఒక శృంగారి, తన అవయవాలను సింగారిస్తున్నట్లు కలలుగనేది.

తన దర్శన భాగ్యంకోసం ఎందరో రాజయువకులు తన అంతఃపుర ముందటి మందిరంలో వేచిచూస్తున్నట్లు ఊహించు కునేది. అలంకరణలను ముగించుకొని ఎదురుగాఉన్న నిలువెత్తు అద్దంలో తననుతాను చూచుకున్నపుడు, తన ప్రతిమారూపంముందు ఆ గదిలోనే వెల్గుతూన్న విద్యుద్దీప కాంతులు, వెలవెలాబోతున్నట్లు తలంచుకునేది. అద్భుత వేగంతో భావనాజగత్తులో అనంతంగా కంటూన్న కలలు కరిగి, ఒక్కసారి యదార్థజీవితంలోనికి, ఊడి పడ్డప్పుడు ఉలిక్కిపడేది మేనక. చుట్టూ కలియజూచుకొనేది. తనను తాను చూచుకొనేది. కన్నీరు విడిచేది.

అనాధ శరణాలయం నుంచి, యుక్తవయస్సురాగానే బయటి కొచ్చింది. జీవితంలో కడుగిడింది. అది కంటకావృతంగా ఎదుర యింది. దారినిండా ముండ్లపొదలు. ఎటుచూచినా చిమ్మచీకటి, ఎన్నో చోట్ల ఉద్యోగాన్వేషణ సాగించింది. అధిక కష్టాలతో ఉద్యోగాలు కొన్ని చేసింది. ప్రతిచోట అనేక కారణాలతో బయ టికి నడవ వలసి వచ్చింది.

కడకు పడుపువృత్తికి పాల్పడింది. ఆ మొదటి రోజు నుంచే జీవితంపై వైరాగ్యం ఏర్పడింది. విటులపై ద్వేషం గలిగింది. క్రమంగా అదేపురుషజాతిపై విద్వేషంగా మారింది. కష్టాలలోపుట్టి, కష్టాలలోపెరిగి, కరుడుగట్టిన కష్టాలనే తినిపెరిగిన మేనక, జీవితం కన్నా ఎదిగింది. ఇప్పుడు కష్టాలనూ, జీవితాన్ని పెనవేసుకొన్న దృష్టిని విశాలపరచుకొని తానువేరు, తన జీవితంవేరు, అనే భావనకు

వచ్చింది. జీవితంలో బ్రతుకుదెరువుకోసం ఒక ఉద్యోగమో వ్యాపారమో విడిగా చేసిన విధంగా, ఆమె విడిగా జీవించడం నేర్చుకుంది. ఫలితంగానే, పడుపువృత్తికి పాల్పడ్డ మొదటి రాత్రి, దుఃఖోద్వేగంతో పగలల్లా సతమతమైపోయి, అశ్రుభారంతో శయ్యాగారం ప్రవేశించిన మేనక, తన తండ్రికన్న పదేండ్లు బహుశా పెద్దవాడైన రసిక విటుని కామాగ్నిని చల్లార్చేందుకు, అందంగా అలంకరించబడిన శయ్యవైపు భారంగా నడిచింది.

చిన్ననాటినుంచి, తనవైపు తర్జనిని నిగిడ్చి, గ్రుడ్లనుమిటకరించి, అభిశాపాలను పరంపరగా ప్రసాదిస్తూన్న విధివైపు మనోనేత్రంతో ఒక్కసారి చూచింది! వెకిలిగా నవ్వింది!! వెక్కిరించింది!!! విధి కండ్లలోకి సూటిగా చూస్తూ, "విధీ, ఓ విధీ! నా బ్రతుకిలా బండరాయిలా మార్చావు. నీ కసి తీరిందా?" అని ప్రశ్నించింది.

"నా బ్రతుకిలా మార్చిన, నీ బ్రతుకు మాత్రం అంత దివ్యంగా ఉందా?" అనిగూడా ప్రశ్నించింది.

మిడిగ్రుడ్లతో ఎదురుగా నిలిచిన విధి ఈ ప్రశ్నకు బిత్తరపోయింది. "పిచ్చిదానా, ఓ నా ప్రియమైన విధీ, ఇంతేగదూ నీవు చేయగలిగింది ? ఇంకేమైనా చేయగలవా? ఇంతకన్నా నిన్ను పుట్టించిన జేజమ్మయినా అపకారం చేయలేదు. ఇక నీ ఆటకట్టు, ఇకనాదేపై చేయి," అంటూ భృకుటిముడిచి, పెదాలు బిగించి, నిదానంగా పలికింది. కసిగా పలికింది.

విధి ఉలికింది. ఉలిక్కిపడింది.

"ఓ విధీ!" అని కేకవేసింది, మేనక కేకకు భూనభోంతరాళాలు ప్రతిధ్వనించాయి. ఆ కేకకు తన మాతాపితలు పుట్టిపెరిగిన క్లైర్విల్లిన్ రాజప్రసాద కుడ్య భాగాలు మార్మోగినయ్.

ఆ కేకకు విధి గ్రుడ్లను మిటకరించింది.

"తీరిందా నీ దాహం విధీ!!" అన్నది మేనక. "నారాజ వంశాన్ని హతమార్చావు. నా కుటుంబాన్ని కూల్చేశావు. నన్నిలా నడిబజారుల్లోకి విసిరివేశావు. నా జీవితాన్నిలా రచ్చకెక్కించావు. సుకుమార సుందర సున్నితపుష్పాన్ని నీ కఠిన ఇనుప పాదాల క్రింద నలిపివేశావు. మృత్యువుకు మూడు బారల దూరంలో బ్రతుకుతూ. ఆ సుందరతల్పంపై నాకోసం నిరీక్షిస్తూ తపిస్తూన్న ఒకానొక నీ ప్రతిరూపానికి నా ఈ శరీరాన్ని రేపటి నా పొట్టకూటికై అమ్ము కొమ్మని శాసించావు! సరే!! అమ్ముకుంటున్నాను. ఇంతటితో ఆగను, ఇంతకన్నా మహా నికృష్టులకు సయితం రేపటి నుంచి ఈ దేహాన్ని అమ్ముకుంటాను! నీ కసి నాపై తీరిందాకానే గాదు, నా కసి నీపై తీరిందాకా అమ్ముకుంటాను. ఈనా అద్భుత సౌందర్య శోభిత శరీరాన్ని!! నా కసి నాపై, నా జీవితంపై, నీపై, నిన్ను నన్ను సృష్టించిన వానిపై దీరిందాకాగూడా అమ్ముకుంటాను. హృదయం లేదని చెప్పబడేనీకు, హృదయం ఉన్నదని చెప్పబడే విధాతకు, నన్ను కొనటానికి ఉత్సాహపడిన ఈ పురుష జాతికీ, జ్ఞానం వచ్చిం దాకా, ఈ శరీరాన్ని అమ్ముకోవటమనే వ్యాపారం చేపడతాను. వృత్తిగా స్వీకరిస్తాను. దృఢదీక్షతో ఈ కసాయి తనాన్ని కొనసాగి స్తాను." అంటూ పలికింది

విధి తలవంచుకొని ఉంటుంది. సిగ్గుపడి ఉంటుంది. వెనుకంజ వేసి ఉంటుంది. వెనక్కి తిరిగిపోయి ఉంటుంది.

మేనక తన కథలో ఈ భాగం చెపుతూన్నపుడు ఈ 'కసాయి తనం' మాటకు లక్ష్మి ఒళ్లు జలదరించింది. ఆ క్షణంలో లక్ష్మికి ధర్మవ్యాధుడు జ్ఞాపకం వచ్చాడు. ఒకవీధిలో, ఒక మూల దుకా ణంలో ఒక ఆసనంపై కూర్చొని, ఎదురుగా బల్లపై పేర్చబడిన మాంసాన్ని, కత్తితో కోస్తూ కుప్పలు పెడుతూ, ముక్కలు ముక్క లుగా నరుకుతూన్న ధర్మవ్యాధుడు లక్ష్మి మనస్సులో మెదిలాడు.

ధర్మాధర్మ సూక్ష్మాలను గుర్తెరిగిన మనిషి, ధర్మరాజుకు సయితం ధర్మసూక్ష్మాన్ని సుబోధకంగా విడమరచిన మనిషి, దివ్య జ్యోతులతో వెలుగొందే విశాల ఫాలంతో ప్రకాశిస్తూ, కటిక

వ్యాపారిగా వృత్తి సాగిస్తూన్న ధర్మవ్యాధుడు లక్ష్మి మనోఫలకంపై గన్పించాడు. ధర్మవ్యాధునికి లక్ష్మి నమస్కరించింది.

సరిగ్గా తన కథ ఇక్కడకు చెప్పేసరికి, మేనక రూపంలో ధర్మవ్యాధుడు లక్ష్మి బాహ్య నేత్రాలకే కన్పడ్డాడు. ఎన్నో వన్నెలు తగ్గినా, ఇంకా అపురూపంగా ప్రకాశిస్తూన్న ఈ సౌందర్యవతి మొగం జ్యోతిలా వెలుగుతోంది. రెండు కండ్లలో రెండు వెలుగొత్తులూ ప్రకాశిస్తున్నాయి. విశాల ఫాలంమంతా వెన్నెల కాంతులు నిండి ఉన్నాయి. మనస్సులోనే ఈ అమ్మాయిని అద్భుత మానవిగా భావించుకొంది శ్రీమతి లక్ష్మి.

నాటినుంచి మేనక మారింది. మేనక జీవితమే మారింది. ఆ జీవితంలో కోపంలేదు, తాపంలేదు, వేగంలేదు. ఆశగంలేదు. ఆశ లేదు నిరాశలేదు. ఎదురైన విధంగా, జీవితాన్ని స్వీకరించింది మేనక.

తనది పతనజీవితమన్నది మేనక. తాను పతితనని చెప్పుకుంది మేనక.

మేనక అలా చెప్పుకున్నప్పుడు లక్ష్మి తన్నుతాను ప్రశ్నించుకుంది. "మేనక పతితా?" "పతిత అంటే ఎవరు ?" అని ప్రశ్నించుకోబుద్ధయింది లక్ష్మికి.

"నిర్దేశితమైన జీవనమార్గంవిడిచి వక్రమార్గంలో పయనించే ప్రతివారూ పతితులుగారా !" అని సమాధానించుకోబుద్ధయింది.

అసత్యమాడే ప్రతివారూ పతితులుగారా ?

అపసవ్య మార్గంలో ఆర్జించే ప్రతివారూ పతితులు గారా ?

ప్రజల అజ్ఞాన అమాయకతలను స్వార్థానికి ఉపయోగించుకొని తెలివిగా పెద్ద పాములను తప్పించుకొని పరమపద సోపానపటంపై కెక్కే పెద్దలందరూ పతితులుగారా ?''

'అబద్ధమాడకు, దొంగతనం చేయకు' అనే సామాన్య ప్రజల జీవన నియమాలను, జనసామాన్యం విధిగా పాటించాలని ప్రబో

చూడగానే ఏదో మీలోని ఆప్యాయత నన్ను వశపరచుకొంది మదాం లక్ష్మి. బహుశా అది మీ కట్టురీతి గావచ్చు. మీ నొసటన ఎర్రగా మెరిసే మీ బొట్టురీతి గావచ్చు. సదా చిరునవ్వులు చిందే మీ ప్రసన్నవదనమేగావచ్చు. మీమాటలలోని ఆ ఆప్యాయతేగావచ్చు. దయను చిందించే మీ చూపులే గావచ్చు. అన్నిటికి మించీ, మీలో కొట్టవచ్చినట్టు గన్పించే ఆ మానవతే గావచ్చు. ఏమైనా మీరు నాకు ఆప్తులనుకున్నాను. ఇద్దరకూ అర్థమయిన ఆంగ్లభాష గూడా మన మధ్య, ఉన్న దూరాలను దగ్గిరచేసిందేమో గూడాచెప్పలేను. మొన్న రాత్రి మీ స్నేహితురాలు, మదాం హెష్టా నన్నుకలిసినపుడు, మీరు ఆమెకు అతిధిగా వస్తున్నారనీ, మీరు పరిచయం గల్గించుకోవలసిన ఉన్నత వ్యక్తులనీ, భారతదేశంలో మహిళా అభ్యుదయంకోసం, మీరు సాగిస్తూన్న కృషిని గురించి, ఆమె తెలిపిన విషయాలు గూడా, నన్ను నేను, మీకు సంపూర్ణంగా ఎఱుకపరచుకుంటానికి దోహదంచేసి ఉండవచ్చు. ''నేను కృతజ్ఞురాలను మదాం లక్ష్మి! మీరు నా కధను విన్నందుకు నాతోపాటు నా కధవింటూ మీరు పరితపించినందుకూ నా కృతజ్ఞతలు. నాతోపాటు మీరు కన్నీరొడ్చినందుకూ నా కృతజ్ఞతలు. మదాం, మీకు ధన్యవాదాలు'' మేనక చెప్పటం ఆపింది. గాలి నిండుగా పీల్చుకొని, కొంచెమాగి మరల మొదలెట్టింది.

"ఈవాళ నాకు జీవితమంటేనే లక్ష్యం లేదు, ఆశలేదు, నిరాశ లేదు, విలువాలేదు. జీవితపు అట్టడుగును అరచేతిలో స్పృశించిన నాకు కాంక్షలు లేవు. ఉన్నా ఏ మాత్రం సమకూరవనే విచక్షణా జ్ఞానం గూడా ఉంది. అందుకే, ఈ వారం రోజులుగా సంఘమంటే ఎన్నేళ్లుగానో గూడు కట్టుకొని నాలో నిబిడీకృతంగా ఉన్న ద్వేషం ముఖ్యంగా పురుషులంటే నరనరాన, ప్రతి అణువులోనూ నిండి ఉన్న విద్వేషం నన్ను దహించివేస్తుంది. నా పతనానికీ, నా ఈ దుర్భర దుస్సహ బ్రతుకుకూ కారణమైన ఈ సంఘంపై నాకసి తీర్చుకోవాలనుకుంటున్నాను మదాం లక్ష్మి.

"ఒక అనామిక, అన్నీ పోగొట్టుకున్న బాలిక, రాజరిక సౌభాగ్యాలను ఈ సంఘశక్తుల కారణంగానే, మా పాపమెంతమాత్రం లేకుండానే పోగొట్టుకున్న కుటుంబానికి చెందిన ఒక రాకుమారి ఈనాడు ఈ దరిద్ర పరిస్థితుల్లో పరాయి ఫ్రాన్సు దేశపు ముఖ్య నగరమైన పారిస్‌లో సంఘ ప్రముఖుల విలాసాల జీవితానికి పేరొందిన వ్యభిచార గృహంలో ఈ విధంగా బ్రతుకును భగ్నంచేసిన ఈ సంఘానికి, అందునా పురుషజాతికి నేను గుణపాఠం చెప్పాలనుకుంటున్నాను మదాం!" అన్నది మేనక.

ఆ మాటలు చాలా పౌరుషంగా ఉన్నాయి. రాజవంశపు అభిజాత్యపు నెత్తురు ఆమె అన్ని నరాల్లో ఒక్కసారి, అతివేడిగా వేగంగా ప్రవహించటం లక్ష్మి గమనించింది. ఒక తృటిపాటు ఆమె నీలిరంగు నేత్రాలలో అరుణకాంతి స్ఫుటంగా కన్పించింది. అందులో ఆవేశంగూడా కన్పించింది.

ఆమె ఆవేశాన్ని గమనించిన శ్రీమతి లక్ష్మి ఎంతో నిదానంగా పలికింది. "ఏ రకంగా గుణపాఠం నేర్పదలుచుకున్నావు చెల్లమ్మా," అని. 'చెల్లమ్మా' అనే ఆ పిలుపుకు, మేనక ఒక్కసారి తృల్లిపడటం లక్ష్మి గ్రహించింది. మేనక భుజంపై లక్ష్మి చేయి వేసింది. వీపు నిమిరింది.

"మదాం—నా నిశ్చయం నేనుచెబుతున్నాను. మరోగంటలో తమనుండి నేను సెలవు తీసుకోబోతున్నాను. బహుశా మరి ఈ నా శేషజీవితంలో మిమ్ములను చూడలేనేమో! అయినా మీ మంగళ మూర్తిని నేను బ్రతికున్నంతవరకు గుర్తుపెట్టుకుంటాను!! మీ సమతుంలో నేను పొందిన ఊరట, నా జన్మలో మా అమ్మగారి ద్వారా గూడా పొంది ఉండలేదు. మరోసారి మీకు నా ధన్యవాదాలు. అయితే నన్ను నా కర్తవ్య పథంనుండి మాత్రం మీరు విముఖులుగా చేయవద్దని మిమ్ము హృదయపూర్వకంగా కోరుకొంటున్నాను.

"నీ కర్తవ్యం ఏమిటి?" అని లక్ష్మికి తెలియకుండానే మాటలు ఆమెనుంచి దొర్లాయి.

"నాకు సంప్రాప్తమైన ఈ సిఫిలిస్ రోగాన్ని, సాధ్యమైనంత ఎక్కువమంది పురుషులకు పరివ్యాప్తం జేస్తాను. ఏ మాత్రం నా యిష్టాయిష్టాలతో ప్రసక్తిలేకుండా, నన్ను సమీపించిన ప్రతి పురుషునికీ ఈ వ్యాధిని ఐచ్ఛికంగా సంప్రాప్తం జేస్తాను. దూరంగా పోయే మగ పురుగులను సయితం, కావాలని ఆకర్షించి, ఈ జబ్బును వారికి ఎక్కిస్తాను. తద్వారా వారి జీవితంతోబాటు, వారి భార్యల జీవితాలు, వారి బిడ్డల జీవితాలు ఈ రోగంతో మారణమైపోతాయి. ఎన్నో శాపాలకు లోనై దగ్ధమైన నా బ్రతుకు యొక్క మహాశాప ఫలితం అప్పుడుగాని సంఘం అనుభవించదు. నాడుగాని నాలోనిండి నిబిడీకృతమైన ఈ ద్వేషం చల్లారదు. లావా లాగా ఉడుకుతూన్న నా రక్తం ఆనాడుగాని శాంతించదు." అనర్గళంగా మాట్లాడింది మేనక. ఏదో భూతం ఆవేశించినదానిలా మాట్లాడింది. ఏమి మాట్లాడుతుందో తెలుసుకోలేనంత ఆవేశంతో మాట్లాడింది. కాని ఈ మాటలవెనుక, ఈ ఆవేశంవెనుక, సుదీర్ఘమైన ఒక ఆలోచన, కసితోనిండిన భావన, తద్వారా రూపొందించుకొన్న కర్తవ్యం, దానిని శక్తివంతంగా నిర్వహించాలనే దృఢదీక్ష, స్పష్టంగా కన్పించాయి శ్రీమతి లక్ష్మికి.

ఒక్కసారి ఈ అమ్మాయి ఆలోచనలకు, ఆవేశానికి, భయభ్రాంత అయింది. లక్ష్మి......

ఏమవుతుంది ఈ అమ్మాయి తాను వెలిబుచ్చిన అభిప్రాయాన్ని అమలుపరిస్తే! ఈమె, తన సహచర ఆభాగ్యసోదరీమణులకుగూడా ఇదే భావనను ప్రబోధించి, వారికిగూడా ఇదే తమ కర్తవ్యమనే అభిప్రాయానికి తెస్తే, ఈ సంఘం ఏమౌతుంది ? ఇదే భావప్రచారం పారిస్ నుంచి బయల్వెడలి, ఫ్రాన్సు దేశం సరిహద్దులు దాటి, సముద్రాలు అధిగమించి, భూగోళాన్ని ఆక్రమిస్తే మానవజాతి ఏమిటి ? ఒక

క్షణం ఆలోచనా రహిత అయింది శ్రీమతి లక్ష్మి. చేతివ్రేళ్లతో కనురెప్పలు ఒత్తుకొంది శ్రీమతి లక్ష్మి.

ఆమె గుండె గుభేలుమంది!

మేనకను సముదాయించింది. అతి కష్టంతో మామూలు మనిషిని చేయటానికి కొంతసేపు పట్టింది లక్ష్మికి.

"మేనకా"— అని పిలిచింది. శ్రీమతి లక్ష్మి.

తలఎత్తిచూచింది మేనక. "ఆవేశపడకమ్మా! నీ జీవితాన్ని ఆమూలాగ్రంగా వింటూన్న నాకు అడుగడుగునా ఖేదమే ఎదురైంది. పరితాపమే మిగిలింది. నేనెక్కడున్నా నీవు నా మనస్సులో మెదలుతూనే ఉంటావు. అయితే ఒక్క విషయం నీకు చెప్పాలనుకుంటున్నాను. మేనకా! జీవితం ఒక యాక్సిడెంటు అని ఎవరో ఒకాయన చెప్పింది ఇప్పుడు జ్ఞాపకం వస్తుంది. నీ బ్రతుకులో అన్నీ యాక్సిడెంట్లే. గొప్పగాఎదిగి, గొప్పగా బ్రతకవలసిన నీ బ్రతుకు ఎందుకు ఇలాబండలపాలయిందో చెప్పగల శక్తి నాకు లేదు. ఎవరికైనా ఉందోలేదో గూడా నాకు తెలియదు.

కాని మానవజాతిపై ఇంతగా పెంచుకున్న ద్వేషంనుంచి ముందు నీవు విముక్తిగావాలి మేనకా. నీకునీవు విముక్తవయితే తప్ప నీకు శాంతిలేదు. నీ బ్రతుకుకు ప్రశాంతతలేదు." అని చెప్పింది లక్ష్మి.

"నా బ్రతుకుకు శాంతియా మాడమ్"!—దీర్ఘంగా నిశ్వాసం వదిలింది మేనక. అవునమ్మా నీ శాంతికోసరమే నా ఆరాటం.

ఈ నీ దగ్ధజీవితానికి ఏ ఒక్కరూ కారణంగాదు. ఆలోచించుకో అలాఅని సంఘమూగాదు. అయినా ఈ బాధ్యత సంఘానిది కాదనీ అనలేము. ఇంతకూ ఈ సంఘం అంటే ఎవరు? మనమేగా? ధ్యాన్ని సంస్కరించుకోవటంలోనే అందరిబాగూ ఉంది.

కొని, ఆ అనుభూతులను ఊహల్లో నింపుకుని, తన జీవితం జ్ఞాపకం తెచ్చుకొని ఒక్కసారి నిరామయమయ్యేది. "ఎక్కడినుంచి ఎక్కడకు పడిపోయాను!" అని తలచుకున్నప్పుడు ఒళ్ళు జల్లుమనేదట. అలాంటి జీవితం తనకు ఇక ఉండదుగదా అని అనుకున్నప్పుడు తన గుండె బరువెక్కేదట! తనలోతనే కుళ్ళికుళ్ళిపడ్చేదట.

సంవత్సరాలతరబడి ఈ గిట్టనిజీవితంలో, తనతలపుల్లోని సౌకుమార్యాలన్నీ కావాలని పారదోలింది. సంఘంపట్ల ముఖ్యంగా పురుషులపట్ల గాఢమైన ద్వేషాన్ని పెంచుకొంది.

నూతిలోని గొంతుకతో మాట్లాడుతున్న మేనక తన జీవితంలోని ఏ భాగం స్ఫురణకొచ్చిందోగాని ఒక్కసారి ఉద్విగ్నమైంది. క్రమంగా స్వరం కఱకుబారింది.

"మడాం! లక్ష్మీరఘురామ్'' అని పిలిచింది. లక్ష్మికేసి చూసింది. ఈమె చూపులో తన చూపులు కలిపింది. ఆ చూపులు నిశితంగా ఉన్నాయి.

''ఏంవిటి మేనకా'' అన్నది లక్ష్మి. ఆమె మానసిక స్థితిని అర్థంచేసుకున్న ఈమె గొంతుకలోగూడా ఆర్ద్రిత ధ్వనించింది.

"ఆ పాపగృహంలోనే సంఘాన్ని ద్వేషించటం ప్రారంభించాను. ముఖ్యంగా పురుషజాతి అంటే ఎనలేని అక్కసు నాలో పెరిగింది. నా కోసమేగాదు. మాపాప భవనంలో బ్రతికే వందమంది పై చిలుకు అభాగ్య యువతుల బ్రతుకులకు ప్రతినిధిగా ఈ పురుష జాతిని ద్వేషించడం నేర్చుకున్నాను.'' అని పలికింది మేనక.

లక్ష్మి మేనకను కలుసుకున్న రోజుకు కొద్ది కాలం క్రితమే ఆమెను పరీక్ష జేసిన డాక్టరు మేనకకు సిఫ్లిస్ వ్యాధి వచ్చిందన్నాడు. నెత్తురు పరీక్షలులాంటివన్నీ ముగించి వ్యాధి ఉధృతంగానే ఉందనీ తేల్చి చెప్పాడు. పాశ్చాత్యదేశాల్లో ముఖ్యంగా ఈ సిఫ్లిస్ వ్యాధిని అతి భయంకరమైందిగా భావిస్తారు. సుఖరోగాల జాబితాలో ఈ

వ్యాధికున్న పరపతి, కుష్టురోగులకన్నా ఒక్క మెట్టు మాత్రమే తక్కువగా పరిగణిస్తారు.

డాక్టర్ చెప్పిన మాటలను మేనక లక్ష్మికి చెబుతూన్నప్పుడు ఆమె ముఖంలో వచ్చిన వివర్ణత, ఇప్పటికీ లక్ష్మికి కనులకుకట్టినట్లు కనపడుతుంది. ఆ గొంతులో వచ్చిన మార్పు ఇంకా ఈమె చెవుల్లో మ్రోగుతున్నట్లుంటుంది. నిండుకుండలా ఆ కన్నులనిండా పొర్లి పోయేట్టు నింపుకున్న కన్నీరు ఇంకా లక్ష్మి మనోఫలకంపై జరజరా రాలినట్లు అనిపిస్తుంటుంది.

ఎదురుగా కూర్చొని, తన గాథను వినిపిస్తూన్న మేనక ఒక్క సారి లక్ష్మి రెండు చేతులను పట్టుకొని తన మొఖం ఈమె దోసిలిలో దాచుకొని ఏడ్చింది. వెక్కిళ్లు బెట్టి ఏడ్చింది. వొళ్లంతా కదిలి పొయేట్టు ఏడ్చింది.

అంతకుముందే ఎన్నోసార్లు మేనక జీవితంలోని వివిధఘట్టా లను వినేప్పుడు తనలో తానే పరితపించిన లక్ష్మిలోని స్త్రీ హృద యం, అతిభయంకర రోగగ్రస్థగా మారి ఈమె చేతుల్లో మొగం దాచుకొని వెక్కిళ్లతో శోకిస్తున్న ఈ దృశ్యంతో ఒక్కసారి బేల పడిపోయింది. పుట్టెడు దుఃఖం ఉవ్వెత్తుగా పెల్లుబికింది. గుండె గొంతుకలో కొచ్చింది. గొంతుక తడి ఆరింది. ఉఛ్వాస కష్టమ యింది. నిశ్వాసం గగనమయింది. ధారాపాతంగా లక్ష్మి కండ్లవెంట కారే అశ్రువులు, తన అరచేతుల్లో మొగం దాచుకొన్న మేనక చంపలపై ఉటఉటరాలుతూ, ఆమె అశ్రుప్రవాహంలో ఏకమై యిద్దరి బాధా ఒకటే అయింది. ఇద్దరి గుండెలూ ఒకేధ్వని చేస్తున్నాయి.

ఇది నిజంగా లక్ష్మికి ఒక క్రొత్త అనుభూతి, దేశంకాని దేశంలో, మొగమన్నా ఎరుగని అమ్మాయి, ఇలా లక్ష్మిని ఆప్త బంధువులా భావించి తన బాధాపరితప్త హృదయాన్ని ఈమె దోసిలిలో ఉంచిన సంఘటన మరువలేనిది.

"ఓ సృష్టికర్తా! ఎంతటి సుకుమార సుందర పుష్పానికి ఏలాంటి గతి రాసిపెట్టావయ్యా?'' అని లక్ష్మి అంతరాత్మ దేవ దేవుణ్ణి ప్రశ్నించింది. ఆ సమయంలో గూడా ఈ సంఘమంటే ఒక రకమైన అసహ్యాత ఆవరించింది లక్ష్మికి గూడా.

నిదానంగా, మేనకని లేపింది లక్ష్మి. నిశ్శబ్దంగా ఓదార్చింది. మాటలను మరచి చేతులే ఆమెను నిమిరాయి. ఆపాదమస్తకం ఈమె నిమిరింపులతో మేనక తేరుకొంది.

క్రమంగా మామూలు మనిషి అయింది. తిరిగి ఆమెకన్నుల్లో కాంతులు ప్రవేశించాయి. కూచున్న ఆసనంపైనుంచి లేచింది. గదిలో అటూయిటూ నడవటం మొదలయింది. ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లుంది.

లక్ష్మికి ఎదురుగా ఆగి, "మదాం, లక్ష్మీ!" అనిపిలిచింది. ఆ పిలుపులో ఆర్ధతలేదు. ఆప్యాయతాలేదు. ఎదుట ఒకక్రొత్త మనిషి నిలిచినట్లుంది. మేనక కొత్తరూపంలో ఎదురైనట్లనిపంచింది. ఎగాదిగా చూస్తూన్నది లక్ష్మి. ఈ ఆకస్మిక పరిణామానికి హేతువును వెతుక్కుంటున్నది.

"మదాం——" అన్నది మేనక,

''ఏమమ్మా!'' అన్నది లక్ష్మి.

''మీరు క్షమిస్తే, ఒక సంగతి చెప్పాలనుకున్నాను. గత వారంరోజులుగా నన్ను వేధిస్తూన్న విషయం మీముందు పెట్టాలని అనుకుంటున్నాను——" అన్నది మేనక.

"చెప్పమ్మా—— ఇందులో క్షమించాల్సిందేమి ఉంది అన్నది లక్ష్మి".

"మదాం—— లక్ష్మి!, డాక్టర్ నన్ను సిఫ్లిస్ రోగిగా చెప్పిన నాటినుంచి, నేను జీవచ్ఛవంగా బ్రతుకుతున్నాను. ఈ జబ్బు తీవ్రత ఎలాంటిదో నాకు తెలుసు ఎందరు అభాగినులు ఈ రోగం వాతపడి

కురూపులై, వికారులై, మృత్యుమందిరానికి వేగంగా నడిచారో గూడా నాకు తెలుసు.

"నాకు గూడా మిగిలిఉన్నది కొద్దికాలమే అనుకుంటు న్నాను......" అంటూ ప్రక్కగాఉన్న బాల్కనీ కిటికీలోంచి, దూరంగా కన్పడుతూన్న శూన్యంలోకి చూచింది. ఆ వసంతఋతువులో పారిస్ ఆకాశంలో స్ఫుటంగా నక్షత్రాలు మినుకుమినుకు మంటున్నాయి. ఆ చూపు అలానే కొన్ని క్షణాలసేపు నిగిడ్చింది. చుట్టూ ఆవరించిన నిశ్శబ్దాన్ని లక్ష్మి భయంతో కాపాడుతూంది. మేనక మనోగత భావాల విశదీకరణకు ఏమాత్రం భంగం వాటిల్ల గూడని పరిస్థితి అది.

"మదాం" అంటూ మళ్లీ పిలిచింది. "ఇటు చూడండి మదాం— ఈ వారం రోజులుగా మా అమ్మ జ్ఞాపకం వస్తోంది. ఒకనాటి నా కమ్మని హృదయం జ్ఞాపకం వస్తోంది. అలనాటి నా మనో గర్భితమైన ఎన్నో జ్ఞాపకాలు స్ఫురణకొస్తున్నాయి. ఆనాటి నా దేహం, అద్దంలో అందంగా ప్రతిబింబితమై నా మనస్సులో ముద్రించబడ్డ నా సౌందర్యం నిత్యమూ తలుపుకు వస్తోన్నది.

కాగా ఈనాటి నా జీవిత యదార్థ పరిస్థితి జ్ఞాపకం వచ్చి, నా హృదయాన్ని కలవరపరుస్తూంది. కడుపులో చేయిపెట్టి కలబెడుతున్నట్లుంది. కండ్లు బయర్లు కమ్మినట్లుంటున్నాయి. అన్నమా సయించదు. నిద్రరాదు. అసలే మాట్లాడబుద్ధవదు. వెర్రిచూపులతో, పిచ్చిమాటలతో గతవారంలో నాలుగు రోజులు గడిపాను. నా స్థితిని గమనించిన మా భూత గృహయజమానురాలు, డాక్టరు ద్వారా నా వాస్తవస్థితిని గ్రహించి, రెస్క్యూహోమ్‌కు తెలిపింది. మీ స్నేహితురాలు, దయార్ద్ర హృదయిని, స్వయంగా తన కాడ్ లాక్‌లో నన్ను ఆ దుస్సహ గృహంనుంచి బయటకుతెచ్చి, ఆమెకు గల ఒక ఎపార్ట్‌మెంటు హౌస్‌లో ఒక గదిలో నన్ను ఉంచింది మూడురోజులనుంచి. రాత్రి మనం కలిశాము. ఈ రోజు ఎందుకో మన యిద్దరమె ఇలా ముఖాముఖిగా తటస్థపడ్డాము. మిమ్ములను

"సకారణంగానే" కాగాక నీలోగూడుకట్టుకున్న ఈ విద్వేషాగ్నిని చల్లార్చుకోనుట ద్వారానే, నీకు మనశ్శాంతి లభ్యమౌతుంది. నీకు అపకారంచేసిన ప్రతివ్యక్తి నిజంగానే శిక్షార్హుడు. ఎంత మాత్రం క్షమార్హుడుగాడు. ఈ పతనావస్థ నీదేగాదు వాళ్లదిగూడా! సంఘంలో ఒక అభాగ్యమహిళను, గౌరవనీయ సోదరిగా చూడలేక పోయిన వారిదీ దౌర్భాగ్యం — అట్లాంటి వారితో సంఘం నిండి ఉన్నమాట వాస్తవమే. నీలాంటి దురదృష్ట సోదరీమణులు, ప్రపం చంలో అన్ని దేశాల్లో, అన్ని పట్టణాలలో నీలాగే నికృష్టజీవితాలతో బ్రతుకుతున్నారు. వారిని చూచి ఊరట తెచ్చుకో. ఈ అభాగ్య సోదరీమణుల రక్షణను గురించి ఆలోచించుకుంటూ ఊరటగల్గించుకో. సంఘ దృష్టిలో రావలసిన మార్పుల గురించి ఏ కొద్దిపాటి కృషి జరుపుతూనో నీకు నీవు ఈ విషవలయంనుంచి బయటపడి, నిన్నావ రించిన పరిస్థితులకన్నా నీవు ఎదిగి ఒక వ్యక్తిగా బ్రతుకు. ద్వేషిం చటం ద్వారా నీవు మరీ ఆహుతై పోతావు, భగ భగ మండిపోతావు. బహుశా ఈనాటి నీ మానసిక స్థితిలో ప్రతివారూ అదే నిర్ణయానికి వస్తారు తప్పులేదు. అయినా నిగ్రహం చూపుకోవలసిన సమయమిదే నమ్మా!! ఊరడించింది శ్రీమతి లక్ష్మి.

"పతనమయ్యానని చెప్పుకోగల ధైర్యమున్ననీవు, నీ శారీరక రుగ్మతను సంఘానికి అంటించి, కసిదీర్చుకున్నానని తృప్తిపడేకన్నా, నీకసిని నీలోనుంచి, తొలగించుకొని, నీవు ఎదిగి, నీకపకారంచేసిన వారికన్నా పెరిగి, వారినిమన్నించి, నీకు నీవు బాగుపడి, నీ కన్నా బాధపడుతూన్న అసంఖ్యాక అభాగ్య సోదరీమణుల, సౌఖ్యానికి కృషిజేయడంలోనే నీ జీవిత చరితార్థత ఉంటుంది, మేనకా! ఆలోచించుకో. ఆవేశంకన్నా ఆలోచన ఎపుడూ మేలుచేస్తుంది చెల్లీ!" అని పలికింది లక్ష్మి.

ఏటో చూస్తున్న మేనక, నిశ్శబ్దంగా కుర్చీలోంచి లేచింది. టీపాయి మీదఉన్న చేతిసంచిని అందుకుంది, లక్ష్మి కండ్లల్లోకి ఒక క్షణం తేరిపార జూచింది. నిశ్శబ్దంగా తలవంచి నమస్కరిస్తూ సెలవు తీసుకొంది.

నిశ్శబ్దమే ప్రస్తుతానికి మేనకను సేదదీర్చగలదనుకున్నది శ్రీమతి లక్ష్మి. ఒంటరిగా ఉండటమే ఆమె విహ్వాల మనస్సును కుదటపరచగలదనుకున్నది లక్ష్మి.

మరురోజు మధ్యాహ్నం లక్ష్మి లండన్ వెళ్లిపోయింది. నాలుగో రోజు ఉదయం లక్ష్మికి పారిస్ నుంచి ఒక ఉత్తరంవచ్చింది. ఈమె స్నేహితురాలు, మదాం హెష్టా బారనెస్ ఆ ఉత్తరం వ్రాసింది.

"మేనక నిద్ర మాత్రలు అతిగామింగి మృత్యువాతపడింది. ఎంత ప్రయత్నించినా డాక్టర్లు ఆమెను దక్కించలేకపోయారు. ఆమె మొత్తం ఆస్తి బ్యాంకులో ఉన్న 18 ఫ్రాంకులూ. స్వదస్తూరితో మీ పేర ఆ మొత్తానికి ఒక చెక్కురాసి పెట్టి మీకు అందజేయమనీ, ఆ స్వల్పధనం, ఏ ఒక్క అభాగ్య సోదరి కన్నీటిబొట్టు తొలగించ టానికి ఉపయోగపడినా తన ఆత్మ కృతజ్ఞతగా ఉంటుందనీ, రాస్తూ మీకు ఆ చెక్కుతోపాటు, తన అంతిమ మనవిని నివేదించమని కోరింది." అదీ ఆ ఉత్తరంలోని సారాంశం. పిడుగుపాటుగా వచ్చిన ఈ వార్త శ్రీమతి లక్ష్మిని నిశ్చేష్టగా చేసింది. ఆమె కండ్లవెంట అశ్రువులు ధారలు కట్టాయి.

ఆ మధ్యాహ్నానికి, మేనక భౌతికకాయానికి పారిస్‌లో 'హెష్టా' ఆధ్వర్యంలో జరిగే అంతిమ సంస్కార సమయానికీ, విమానంలో ఒక పుష్పగుచ్ఛం పంపించింది లక్ష్మి. దానిపై వ్రేలాడదీసిన చిన్ని అట్టముక్కపైన, సోదరి మేనకకు ఓ పుష్పగుచ్ఛము - లక్ష్మి. అని స్వదస్తూరితో వ్రాసి పంపారు శ్రీమతి లక్ష్మి.

# లండన్ యాత్ర

న్యూఢిల్లీలోని పాలెం విమానాశ్రయంలో భార్యా, భర్తా, బిడ్డా వి. ఐ. పి. లాంజిలో కూర్చొని ఉన్నారు.

శ్రీమతి లక్ష్మీ రఘురామ్ తొలిసారి లండన్ వెళ్తున్నారు ఆపూట. ఆపూట కొంచెం విశ్రాంతిగా ఉన్న రఘురామయ్యగారూ, కూతురు దివ్యజ్ఞాన సరోజినీ దేవీ, విమానాశ్రయానికి వచ్చారు ఈమెకు వీడ్కోలు చెప్పటానికి. ఇంకా టైముంది విమానం కదలటానికి. కాఫీలు తెప్పించారు రఘురామయ్యగారు. పొగలు గ్రక్కే కాఫీని నెమ్మదిగా త్రాగుతూ కూర్చున్నారు ముగ్గురు.

"ఇంగ్లండుకు నా మొదటి ప్రయాణం స్వరాజ్యం రాకముందు. నీ తొలి ప్రయాణం స్వాతంత్ర్యం వచ్చాక, మనిద్దరిలో ఎవరం గొప్ప వార మంటావ్ ?'' అని చిలిపిగా ప్రశ్నించారు రఘురామయ్యగారు.

ఉల్లాసంగా ఉన్నపుడు రఘురామయ్యగారు చాలా చలాకిగా మాట్లాడుతారు. చిలిపిగానూ మాట్లాడుతారు. పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వనూ గలరు. ఎదుట వారిని కడుపు నిండా నవ్వించనూ గలరు.

ఆయన లండన్‌లో చదువు కున్నారు. ఆంగ్లేయ జీవితాన్ని అర్థంచేసుకున్నారు, కాచివడపోశారు.

బానిస దేశవాసిగా శ్రీ రఘురామయ్య గ్రేటు బ్రిటన్‌కు వెళ్లినా, తన జాతి అభిజాత్యాన్ని ఏనాడు విస్మరించలేదు. ఆయన ప్రతిపలుకులో ప్రతి అడుగులో అది అభివ్యక్తమయ్యేది. స్ఫూర్తి వంతమయ్యేది.

ఆనాడు, తెల్లవాడు ఎంత గొప్పవాడైనాగానీ, అతనికన్న ఈయన ఎందులోనూ తగ్గలేదు. ఏనాడూ తగ్గలేదు. ఎందునా తల వంచలేదు.

కాని సోదర భారతీయ విద్యార్థులే అనేవారు,"మన రఘురామయ్య ఎందుకు అంతగా ఆత్మాభిమానం చూపుతాడు !'' అని.

"ఆత్మ ఉందికనక, అభిమానమూ ఉందికనక'' అని శ్రీ రఘురామయ్య సమాధానించేవారు. "అది రైతు బిడ్డల సహజ లక్షణం గూడా !'' అని నొక్కి వక్కాణించేవారు.

పల్లెలంటే తెలియక, పల్లీయులంటే ఎరుగక, భూమి తల్లి మనుష్యులపై ఏలాంటి చెరగని ముద్రవేస్తుందో గుర్తెరుగని నగరవాసులైన, ఆంగ్లేయ ప్రభుత్వ ఉన్నతోద్యోగుల బిడ్డల ప్రశ్నలకు, రైతు బిడ్డ రఘురామయ్య కొరక రాని కొయ్య. వారంతా పట్టణాలలో మహానగరాలలో ఆంగ్ల విద్యాలయాలలో చదువులు సాగించుకొని, అమ్మనాన్నలను, మమ్మీ డాడీలని పిలుచుకుంటూ, ఆంగ్ల నాగరికతను అర్థంగాక పోయినా జీర్ణంచేసుకున్నామని భావించే పరమ విద్వాంసులు.

మరి రఘురామయ్య భారతదేశాన్నుంచి ఉన్నత విద్యలకోసం, దీక్షగా చదివి ప్రతిభతో ఉత్తీర్ణుడై ఇంగ్లండుకు విచ్చేసిన నవయువకుడు. తెలుగు దేశపునడిగడ్డన మొలకెత్తిన చేవలిగిన సిరిమాను మొక్క.

పది మందికి మెక్క బెట్టి తానుతినే కుటుంబాలలో ఉద్భవించిన వాడు. సకల జనుల క్షుదార్తినిబాపి, కడుపులు నింపి కూడును పండించే కుటుంబాలలో జన్మించినవాడు. ఎవరకూ భయపడనివాడు. భయమంటే ఎరుగనివాడు, నమ్మకాలను ఎన్నుకునేవాడు. ఎన్నుకొన్నవాటిని నమ్మేవాడు. నమ్మిన వాటిని ఆచరించేవాడు. హరిహర బ్రహ్మాదులనైనా లెక్కచేయనివాడు. వెనుదిరగని వాడు. మేధావి.

సంపదకు తక్కువ లేదు, ధనానికి కొదువలేదు. మస్తిష్కం నిండా మేధస్సు ఉంది. మేధస్సు నిండా చైతన్యముంది.

మరి తెల్లవారికి తల ఒగ్గ వలసిన అవసరం ఆయనకు లండన్ విద్యార్థి జీవితంలో ఏనాడూ కలుగ లేదు.

తన భార్య ఈనాడు తొలిసారిగా లండన్ వెళ్తోంది అనే భావన రాగానే, ఇంగ్లండులో తాను గడిపిన రోజులు స్ఫురణ కొచ్చి ఉంటాయి.

అందుకనే ఆ ప్రశ్న వేశారు, శ్రీ రఘురామయ్య శ్రీమతి లక్ష్మని.

వారి ప్రశ్నకు ఈమె నవ్వుకుంది.

"ప్రశ్నకు నవ్వు ఎక్కడైనా సమాధానమౌతుందా లక్కీ ?" అన్నారు రఘురామయ్యగారు.

కూతురు దివ్యజ్ఞాన సరోజనీ దేవి ఫక్కున నవ్వింది.

"మీ ప్రశ్న మరో విధంగా వేసి ఉంటే, మీ ప్రశ్నలోనే నాసమాధానం గూడా వచ్చి ఉండేది !" అన్నారు శ్రీమతి లక్ష్మ.

"ఎలాగేమిటి ?" అన్నారు శ్రీ రఘురామయ్య. కుతూహలంతో తల్లి వైపు చూచింది, దివ్యజ్ఞాన సరోజనీదేవి.

"ఏమీ లేదు ! బానిస భారత పౌరునిగా నేను తొలిసారి మా ప్రభువుల దేశం ఇంగ్లండు వెళ్లాను. స్వతంత్ర భారత పౌరురాలుగా సమాన స్థాయిలో ప్రత్యేక ఆహ్వానం పొంది ఈనాడు నీవు ఇంగ్లండు వెళ్తున్నావు; మరి మన ఇద్దరిలో ఎవరం గొప్పా?" అని మీరు అడిగి ఉంటే సమాధానం గూడా నేను చెప్పవలసిన పని ఉండేది గాదు !అని అన్నారు శ్రీమతి లక్ష్మ.

బిగ్గరగా నవ్వింది దివ్యజ్ఞాన సరోజినీదేవి. ఆమె నవ్వులో వాళ్ల నాన్నగారి నవ్వూ కలిసింది. లాంజి ప్రతి ధ్వనించింది.

ఇంతలో లౌడ్ స్పీకరులో నుంచి ఒక సుతి మెత్తని కంఠ స్వరం 'లండన్ ఫ్లైట్ రడీ' అని ప్రకటించింది. ముగ్గురూ విమానాన్ని సమీపించారు. లక్ష్మి, బేబీ చుబుకం పుణికి ముద్దాడింది. రఘు రామయ్యగారికి నమస్కరించి సెలవు తీసుకున్నది.

రఘురామయ్య గారు, "క్షేమంగా వెళ్లి లాభంగారా !" అంటూ మృదువుగా నవ్వారు. వెన్నుతట్టి నిమిరారు. అయినా ఆ గొంతులో ఏదోలోపించినట్లు వినిపించింది. గాద్గదికత ధ్వనించినట్ల యింది.

అవును. ఆప్తులు తాత్కాలికంగానే పోగాక, దూరమవబో తూంటే, ఈ అనుభూతులు అనివార్యం. సహజ లక్షణం.

విమానం కదిలింది. నేల మీద పరువెత్తింది. విమానపు కిటికీ లోంచి చూస్తూన్న లక్ష్మికి భర్తా బిడ్డా జేబురుమాళ్లు ఊపటం కని పించింది. భద్రంగా విమానం గాలి పీల్చుకొని వాయుమండలంలో కెగరింది. నింగివైపు ఉరికింది. ముందుకు దూసుకపోతోంది.

* * *

విమానం మేఘమండలాన్ని దూసుకొని ముందుకు ఉరుకు తోంది. విమానంలో కూచున్న శ్రీమతి లక్ష్మి మనస్సు వెనక్కు మళ్లి చరిత్రపుటల్లోనికి దూసుకుపోతోంది. విమానపు వేగం ముందుకు, ఆమె మనోవేగం వెనుకకూ పోటీలుపడుతున్నాయి.

"హిందూ దేశానికి ఆంగ్లేయులరాక - ఈస్టిండియా కంపెనీ ఆవిర్భావం. వ్యాపారం పేరిట దేశీయ వ్యవహారాలలో జోక్యాలు. స్వదేశీ సంస్థానాధీశులతో సంబంధాలు. వారిలోని అనైక్యతను సాకుగా తీసుకొని సాగిన రాజకీయ కుట్రలు రాజ్యాపహరణాలు. ఆంగ్ల పరిపాలనా ప్రారంభం. చివరకు స్వదేశసంస్థానాలన్నీ ఆంగ్లే యుల సార్వభౌమత్వానికి అంగీకరించటం దేశంలోని ముడిసరకుల ంవాణా. తిరిగి వినియోగ వస్తువులుగా మార్చి ఈ దేశానికే దిగుమతి గావించటం.

వరుసగా ఊహా చిత్రాలు శ్రీమతి లక్ష్మికి మనస్సులో మెది లాయి. బయస్కోపుల్లోని బొమ్మల్లాగా ......

విమానం ముందుకు ఎగురుతూనే ఉంది !

మనస్సు వెనక్కు ఆలోచిస్తూనే ఉంది !!

బానిస దేశంలో భారత ప్రజ ఇక్కట్టులు, అమాయికత్వం అజ్ఞానం దారిద్ర్యాలు.

స్వాతంత్ర భావబీజాంకురణ. ఉద్యమాల రూపధారణ. రాజ కీయ పార్టీల నిర్మాణాలు. దేశనాయకుల ఉద్బోధలు.

విమానం ముందు కెగురుతూనే ఉంది !

మనస్సు గతంలోనికి ఆలోచిస్తూనే ఉంది !!

ఉద్యమాల ప్రారంభం. ప్రజల త్యాగాల ఆరంభం. తీవ్రవాద పోరాటాల విజృంభణ. తెల్లవారి తుపాకులు ప్రేలడం. నల్లవారి శరీ రాలు నేలరాలటం. అరుణారుణ రుధిర స్రవంతులు భారత ధాత్రీ తలాన్ని పులకింప జేయుటం. లాటీల దెబ్బలు. జైళ్లకవాటాలు. బ్లాక్ హోల్ ఆవ్ కలకత్తా, జలియన్‌వాలాబాగ్, కాన్పూరు కుట్రకేసు, మీరట్ కుట్రకేసు, భగత్‌సింగ్ రాజగురు సుఖదేవుల ఆత్మార్పణ. జితీంద్రుని అరవై రోజుల ఆమరణ నిరాహారదీక్ష.

విమానం ముందుకు పోతూనే ఉంది!

మనస్సు గతంలోనికి సంచరిస్తూనే ఉంది!!

దేశ రాజకీయాలలో మహాత్ముని ప్రాదుర్భావం. రాటం త్రిప్పుతూ రాజకీయాలు వడకటం. సత్యాగ్రహ నినాదం. అహింసా ఉద్యమాలు. జవహర్ లాల్ నెహ్రూ, వల్లభాయ్‌పటేల్, రాజగోపాల చారి, మహమ్మదాలీ జిన్నా, అబుల్ కలాంఅజాద్, సరోజినీనాయుడు, లార్డ్‌లిన్‌లిత్‌గో, వేవెల్, క్రిప్సు రాయబారం, బ్రిటన్‌లో ఎన్నికలు లేబరు పార్టీ ప్రభుత్వం, మౌంటుబాటన్, స్వాతంత్ర ప్రదానం, ఆగష్టు 15.

విమానం ముందుకు పోతూనే ఉంది.

మనస్సు నిలచి ప్రశ్నించుకుంది.

"భారత దేశం సాగించిన అహింసాపూర్వక స్వాతంత్ర్య పోరాటానికి ఆంగ్ల జాతి కనక స్వాతంత్ర ప్రదానం జరిగింది. అదే మరో జాతి అయితే మన దేశం గతి ఎలా ఉండేది" అని ప్రశ్నించు కుంది తనలోతానే లక్ష్మి.

"అదే ఆజాతి విశిష్టత" అని మనస్సు సమాధానం చెప్పుకుంది తనకుతానే.

"ఆ దేశానికే ఈ ప్రయాణం" జ్ఞప్తికి తెచ్చుకుంది లక్ష్మి మనస్సు.

ఇంగ్లండులో 'ఉమెన్సు వాలంటరీ సర్వీసెస్' అను పేరిట ఒక ప్రసిద్ధమైన మహిళా స్వచ్ఛంద సేవాసంస్థ నెలకొని ఉన్నది. ఆ సంస్థ మహాసభలను పురస్కరించుకొని శ్రీమతి లక్ష్మిరఘురామ్, హాజరవ వలసిందిగా ఆహ్వానం వచ్చింది. ఆ కారణంగానే ఈ లండన్ ప్రయాణం—

*　　*　　*

విమానంలో సోదరి రాధాకృష్ణ, కుమారుడు అరవింద్‌తో కలసి అక్కగారి కోసం ఎదురుచూస్తోంది. దూరంగా ఆకాశంలో ఒక చుక్క కనబడింది. చుక్క పక్షి అయింది. పక్షి పెద్దదయింది. అది విమానమయింది. ఇండియన్ ఎయిర్ లైన్సు వారి బోయింగ్ విమానమయింది. ఆగింది.

విమానానికి ఆనించిన నిచ్చెన మెట్లు దిగుతూనే శ్రీమతిలక్ష్మి చెల్లినీ, అరవిందునీ చూచింది. కుడిచేయి పైకెత్తి అల్లల్లాడించింది. గబగబా నిచ్చెన దిగి జరజరా వారిని సమీపించింది.

అక్కను చూచిన రాధాకృష్ణ నాలుగడుగులు ముందుకు ఉరికింది. అక్కను ఆలింగనం జేసుకొంది.

ఐరోపా ఖండపు ఆ పడమర కొసన నివసిస్తోన్న ఆ చెల్లి రాధా కృష్ణ, ఆశియాఖండపు ఈశాన్యపు కొసన నివసిస్తోన్న ఈ అక్క లక్ష్మీనారాయణ ఒకరినొకరు వాటేసుకున్నారు. ఆరు సంవత్సరాల దీర్ఘ వియోగానంతరం ఆ అక్కచెల్లెండ్రు ఒకరి బాహువుల్లో ఒకరు ఒదిగిపోయారు.

"అక్కా!" అని పిలిచింది కృష్ణ.

అది పిలుపుగాదు! పలుకు గాదు !! గొంతులోని గురగుర ! ఒకస్వరజీర !!

అక్కగారి గొంతుకలో ఆ జీరగూడా పలుకలేదు.

కండ్ల నీరూరింది ! కన్నీరుగామారింది !! ఏరుగా పారింది !!! ఇరువురి హృదయ స్పందనలూ ఏక గీతిని ఆలపించాయి. ఏక శోకాన్ని ధ్వనించాయి. సావేరిరాగాన్ని ప్రతిధ్వనించాయి.

ఒకేమాతృగర్భంలో జీవంపోసుకున్నవారు. ఒకేతల్లి ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో పాలుపంచుకున్నవారు. ఒకే అమ్మ స్తన్యంతో బిడ్డలైన వారు. ఒక పళ్లెరంలో భుజియించినవారు. ఒక శయ్యపై నిదురించిన వారు. ఒకరుగా ఆడినవారు. ఒకరుగా పాడినవారు. ఒకే చోట చదివిన వారు. ఒకరుపెద్దమ్మాయి. ఇంకొకరు చిన్నమ్మాయి.

ఆరేండ్ల తరవాత తిరిగి ఒకరి చేతుల్లో ఒకరు ఒకటైనారు.

అది తెల్లదొరల దేశమని వారికి స్పృహలేదు. పరాయి ప్రాంత మన్న భావన రాలేదు. ఎవరన్నా చూస్తున్నారేమో నన్న తలంపు కలగలేదు. ఏమన్నా అనుకుంటున్నారేమోనన్న విచికిత్సా మనస్సు లకు తాకలేదు.

రెండు హృదయాలు మాత్రం ఒకటి నొకటి తాకాయి. బలంగా తగిలాయి. ఒరుసుకున్నాయి. ఏకమైనాయి. క్షోభించాయి. దీర్ఘ వియోగానంతరం ఆ తప్తహృదయాలు కలుసుకున్నపుడు ద్రవించే ఆర్ద్రత, పొరలే ఆప్యాయత, పొంగే వాత్సల్యం పెనవేసుకొని మూర్తి

దాల్చి ఆ ఇద్దరు స్త్రీమూర్తులలో ద్యోతకమైనాయి, ఆ లండన్ విమానాశ్రయంలో ఆ క్షణాన.

చుట్టు ప్రక్కల ప్రయాణీకులు సహితం నిలచి క్షణంసేపు తేరిపారజూచి, ఆశ్చర్యంతో పాటు ఆనందాన్ని గూడా సమ్మిశ్రితం జేసుకొన్న చూపులతో ఈ ఇరువురు సోదరీమణుల గాఢాభిరక్తికీ, ప్రగాఢానురక్తికీ తమ మనస్సుల్లోనే ప్రకటించుకుని సాగిపోయిన క్షణం అది.

అమ్మా, పెద్దమ్మల ఆలింగనాలను చూచి సంతోషిస్తోన్న బాబు అరవింద్, తల్లుల నయనాల్లోని విషాద రేఖలనూ, మొగములో ప్రస్ఫుటమౌతోన్న ఆవేశ ఆవేగాలనూ పరీక్షగా చూచి, కొంచెం బిక్కుమన్నాడు. బిక్కమొగం వేశాడు.

అది గమనించిన శ్రీమతి లక్ష్మి తన కన్నీటిని తుడుచుకొంది. తమాయించుకొంది. తనలోని భావావేశాన్ని తనలోనే ఇముడ్చుకొని తాను తానైంది. అరవింద్‌ను రెండు చేతులతో దగ్గరకు తీసుకొంది.

"అమ్మా!" అంటూ కాళ్లువాటేసు కున్నాడుబాబు. రెండు చేతులా పైకెత్తి బుగ్గలను ముద్దిడుకొంది పెద్దమ్మ. బాబు దిగులు పోయింది. నవ్వాడు. రెండు చేతులా పెద్దమ్మ మెడను వాటేసు కున్నాడు.

శ్రీమతి కృష్ణ కారులో ఆమె డ్రైవ్ చేస్తుండగా ఆమె నివాస గృహానికి జేరారు అందరూ.

చెల్లి కృష్ణతో రెండురోజులు కులాసాగా గడపాలనే ఉద్దేశ్యంతోనే, అక్క లక్ష్మి ఈ అంతర్జాతీయ మహిళా సమావేశపు తేదీలకన్నా రెండురోజులు ముందుగానే ప్రయాణమై లండన్ రావటం జరిగింది.

ఉమెన్స్ వాలంటీర్ సర్వీసెస్ (W. V. S.) ఇంగ్లండులోని సర్వప్రజానీకంలో అద్భుత గౌరవ మన్ననలను అందుకున్న సంస్థ.

ఈ మహిళా స్వచ్ఛంద సంస్థ, రెండవ యుద్ధకాలంలో, ఇంగ్లండు మహా భయంకర విపత్కర పరిస్థితులను ఎదుర్కొంటున్న కాలంలో ఉద్భవించింది. బ్రిటిషు దీవులలోని స్త్రీలందరకూ ప్రాతినిధ్యం ఉన్న ఈ సంస్థలో అసంఖ్యాకంగా సభ్యులు జేరారు. యుద్ధకాలంలో, రక్షణశాఖల్లో వివిధములైన ప్రయోజనాత్మక కార్యక్రమాలను కొనసాగించారు. విమానదాడుల నుంచి, వయోవృద్ధులనూ, పసినిసుంగులనూ తప్పించేందుకూ, సామూహికంగా వారిని నగరాలనుంచి, పల్లె ప్రాంతాలలోని రక్షితస్థలాలకు తరలించటంలో, అనుపమానమైన కృషి జేశారు. విమానదాడుల అనంతరం, క్షతగాత్రులైన పౌరులకు, వైద్యసహాయం జేయడంలోనూ, వారికి పునర్నివాసాలేర్పరచడంలోనూ, ఈ స్త్రీలు నిరుపమానమయిన సేవలు జేశారు.

రణరంగంనుంచి, తరలించబడిన అంగవిహీనులై, రోగగ్రస్థులైన రక్షణ దళాల సిబ్బందికి కడుఓరిమితో వైద్యసదుపాయాలు కలిగించి ఆదరించి పునః వారికి ఆత్మవిశ్వాసం జేకూర్చారు.

ప్రభుత్వమూ, పరిశ్రమలూ, యుద్ధావసరాలకు ఉత్పత్తిచేయడంలో తల మునకలుగా సతమతమవుతుంటే, ఈ స్వచ్ఛంద సేవా మహిళా కార్యకర్తలు, లభ్యమైన ప్రతి వసరునూ, ఉపయోగించుకొని, దొరికిన ప్రతి వస్తువునూ వినియోగించుకొని, జాతి అవసరాలను కడుశ్రద్ధతో తీర్చుకున్నారు. జాతి జీవితాన్ని అనుదినం నడపవలసిన బాధ్యతనుంచి ప్రభుత్వాన్ని తప్పించి, ఈ స్వయం సేవక మహిళా సోదరీ మణులే, బ్రిటీషు ప్రజల నిత్యావసరాల సేకరణ అద్భుతంగా నిర్వహించాను. సరఫరా బాధ్యతల నిర్వహణను తమ భుజస్కంధాలపై భరించారు.

దొరికిన పాత మేజోళ్లను కలిపి చేతులతో కుట్టి బ్లాంకెట్లుగా తయారుజేసి పౌరులకు అందించారు. జీర్ణ వస్త్రాలను, ఇంకాపనికిరాని అన్ని వస్తువులనూ, ఎక్కడకక్కడే వారు కృషిజేసి

అవసరాలకు ఉపయోగించే తీరుగా తయారించుకొని ప్రజల అక్కర్లను తీర్చారు.

పోరాటంలో అగ్రశ్రేణిలో ఉన్న సైనిక దళాలకు, సప్లయి చేయటానికి గూడా ఎంతమాత్రం వెరువక, ఈ దళం యువతులు ముందుకు వచ్చారు. ధైర్యంగా కృషి జేశారు. ఘనంగా మనన్న లందారు.

త్యాగ పూరితమూ, సాహసోపేతమూ అయిన, ఈ సంస్థ నిర్వహించిన చారిత్ర్యాత్మకకృషిని జూచి, ఆంగ్లప్రజలు ఇనుమ డించిన ఉత్సాహంతో యుద్ధ కృషికి దోహదం చేశారు.

ఈసంస్థకు బ్రిటిషురాణి పోషకురాలు. రాణిమాత ఎలిజబెత్ అధ్యక్షురాలు ఆనాడు.

ఈసంస్థ సమావేశానికే శ్రీమతి లక్ష్మి హాజరయ్యారు.

లండన్‌లో జరుగనున్న ఈ స్వచ్ఛంద సేవా కార్యక్రమాల ఉత్తమ సంస్థ సమావేశాలకు భారతదేశం తరపున ప్రాతినిధ్యంవహింటానికి ఎన్నికచేయ వలసి వచ్చినప్పుడు, రాజకీయవైరుధ్యాలు లేని నాయకులకోసం భారత ప్రభుత్వం తీవ్రంగా పరిశీలించ వలసి వచ్చింది.

రాజకీయాల ప్రమేయం లేకుండా, మహిళా ఉద్యమంలో కృషిజేస్తున్నారనే అభిప్రాయంతో శ్రీమతి ఇందిరాగాంధి శ్రీమతి లక్ష్మి రఘురామ్ పేరు సూచించారు. తదనుగుణంగానో, శ్రీమతి లక్ష్మికి ఆహ్వానం రావడం, ఈమె అంగీకారం తెలపడం జరిగింది.

* * *

సమావేశాలకు ముందున్న ఆ రెండు రోజులూ, తానూ కృష్ణ, చిన్ననాటి అక్కచెల్లెండ్రు అయ్యారు. పెరిగిన వయస్సులను ఎదిగిన బాధ్యతలను విస్మరించారు. తిరిగి ముప్పైఅయిదేండ్లనాటి అమ్మా నాన్నల పెంపకంలో అల్లారుముద్దుగా పెరిగి, ఆనందాతిరేకంతో కుప్పిగంతులు వేసుకున్న వయస్సుకు మళ్లారు.

మదనపల్లి గురుకులంలో కజిన్సు సతీమణి 'ప్రేమతో' చౌదరి సిస్టర్స్' అని పిలవటం జ్ఞాపకం వచ్చింది. నవ్వుకున్నారు. పీటల క్రింద ఇష్టంలేని చపాతీలు దాచి, తిన్నామని వంటవాళ్లనూ తోటి వాళ్లనూ నమ్మించి, బియ్యపు అన్నం తినడం జ్ఞాపకంవచ్చింది. నవ్వుకున్నారు.

ఇద్దరూ సైకిళ్ళు త్రొక్కడం జ్ఞాపకం వచ్చింది. గుర్రపు స్వారీ చేయటం జ్ఞాపకంవచ్చింది. బందరులో స్కూలు వదలిం తర్వాత కారును పంపించి వీరు నడచి వెళ్తుంటే జనం వీరికేసి వింతగా చూడటం జ్ఞాపకం వచ్చింది. ఇద్దరూ కవల పిల్లలు అని వారు అను కుంటం మరొకసారి వినిపించింది. నవ్వుకున్నారు.

'కృష్ణ' చిన్నతనంనుంచీ చాలా కలుపుగోలుతనంగల పిల్ల. మనిషికి చొరవ ఎక్కువ. కొత్తా పాతా లేదు. ఎవరి ఎదుటికైనా పోతుంది. ఏమైనా మాట్లాడుతుంది.

నాన్నగారు ఇంటివద్ద లేని సమయాల్లో, జవానులు సమయా నికి ఇంటిముందు ఉండనప్పుడు పెద్దవారు ఎవరైనా వచ్చి, నాన్న గారి గురించి అడిగితే, లక్ష్మి కొంచెం తలుపుచాటున ఉండి సమా ధానం చెప్పేవారు. అడిగితేనే చెప్పేవారు. అడిగినంత వరకే చెప్పే వారు. 'కృష్ణ' అలా కాదు తుర్రున వాళ్ల ఎదుటకు వెళ్లేది. ఈమే అడిగేదివాళ్లను "ఎందు కొచ్చారు"? అని. ''నాన్నగారు కాంపుకు వెళ్ళారు. ఫలానపుడు వస్తారు" అని చెప్పేది. "ఏమిపని మీద వచ్చారు ?'' అని ప్రశ్నించేది. అంత అర్జంటయితే నాన్నగారు కాంపు చేస్తూన్న ఊరికి వెళ్లమంటూ దారి గూడా చెప్పేది.

"ఎందుకే, కృష్ణా! నీకు ఆవివరాలన్ని? నాన్నగారు లేరు అంటే సరిపోదూఅంతా అనవసర ప్రసంగం" అనేవారు లక్ష్మి.

''అది కాదే అక్కా! వాళ్లు ఎంత అర్జంటు పనిఉండి వచ్చారో.

ఎంత ఆత్రంగా వచ్చారో! మరిఆసంగతి తెలుసుకొని వాళ్లకు వివరాలు చెప్పటం మంచిదేగా అక్కా!'' అని జవాబు చెప్పేది. తుర్రున మళ్లీ ఇంట్లోకి వెళ్లేది. స్వచ్ఛంద హృదయిని చెల్లెమ్మ కృష్ణ.

బంధువు లందరి దగ్గరా ఈ చిన్నమ్మాయికి మాలిమి ఎక్కువ. అందరనూ, వయిన వయినంగా పిలిచేది. వరసలు కలుపుకొని పిలిచేది.

లక్ష్మి కదిచేతకాదు. బంధువులయినా సరే అడిగినదానికే ముక్తసరిగా జవాబులు చెప్పటం ఈమెకు అలవాటు. అందుకనే అందరూ కృష్ణను మెచ్చుకునేవారు. మంచి పిల్ల అనేవారు. భోళా మనిషి అనేవారు. దగ్గరకు తీసుకునేవారు. లక్ష్మిని మొఖమెదుట అనకపోయినా, గర్విష్టి అని వాళ్లలోవాళ్లు అనుకునేవారు. ఒకరికొకరు చెప్పుకునేవారు.

కర్ణాకర్ణిగా ఈ విషయం ఈమె చెవుల బడినా ఈమె చేయగలిగింది గూడా ఏమీ ఉండేది గాదు. ఇది ఈమె తత్వం. ఎవరితో మాట్లాడ గూడదనిగానీ, బెట్టుసరిగా ఉండాలనిగానీ, ఆధిక్యతను చూపుకోవాలనిగానీ ఎంత మాత్రం ఉండేదికాదు లక్ష్మికి. అయినా ఈమెకు మొదటి నుంచి అంతగా కలివిడిగా ఉండడం అలవాటుగా లేదు. చేతనూ గాలేదు.

కృష్ణకు స్కూలులోగానీ, కాలేజీలోగానీ చాలా మంది స్నేహితురాండ్రు. ఎక్కడికక్కడే కలుపుకునేది. లక్ష్మికో బహు కొద్దిమంది. అందరిలో ఈమెకు ముఖ్యస్నేహితురాలు తన ప్రియమైన చెల్లెలు రాధాకృష్ణ.

ఆ రెండు రాత్రిళ్లూ, భోజనాలయాక, వీరిద్దరూ ప్రక్కప్రక్క మంచాలపై జేరి బాల్యస్మృతుల నెన్నింటినో వెలికి తెచ్చుకున్నారు.

"అక్కాయ్!"—అని పిలిచింది చెల్లి కృష్ణ.

"ఏమిటమ్మా!"—అంటూ జవా బిచ్చింది అక్కలక్ష్మి.

"అమ్మ ఎట్లా ఉందే అక్కా!" అడిగింది చెల్లిగుబులుగా.

"బాగానే ఉందమ్మా! నిన్ను గురించే ఆమెకు దిగులల్లా!" అంది అక్క. ఆ అమ్మకున్న దిగులులో ఈ అక్కకు నూటికి రెండు నూరుల వంతు ఎక్కువ ఉంది. అమ్మ ఈ ఇద్దరకు అమ్మే అయినా,

లక్ష్మికి కృష్ణ చెల్లెలేగాదు కూతురుగూడా.అంతేగాదు తనలోని భాగం గూడానేమో, అక్క అయి ఉండి గూడా చెల్లిని గురించి తల్లిలాంటి భావాన్ని గలిగించుకొంది. ఆలాంటి అనుభూతిని పెంచుకొంది. వాత్స ల్యాన్ని పెంపొందించుకొంది.

"ఎందుకే అక్కా అమ్మకు దిగులు!" నిదానంగా అడిగింది చెల్లి.

"నీవేమో ఆరువేల మైళ్ళకీవల ఉంటివాయె! అమ్మేమో దుగ్గిరాల నుంచి కదలదాయె! నూటికో కోటికో ఢిల్లీకి రావడమే గగనమాయె! అమ్మ లండన్ ప్రయాణంచేయదాయె! మనస్సేమో లండన్‌లో ఉన్న నీచుట్టూ తిరుగుతుందాయె! అందుకేనే అమ్మకు దిగులు!" ధైర్యంగా బదులు పలికింది అక్క. మమకారాలు పలుక్కు నేప్పుడు వినవచ్చే మాటలవి. కడుపు చించుకొని బయల్వెడలే వాక్కు లవి. వినేవారిని అతలాకుతలం జేసేధ్వనులవి.

"అక్కా!" అని పిలిచింది చెల్లి

"ఏమిటి కృష్ణా!" అని పలికింది అక్క.

"బావగారు బాగున్నారా? దివ్యజ్ఞాని ఏమంటుంది?" చెల్లి ప్రశ్నించింది.

బావగారి రాజకీయ వ్యాసంగాన్ని గురించి, నిర్వహిస్తున్న భారత ప్రభుత్వయంత్రాంగాన్ని గురించి అడిగి తెలుసుకొంది. ఢిల్లీ లోని రాజకీయ వాతావరణాన్నీ, తెలుగునాట ప్రభుత్వ పరిస్థితినీ, అడిగి తెలుసుకొంది.

దుగ్గిరాలను జ్ఞాపకం చేసుకొంది. చిన్ననాడు ఆడిపాడినప్రదే శాలను జ్ఞాపకంచేసింది. గొబ్బెమ్మలకాలంనాటిస్నేహితురాండ్రనూ, ఇరుగుపొరుగు అమ్మలక్కలనూ స్పృశించింది. అందరనూ వయిన వయినాలుగా అడిగింది. పేరుపేరునా పలకరించింది.

చెల్లెలి జ్ఞాపకశక్తికీ, ఇరుగుపొరుగులవారి పైని ఆకాంక్షకూ అక్క అబ్బురపడింది.

తదుపరి జీవితాలలో వచ్చిన మలుపులను గురించి ప్రస్తావించుకున్నారు.

మాటామంతీచెప్పుకున్నారు. పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. సంతృప్తికరంగా నిద్రపోయారు.

* * *

ఆంగ్ల మహిళా విముక్తి ఉద్యమం స్ఫురణకువచ్చినపుడల్లా శ్రీమతి లక్ష్మి ముగ్ధురాలవుతారు. "నిజంగానే ఈ దేశంలోని మహిళా ఉద్యమ చరిత్రా, ఆ కార్యకర్తలు నన్ను చాలవరకు ప్రభావితం చేశారని చెప్పుకొనుట బిడియపడవలసిందేదీ లేదనుకుంటాను. కాగా ఆంగ్ల మహిళల విముక్తి పోరాటంలో పాల్గొన్న సోదరీ మణుల ధైర్యసాహసాలూ, కష్టసహిష్ణుత, కర్తవ్యదీక్షలు నాకు ఒకవిధంగా ఆదర్శప్రాయంగానే ఉంటాయి. ఉత్తేజితపూరితంగానూ ఉంటాయి. నాకేగాదు ప్రపంచంలోని అన్ని దేశాల మహిళా ఉద్యమ నాయకురాండ్రకూ ఆనాటి ఆంగ్ల సోదరీమణుల కృషి శిరోధార్యమే గావాలని నా అభిలాష." అని శ్రీమతి లక్ష్మి తన డైరీలో ఒక చోట వ్రాసుకున్నారు.

"ఆంగ్ల స్త్రీలు సమాజంలో నేటిస్థితికి రావటానికి ముందుట సుదీర్ఘమైన పోరాట చరిత్ర ఉన్నది. విపులమైన కార్యరంగమున్నది. సాహసోపేతమైన కార్యాచరణా ఉన్నది. నిస్వార్థ, త్యాగపూరిత మైన పెక్కురు మహిళా నాయకురాండ్ర జీవితాల తపస్సులూ ఉన్నాయి." అంటూ లక్ష్మీరఘురామ్ చెప్పుకుపోతుంటే, ఆమె మనఃఫలకంపై ఆగ్లం మహిళా ఉద్యమచరిత్ర పుటలు, వేవేగంగా తిరుగుతున్నట్లు గన్పిస్తుంది. సంక్లిష్టమూ, క్షోభాపూరితమూ అయిన ఆ చారిత్రకపూటలను వివరిస్తూ—

"చూస్తుంటే ప్రపంచ వ్యాప్తంగా మనుష్యులందరి మనస్సు లోనిభావాలు ఒకవిధంగానే ఉంటాయనితోస్తుంది. వెనుకపడ్డ ప్రజల



ప్రపంచ తెలుగు మహాసభలలో బహుమతీస్వీకారం. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు : విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు : వేదికపై డాక్టర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి.



అఖిల భారత మహిళా మహాసభలో (గుంటూరు) ప్రసంగిస్తూన్న కేంద్రమంత్రి శ్రీ రఘురామయ్య: ప్రారంభించిన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు: అధ్యక్షురాలు శ్రీమతి లక్ష్మీరఘురామ్, ప్రదేశ్ కాంగ్రెస్‌పతి శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ, వ్యవసాయమంత్రి శ్రీ చొక్కారావు.




అంతర్జాతీయ మహిళా సదస్సులో ప్రసంగిస్తోన్న ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ; అధ్యక్షత వహించిన శ్రీమతి లక్ష్మీరఘురామ్.



బేగం షేక్ అబ్దుల్లాతో శ్రీనగర్ సమావేశంలో.



—హనోలూలూ మహిళా ఉద్యమ నాయకురాలుకు ఇచ్చిన విందు సందర్భంలో శ్రీమతి లక్ష్మీరఘురామ్, శ్రీమతి తారకేశ్వరిసిన్హా, హనోలూలూ నాయకురాలు, శ్రీమతి దివ్యజ్ఞాన సహోదరి వరదరాజన్.



— ఇంటర్నేషనల్ ఎలయన్స్ ఆఫ్ ఉమెన్, బెర్లిన్ సమావేశంలో ఆసియాఖండ విభాగానికి డైరెక్టరుగా పాల్గొన్న శ్రీమతి లక్ష్మీరఘురామ్.



— మాజీ రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరితో



— మాదాం ననా వాహావో (రష్యా) గౌరవార్ధం శ్రీమతి లక్ష్మీరఘురామ్
ఇచ్చిన విందులో



— ఎథీనియం - ప్రారంభోత్సవం చేస్తున్న శ్రీమతి లక్ష్మీరఘురాం, మాజీ కేంద్ర సమాచార మంత్రి డాక్టర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి.

× × ×

—శ్రీ స్వామి శివానంద కల్చరల్ అసోసియేషన్ భవనానికి శంకుస్థాపన గావించిన మాజీ రాష్ట్రపతి డా. రాధాకృష్ణన్, అధ్యక్షత వహించిన శ్రీమతి లక్ష్మీరఘురామ్.



స్వర్గీయ లాల్‌బహదూర్‌శాస్త్రి అధ్యక్షత వహించిన ఒక అంతర్జాతీయ సదస్సులో ప్రసంగిస్తున్న శ్రీమతి లక్ష్మీరఘురామ్.




కరాచిలో జరిగిన ప్రపంచ మహిళా సదస్సులో శ్రీమతి లియాకత్ అలిఖాన్ వీడ్కోలు ప్రసంగం. ఆస్ట్రేలియా ప్రతినిధి శ్రీమతి కల్లన్స్, నేపాల్ ప్రతినిధి శ్రీమతి శకుంతల, భారత ప్రతినిధి శ్రీమతి లక్ష్మీరఘురామ్, పాకిస్తాన్ ప్రతినిధి శ్రీమతి అహమద్.



భావం ముందుకు పోవాలని ఉంటుంది. ముందున్న ప్రణివారూ వెనకనున్న వారిని వెనకనే ఉంచాలనుకొంటారు. ఈసత్యం, మరీ పురుషులకూ స్త్రీలకు మధ్యఉన్న సంబంధంలో స్పష్టంగా కనిపిస్తుంది. అది ఏదేశమైనాగానీ, ఏప్రాంతమైనాగానీ మనకు 'మనువు' లున్నట్లే అన్ని దేశాలలోనూ వారికి వాళ్ల 'మనువు' లున్నారు. చూస్తూ చూస్తూ ఆడదానికి హక్కులు యివ్వటానికి ఎంతమాత్రం ఇచ్ఛగించని మహాప్రబుద్ధులు, అన్నిదేశాలలో అన్నికాలాలలో మనకు కనుపిస్తూనేఉన్నారు. ఇంగ్లండులో స్త్రీలు ఎవరి దయాధర్మాలమీద ఆధారపడకుండా ఉద్యమాలు నడిపి, పోరాడి, యాభయి సంవత్సరాలు అనేక అవస్థలుపడి కడకు మాత్రమే విజయాన్ని సాధించారు." అని తృప్తిని ప్రకటిస్తారు శ్రీమతి లక్ష్మి.

'శ్రీమతి, మేరి ఉల్‌స్టన్ క్రాఫ్ట్' "న్యాయమైన స్త్రీల హక్కులు.'' అనే గ్రంథాన్ని రచించింది. ఈమె "స్వాతంత్రం, సమానత్వం" సిద్ధాంతాలతో ప్రభావితమైన వ్యక్తి.ఈమెలాగే పెక్కురు ఆంగ్ల వనితలు స్త్రీలహక్కులను ఉద్ఘాటిస్తూ పెక్కురచనలు సాగించారు. ఎన్నో అత్యవసర కరపత్రాలను రచించారు. ఈ రచయిత్రుల గ్రంథాలు ఆంగ్లస్త్రీల వాస్తవ పరిస్థితులను సంఘానికి పరిచయం చేశాయి. పిడి వాదంతో ఆడవారు ఆడవారే, మగవారు మగవారే, మనతోవాళ్లు సమాన మేమిటి, అనే ప్రబుద్ధుల బండబారిన మెదడులకు ఈరచనలు సోకకపోయినా, సాంఘిక ప్రయోజనాన్ని త్రికరణ శుద్ధిగా వాంఛించే కొందరు జ్ఞానపరులకు ఇవి రుచించాయి. న్యాయసమ్మతమైన స్త్రీల వాంఛలపట్ల వారిదృష్టి మరలటానికి ప్రధానంగా ఈ రచనలు ఆరోజుల్లో ఉపయోగపడ్డాయి.

ఆమాటకొస్తే ప్రతిదేశంలోనూ, మహిళా ఉద్యమాలు స్త్రీల రచనలతోనే ప్రారంభమయ్యాయి. ఏనాటికానాడు ప్రతిప్రాంతంలోనూ ఈరచనలు మహిళా కార్యకర్తలను ఉత్తేజపరచాయి.

మేరీ ఉల్‌స్టన్ గ్రంథంలో స్త్రీలకు సమాన మానవహక్కులు ఉండవలసిన అవసరాన్ని శాస్త్రీయంగా ఋజువు చేసింది. ఈ

గ్రంథం మహిళా ఉద్యమాలకు పాఠ్యగ్రంథంగా పరిగణించబడింది. స్త్రీలలో ఈ పుస్తక పఠనం ఎంతగా ఉద్దీప్తరాంద్రను చేసినా, పురుషులు మాత్రం, "నాటిసమాజంలో ఏమాత్రం మార్పులు జరిగినా, స్త్రీకి స్వేచ్ఛ లభించినా, సంఘమే పతనమౌతుందనీ, దేశం ధ్వంసమైపోతుంద"నే అభిప్రాయాలను ఇంకా బాహాటంగా ప్రవచించటం ప్రారంభించారు. అయితే క్రమంగా లోలోన మహిళల పట్ల సానుభూతి పెరగటం ప్రారంభించింది.

ఆరోజుల్లోనే, మిస్ హాన్నా మూర్, Hannah More మిసెస్ ట్రిమ్మర్ లాంటివారు, ఆదివారం పాఠశాలలు ప్రారంభించారు. ఇవి స్త్రీలలో విద్యాభిలాషను పెంపొందించాయి.

స్త్రీల ప్రగతికి కంకణంకట్టుకున్న జేన్ ఆస్టిన్, మేరీ బెర్రి, మేరీసోమవిల్లె లాంటివారు దక్షతతో సాగించిన కృషి ఫలితాలు స్త్రీ జనం వివేకవంతమవటానికి ఎంతగానో తోడ్పడ్డాయి. 'స్త్రీలహక్కులు' అనే మాటను, నినాదరూపంలో పెట్టి దానికి తగుప్రచారాన్ని సాధించారేగాని వీరు చట్ట రూపంలోనికి తెచ్చేందుకు ఇంకా ఎంతో దూరంలోనే ఉండిపోవలసి వచ్చింది ఆనాటికి.

ఇట్టిపరిస్థితిలో 1837 లో విక్టోరియా మహారాణి, ఆంగ్ల సింహాసనాన్ని అధిష్టించింది. అప్పటికి విక్టోరియాకు 18 సంవత్సరాల వయస్సే. ఆమెకు పట్టాభిషేకం జరుగుటతోడనే, (Chartist Movement) చార్టిస్ట్ ఉద్యమం అంటూ ఒకటి వెలసింది. ఆ ఉద్యమానికి మూల సూత్రాలలో 'స్త్రీల సమాన హక్కులు' గూడా ఒకటి. కాని అధిక సంఖ్యలో పురుషులు చూపిన తీవ్రప్రాతికూల్యం మూలంగా ఈస్త్రీల సూత్రాన్ని చివరకు కొట్టివేయవలసి వచ్చింది. అయితే ఆ ఉద్యమ కారులైన పురుషులు, ఈమహిళా ఉద్యమవ్యాప్తికి దోహదంచేశారు. 1819 లో(రిఫారంబిల్ అజిటేషన్) సంస్కరణల చట్టం ఆందోళన సందర్భంగా, పీటర్లూలో పెక్కురు ప్రదర్శనకారులు చంపబడ్డారు.

అప్పటినుంచి, స్త్రీలు తమ వేదికలను తామే ఏర్పాటుచేసుకోవడం ప్రారంభించారు.

"ఈ సందర్భంలో నాకొకటి తలపుకు వస్తుంది. ఒక్కొకసారి ఒక్కొకరి జీవితంలోని స్వంత అనుభవాలు, బాధలు, వారు మారటానికేగాక, పరిసరాలు మారటానికిగూడా ఎంతగానో తోడ్పడతాయ"ని అంటారు శ్రీమతి లక్ష్మి ఆంగ్లమహిళోద్యమాన్ని సమీక్షిస్తూ.

"ఇంకో విషయంగూడా నాకు జ్ఞాపకం వస్తూంటూంది. పిల్లి పిల్లియే కాగాక. దానిని గదిలో బెట్టి తలుపులు బంధించి, మూలకు నెట్టి కొరడా ఆడిస్తే, అది పిల్లిగానే ఉండదు. పులిగాగూడా మారుతుంది. పంజావిప్పి కొరడా హస్తధారుని కనుగ్రుడ్లూ పీకుతుంది". అనిగూడా అంటారు శ్రీమతి లక్ష్మి.

ఆంగ్లేయ మహిళా పోరాట ఉద్యమంలో సుప్రసిద్ధురాలైన, కారొలిన్ నార్టన్ (Caroline Norton) జీవితం జ్ఞాపకం వచ్చిన ప్రతిసారీ, ఈ భావమేనాకు స్ఫురిస్తుంది.'' అని ఒకక్షణం వినీలాకాశంవైపు శ్రీమతి లక్ష్మి తన చూపులు నిగిడ్చి కారొలిన్ నార్టన్ పాత్రను జ్ఞాపకం తెచ్చుకుంటుంది. అనర్గళంగా కారొలిన్‌ను గురించి చెప్పుకుపోతుంది.

''కారొలిన్ నార్టన్‌లండన్ సభ్య సమాజంలో ఒక తుపాను సృష్టించింది. ప్రఖ్యాత నాటక రచయిత 'షెరిడన్'కు (Restrand Brinsley Sheridan) మనుమరాలు ఈమె. అద్భుత సౌందర్యవతి. 19వ, ఏటనే ఆనరబుల్ రిచార్డు నార్టన్‌తో వివాహం జరిగింది. ఆమె గృహానికి లార్డ్ మెల్‌బోర్న్ ప్రభృత అనేకులుప్రఖ్యాతులు విచ్చేస్తుండేవారు. మంత్రి పుంగవులూ దయచేస్తూ ఉండేవారు. ఆమె ఆతిథ్యం పొందటానికి అందరూ బహు తహతహ పడుతుండేవారు. తపన పడుతుండేవారు. ఆనాటి ఆంగ్లేయ సభ్య సమాజంలో ఆమెకు ఎంతో పరపతీ మన్ననా ఉండేవి.

కాని ఆమె మాత్రం ఏమాత్రం సుఖపడలేదు. భర్త క్రౌర్యానికి బలై పోయింది. ఒకసారి ఆమె సోదరిని సందర్శించటానికి వెళ్లిన సందర్భాన్ని, అపార్థం చేసుకొని, ఆమె భర్త ఆమెపై చేయిచేసుకొని, క్రూరంగా హింసించిన ఫలితంగా, ఆమె తల్లిదండ్రుల ఇంటిని శరణు జొచ్చవలసి వచ్చింది. ఆమె ముగ్గురి సంతానాన్నిగూఢా

భర్త అధీనంలోనే ఉంచుకొన్నాడు. పిల్లలను చూచుకుంటానికి గూడా అవకాశం ఇవ్వక వేధించాడు. ధనమూ లేదు. గృహమూ లేదు. జీవితమూ కడగండ్ల పాలైంది. ఆవిడ ఏమన్నా సంపాదించు కున్నా, నాటి చట్టాల ప్రకారం, స్త్రీకిఉన్న ప్రతిపైసా పురుషునకే చెందింది.

ఈలోగా, లార్డ్ మెల్‌బోర్న్‌తోపాటు తన భార్యనూ దోషిగా చిత్రిస్తూ ఈమె భర్త కోర్టులో దావా వేశాడు. నిష్కారణంగా ఈ దావా వల్ల, పదిమంది నోళ్లలో నానవలసి వచ్చిపడింది కారొలిన్. ఏలాంటి దురవస్థలో తానున్నదో కారొలిన్ అర్థం చేసుకుంది. తన్నివారణోపాయానికై అన్వేషణ ఆరంభించింది. చివరకు కోర్టు తన నిర్దోషిత్వాన్ని అంగీకరించిందనేది వేరు విషయం.

ఎలాగయినా సరే తనబిడ్డలను తాను చూచుకోవాలనే కోరిక బలపడింది.

ఆ అభిప్రాయమే ఒక ఉద్యమరూపం దాల్చింది.

"అందుకే నేనన్నది, పిల్లిని మూలకునెట్టి హింసించటం ప్రారంభిస్తే పంజావిప్పుతుందని" అంటారు శ్రీమతి లక్ష్మి.

కారొలిన్ సరిగ్గా అలాగే తన పంజావిప్పింది. ముడుచుకొని ఉన్నంతసేపూ, పులిదిగానీ, పిల్లిదిగానీ, పంజా మెత్తగానే ఉంటుంది. ఎత్తునుంచి దూకినా, నిశ్శబ్దంగానే ఉంటుంది. ఒక సారి పంజా విప్పిందా ఆ గోళ్లకు ఎంతపెద్ద వస్తాదు మొఖంలోనైనా గీట్లు పడక మానవు.

ఇక, ఈమె అనేక కరపత్రాలను వ్రాయటం ప్రారంభించింది. సమాజానికి న్యాయాన్యాయాలను సుబోధకం చేస్తూ ఎన్నో రచనలు సాగించింది. బిడ్డలపై తల్లులకు లేనిహక్కు తండ్రులకు ఎక్కడ నుంచి సంప్రాప్తమయిందని ప్రశ్నించేది ఆ కరపత్రాలలో. బిడ్డలపై తండ్రులకున్న హక్కు ప్రశ్నించటానికిగూడా వల్లగానిదా? "అంటూ తీవ్రవాదనలను సాగించింది, తన రచనలలో. ఆమె రచనలలో తీక్ష

ణత ఉండేది. నిజాయితీ ఉండేది. సవాళ్లు ఉండేవి. కనకనే అవి పెక్కురు పెద్దలదృష్టిలో స్థానం సంపాదించు కున్నాయి. ఈమె వెలిబుచ్చిన సత్యాన్ని అర్థంచేసుకున్నారువారు.

ఫలితంగా, ఒక పార్లమెంటు సభ్యుడు (Talfourd) మిష్టర్ టాల్ఫర్డు, బిడ్డల పోషణ బాధ్యతల చట్టాన్ని పార్లమెంటులో ప్రతిపాదించ సమకట్టాడు. ఈ సందర్భంగా కొన్నిసార్లు ఈమెను కలుసుకోవటం, ఈ చట్టంలో పొందుపరచవలసిన వివిధ సూత్రాలను చర్చించుకోవటం జరిగింది. కాని పాడు సంఘం, దీనికి సహించలేక పోయింది. మిష్టర్ టాల్ఫర్డు ఈమెపై చూపిస్తూన్న సానుభూతినే సహించలేక పోయింది. కాగా ఇద్దరకూ 'రంకు' తనం అంటగట్టింది. పురుష పుంగవులు, ఈమెను 'ఆడ దెయ్యం' అని నోటినిండా తిట్టుకునేవారు. 'ఆడ మృగము' అని నోటినిండా నిందించేవారు.

ఇవన్నీవిని కారొలిన్ రౌద్రమూర్తి అయింది. కోర్టులో పరువునష్టం దావావేయాలని ప్రయత్నించింది. కాని శాసనాలూ, శాసనాలు ప్రసాదించవలసిన న్యాయాలు స్త్రీలకు మాత్రంగాదని, పాపం కారొలిన్ త్వరగానే తెలుసుకుంది. ఎందుకంటే వివాహిత స్త్రీకి స్వంతంగా దావావేసే హక్కు ఆనాటి సభ్య ఆంగ్ల సమాజంలో లేదు. హతోస్మి!

చివరకు, (Infants Custody Bill) 'శిశు సంరక్షణ బిల్లు పార్లమెంటులో ప్రతిపాదించబడే సమయానికి కారొలిన్ ఒక తీవ్ర వాద పూరితమైన కరపత్రాన్ని విడుదల చేసింది. అది తన పేరున వెలువరిస్తే సాధించవలసినంత ఫలితాన్ని సాధించలేదేమోనని, ఒక పురుషుని నామధేయంతోనే పాపం ప్రచురించవలసి వచ్చింది. ప్రతి పార్లమెంటు సభ్యునకూ, ప్రతి లార్డు మహాశయునకూ, విడివిడిగా ఈ విజ్ఞాపన కరపత్రాన్ని అందజేసింది.

ఒంటరిదైన ఈ ఆడది ఆ 19 వ శతాబ్దంలో ఎంతోబలిసి, మహోచ్ఛస్థితిలోకన్నుమిన్నుగానక,రవిఅస్తమించని సామ్రాజ్యాన్ని

పలుతున్నామని ముసురుకుంటున్న అందరు పార్లమెంటు మగధీరులతో ఎంతవరకు పోరాడగలదు !

అయితే ఒకటి మాత్రం నిజం. తదుపరి చాలా కాలానికి 1925 లో ఆంగ్ల పార్లమెంటు, పిల్లలపోషణ విషయాలలో స్త్రీ పురుషులకు సమాన బాధ్యత ఉన్నదని, విజ్ఞతతో చేసిన శాసనానికి, ప్రాతిపదిక మిసెస్ కారొలిన్ సూత్రాలేననీ, ఒకనాటి ఆమె నిర్విరామ పోరాటమేననీ నేను ధృడంగా చెప్పగలను. అని ఎంతో విశ్వాసంతో పలికింది శ్రీమతి లక్ష్మి.

"అందుకే మిసెస్ కారొలిన్ పాత్రను, మనస్సులో భద్రంగా దాచుకున్నాను. కనకనే ఈనాడు మీకు పరిచయాన్ని చేస్తున్నాను. '' అని గర్వపడతారు శ్రీమతి లక్ష్మి. "ఒక్కొకరి వ్యక్తిగత అనుభవాలు, బాధలు, వారిపరిసరాలను మార్చటానికి గూడా ఒక్కొసారి ఎంతగానో ప్రోద్బలంచేస్తాయి." అంటూ "అందుకే ఆంగ్ల మహిళా ఉద్యమ చరిత్ర పరిశీలనలో ఈమెకు ఇంత ప్రాముఖ్యమిచ్చినదీనూ," అన్నారు.

అంతేగాక, తరవాత 1857 లో పార్లమెంటు చేత, "వివాహాలు విడాకుల చట్టం" శాసనం గాబడటానికి, అందుకు పూర్వరంగంలో జరిపిన కృషికి కూడా మిసెస్ కారొలిన్ ఒక వైతాళిక అయింది. జాన్ స్టువర్టు మిల్లు, ఆయన సతీమణి హారియట్, బార్బరా స్మిత్ లాంటివారు ఈ ఉద్యమంలో విశేషపాత్ర వహించి "వివాహిత స్త్రీకి ఆస్తిపై హక్కు'' కై పోరాడారు.

అప్పటి నుంచే ఓటు హక్కుకై గూడా ఆందోళన జేయటం ప్రారంభించారు.

ఆంగ్ల మహిళా ఉద్యమ చరిత్రను జ్ఞాపకం తెచ్చుకుంటే, ఒకోసారి పురుషుల హ్రస్వదృష్టికి శ్రీమతిలక్ష్మి కుంచించుకపోతారు.

"స్త్రీలు సంస్కృతం చదువ నొల్లపడదు'' అని మన పూర్వ

ఋషులు నొక్కివక్కాణిస్తే; ఇచ్చట ఈ ఆంగ్లేయ ప్రబుద్ధులు, ఆడది పై చదువులు చదవరాదంటూ తిరస్కరించారు.

"నేడు, ఇంతటినాగరికత జాతిగా మన ప్రశంసల నందుకుంటున్న ఈనాటి వారి తండ్రితాతలు ఎంతటి సంకుచిత స్వభావులా అని నేను ఆశ్చర్యపడిపోతాను" అంటారు శ్రీమతి లక్ష్మి.

1866 వ సంవత్సరంలోగూడా లండన్ విశ్వవిద్యాలయపు ద్వారాలు ఆడపిల్లలకు తెరవబడలేదు. అంతకు ముందు అసలు కాలేజీలలో గూడా ఆడపిల్లలకు చేరేఅవకాశంలేదు. 'మిస్ బార్బరా బొడిచాన్' లాంటి మహిళా మణులు, స్త్రీల విద్యావ్యాప్తికి గణ్యమైన ప్రచారం జేసుకొని, Queens college ని స్వంతంగా స్థాపించుకున్నారు. అయినా అక్కడి విద్యార్థినులకు విశ్వవిద్యాలయం పరీక్షలను పెట్టడానికి నిరాకరించింది. ఎంతో ఆందోళనచేస్తే, మగపిల్లలకన్నా ఆడపిల్లలకు, అంతస్థు తక్కువైన పరీక్షలు మాత్రమే నిర్వహించగలమనే అంగీకారానికి వచ్చారు.

ఇలాంటి ఎన్నో అవమానాలను భరించి, ఆంగ్ల స్త్రీలు తమ స్వంత కళాశాలలనే వృద్ధి జేసుకుందామని నిశ్చయించుకున్నారు. కేంబ్రిడ్జి, ఆక్సఫర్డ్ విశ్వవిద్యాలయాలలో పురుషులకు ఎలాంటి శిక్షణ కల్పించబడుతుందో ఆలాంటి శిక్షణే తమ విద్యాలయాలలో సమకూర్చుకున్నారు. పరీక్షలకు యూనివర్సిటీనిరాకరిస్తే, అధ్యాపకులను ఆశ్రయించి పరీక్షలు నిర్వహించుకున్నారు.

ఈ గొడవలో విజయంసాధించు కొన్నాక, స్త్రీలు వైద్య విద్యాభ్యాసం జేయగూడ దన్నారు పురుషులు. ఇక్కడ శ్రీమతి లక్ష్మికి ఆశ్చర్యంగలిగించే విషయం ఒకటి ఉంది. అది "నర్సు విద్యకు స్త్రీలను ప్రోత్సహించిన, ఫ్లారన్స్ నైటింగేల్, ఆడవాళ్లకు డాక్టర్ల విద్య కూడదు అనటం.'' అయినా ఉద్యమం సాగింది. శ్రీమతి ఎలిజబెత్ గారెట్ ఈ ఉద్యమాన్ని వెన్నుకాచి నిలబెట్టింది. ఎంతో

ఆందోళనచేసి, దేశంలో గందరగోళం లేవదీసింది. అయినా పురుషులు గీసుకున్న గిరిలోంచి బెత్తెడన్నా వెనక్కు జరగలేదు.

విద్యావంతులైన పురుషులు తమచుట్టూ ప్రత్యేకంగా తమ పురుషులకోసమే, నిర్మించుకున్న ఈకోట గోడలను ఎక్కి, విచ్ఛేదం చేయప్రయత్నించిన ఘనత 30 సంవత్సరాల యువతి, సోఫియా-జిన్-బ్లేక్‌కు చెందుతుంది.

ఈమె స్త్రీలు నిర్మించుకున్న Queens College లోని పట్టభద్రురాలే. జర్మనీలో ఒక సంవత్సరం అధ్యాపక వృత్తిలో ఉండి, తదుపరి అమెరికావెళ్లి, ఒక సంవత్సరం వైద్యవిద్య ముగించింది. ఇంతలో తండ్రి అవసానదశలో ఉన్నాడని తెలిసి ఇంగ్లండు తిరిగి రావలసివచ్చింది.

ఇంగ్లండులో వైద్యవిద్యను పూర్తిచేయటానికి ఆంక్షలున్నందు వల్ల ఆ అవకాశం ఈ మేధస్సుగల యువతికి లభ్యంగాలేదు. కాని, తనకూ, తనతోటి సోదరీమణులకు జరుగుతూన్న ఈ అన్యాయాన్ని ఎదుర్కోటానికి తీవ్రంగా పోరాడింది. 1870 లో ఈమె నాయకత్వం క్రిందనే, వైద్యవిద్య చదువ నభిలషించు యువతులు సర్జన్స్ హాలులో ప్రవేశించబోగా, అక్కడి యువకులు దొమ్మీజరిపారు.

ఇదంతా ఒక భాగమే. మరొకభాగం ఉంది. అదీ మహిళా విముక్తి పోరటగాథే. అయితే దీనికన్నా ఆ భాగంలోని పురుషులు మరీ సంకుచిత మనస్కులు. కాగా ఇందులోనూ అందులోనూ గూడా స్త్రీ హక్కులను పరిమార్చేందుకు పూనుకున్న పెద్దలే ఎక్కువ.

ఈ కథ అన్నిదేశాలలో ప్రతిబింబితమౌతూ, జాతి జీవనాడును కల్మషపరుస్తూన్న విషాదగాథ గూడా.

1870 సంవత్సరం ప్రాంతాన, అప్పటికే స్త్రీల హక్కులకై అనేక పోరాటాలు సలుపుతూన్న ఆంగ్లేయ మహిళలు, వారి దృష్టిని సాంఘిక సమస్యలపై మళిపారు.

అన్ని దేశాలలోలాగానే, అతిసౌగసైనదిగా అభివర్ణించబడు తూన్న ఈ స్త్రీ సౌధపు పునాదులు వాస్తవానికి క్రూరత్వం మీద, జానిసత్వంమీద, మురికిమీద ఆధారపడి ఉన్నాయి. ఆసౌధపు నిర్మాణ మంతా దుష్ట అలవాటులతో, లంచాలతో, త్రాగుబోతు తనంతో నిండిఉంది.

ఈ నిజాలను ఆంగ్లేయ మహిళలు అర్థం జేసుకున్నారు. ఈ స్త్రీ సౌధంపు ఒక భాగంలో గౌరవనీయ మహిళా నివాసంగా కేటాయించబడింది. ఇందులోని స్త్రీ పవిత్రగా నామకరణం చేయ బడింది. ఆమెలో ఉన్న ప్రత్యేకమైన ఏ అంతరస్థ విలువలూ ఆమెను ఈ పవిత్రగా గౌరవించబడటానికి కారణంగాదు. పురుషుల సౌధా లను పరిరక్షించేందుకు, వారి పేరుకు గౌరవాన్ని ఆపాదించేందుకూ, వారి అహంకారాన్ని అభిజాత్యాన్ని ఎప్పటికప్పుడు వారు మరచి పోకుండా ఉండటానికి ఈమె శిరస్సువంచి, అణగిమణగి పడిఉండ టాన్ని ఆలోచించి, దయతో పురుషులు ఈ సోదరికి, 'పవిత్రగా' నామకరణం చేశారు.

అంతేగాదు ఎన్నో విధులనూ నిర్ణయించారు. భర్త అనుజ్ఞ లేనిదే బయటకుపోరాదు. పరపురుషులతో సాంగత్యం పనికిరాదు. ఇంటిలో వంటావార్పూ నైపుణ్యంగా చేస్తూ భర్తల జిహ్వాల రుచిని తీరుస్తుండాలి. బిడ్డలను కంటూండాలి. వాళ్లను బహుచక్కగా పోషిస్తుండాలి. అంత అవసరమైతే పురాణాలు చదువుకోవచ్చు. వాటిల్లో పుణ్యప్రాప్తి గలిగించే, ఆలోకాల్లోగూడా భర్త పాదార విందాలను కండ్లకద్దుకునే అవకాశం గల్పించే పతివ్రతామతల్లుల గాథలనే పారాయణం జేయాలి.

ఇలాంటి విధి నిర్ణయాలతో, స్త్రీ భౌతిక శరీరాలకు ఇటుక సిమెంటులతో కాంక్రీటు గోడలు నిర్మించటమేగాక, మనస్సులకు గూడా చూపన్నా జొరరాని ఇనుపతెరలు దించారు.

ఈ సౌధ భాగానికి అనుకునే ఈలాంటి మరో స్త్రీని పెట్టారు. ఆమెకు "కులట"అని నామకరణంజేశారు. ఆమెకు బ్రతుకుతెరువు వ్యభిచారం. అందుకై ఆమె విధిగా సౌందర్యాన్ని పెంపొందించుకోవాలి. నిత్యనూతనంగా కనుపించాలి. ఆ ప్రాంగణంలో కాలిడిన పురుషుల వయోభేదంగూడా పరిగణించకర్లేకుండానే తన తనువును అప్పగించాలి. దానిని అతను ఏవిధంగానైనా ఉపయోగించుకోవచ్చు. ఈమె వద్దకు వచ్చువారిలో, తండ్రి కొడుకులు వచ్చినా, అన్నదమ్ములు వచ్చినా, వారి చుట్టరికపు బాంధవ్యాలు ఏవీ ఈమెను అనుభవించటానికి ఎంతమాత్రం అడ్డురాగూడదు. చిదిమిన పాల్గారు చెక్కుటద్దముల వాడొచ్చినా, అంతిమయాత్రకు ఆహ్వాన పత్రాన్ని చేతబుచ్చుకొని సమీపించిన యమధర్మరాజు సేవకులకు కొంచెం లంచంబెట్టి, మరికొంచెం కాలయాపనకు అనుమతిపొంది, లభ్యమైన ఆ సమయాన్ని తన దగ్గర గడపాలని ఒక ముదిమివగ్గు వచ్చినా నిరాకరించరాదు. వాళ్లను తృప్తిపరచి, ధనము రుసుముగా పొందవచ్చు. ఎక్కువ తృప్తిజేసి నగానట్రా గూడా పొందవచ్చు.

ఇవీ పతితగా చిత్రించి ప్రత్యేక విభాగంలో ఉంచిన స్త్రీ విధులు. అంతరస్థమైన ఏ అనర్హతలూ ఈమెను పతితగా నామకరణం చేయటానికీ కారణంగాదు.

అయితే విషాదమేమంటే, ఈ ఇద్దరు స్త్రీలకు ఒకరి వ్యవహారాలు ఒకరికి తెలియవు. ఒకరితోనొకరు సాంగత్యం చేసుకుంటానికి వీలులేదు. ఒకరినొకరు అర్థంచేసుకుంటానికి అవకాశంలేదు.

ఆమెతో నేమో, ఈమెను గురించి కులట, అపవిత్ర, నరక కూపానికి సేరుగా రహదారి చీటి యిచ్చే రాక్షసి అని అభివర్ణిం

చారు. ఈమెతో నేమో ఆమె సంసారి పతివ్రత, ఆమె కనుచూపుసో కినా నీవు భస్మమైపోతావు అని వర్ణించారు.

కనక ఈ ఇద్దరు స్త్రీల మధ్య దాటలేని అగాధం.

అయితే పురుషులు మాత్రం, సౌధపు ఆభాగంలో నుంచి ఈ విభాగంలోనికి ఇష్టమొచ్చినప్పుడు వస్తూనే ఉన్నారు. రెండుచోట్లా వాళ్ల పనులేమో వాళ్లు తృప్తికరంగా పూర్తి జేసు కుంటున్నారు.

పవిత్రగా పరిగణించబడిన ఆమే స్త్రీయే. పతితగా చిత్రించ బడిన ఈమే స్త్రీయే. అయినా పెద్ద భేదాలు. ఈపతిత జీవితంలో తలమునకలుగా మునిగి నిత్యమూ స్నానపానాదులు జేసుకుంటున్న పురుషుల్లో మాత్రం ఈ రకమైన భేదాలు ఏమీలేవు.

ఈ ద్వంద నైతిక విధానంలో ఉన్నపచ్చిమోసము, దురన్యాయమూ, 1869 లో 'లీసే' విరచితమైన "(History of European morals)" "ఐరోపీయ నైతిక చరిత్ర" అనేగ్రంధం విడుదలయిందాకా ప్రజలు గుర్తించలేదు.

1870 సంవత్సరం జనవరి 1 వ తేదీన ప్రముఖ మహిళలు ఆకస్మికంగా ఉద్యమాన్ని ఆరంభించారు. కామన్సు సభా సభ్యులం దరకూ, వ్యభిచార అనువర్తిత శాసనాలకు వ్యతిరేకంగా శ్రీముఖాలు అందజేశారు. చాలా ఉధృతంగా, పోలీసుల రక్షణతో కొనసాగించ బడుతున్న అభాగ్య సోదరీమణుల దేహాల వ్యాపారాన్ని తెగనాడుతూ, సంఘంలో స్త్రీలలో ఒక భాగాన్ని పురుషుల కామక్రీడలకు, విలాసాలకు భోగ్య వస్తువులుగా వినియోగించటాన్ని ఇక ఎంత మాత్రం ఆంగ్ల మహిళా సమాజం సహించదని హెచ్చరికలు గావించారు.

స్త్రీలలో వచ్చిన ఈ తిరుగుబాటు గడుసుబారిన మొగవారిని ఇంకా కఠినాత్ములుగా జేసింది. పతితలైన ఆ నికృష్ట జీవులకోసం పోరాడుతున్న ఈ స్త్రీలు సయితం అధములైనా అయివుండాలి

కాకుంటే మెదడైనా లేకుండా ఉండి ఉండాలి అంటూ ఈ ఉద్యమ నాయకురాండ్రను కసిగా అవహేళన జేశారు.

ఈ సంస్కర్తలకు వ్యతిరేకంగా సాటిలేని ప్రతిఘటన కొనసాగించారు. అయితే ఏ మహిళా నాయకురాండ్రకు వ్యతిరిక్తంగా ఇంతటి అవహేళనలు, ప్రతిఘటనలు సాగుతున్నాయో, వారుమాత్రం నిర్భీతితో అన్నింటికీ సిద్ధమయ్యే ఉన్నారు. వారంతా శుద్ధ చిత్తం గలవారు. బాధలుపడటానికి వెనుకంజ వేయనివారు.

చారిత్ర్యాత్మకమైన ఈ సంస్కరణ పోరాటానికి అధినాయకత్వం వహించింది శ్రీమతి 'జోసఫైన్ గ్రే' ఉద్యమాన్ని అణచటానికి ప్రతి పక్షుల హింసాపూర్వక ప్రతిఘటనను గూడా సమర్థతగా ఓర్పుతో ఎదుర్కొంది. ఎంతో మానసిక వేదనలను భరించవలసి వచ్చింది. అనేక చోట్ల స్త్రీలతో పురుషులకు వ్యతిరేకంగా తిరుగుబాటులు చేయించింది. ప్రొఫెసర్ స్టువర్ట్, హెన్రీ విల్సన్, మిష్టర్ హోప్ వుడ్; (పార్లమెంటు సభ్యుడు) జాకెబ్ బ్రైట్ లాంటివారు కొందరు పురుషులు ఈ నాయకురాలికి సహాయం జేశారు.

1870 సంవత్సరంలో పార్లమెంటుకు జరిగిన ఒక ఉపఎన్నికలో ఈవ్యభిచార చట్టాన్ని ఎన్నికల ప్రణాళిక క్రిందమార్చింది ఈ సమర్థురాలు. ఈ ఎన్నిక పోరాటంలో జోసెఫిన్ ప్రాణానికి గూడా కీడు తలపెట్టారు ప్రత్యర్థులు. కాని ఎన్నికలలోఘనవిజయాన్నిసాధించింది. ఈమె ప్రచారం చేసిన వ్యభిచార నిర్మూలనోద్యమ సూత్రాలు సరైనవని నియోజక వర్గ ప్రజానీకం ద్వారా దేశ ప్రజలు గూడా అంగీకరించారు. ఈ రాజకీయ విజయంతో ఈ సమస్యను కూలంకషంగా పరిశీలించేందుకు ఒక రాయల్ కమీషన్‌ను ఏర్పాటు చేయవలసి వచ్చింది ప్రభుత్వం. అయినా 13 సంవత్సరాలు పట్టింది ఈ ఉద్యమం విజయంగావటానికి.

ఈ ఉద్యమ విజయ ప్రభావంతో మహిళలు స్త్రీలకు ఓటింగు హక్కుకై పోరాటాన్ని ప్రారంభించారు. ప్రథమంలో మున్సిపాలి

టీలలో పన్ను చెల్లించేవారి వరకు ఓటర్లుగా నమోదు గాబడటానికి ప్రభుత్వాన్ని అంగీకరింప జేశారు.

"అలాగే స్త్రీల ఆస్తి హక్కులు, విడాకులలాంటి సంస్కరణ లన్నింటినీ, ఆంగ్లేయ మహిళలు ఎంతో ఓర్పుతో, దీక్షతో, ఎన్నో కష్టాలను ఎదుర్కొని, తీవ్రపోరాటాలు జరిపి మాత్రమే సాధించారన్న సత్యం గ్రహించిన నాకు, ప్రపంచ మహిళా విముక్తి ఉద్యమానికి ఆంగ్లేయ మహిళలు బీజం పెట్టారని నమ్ముతున్నాను. సంస్కారం, జిజ్ఞాసగలిగిన ఆంగ్ల మహిళలు, తమ అవసర హక్కులను, న్యాయంగా ఆలోచించుకొని, వాటికి ఒక కార్యక్రమాన్ని రూపొందించుకొని శ్రద్ధతో పోరాడి వాటిని సాధించిన విషయం ప్రపంచ మహిళ లంద రకూ వరవడి అయింది. ముందు తరాలకు సయితం వీరి ఉద్యమ పోరాటాల చరిత్ర పాఠ్య గ్రంథమూ అవుతుంది" అంటారు శ్రీమతి లక్ష్మి.

* * *

బ్రిటీష్ రాణి రెండవ ఎలిజబత్ నివాసగృహం బకింగ్‌హామ్ ప్యాలెస్. ఈమె ముత్తవ విక్టోరియా మహారాణి పట్టాభిషేకం జరుపు కున్న 1837 నుంచి ఈ బకింగ్‌హామ్ భవనం రాణిమందిరంగా స్థిర పడింది. ఎన్నో చారిత్ర్యాత్మక సంఘటనలకు, చివరిసంతకాలు ఈ భవనంలోనే జరిగాయి.

భూగోళపు విస్తీర్ణంలో 2 శాతంకన్నా తక్కువగా ఉండి, ప్రపంచదేశాల వైశాల్యాలలో 75 వ స్థానమందున్న ఈ చిన్ని ఐరోపా ఖండపు దేశంలోని ఈ బకింగ్‌హామ్ భవనమే రవిఅస్తమించని సామ్రాజ్యాన్ని రెండు శతాబ్దాలపాటు పరిపాలించింది.

1952 లో రాజ్యాధికారాన్ని స్వీకరించిన ఎలిజబెత్తు రాణి బ్రిటీషు దీవులనూ, ఆంగ్ల సామ్రాజ్యాన్ని పరిపాలించిన పెక్కురు రాజులు, రాణులుతోనిండి, 11 వందల సంవత్సరాల దీర్ఘాయువు గలిగిన వంశవృక్షానికి చెందిన రాచబిడ్డ.

నలుగురు పిల్లలతల్లి. ఆంగ్ల రాజ్యానికి ప్రభ్వీగానూ, కామన్ వెల్తు రాజ్యాలకు పెద్దతలగానూ ఈమె ఎన్నో కర్తవ్యాలను నిర్వహించవలసి ఉంటుంది. లండన్ పత్రికలలో రాణి కార్యక్రమాలు రోజూ ప్రచురించ బడతాయి. ప్రతిరోజూ ఏదో ఒక విద్యాలయమో, కాక, మరొకటో ఈమె సందర్శిస్తుంటుంది. ఏదో ఒక ప్రజాహిత కార్యక్రమంలో పాలుపంచుకుంటుంది. వివిధ దేశాలనుంచి వచ్చే ప్రముఖులతో వివిధ విషయాలను గురించి సంప్రదిస్తుంటుంది.

తమ జాతి శ్రేయస్సును కాంక్షించే తమ ప్రభ్వినిగా ఆంగ్ల ప్రజలు ఈమెను భక్తిగౌరవాలతో కొలుస్తారు. సంవత్సరానికోతూరి ఉభయ పార్లమెంటులూ ఈమె ఉపన్యాసంతోనే ప్రారంభమౌతాయి. ఆనాడు బకింగ్‌హామ్ రాజభవనంనుంచి, రాజోచితమర్యాదలతో అష్టాశ్వాలు పూన్చిన సాంప్రదాయపు బగ్గీలో అంగరక్షక రౌతుదళం వెన్నంటినడువ, ఊరేగింపుగా రాణి పార్లమెంటు భవనం ప్రవేశిస్తుంది. ఆ ఉత్సవాన్ని చూడటానికి ప్రజలు అసంఖ్యాకంగా వస్తారు. రాచ బాట కిరుప్రక్కలా క్రిక్కిరిసి నిలుస్తారు. ఆసక్తితో తమ రాణిని తిలకిస్తారు. ఆమె సమీపించగనే, చిన్న పెద్దా తారతమ్యం లేకుండా, తలలపైని టోపీలు ఎత్తిపట్టుకొని నివాళులర్పిస్తారు.

"ఎవరన్నారో జ్ఞాపకంలేదుగాని నాచిన్నతనంలో విన్నాను; ప్రపంచంలో చివరకు ఉండేది అయిదుగురు రాజులేనని. వారు చీట్ల పేకలోని నలుగురు రాజులూనూ, అయిదవవారు బ్రిటీషు రాజూ ననీ." బకింగ్‌హామ్ రాణ్మందిరాన్ని, రాణినిగురించి తలపోస్తూ అన్నారు శ్రీమతి లక్ష్మి.

ఎవరైనా ఆ మాట అననీ అదిఒక చరిత్ర సత్యంగానే ఋజువవుతుంది. కాలం తెచ్చిన మార్పుల ఫలితంగా, ప్రపంచంలో చెక్కు దేశాలలోని రాజులు తరాజులయ్యారు. రాజవంశాల నామరూపాలు చరిత్రపుటలలో మాత్రమే నిలచి ఉన్నాయి. కాని ఆంగ్ల రాజుల హాయామ ఇంకా ఘనంగా చెల్లుబాటు అవుతూనేఉంది.

"నా ఉద్దేశ్యంలో దానికి కారణం, ఆంగ్లేయరాజులు, మారిన కాలంలో పాటు వారూమారారు. వారి రాజకుటుంబం వ్యక్తిగత అహంభావ ప్రదర్శనను మానుకొని ప్రజావాహిని మనుగడతో, వాంఛలతో, వారి అభిరుచులనూ మలచుకున్నారు. అందుకే ఆంగ్లేయ ప్రభువులు, వారిని భరిస్తూన్న ప్రజలు పరస్పర గౌరవ విశ్వాసాలతో బ్రతుకుతున్నారు." అంటూ శ్రీమతి లక్ష్మి ఆంగ్లేయ జాతి విశిష్టతను మెచ్చుకుంటారు.

అదీగాక వస్తుతః ఆంగ్లేయ ప్రజలు సాంప్రదాయాలను బహు ఆదరంగా గౌరవిస్తారు. ప్రాచీన సాంప్రదాయ ప్రసిద్ధమైన ఈ రాజరికాన్ని, ఈ నాడు ప్రజల చేతుల్లో అన్నిహక్కులున్నా తీసివేయాలని తలంచబోరు. ఎంతటి తీవ్రరాజకీయవాదియైనా, ఈసాంప్రదాయం పట్ల అయిష్టతను చూపలేడు.

కనకనే, నేటికీ బ్రిటీషు దేశానికి ఒక రాజ్యాంగమంటూ నిర్దిష్టమైన గ్రంథంలేదు; కేవలం సాంప్రదాయ బద్ధంగానే ఆ రాజ్యాంగన నడుపబడుతుందని మనకు స్ఫురించినప్పుడు మనకు ఈ జాతిపట్ల ఎంతో కుతూహలం గలుగుతుంది. గౌరవమూ పెల్లుబుకుతుంది.

ఈ బకింగ్‌హామ్ ప్యాలెస్ ముందు ప్రతిరోజూ రాణిగారి రక్షక దళం మార్పులు జరిగేపుడు దానిని చూడటానికి పనిబెట్టుకొని ప్రేక్షకులు వస్తారు. దాదాపు అరగంటసేపు జరిగే ఈ నిత్యోత్సవ కార్యక్రమాన్ని నేత్ర పర్వంగా, సావధానంగా విలోకించితృప్తి పడతారు.

*　　　*　　　*

ముందువైపు ఇరుపార్శ్యములా రెండు ఎత్తైన శిఖరాలు ధరించి, మధ్యన ఒక డోము రూపంలో పైకెగిసి, ఆపైన శిలువగల శిఖరంతో విలసిల్లే, సెంట్‌పాల్స్‌కెతేడ్రెల్ లండన్ నగరంలోని చర్చిలలో ప్రసిద్ధమైంది. దిగ్రేట్ ఫైర్ ఆఫ్ లండన్‌లో ఆనాటి క్రైస్తవ దేవాలయం దహించిపోగా, తిరిగి 35 సంవత్సరాల పాటు నిర్మాణం

కొనసాగి, 1710వ సంవత్సరంలో పూర్తిగావింపబడినది. ఎంతో పరిశుభ్రంగా ఉంచబడిన ఈ దేవాలయంలో అడుగిడగానే ఎదురుగా ఎత్తువేదికపై ఉన్న నిలువెత్తు క్రీస్తు చిత్రం మన హృదయాలను ఆకట్టుకుంటుంది. సర్ క్రిష్టఫర్ రెన్ అనే ప్రసిద్ధ వాస్తు శాస్త్రకారుడు రూపొందించిన ఈ నిర్మాణం, దేవాలయపు పవిత్రతను ఇనుమడింపజేస్తుంది.

* * *

ఒక మధ్యాహ్నం పూట థేమ్సు నదిమీద బోటుపై విహారయాత్రకు బయలుదేరారు అక్కచెల్లెండ్రిద్దరూ. ఈ నది పైననే విచిత్రమైన టవర్ బ్రిడ్జి, లండన్ బ్రిడ్జి, వాటర్లూ బ్రిడ్జీలు నిర్మించారు. వాటిల్లో టవర్ బ్రిడ్జి నిర్మాణంలో ఒక విశేషముంది. రెండుకొనలా రెండు ఎత్తైన టవర్లు నిర్మించారు. ఆ రెండు టవర్లను కలుపుతూ ఒక ఇనుపబ్రిడ్జీని అమర్చారు. వీటిపై కారులూ మొదలైన వాహనాలు తిరుగుతుంటాయి. క్రిందినుంచి, పెద్దవైన ఓడలు ప్రయాణించవలసి వచ్చినప్పుడు ఈ బ్రిడ్జి రెండుగా విడిపోయి పైకి లేస్తుంది. ఓడలు దాటిపోగానే తిరిగి విడిపోయిన రెండు భాగాలు ఒకటై బ్రిడ్జిగా మారి, ప్రయాణించనుంకించే వాహనాలకు పచ్చదీపం చూపిస్తుంది. సరిగ్గా ఈ బ్రిడ్జికి పైగానే మనుష్యులు నడచి వెళ్ళేందుకు ఒక బ్రిడ్జిగూడా ఉంది.

* * *

లండనులో, ట్రఫాల్గర్ స్క్వేర్ ఒక గొప్ప కూడలి. ఒక వైపుగా బ్రిటీషు మ్యూజియం బిల్డింగు కనపడుతుంటుంది. దీనికి సమీపంలోనే నేషనల్ గాలరీ, నేషనల్ పోర్ట్రెయిట్ గాలరీలు ఉంటాయి. ఈ స్క్వేరు మధ్యలోనే ట్రఫాల్గర్ యుద్ధ విజయాన్ని సాధించిన నెల్సన్ జ్ఞాపకార్థం, ఒక ధ్వజస్తంభం నిర్మించారు.

వెస్ట్‌మినిష్టర్ పాలెస్‌లోనే పార్లమెంటు భవనాలు ఉన్నాయి. ఎగువసభ దిగువసభ అంటూ చరిత్రకెక్కిన లార్డ్సు సభ, కామన్సు

సభలు రెండూ ఇక్కడే. ఇంత చిన్న హాలు 630 మందిగా ఉన్న కామన్సు సభ్యులకు ఎలాసరిపోతుందా అని ఆమెకు అనిపించింది. ఈ ప్రదేశంలో లక్ష్మి అడుగుపెట్టగానే, ద్వితీయ ప్రపంచ సంగ్రామ మహానాయకుడు విన్‌స్టన్ చర్చిల్ స్మృతిపథంలో మెదిలాడు. ఆయన మహాఉపన్యాసాలు కర్ణపుటాల్లో మెదిలాయి. ఆ ప్రజ్ఞాశాలి ధైర్య వచనాలూ, సాహసోపేత చర్యలూ, బ్రిటీషు దీవులను కాపాడుటయే గాక, ఏవిధంగా రెండవ ప్రపంచ యుద్ధ గతిని మార్చి, అక్షరాజ్య వినాశనానికి దారితీసి, ప్రపంచమానవాళిని పాసిష్టు క్రూర కబంధ హస్తాలనుంచి తప్పించిందీ జ్ఞాపకం వచ్చింది.

చర్చిల్ అనగానే చాలా సంగతులు జ్ఞాపకం వస్తాయి. రెండవ ప్రపంచ సంగ్రామ గాథంతా శ్రీమతి లక్ష్మి కండ్లముందు గిర్రున తిరిగింది.

రోజులు, వారాలు, మాసాల తరబడి, జర్మను విమానాలు బారులు తీరి, ఒకదాని వెంట ఒకటి లండన్ నగరాకాశంలో తిరుగుతూ, నిప్పులు గురిపిస్తూంటే, యుద్ధకాలపు ఈ మహానాయకుని ధైర్యపు వచనాలే, ఆంగ్ల ప్రజల ధైర్యాన్ని నిలబెట్టిందీ, కూడ గట్టిందీ. బాంబుల దాడులతో, తను కండ్లముందశే, ప్రజలు భీరువుల్లాగా పారి తెల్లజెండాలు ఎత్తకండా, ఏక త్రాటిపై నడచునట్లు చేసింది. ఈయన రాజనీతే యుద్ధకాలంలో లేబర్ పార్టీ అగ్రనాయకులు అట్లీ, బెవిన్ ప్రభృతులను తన మంత్రివర్గంలో జేర్చుకొని, అప్పటిదాక ఉన్న కన్సర్వేటివ్ ప్రభుత్వాన్ని మార్చి, అందరి ప్రజలకు ప్రాతినిధ్యమిచ్చే జాతీయ ప్రభుత్వంగా తీర్చి, ప్రజలను యుద్ధోన్ముఖులను గావించింది. ఇది నాదేశం—నాదేశంపై జరుగుతూన్న ఈ యుద్ధం నాకోసం జరుగుతూన్న యుద్ధం అనే భావాన్ని పౌరులలో ప్రతి ఒక్కరకూ గలిగించింది. తాను ప్రథమంగా ఈదేశం ఏ మహాసభల కొరకై వచ్చారో ఆ W.V.S అను మహిళా స్వచ్ఛంద సేవాసంఘం ఈ కాలంలోనే ఆవిర్భవించి, స్త్రీజాతినంతా ఉత్తేజిత పరచి, కష్టసహిష్ణుతను ఆదర్శంగా జేసింది.

వెన్నదొరక్క పోయినా, కోడి గ్రుడ్లు అపురూప మయినా, నిత్యావసర సంచారాలు అందుబాటులో లేకున్నా, ఈ ఆంగ్లజాతి అన్నింటినీ సంయమనంతో సహించింది. యుద్ధ విజయాన్నే కాంక్షించింది. అందుకు అహోరాత్రులు యావత్ప్రజ శ్రమించారు.

పైన విమాన దాడి జరుగుతూంటే, ప్రధాని చర్చిల్ నోటిలో లావాంటి చుట్టపెట్టుకొని, చేతిలో ఒంకి కర్రఊపుకుంటూ బజార్లన నడచేవాడు. శ్రీమతి చర్చిల్ చినిగిన పంట్లాములను అతుకులువేసి యిస్తే, సంతోషముతో వాటిని ధరించి ఆ చిరస్మరణీయ ఆంగ్ల ప్రధాన మంత్రి అన్ని పనులూ చూచుకునేవాడు. ఇక్కడే శ్రీమతి లక్ష్మికి ఒక సంఘటన జ్ఞాపకం వచ్చింది. నవ్వూ తెప్పించింది.

ఒకనాడు సాయంత్రం లండన్ నగరంపై జర్మనుల 'స్పిట్ ఫైర్' విమానాలు అగ్ని వర్షం కురిపిస్తున్నాయి. ఆ సమయానికి రోడ్డుపై ఉన్న చర్చిలు ఒకయింటిలోనికి వెళ్లాడు. పైన విమానాలు ఎగురుతూనే ఉన్నాయి. బాంబులు వదులుతూనే ఉన్నాయి. ఈయ నేమో నిదానంగా ఇంటిపై కప్పు మీదకెళ్లి వంట గదిపైని పొగ చిమ్నిపైన నిబ్బరంగాకూచొని,తనవిమానాలూ జర్మనువిమానాలూ పోరాడు కొనడంచూస్తున్నాడు. అయిదు నిముషాలు అయింది, పది నిముషాలయింది, పైన ఆకాశంలో యుద్ధం జరుగుతూనేఉంది. క్రింది ఈ పొగచిమ్నిపైన చుట్టనోట్లో పెట్టుకొని చర్చిలు అవలోకిస్తూనే ఉన్నాడు. ప్రధాని అంగరక్షకులకు గుండెలు ప్రతిబాంబు మోతకూ గొంతుకల్లోకి ఎగురుతున్నాయి. చర్చిల్ రక్షణ బాధ్యత వారిదే గదా మరి ! కర్తవ్యపరాయణులైన వారికి ఏ దిక్కూతోచ లేదు. అయ్యా ! పైన యుద్ధంజరుగుతోంది, తమరు క్రిందికి దిగండి. రక్షణ కేంద్రంలోనేఉండాలి, అని ఆ వీరునికి తెల్పగలిగే ధైర్యం వీరి కుండాలి గదా ! అది లేదు. సమయస్ఫూర్తి గల ఒక అంగరక్షకుడు ధైర్యంచేసి, ఆయన్ను సమీపించాడు. చర్చిల్ ఆతనికేసి చూచాడు. 'సర్ తమరుకూర్చున్న పొగచిమ్ని క్రిందగదిలో విమాన దాడినుంచి కాపాడుకునేందుకు ఇంటివారంతా దాక్కొని ఉన్నారు. మీరు ఈ

చిమ్నీపై కూచున్నందువల్ల వాళ్లకు గాలిరాక బాధపడుతున్నారు' అని నమ్రతగా తెలిపాడు.

"అలాగా! I am sorry. పద క్రిందికి పోదాము అంటూ, లేచి వచ్చాడు."

అదే ఆయన ధైర్యం. ఆవిధంగా ఆయన బ్రిటీషు ప్రజలకు ఆచరణల ద్వారా యుద్ధకాలంలో ఎలానడవు కోవాలో చెప్పాడు.

ఈ కామన్సు సభాప్రాంగణంలో తిరిగినంతసేపూ, బట్టతలగా మారుతున్న పెద్దతలకాయా, విశాలమైననొసలూ, నిశితమైన చూపులూ, చుట్టా, వొంకికర్రా, చర్చిల్ ఆకారం మనస్సంతా నిండింది శ్రీమతి లక్ష్మికి.

భారతదేశానికి సంబంధించినంత వరకు ఆయన అభిప్రాయాలతో శ్రీమతి లక్ష్మి ఎంత వ్యతిరేకిస్తారో, కష్టకాలంలో ఆంగ్లజాతి నాయకుడుగా, ద్వితీయ ప్రపంచ యుద్ధకాల మహారథుడుగా ఆయన్ను ఈమె అంతగా గౌరవిస్తారు.

* * *

"అక్కా ఇక్కడ నీవు మన గుంటూరు జిల్లా ప్రతిభను చూడబోతున్నావు." అన్నది సోదరి కృష్ణ అక్కగారితో.

లక్ష్మి అటుఇటు చూచారు. ఏమీ అర్థంగాలేదు. "ఏమిటి కృష్ణా!" అని అడిగారు.

"పద నీవు ఎంత సంతోషపడతావో నేను చూస్తాను". అని నవ్వుతూ పలికింది చెల్లి.

ఇద్దరూ, బ్రిటీషు మ్యూజియం భవనపుమెట్లు ఎక్కుతున్నారు. ప్రపంచ ప్రసిద్ధమైన ఈ మ్యూజియాన్ని ఈరోజు విశ్రాంతిగా చూడాలనుకునే బయలుదేరారు.

లోనికి ప్రవేశించటంతోనే అత్యంత శిల్పకళా వైదగ్ధ్యంతో వెలిగిపోతూన్న అపురూప పాలరాతిశిల్ప శకలాలు ఎదురుగా కనిపించాయి. అమరావతిలోని విశ్వవిఖ్యాత బౌద్ధ స్తూపానికి అమర్చిన అమూల్య శిల్ప సంపత్తిలోని ఒక భాగాన్ని 1880 సంవత్సరంలో బ్రిటీషు పాలకులు ఇక్కడకు తరలించుకొని ఈ మ్యూజియంలో భద్రపరచుకున్నారు. కాగితంపై కలాన్ని రచయిత సాగించినంత సులభంగా, ఈ పాలరాతిపై సుత్తెను ఉలిని ఆడించి కావలసిన భావాలను చిత్రాల ముఖకవళికలలో స్ఫుటంగా ప్రతిపాదించిన, ఆ అజ్ఞాత బౌద్ధ భిక్షుక శిల్పకారుల హస్తనైపుణ్యానికి మనం నిండు హృదయంతో ముగ్ధులంగాకమానము. ఆ మహాయోగుల అమలిన హృదయాలలోని నిసర్గభావ గంభీరత మన హృదయాలను పునీతం చేయగలదు. వారి నిష్కల్మష, పవిత్ర ఏకాగ్రత మనలను ఉద్దీప్తం చేయగలదు.

పుణ్య కృష్ణానదీ తీరాన విజ్ఞాన వికాసాలతో వెల్లివిరిసి, ప్రపంచంలోని పలుదేశాల జ్ఞాన పిపాసులకు పలు విద్యలను గరిపి, అయోమయ జీవితాలకు జ్ఞాన జ్యోతిని ప్రసాదించిన, ఆ అమరావతీ మహాబౌద్ధ ఆరామపు అంతేవాసుల అద్భుత శిల్పకళావైభవం, ఈ బ్రిటీషు మ్యూజియంలో ఈనాటికీ అసంఖ్యాక సందర్శకులను ఉత్తేజిత పరచడం నిజంగానే ఆ గుంటూరు మండల పౌరురాలుగా, కృష్ణాతీర నివాసినిగా లక్ష్మికి గర్వకారణమే. అక్క ముఖంలోని జిజ్ఞాసను, కన్నులలోని తృప్తిని గమనించిన కృష్ణ, "నిజమేగాదా అక్కా నేను చెప్పింది! గత పదినిముషాలూ నీవు మన జిల్లాలో గడిపావు. అమరావతిలో బ్రతికావు. అవునా!" అన్నది.

కృష్ణ అన్నమాట ఎంతోనిజం! ఆరువేల మైళ్ల దూరంలో ఉన్న అమరావతిలో ఆ పదినిముషాలు మనోవీధిలో బ్రతికింది లక్ష్మి.

'కృష్ణ' కు శిల్పాలన్నా, చిత్రాలన్నా ఎంతో ఆదరణ. ఆమె విద్యార్థినిగా ఉండేటపుడు ఎన్నో బొమ్మలు గీస్తుండేది. వాటర్

కలర్సుతో అనేక ప్రకృతి చిత్రాలను తెల్లని కాగితాలపై అప్పటి కపుడు అందంగా రూపొందించేది.

బహుశా ఆ పినతల్లి అభిరుచే దివ్యజ్ఞాన సరోజనీదేవికి గూడా అబ్బింది. చిత్రలేఖనంలోని వివిధ శాఖలలో ప్రత్యేక కృషి జేసింది. ముఖ్యంగా వాటర్ కలర్స్‌లో తనకుంచెముంచి తన భావాలను ప్రస్ఫుటంచేయడంలో నైపుణ్యాన్ని సాధించింది శ్రీమతి దివ్యజ్ఞాన సరోజినీ దేవి.

మ్యూజియంలోని అన్ని శాఖలూ చూచారు ఆనాడు. పురాతన వస్తుసేకరణ ఎంతో నైపుణ్యంగా ఉంది. గ్రీకు, ఇటలీ కళాకారుల కాంస్య ప్రతిమలూ, రోమను పురాతన కళాఖండాలూ, జపానుదేశపు బొమ్మలూ అందంగా అమర్చారు. అన్ని సైజులలో రకరకాలైన బౌద్ధ విగ్రహాలు, బౌద్ధశిల్పఖండాలు ఇండియా, బర్మా, చైనాలకు సంబంధించినవి, "ఏషియాటిక్ సెలూన్" లో ప్రదర్శనకు బెట్టారు. అలాగే "ది రూమ్ ఆఫ్ ఇండియన్ రెలిజియన్" అను ఓ ప్రత్యేక విభాగంలో భారతదేశ ఆధ్యాత్మిక సంపదకు సంబంధించిన వివిధ కళావిభాగాలను సమకూర్చారు.

ఇక్కడే వలయాకారంలో నిర్మితమైన ఒక భాగంలో 85 లక్షల పుస్తకాలతో నిండిఉన్న ప్రపంచ ప్రాముఖ్యంగల గొప్ప గ్రంథాలయం ఉన్నది. ఈ గ్రంథాలయంలోనే, కారల్ మార్క్స్ తన విజ్ఞాన తపస్సు సమాచరించుకున్నది దరిద్రంతో బాధపడుతున్నా, బిడ్డలు చలిజ్వరంతో వేగిపోతూన్నా, ఆ మహా ఇల్లాలు తన బాధలు తనలోనే ఇముడ్చుకొని ఈ గ్రంథాలయంలో మార్క్స్ చేసుకుంటూన్న పరిశోధనలకు ఎంతమాత్రం అవరోధం గలిగించేది గాదు. ప్రపంచ పీడిత మానవాళికి నూతన మార్గాన్ని చూపిందని చెప్పబడే, దాస్ కాపిటల్ ఈ ఆలయంలోనే రూపొందింది. బెర్నార్డ్ షాగూడా పెక్కు సంవత్సరాలు ఈ పుస్తకాలతో స్నేహం చేశాడు.

మాడం టుస్సాడ్స్ లక్క చిత్రాల (Madam Tussaud's Waxworks) ప్రదర్శనం చూచారు. మనుష్యుల ప్రతిరూపాలను లక్కతో నిర్మించడంలో ఈమె అద్భుత ప్రజ్ఞ గలది. గ్లాడ్‌స్టన్, మౌంట్‌బాటన్ లాంటి ప్రఖ్యాత ఆంగ్లేయుల చిత్రాలు వాస్తవ రూపానికి ఎంతో సామీప్యతను సాధించాయి.

* * *

ఛాంబర్ ఆఫ్ హారర్స్ (Chamber of Horrors) చూచి నిజంగానే భీతిచెందారు శ్రీమతి లక్ష్మి.

బ్రిటిషు ప్రధానమంత్రి అధికార నివాస స్థానము డౌనింగ్ స్ట్రీట్‌లో ఉన్న 10 నంబరు భవనం. విన్‌స్టన్ చర్చిల్ కాలంలోనే ఆయనతో పాటు ఈ 10 డౌనింగ్ స్ట్రీటుకు గూడా ఖ్యాతి లభించింది.

లండన్‌లోని ఫ్లీట్ స్ట్రీట్‌లో, ముఖ్యమైన దినపత్రికలూ, జర్నల్సూ అచ్చవుతుంటాయి. ఫ్లీట్‌స్ట్రీటంటే పత్రికలవీధి అనే పేరు ఉంది. ఈ వీధికి ముందరనే డాక్టర్ జాన్‌సన్ విగ్రహం ఉంది. మిలియన్ల సంఖ్యలో అచ్చయ్యే ముఖ్యపత్రికలన్నీ ఈ వీధినుంచే ప్రపంచపు నలుమూలలకూ రవాణా అవుతుంటాయి.

ఆంగ్ల మహాకవి షేక్స్‌పియర్ జన్మస్థలం ఎంతో భద్రంగా కాపాడబడుతుంది. ఆంగ్లభాషా ప్రపంచమంతటనుంచి, పలువురు ఈ మహాకవి అభిమానులు, Statford-upon-Avon లోని ఈయన పుట్టిన Ann Hathways Cottage ని సందర్శించి తమ భక్తి ప్రపత్తులు ప్రకటించుకొంటారు.

"Whether to be or not to be us the question now!" వాక్యంతోపాటు చిరంజీవత్వం గల హామ్‌లెట్ పాత్ర జ్ఞాపకం వచ్చింది ఈ యింటినుండి తిరిగివచ్చేప్పుడు.

"ప్రతి మనిషి ఎప్పుడో ఒకప్పుడు, జీవితంలో ఒక్కసారైనా కొద్దిసేపైనా, హామ్‌లెట్ పాత్రలో జీవిస్తాడు గదూ! అక్కా!"

అడిగింది కృష్ణ. "ప్రతి మనిషి అనేకన్నా ప్రతి భావుకుడూ అను.'' అన్నారు శ్రీమతి లక్ష్మి.

"భావుకుడు బయటపడతాడు. పదిమందికి చెప్పుకుంటాడు, జీవిత బాధాతప్త సుడిగుండంలో కొట్టుకుంటూ, ఈ సుడిగుండ యాత్ర ఎంత అందంగా ఉందో కన్నీటితో అభివర్ణించుకుంటాడు అక్కా! మరి మామూలు మనిషేమో, హామ్లెట్ పాత్ర వినక పోయినా తనలో తానే కుమిలిపోతాడు. ప్రతివానికీ జీవితంలో ఏదో ఒక రోజున 'to be or not to be' అనే question ఎదురౌతుందనే అనుకుంటాను అక్కా!" అన్నది కృష్ణ. లక్ష్మి నవ్వి ఊరుకుంది.

ఇంగ్లీషు పొయెట్రీ తెగచదువుతుంది చెల్లి. అందునా షేక్స్పియర్ గద్యకావ్యాలలోనుంచి సందర్భోచితంగా ఉల్లేఖించడమంటే అరచేతిలో వలచిన అరటిపండువలె కృష్ణ కు.

* * *

'హైడ్ పార్కు'ను సందర్శించకుండా, ఆ శోభను ఆస్వాదించకుండా, లండన్ యాత్ర పూర్తయినట్లు గాదు.

ఒక ఆదివారం పెందలకడ భోజనాలు ముగించుకొని ఈ పార్కుకు వచ్చారు. హైడ్ అనే ఆయన ఎవరన్నా ఉండి, ఆయన పేరు ఈ పార్కుకు పెట్టారో, ఇక్కడ మనుష్యులు "హైడెడ్"గా సంచరించటానికి అనేక వీళ్లు ఉన్నాయికనక దీనికి ఈ పేరువచ్చిందో తెలియదుగాని, ఈ హైడ్ పార్కు గర్భంలో, అనేక వందల వేల ప్రణయగాథలు దాగిఉన్నాయనేది మాత్రం నిజంగా కన్పిస్తుంది. లవర్స్ కార్నర్' ఏనాడు ఆ పేరు వచ్చిందో ఈ పార్కులో ఒక భాగానికి; ఆ విభాగంలో, చెట్ల నీడల క్రింద, పుష్ప నికుంజాల వెనుక మాటున, అనాచ్ఛాదిత ఆకాశం క్రింద, పచ్చని మెత్తని గడ్డిపరకల పైన, పరప్రపంచాన్ని మరచి ఎన్నెన్నో జంటలు ఒకరి వొడిలో ఒకరు ఒరిగి, ఒకరి కండ్లలోనొకరు కరిగి, ఆలింగన, చుంబనాలతో తమ్ముు తామే మరచు సంఘటనలు ప్రతి రోజూ కోకొల్లలు. ఈ

ప్రణయ కలాపాల, శృంగార హేళీవిలాసాల పోషణ ఈ పార్కులో లండన్ నగరవాసులు ఎన్నో ఏండ్లనుంచి చేస్తూనే ఉన్నారు. "ఈ భాగం ఒక ప్రత్యేక భావోద్వేగ ప్రపంచం" అన్నారు శ్రీమతి లక్ష్మి హైడ్ పార్కులో ఒక సాయంత్రం గడిపి.

"అంటే పిచ్చివాళ్ల ప్రపంచమా అక్కా!" అని నవ్వింది కృష్ణ. "ఆ మాటా నిజమేనేమోననిపిస్తుంది. ప్రేమ ముదిరితే పిచ్చిగా మారుతుంది గామోసు" అంటూ శ్రీమతి లక్ష్మి నవ్వారు.

విశాలమైన ఈ హైడ్ పార్కులో పచ్చని గరిక బయళ్లూ, అక్కడక్కడా వరుసలలో తీర్చిదిద్దిన పలురంగుల పుష్పాలమొక్కల దొంతర్లు, ఎత్తైనచెట్లూ, పూలకన్న మృదువుగా రంగులలో వెలారే ఆకుల వృక్షాలూ అక్కడక్కడా చిన్నిచిన్ని సరోవరాలూ, విశాల మైన బాటలూ, బాటల కిరుప్రక్కలా గీతలు గీచి నిలిపినట్లుండే చిన్ని చిన్ని పూలపాదులూ, ద్వారకానగరంలోని సుందర నందనో ద్యానవనమా అని అనిపిస్తుంది.

పిల్లలూ పెద్దలూ, స్త్రీలూ పురుషులూ, శ్రీమంతులూ దరి ద్రులూ అందరకూ ఈ హైడ్ పార్కు విశ్రాంతిని ఇస్తుంది. మనస్సుకు ప్రశాంతిని కూరుస్తుంది. వేగంతో, గందరగోళంతో. నగరంలో విసిగిపోయిన బ్రతుకు బాటసారిని ఈ హైడ్ పార్కు ఆహ్వానించి, ఆదరించి, కూచోబెడుతుంది. నిదానాన్ని కలిగిస్తుంది. 'కొంచెం తాపీగా బ్రతికితే మంచిదిగాదా!' అని జ్ఞాపకం చేస్తుంది.

పిల్లలు పోనీలపై కేరింతలు కొడుతూ సవారీలు చేస్తుంటే, వయస్సును మరచి పెద్దవారు పెద్ద గుర్రాలపై కేకలు వేసుకుంటూ స్వారీచేస్తారు.

అక్కాచెల్లెండ్రకు చిన్నప్పుడు తాము చేసిన గుర్రపుస్వారీలు జ్ఞాపకం వచ్చాయి. వారి గుర్రమూ జ్ఞాపకానికివచ్చింది.

హైడ్పార్కు ప్రసంగాలకుగూడా చాలా ప్రసిద్ధిగాంచింది. ఔత్సాహిక ఉపన్యాసకులేగాదు, పలురకాల భావాలను ప్రచారం

చేయటానికి ఎందరో ప్రాసంగికులు, ఈ హైడ్ పార్కును సందర్శించే వారిని, సదస్యులుగా నిలుపుకోటానికి ప్రయత్నం చేస్తారు. ఏ కొద్ది మంది లభ్యమైనా ఒక ప్రసంగంచేసి, మరురోజు లండన్ పత్రికలలో ఆ వార్తలు ప్రకటించునట్లు చేస్తారు. ఉపన్యాస దురంధరు లెందరో ఇచ్చటనే వారి 'అప్రెంటిస్‌షిప్' పొందారట.

అలాంటి ఒక విశేషము, ఆనాడు వీరి కండ్లబడడం వీరి భాగ్యం!

మధ్యాహ్నంనుంచి పార్కంతా తిరిగి, అలసిపోయిన వీరు ఇక గూటికి చేరుకుందామనుకొని, నిదానంగా కారు కేసి నడుస్తున్నారు.

ఒకాయన అనర్గళంగా ఉపన్యాసం చేస్తున్నాడు. చేతిలో నోట్సు రాసుకున్న తెల్లకాగితముంది. ఎదురుగా 12 మంది మనుష్యులు నిలబడి ఉన్నారు. ఆయన ఉపన్యాసం చేస్తూనే ఉన్నాడు. వీరు సమీపిస్తున్నారు. మనిషి రంగుచూస్తే ఆసియావాసిగా కనపడుతున్నాడు. ఇంగ్లీషు ఉచ్చారణ వింటూంటే, ... "ఖర్మకాలి ఇండియన్ కాదుగదా!" అన్నది కృష్ణ. అంతలోకే వీరికేసి చూచి, ఆ ఉపన్యాసకుడు. "రండి రండి, నేనూ మీవాడినే" అన్నారు ఆయన. నిజంగానే వీరిద్దరూ బిత్తరపోయారు. ఈ లండన్‌లో, హైడ్ పార్కులో, ఎప్పుడూ చూడనన్నచూడని మనిషి, అచ్చం తెలుగులో అనర్గళధోరణిలో ఐక్యరాజ్యసమితి బడుగుదేశాలకు అందించవలసిన సహాయాన్నిగురించి ప్రవాహంలా సాగుతూన్న తన ప్రసంగాన్ని మధ్యలో త్రుంచి, వీరిని పలకరించటంతో బిత్తరపోయారు. బిత్తర పోక మరేం చేస్తారు?

దయచేసి రెండు మూడు నిమిషాలుండండి. నా ప్రసంగం ముగియవచ్చింది అంటూ, "well, my friends", అంటూ ఉపన్యాసం తిరిగి ప్రారంభించాడు. ఇంగ్లండులో అందరూ పంచ్యువల్‌గా ఉంటారు. అలాగే ఆ ఉపన్యాసక మిత్రుడూ మూడో నిముషం పూర్తయ్యేప్పటికి తన ప్రసంగాన్ని ఆపి "Thank you"

అంటూ శ్రోతలకు వందనం చెప్పారు. 12 మంది శ్రోతలు ఎవరి దారిన వారు వెళ్లారు.

ఈయన ఈ అక్క చెల్లెండ్రవద్దకు ఆదరాబాదరాగా సమీపించాడు. "క్షమించండి, మిమ్మల్ని అపానుగదూ! మరేమీ అనుకోకండి. మనవారుగదా అని చనువు తీసుకున్నాను. నేను ఉపన్యాసం చెబుతూండగా మన తెలుగు స్త్రీలను అకస్మాత్తుగా చూచేసరికి, ఉపన్యాసం మరచి, ప్రాణం లేచివచ్చిందనుకోండి". అంటూ ఇంకా ఉపన్యాసధోరణిలోనే తెలుగులో గడగడా మాట్లాడేస్తున్నాడు ఆయన.

"మేము తెలుగువారమని ఎట్లా తెలిసింది?" అన్నదిచెల్లి. "అదేమిటమ్మా! అట్లా అంటావ్. నేను యావత్ భూస్థలిని చుట్టబెట్టితిని. ప్రజను పరిశీలించితిని. ఎందేని ఇంత అందచందములు వెలార్చు కట్టు బొట్టులను మందునకైనా ఎరింగితినా? అది తెలుగు స్త్రీల ప్రత్యేకత తల్లీ! అని గ్రాంధికంలో అభినవయుక్తంగా చెప్పారు. ఇద్దరూ ఫక్కున నవ్వారు. ప్రాసంగికుడు కూడా వారి నవ్వుతో కలిపి నిర్మలంగా నవ్వాడు. మంచి మనిషి.

"ఇంతేగాదు మరోసంగతి చెప్పనా?" అన్నారాయన. "చెప్పండి." అన్నారు శ్రీమతి లక్ష్మి.

మీరు కృష్ణాతీరవాసులు. అవును. అందునా గుంటూరు మండలానికి చెంది ఉంటారు. అందునా తూరుపు తాలూకాలవారై ఉండాలి." అన్నారు ఆయన మధ్యమధ్య ఆలోచిస్తూ... వాక్యాల మధ్య విరామాన్ని పాటిస్తూ.

మరల ఇద్దరూ నవ్వారు. ఆ నవ్వులో వారు నిజాన్ని తెలిపారనే వీరి సంతోషం ప్రకటితమైంది.

"అవునాండీ. ఇప్పుడు మరో సంగతిగూడా చెప్పగలననుకుంటున్నాను." అన్నారు ఆయన.

"అభ్యంతరమేమీలేదు కానివ్వండి" అన్నారు శ్రీమతిలక్ష్మి.

"మీరు కమ్మవారు." అన్నారు ఆయన. లక్ష్మికి ఆశ్చర్యం వేసింది. అక్కాచెల్లెండ్రు ఒకరినొకరు చూచుకున్నారు.

"మమ్ములను ఎక్కడన్నా చూచారా ?" అని అడిగారు శ్రీమతి లక్ష్మి.

"లేదండీ !" అన్నాడు ఆయన.

"జ్యోతిష్యం ఏమన్నా తమకు తెలుసాండీ !" అన్నది చెల్లి.

లేదుతల్లీ. జ్యోతిషంలో మనుష్యుల ప్రాంతాలూ, కులాలూ తెలియవుగా అమ్మా !" అన్నారు ఆయన.

"మరి ?" అని ప్రశ్నించింది చెల్లి.

షెర్లాక్ హోమ్సు లండన్‌లోనే ఉండేవాడు గదూ ? అన్నారు లక్ష్మి నవ్వుతూ.

"అవును డాక్టర్ వాట్సన్‌తోసహా !" అన్నది చెల్లి నవ్వుతూ. "Exactly Madam. That is the real analysis Begin with deduction and you will arrive at facts· అది థీరీ మదాం." అన్నారు ఆయన.

ఇది మరీ ఆశ్చర్యంగా ఉంది.

"ఎలాగంటేనమ్మా ! మొట్టమొదట మీ కట్టూ బొట్టూ నడక చూడంగానే మన తెలుగువారేననిపించింది. అప్పుడే మీరు కృష్ణా గుంటూరు జిల్లాలకు చెందిన వారనీ తోచింది. కృష్ణా గుంటూరు జిల్లాలలో మాగాణి ప్రాంతంలో కమ్మవారి కట్టూ బొట్టూ ఒకే రీతిగా ఉంటాయనేది నాకు చిరకాల అనుభవం. అయితే మీమాటలు విన్న తర్వాత కృష్ణాజిల్లా యాస ఎంతమాత్రం లేదు. కనక మీరు గుంటూరువారే అయిఉండాలని నిశ్చయించాను."

"కరెక్టు మాష్టారూ! మీ "డిటెక్షన్ అండ్ ఫైండింగ్ ఫాక్ట్సు బాగుందండీ!'' అంది చెల్లి.

ఇంతకూ వీరు మన ప్రాంతీయులే. చాలాసార్లు ప్రపంచాన్ని వివిధ వ్యాపకాలతో పర్యవేక్షించి వచ్చారు. లండన్ గూడా ఇంతకు ముందు రెండు మూడుసార్లు వచ్చారుటగానీ, హైడ్ పార్కులో ఉపన్యాసానికి తీరికలేక పోయిందట. ఈ పార్కులో ఉపన్యసించాలని, ఇంగ్లీషు బోధించే తెల్లలెక్చరర్ల పాఠాలు కాలేజీలో విన్న నాటినుంచే ఒక కోరిక ఉండేదట. కాలక్రమేణా ఆ కోరిక బృహత్ రూపం దాల్చిందట. అది ఈనాటికి తీరిందట.

తన మీటింగుకు ఎంతమంది వచ్చారనేది ఆయనకు ప్రశ్న గాదన్నాడు. 'సోమరులు నిండిన మనదేశంలో వేలమంది జనం మీటింగులకొస్తారుగానీ, ప్రతినిముషం విలువగా భావించే ఈ దేశంలో ఎవరు వస్తారండీ' అని అన్నాడు. ఇంకానయం తన మీటింగుకు 12 మంది ఉన్నారు, మొన్నొక ఆంగ్లేయుడు ప్రసంగించేపుడు, అయిదుగురే ఉన్నారు అనిగూడా తెలిపాడు. ఆ అయిదుగురు విన్నా ఉపన్యాసకునికి తృప్తి ఉంటుందట.

తనకూ తృప్తి గలిగిందట.

"తమరు ఎక్కడ దిగారు. మా కారుఉంది, అక్కడమిమ్మొదించి వెళ్తాము." చెల్లి చెప్పింది.

"సంతోషమమ్మా!" అంటూ ఆయన దిగిన హోటల్ పేరు చెప్పాడు.

కారులో ఆయన స్వవిషయాలు తెలిపాడు. చాలా నిజాయితీ మనిషి. నిజమే! కొందరు నవ్వుకోవచ్చుగాని, ఈ సంగతిచూచి ఏముంది ఇందులో. 10 మందికేగావచ్చుగాక తన భావాలు చెప్పదలిచాడు. చెప్పాడు. అందులో సమస్యామంచిదే. సంపన్న దేశాలు ఎడుగుదేశాల సమస్య! లక్ష్మి అదే ఆయనతో అన్నారు.

ఆయన చాలా సంతోషపడ్డారు.

తన చెల్లెంద్రను చూచినట్టుందని సంబర పడ్డారు. కారులో లిఫ్టు ఇచ్చినందుకు కృతజ్ఞతలు తెలిపారు.

"అయ్యా !, తమ కభ్యంతరంలేకపోతే, మీరు వెళ్లేలోగా ఒకసారి మా ఆతిథ్యం స్వీకరించండి.'' అన్నది చెల్లి.

హోటలుముందు కారుదిగిన శర్మగారు," అవునమ్మా అది కమ్మవారి పలుకే. ఆతిథ్యం ఇవ్వడంలో కమ్మవారిది ప్రత్యేక ఆదరణ. నిజానికి నాస్నేహితుల్లో ఎక్కువమందివారే. ఇంతకూ ఆవకాయపచ్చడి ఉందా ?'' అన్నారు ఆ పెద్దమనిషి.

"అక్కగారు వారంక్రితమే యింటిదగ్గరనుండి వచ్చారు. ఆవకాయేగాదు. కందిపొడీ, మంచినెయ్యి గూడా ఉంటాయి. తప్పకరండి. ఒకరోజు ముందుగా ఫోను మాత్రం చెయ్యండి'' అంటూ తన విజిటింగ్ కార్డు ఇచ్చింది కృష్ణ.

"శుభమస్తు !" అంటూ ఆశీర్వాదాలు పలుకుతూ నడిచారు ఆయన. వీరికారు ముందుకు సాగింది.

* * *

"The Associated country women of the world" అనే గ్రామీణ మహిళల అంతర్జాతీయ సంస్థ ప్రధాన కార్యదర్శి శ్రీమతి జాన్ బెల్ (Mrs. John Bell), శ్రీమతిలక్ష్మి, ఇండియాలో ఉండగానే లండన్‌నుంచి ఉత్తరం రాసింది; తనకు ఈమె లండన్ ప్రయాణం గురించి అఖిల భారత గ్రామీణ మహిళా సంఘము ద్వారా తెలిసిందనీనూ, ఈమె లండన్‌లో ఉంటూన్న రోజుల్లోతప్పక ఒక రోజు వారి కేంద్రీయ కార్యాలయాన్ని సందర్శించ వలసింది గానూ కోరుతూ ఆహ్వానం పంపింది.

తీరా ఈమె వెళ్లిన సమయానికి శ్రీమతి జాన్ బెల్ తన పదవినుంచి రిటైరై వెళ్లిపోయింది. అయినాగూడా, వీరికోసం ఒక ప్రత్యేక అధికారిని వినియోగించింది.

శ్రీమతిలక్ష్మి భారత గ్రామీణ మహిళా సంఘం ఉపాధ్యక్షురాలు గావటంతో, ఇండియానుగురించి, మిగిలిన ఆసియా, ఆఫ్రికా ఖండాల పర్యటనలలో ఈమె గమనించిన గ్రామీణ మహిళల పరిస్థితులను గురించి ఆ అంతర్జాతీయ మహిళా కార్యాలయంలో ఒక పూట వీరి అభిప్రాయాలను ఒకరు కొకరు తెల్పుకున్నారు.

ఈమె కొరకు నియుక్తమైన ఆ ప్రత్యేక మహిళా అధికారిని తోకలసి ఇంగ్లండు గ్రామాలవైపు తిరిగారు.

ఈనాటి నవీన పరికరాలన్నింటినీ, ఆధునిక విజ్ఞానాన్నంతనూ ఉపయోగించుకుంటూ గూడా, ఇంగ్లండు తన ఆహార అవసరాలలో సగం వంతు మాత్రమే ఉత్పత్తిచేసుకుంటోంది. మిగిలిన సగం విదేశాల దిగుమతులపైననే ఆధారపడుతుంది. విమానాల్లోంచి పైరులపై మందులు చల్లడం ఈమె చూచారు. ఆధునిక వ్యవసాయ పరికరాలనూ, బంగాళా దుంపలు భూమిలోంచి త్రుళ్లగించి వేరేక్రొత్త పరికరాలతో సహా అన్ని చూచారు.

వీళ్ల ఫారాలలో ప్రసిద్ధమైన Red poll Bull అను ఆంబోతు చాలా ప్రత్యేకంగా కనపడింది. చాలా బలిష్టంగా ఉంటుంది. ఎత్తు కొద్దిగాని, వెడల్పు ఎక్కువ ఈ సంతతి ఆంబోతులను ప్రపంచంలో పెక్కు దేశాలకు ఎగుమతి చేస్తారట.

వారి వ్యవసాయ పరిశోధనలు, ఒక్క ఇంగ్లండు వ్యవసాయ రంగానికే పరిమితంగాక, మిగిలిన దేశాల సమస్యల పరిష్కారానికి గూడా ఎంతో కృషి జేస్తాయి. అలాంటివాటిల్లో ఒకటి, Anti locust Research centre అనే పేరిట లండన్‌లో ఉన్నది.

చట్ట ప్రకారం ఇగ్లండులో పిల్లలు అయిదవ సంవత్సరంనుంచి విధిగాస్కూలుకు వెళ్లవలసి ఉంది. అంతకు ముందే స్కూళ్లలో చేర తామన్నా అభ్యంతరంలేదు. కనీసం 16 వ సంవత్సరం వచ్చిందాకా విధిగా విద్యాభ్యాసం చేయాలనేది శాసనమే. 16 సంవత్సరాల వయస్సుదాటిన వారుగూడా అత్యధిక శాతం తమ చదువులు కొన సాగిస్తున్నారు. యూనివర్సిటీలలోనూ, సాంకేతిక విద్యాలయాల లోనూ, ఇతర శాస్త్రాల అధ్యయనశాలల్లోనూ చదువుతున్నారు.

ఆ సాయంత్రం తిరిగి లండన్ వచ్చేమార్గంలో ఒక పల్లెటూ రిలో వ్యవసాయ కుటుంబం ఇంటి ముందు ఆగారు. ఆ గృహ యజ మాని మిసెస్ అర్నాల్డ్ మాథిసన్‌తో పరిచయం చేసుకొని, వారి విష యాలు ముచ్చటించుకున్నారు. ఇంగ్లండులో సహజంగా, దాదాపు ప్రతికుటుంబం,సంవత్సరపు ఆదాయవ్యయాల బడ్జెట్ వేసుకుంటుంది. వారి ఆదాయాన్ని అనుసరించి, ఖర్చులు నిర్ధారణ జేసుకుంటారు.

మిసెస్ మాథిసన్ తన కుటుంబ బడ్జటును గురించి వివరిస్తూ ''ఆహారం కోసం ఆదాయంలో అయిదోవంతు ఖర్చవుతుంది; గృహ వసతికోసం, వంటచెరకు, కరంటులాంటి గృహావసరాలకోసం ఆదా యం 8 వ వంతు ఖర్చవుతుంది; మరో 8 వ వంతు, మత్తుపానీయములు సిగరెట్లకొఅకు వినియోగిస్తాము. పన్నెండవ వంతు బట్టలకూ, బూట్లకు ఖర్చవుతుంది; 12 వ వంతు ఇంటిసామగ్రికి ఖర్చవుతుంది'' అని చెప్పింది.

ఇవి కనీస అవసరాలుగా పరిగణించి, మిగిలిన నిధులలోంచి, విలాసవస్తువులు, వినోద యాత్రలు, పుస్తకాలు, మాగజైనులు వగై రాలకు ఖర్చవుతుందని చెప్పింది.

వీరి ఆదాయాలలో గూడా, పెద్దగా మితిమీరిన హెచ్చు తగ్గులు శ్రీమతి లక్ష్మికి కనపడలేదు.

21 మిలియనుల వ్యక్తిగత ఆదాయాలలో, ఆదాయపు పన్నులుపోగా, 13 మిలియను మంది సంవత్సరానికి రెండువేలపౌను లకుమించి ఆర్జిస్తారు. 9.7 మిలియనుల మంది వెయ్యినుంచి రెండు వేలఆర్జనపు పరిధిలో ఉన్నారు. 8.2 మిలియనుల మంది 500 నుంచి వెయ్యి పౌనుల ఆర్జన పరిధిలో ఉన్నారు.

కనకనే, ఈదేశంలో మధ్య తరగతి ప్రజలు అత్యధికసంఖ్యలో ఉన్నారు. ఇక్కడ కన్సర్వేటివ్స్ అధికారంలోకి వచ్చినా లేబర్ పార్టీవారు అధికారాన్ని కైవశం చేసుకున్నా, జాతిజీవితంలో తల క్రిందులయ్యే మార్పులు ఏమీరావు.—

# అంతర్జాతీయ గ్రామీణ మహిళల మహాసభలో

గ్రామీణ మహిళల, సమస్యలను అర్థంచేసుకొని, వివిధ ప్రభు త్వాలకు తగుపరిష్కార పద్ధతులను సూచిస్తూ, అభ్యుదయం కోసం కృషి జేసే ఉన్నత ఆదర్శంతో అంతర్జాతీయ గ్రామీణ మహిళా సమాఖ్య ఏర్పడింది. పలుదేశాలలో శాఖలను ఏర్పరచుకొని విస్తృత పరిధిలోనే ఈ మహిళా ఉద్యమం నడుస్తోంది.

ఆస్ట్రేలియాలోని, మెల్‌బోరన్ పట్టణంలో ఒకసారి ఈ అంత ర్జాతీయ గ్రామీణ మహిళా సమాఖ్య మహాసభ జరిగింది. ఈసమాఖ్యకు అనుబంధిత శాఖలుగా ఉన్న అన్ని దేశాలనుంచి 1200 మంది మహిళా ప్రతినిధులు ఈ మహాసభలో పాల్గొన్నారు. ఆస్ట్రేలియా దేశంనుంచే నాలుగు వేలమంది ప్రతినిధులు హాజరయ్యారు.

అఖిల భారత గ్రామీణ మహిళా సమాఖ్యకు శ్రీమతి లక్ష్మి ఉపాధ్యక్షురాలు. ఈమహాసభలో మనదేశప్రతినిధిగా పాల్గొన్నారు.

వివిధ దేశాలకూ, వివిధమతాలకూ, వివిధ భాషలకూ చెందిన అయిదారు వేల మంది స్త్రీలు, పదిరోజులపాటు జరుపుకొన్న ఈ సమా వేశం ఒక అంతర్జాతీయ మహిళల పండుగలాగా గనిపించింది. పది రోజులవరకు విస్తరించిన సుదీర్ఘ కార్యక్రమంలో ప్రతిదేశపు ప్రతినిధి వర్గం, తమదేశపు గ్రామీణ మహిళల ఆర్థిక, సాంఘిక, రాజకీయ స్థితిగతులను సమీక్షించుకుంటూ, ఉన్నత భవిష్యత్తుకై ఎలాంటి కార్యక్రమాలను అభిలషిస్తున్నారో వివరిస్తూంటే, అన్నివిధాలా ప్రోత్సాహముండి అవకాశాలు లభిస్తే, అంతర్జాతీయ వేదికలను ఏర్పాటుచేసుకొనుటలోనూ, వాటిని బాధ్యతాయుతంగా నిర్వహించు కొనుటలోనూ, ప్రగతి శీలకమైన కార్యక్రమాలను రచించుకొన

డంలోనూ, స్త్రీలు పురుషులకన్నా ఎందునా తీసిపోరని లక్ష్మికి తల
పింపజేసింది.

శుష్క వివాదాలతో, అనవసర కాలయాపనలతో, ఏమాత్రం
ఫలితాలను సాధించకుండా, నెలలు నెలలు పురుష పుంగవులు
జరుపుకునే అంతర్జాతీయ సమావేశాలు జ్ఞాపకం వచ్చాయి.

ఎవరనూ విమర్శించటం శ్రీమతి లక్ష్మి పనిగాదు, ఇష్టమూ
ఉండదు. అయినా ఈ మహిళా సమాఖ్య సమావేశం చూచిన
తర్వాత మహిళా ఉద్యమ కార్యకర్తలలోని ఉత్సాహాన్ని, నాయకు
రాండ్ర విజ్ఞతను ఆకళింపు జేసుకున్న తదుపరి, మహిళలు అంతర్జా
తీయ పరిధిలో సమస్యల పరిష్కారం చక్కగా చేయగలరని, ప్రపంచ
భవిష్యత్తును తీర్చిదిద్దటమనే కృషికి ఉత్తమంగా దోహదపడగలరని
విశ్వాసం గలిగింది.

మొదటిరోజు మహిళా ప్రతినిధుల సభలోనూ, చివరకు జరిగిన
బ్రహ్మాండమైన బహిరంగ సభలోనూ శ్రీమతి లక్ష్మి తన ఈ విశ్వా
సాన్నే ప్రకటించారు.

"ఈనాడు మనుష్యజాతి ఎదుర్కొంటున్న సమస్యలన్నీ, అవి
యుద్ధాలుగానిండి, కలవులుగానిండి, ప్రకృతి వైపరీత్యాలు గానిండి,
వర్ధమాన దేశాలకు అందివ్వ ఉద్దేశించిన సహాయ సహకారాలుగానిండి,
అన్నీ రాజకీయాలకు ముడిబెట్టబడుతున్నాయి. ఈ రాజకీయాల
ప్రసక్తి మనుష్యుల జీవిత కష్ట పరంపరల నివారణకూ, ప్రగతికృషికీ
ముడిబెట్టబడినపుడు, మొత్తం కార్యక్రమాలు అరాజకయుతమౌ
తున్నాయి. ఏ మహోద్దేశ్యంతో, ఈఉత్తమ కృషులు ప్రారంభించబడి
నిర్వర్తించబడవలసి ఉందో, ఆ మహదాశాయం సాధించబడటంలేదు.
కనకనే సహాయాలను అందించే సంపన్న దేశాలు, అందుకునే బడుగు
దేశాలు అడుగడుగునా అనుమానాలకు లోనౌతున్నాయి. బంధనాలు
ఎన్ని వేశాము అని సంపన్న దేశాలు, లెక్కలు వేసుకుంటూంటే,
ఎన్నిబంధనాలలో చిక్కకున్నాము అని సహాయాలను స్వీకరించే
వర్ధమాన దేశాలు లెక్కలు వేసుకుంటున్నాయి,

"ఫలితంగా, మానవజాతిలో రావలసిన ఏకత్వము, పెరగవలసిన మమకారాలకు బదులు, పరస్పర అవిశ్వాసము ప్రబలుతుంది." అని లక్ష్మి ఆ ప్రతినిధుల మహాసభలో ప్రసంగించినపుడు సదస్యులందరూ కరతాళ ధ్వనులతో వీరి అభిప్రాయాన్ని మన్నించారు. రెండు నిముషాలపాటు సభంతా, 'హియర్, హియర్' కేకలతో మ్రోగిపోయింది.

సహజంగా ఒకరు ఉపన్యసిస్తుండగా, అధ్యక్షులు జోక్యంగలిగించుకోనడం ఎక్కడా సాంప్రదాయంగాదు. కాని, ఆ సమావేశానికి అధ్యక్షత వహించిన సోదరి, వెంటనేలేచి, 'భారతీయ ప్రతినిధి మాడం లక్ష్మి పరిశీలన, చాలా శాస్త్రీయంగా కన్పడుతుంది. అంతర్జాతీయ సమస్యల పరిష్కార వైఫల్యాలకు ఈ రాజకీయాలే ప్రధా కారణమౌతున్నాయని ఈమెవెలిబుచ్చారు. మీఅందరి తరఫునా వారి ఈ అభిప్రాయన్ని ఇంకా వివరించ వలసిందిగా ప్రార్థిస్తున్నాను.'' అంటూ కూర్చున్నారు. తిరిగి హాలంతా దద్దరిల్లినట్లుగా హర్షధ్వనులు మారుమ్రోగాయి.

నిజంగా లక్ష్మి ఆ ప్రసంగం అక్కడ చేయాలనుకోలేదు. ముందుగా ఏ విధమైన ప్రసంగ ప్రయత్నమూ చేయలేదుగూడా. ఆ అంతర్జాతీయ సదస్సులో ఈమె హృదయంలో ప్రధానంగా ఎన్నో రోజులనుంచి గూడుకట్టుకొని ఉన్న భావం అప్పటికప్పుడు ఆ ప్రసంగరూపంలో బయల్వెడలింది.

తిరిగి లక్ష్మి సోదరీమణులను ఉద్దేశించి ప్రసంగించారు.

"నిర్మొహమాటంగా భావాలను బహిర్గతం చేసుకొనుటకే, ఈ సమావేశాలు ఏర్పాటుచేసుకున్నాము, అదే నా విశ్వాసంగూడా. ఈనాడు ప్రపంచవ్యాప్తంగా ప్రతి సమస్యా రాజకీయాలతో ముడి పెడుతున్నారని తమకు ఇంతకుముందే మనవి చేసుకున్నాను. ఈ రాజకీయాలు ఎప్పుడూ స్వార్థప్రపూరితాలు. ఒక దేశం ఎప్పుడూ మరో దేశంపై వివిధ కారణాలతో కార్పణ్యం వహించటానికీ, ఇతర దేశాలపై తమ పలుకుబడులను, ఒకరికి పోటీగా ఒకరు పెంపొందించు

కొనుటకూ ఈ రాజకీయాలు ఉపయోగపడుతున్నాయి. మానవు లందరం ఒక శ్రేణినీ, భగవంతుని సృష్టిలో అందరం సమానులమనీ, ఆపద లలో తోటివారికితోడ్పడమనీ, మన బాల్యమాది మన తల్లిదండ్రుల ద్వారా, గురువులద్వారా, పుస్తకాల ద్వారా విన్నాము, చదువు కున్నాము. మన మతాల సారం అదేననీ గ్రహించాము. ఆ ఉన్నత ఆదర్శంతోనే మానవజాతి తరతరాలుగా ప్రభావితమౌతుంది. ఆ ఉన్నత లక్ష్యంతోనే మానవజాతి ఎన్నో త్యాగాలు చేస్తూ నడక సాగిస్తూంది. కాని ప్రభుత్వాలెప్పుడూ, ఈ సామాన్య ప్రజల సదవ గాహనను అర్థం జేసుకుంటున్నట్లు లేదు. పరార్థచింతనకు ప్రభుత్వా లకూ చుక్కెదురుగా కనిపిస్తుంది నాకు.

"ప్రపంచ ప్రజలందరూ అన్నివిధాలా క్షేమంగా ఉన్నరోజునే ఎంతటి సంపన్నదేశంలోని ప్రజలుగూడా సంతృప్తికరంగా మనుగడ సాగించగలరనే మౌళికసూత్రం విస్మరించబడింది నేడు. ఇంతకూ ఈ ప్రభుత్వాలు యుద్ధాలుచేసి వేలకోట్ల డాలర్లు వెచ్చించినా, పరదేశ సహాయ కార్యక్రమాలకు లక్షల డాలర్లు మంజూరుచేసినా, ఈ ధన మంతా ఎవరది ? ప్రజలదే గదా ? ఈ ప్రజలు ఖజానాలను ధనంతో నింపుతున్నది యుద్ధాలు చేయమనా ? పొడుగైన ఉరిత్రాళ్ల ఉచ్చులు గుప్పెట్లో ఉంచుకొని బడుగుదేశాలకు సహాయ సహకారా లందివ్వమనా ? కానేకాదుగదా !

ఈ విషయంలో నేను ఏఒక్కరినీ దృష్టిలో పెట్టుకొనీ మాట్లా డటం లేదు. ఈ క్షణంలో ప్రపంచంలోని అన్ని దేశాలు నా దృష్టిలో గిర్రున తిరుగుతూనే ఉన్నాయి. ఈ రాజనీతి, ఒక్క అమెరికాకో, చైనాకో, రష్యాకో, లేక పాకిస్థాన్, ఇండియాలకో పరిమితమై ఉన్నదని వ్రేలెట్టిచూపటంగూడా నా బాధ్యతగాదు. నేటి సంక్షుభిత ప్రపంచానికి, ఈ అనవసర రాజకీయాలు ఎంతటి ద్రోహంచేస్తు న్నాయో తమ దృష్టికి తీసుకరావటమే నా ప్రధానమైన అభిలాష.

వ్యక్తిత్వాల పరి పోషణకూ, స్వయంకీర్తి ప్రతిష్ఠల నిర్మా ణానికీ వర్గ ప్రయోజనాలకూ, ఈ రాజకీయాలు ఉపయోగించుకో బడుతున్నాయి.

"నాయకుల అహంభావాల ప్రభావం నేటి రాజకీయాలలో మిక్కుటంగా గన్పిస్తోంది. ఇది శోచనీయస్థితి. ఇది ప్రపంచ వ్యాప్తంగా సామాన్య ప్రజానీకానికి తీరని ఆశాభంగం గలిగిస్తుంది. ఈ పరిస్థితులనుంచి ఈ వ్యాపార రాజకీయాలనుంచి, ప్రపంచ ప్రజ ఎంత త్వరగా విముక్తమైతే అంత మేలు. ఎంత శీఘ్రంగా జరిగితే అంత మేలు.

"మనందరం ప్రపంచ వ్యాప్తంగా గ్రామీణ ప్రాంతాలకు చెందిన వారము. మనదృష్టి అంతా గ్రామసీమల మీదే నిలచి ఉంటుంది. మనకు ప్రధానంగా కనుపించేది గ్రామీణులే. ప్రపంచంలో అత్యధికసంఖ్యలో ఈ జనభాయే ఉన్నారు. వారు ఏస్థాయికి ఆస్థాయిలో వెనుకబడి ఉన్నారు. ఏదేశపు వారైనా మన గ్రామీణ ప్రజలు ఏనాడూ ఈలాంటి రాజకీయాలను వాంఛించరే! ఇది మనం ఎరిగున్న సత్యమేగదా !

"ఒక భారతదేశంలో వరదలొచ్చి నష్టంగలిగిందంటే, ఒక గ్రామీణ అమెరికా రైతుకుటుంబం, ఒక వంద పాలపొడి డబ్బాలు సహాయమందిస్తుంది. ఒక పెరుగ్వేలో భూకంపంవచ్చి ఆస్తినష్టం జరిగిందంటే, ఒక ఆస్ట్రేలియా ఒక లక్ష డాలర్ల విలువగల పరికరాలు సప్లయి చేస్తుంది. అలాగే మానవజాతిలో, ఏభాగంలో ఎప్పుడు ఏరకమైన విపత్కరస్థితికి లోనైనా మిగిలిన మానవాళి సహృదయంతో పీడిత మానవాళి క్షోభలను నిర్మూలించేందుకు సహాయ పడుతూనే ఉంది.

"ఈ సహాయాలకు ఏలాంటి బంధనాలు లేనట్లే, మిగిలిన సమయాలలో గూడా స్వచ్ఛందంగా మానవతా దృష్టితోనే ప్రపంచ దేశాల సమస్యలను పరిష్కరించుకోవచ్చునే! నేడు, వర్తమాన ప్రపంచంలో, ముఖ్యంగా రెండవప్రపంచ యుద్ధానంతరం,సామ్రాజ్యవాదం నశించింది. వలస రాజ్యాలన్నీ ప్రపంచపటంలో రంగులు మార్పుచేసుకున్నాయి. పరాధీనతనుంచి విముక్తమై స్వతంత్రమయ్యాయి. స్వయంకృషితో తమతమ దేశాలలోని సమాజాలలో

పేరుకొనిపోయిన అజ్ఞాన, అనారోగ్యాలపై, దారిద్ర్యాలపై, తీవ్రపోరాటాలను సాగిస్తున్నాయి.

"స్వంత సమస్యలతో సతమతమై పోతూన్న ఈ బడుగుదేశాల ఉన్నతికి త్రికరణశుద్ధిగా, అభివృద్ధిపొందిన దేశాలు సహాయ పడవచ్చునే! వివిధదేశాల రాజకీయ నాయకుల దృష్టిలోనే ఈమార్పు రావాలని కోరుకుంటున్నాను.

"అందుకే, మన మన గ్రామీణ మహిళా సమస్యల పరిష్కారంతో పాటు, మన దృష్టిని ఈ వైపుగూడా త్రిప్పి, మన మన దేశాలలోని మలిన రాజకీయాలను, పరిశుభ్రం చేయటానికి మనవంతు కృషిని సాగించాలని కోరుతున్నాను." అని ప్రసంగాన్ని ముగించారులక్ష్మి.

సమావేశానంతరం, ఏయే దేశాల ప్రతినిధులు లక్ష్మికి అభి నందనలు తెలిపిందీ, ఎంత పెద్దఎత్తున వారి హర్షామోదాలు తెలిపిన విషయాలు ఒక ప్రత్యేక అభినందన సంచికకు సరిపోయేవి అనేది మాత్రం సత్యం. స్వోత్కర్షకు లక్ష్మి సదా విముఖురాలు.

బహుశా చిత్తశుద్ధితో ఆమె చేసిన ఆ ప్రసంగం శ్రోతలైన ఆ సోదరీ మణు లందరనూ ఆకట్టుకొని ఉండవచ్చు. వినమ్రతతో, హృదయపు లోతులనుండి, వచ్చిన ఈమె ఆరాటం, కశాల్మల రాజకీయాలపట్ల ఈమెకున్న వైముఖ్యం సూటిగా వారి గుండెలకు తాకి ఉండవచ్చు. అంతకన్నా మించి శ్రీమతిలక్ష్మి ఆ ప్రశంసలకు అధిక ప్రాముఖ్య మివ్వలేదు.

మిగిలిన పదిరోజుల కార్యక్రమాలలో, తదుపరి జరిగిన వీరి సామూహిక పర్యటనలలోనూ, ఈ భారతదేశ ప్రతినిధికి సముచిత గౌరవం లభ్యమయిందనీ, అనేక విషయాలలో చివరి నిర్ణయాలకు ముందు, లక్ష్మివైపు వారి దృష్టిసారించే వారనీ గుర్తుకు వచ్చినపుడు తన కృషి రాణింపుకు వచ్చిందనే తృప్తి లక్ష్మికి గల్గింది. ఈ పర్యాట నకై మన దేశ ప్రభుత్వం ఈమెకు కేటాయించిన 75 రూపాయల

విదేశీమారక ద్రవ్యం ఎంత మాత్రం నిరుపయోగమవలేదని గూడా ఈమెకు సంతృప్తి గలిగింది.

*   *   *

ఒకకోటి 27 లక్షల మంది జనాభాగల ఆస్ట్రేలియా దేశంలో ఈ అనుబంధ మహిళా సంఘానికి 22 వేలమంది సభ్యులున్నారు, దేశంలోని అన్ని గ్రామాలనుంచి ప్రాతినిధ్యం ఉండటమేగాక గ్రామ సీమల్లో ప్రతికుటుంబం నుంచి ఒకరన్నా ఈ సమాఖ్యలో సభ్యులుగా ఉన్నారనేది గూడా లక్ష్మికి అర్థమయింది.

వివిధ కార్యక్రమాల భారంతో పదిరోజులపాటు నిర్విరామంగా సాగిన ఈ సమావేశాలు ముగియటంతోచే, ఆస్ట్రేలియా సమాఖ్యవారు, అతిధులకు విస్తృతంగా వారి దేశంలో పర్యటనావకాశాలను గల్పించి, అలసిపోయిన మనస్సులకు ఉత్సాహం గల్గించాలని గామోను తలచారు.

ఆస్ట్రేలియా 'ఉన్ని సమాఖ్య' ఒకసాయంకాలం, వీరికి ఒలింపిక్ "స్విమ్మింగ్ స్టేడియం"లో వినోదప్రదర్శనాలు ఏర్పాటు చేసింది. ప్రతినిధులందరూ, వారివారి జాతీయ దుస్తులలో చూడ్చముచ్చటగా, పలుదేశ నాగరికతా సాంప్రదాయాలను పుణికి పుచ్చుకొని పాల్గొన్నారు. ఆ సరోవరమంతా రంగురంగుల రబ్బరు బెలూన్లతో నీటిపై అలంకరించారు. వీరిని కూచోపెట్టుకొన్న చిన్నచిన్న పడవలు ఉత్సాహంతో కొలనంతా పరుగులు పెడుతూ విహరించాయి. ఆ దృశ్యం మరువరానిది.

1775 సంవత్సరంలో ఆస్ట్రేలియాను కనుగొన్న ఆంగ్లేయ సాహసిక నావికుడు "కాప్టెన్ థామస్ కుక్" స్మారకచిహ్నాన్ని, లక్ష్మి మరో యిరువురు స్నేహితురాండ్రతో కలసి సందర్శించారు. ఇంగ్లండులో "కుక్" నివసించిన ఆయన గృహాన్నికొని, దానిని తీసుకొనివచ్చి, అదేఫక్కీలో ఇక్కడ తిరిగి నిర్మాణం గావించారు. ఆయన ఉపయోగించిన పరికరాలను, ఆయన చిత్రాన్ని భద్రంగా దాచారు ఇందులో.

ఈ మహాసభలు జరిగిన 'రాయల్ హాల్ రూమ్' నుంచి, "హీస్ లెవిల్"లోని సర్ కాలిన్ మెకంజి శాంక్చ్యుయరీని సందర్శించ టానికి, 27 బస్సులలో ప్రయాణమై పోయారు ఒకరోజున. ఈ శాంక్చ్యుయరీ వారికి ఒక పవిత్ర ప్రదేశం. ఈయాత్ర చిరస్మరణీయం. అక్కడ వీరు దిగగానే, ఆప్యాయతతో వీరికీ తలాఒక "లంచిబాక్సు" అందించారు. వీరి ప్రయాణవార్త తెలిసిన, విక్టోరియా గ్రామప్రజలు మహిళా సమాఖ్య సభ్యులు 30 మంది, 16 గంటలు కష్టపడి, ఈప్రతినిధులకు ఈ లంచిబాక్సులు తయారుజేశారు. ప్రతి లంచిబాక్సులోను ఒకకోడి గ్రుడ్డు, వెన్నపొట్లం, కోడిమాంసం, కేక్, బిస్కట్లు, డ్రైఫ్రూట్సు అమర్చారు. అయితే లక్ష్మి మూలంగా విదేశాలలో ఈ ప్రతినిధులకు లంచిగానీ, డిన్నర్లుగానీ, పెద్దఅవస్థే. ఈమె కేమో మాంసాహారం కొరకరానికొయ్య. వారికేమో శాకాహారం ఒక ప్రత్యేక శ్రమ. అయినా ఈమె మిత్రులు ఈమెకోసం ఎంతో శ్రమ పడతారు. అర్ధాకలి కన్నాగూడా సహృదయంతో, వాత్సల్యంతో ఈమె మిత్రురాండ్రు ఈమెకోసం పడే శ్రమే ఈమెను ఎక్కువ ఇబ్బంది పెడుతుంది. ఇరకాటంగలిగిస్తుంది.

కాని ఇక్కడ మాత్రం లంచిపొట్లం చాలా రుచిగా తయారుజేశారు ఈ గ్రామీణ మహిళా సోదరీమణులు. రొట్టె, జున్ను, వెన్న, ఉడక పెట్టినబంగాళాదుంపలు, కొన్ని పచ్చళ్లతో తృప్తిగా సాగింది లక్ష్మి భోజనం.

అయితే ఈ వినోదయాత్రలో అసలు వినోదం ఏమంటే ఈ ప్రతినిధులందరూ ఎవరి పొట్లాలువాళ్లు విప్పుకొని నలుగురు ముగ్గురుగా విడిపోయి కూచొని వీరి ఆతిథేయవర్గం ఆప్యాయంగా యిచ్చిన ఆహారాన్ని తింటూండగా, ఎక్కడో పొంచిఉండి, నిశ్శబ్దంగా వచ్చిన వానర సోదరులు అంత ఆప్యాయంగానే ఆ పొట్లాలను అందుకొని పరుగెత్తటం. ఈ ప్రమాదాన్ని గురించి ముందే వీరికి ఆర్గనైజర్లు చెప్పినప్పటికీ ఈ ప్రతినిధి బృంద సభ్యురాండ్రు అసలు సమయానికి, ఈ విషయాన్ని విస్మరించారు. కొత్తరకం కట్టూబొట్టులలో

కూర్చున్న శ్రీమతి లక్ష్మి వద్దకుమాత్రం ఏ కారణంగానో ఈ హనుమన్ భ్రాతలు రాలేదు. బహుశా ఈమె దేశంలోని ప్రజలు వారికి భక్తులు అని తెలుసుకున్నా యోఏమోగాని, లక్ష్మికి ఎదుటా ప్రక్కల కూచున్న మిత్రురాండ్ర పొట్లాలు చేతుల్లోవి చేతుల్లోనే ఎగిరి మాయ మవటం నిజంగానే వింతగానేఉంది. చేతిలోని పొట్లాం నోటికందే మధ్యలో మాయమవటంతో చకితలై మాతృభాషల్లో ఎంత గావు కేకలు ఈ నారీమణులు పెట్టినా, ఆ వానరమణులు తమపనితాము సాధించాయి.పూర్వం తిరుపతిదేవస్థానంలో 'యాత్రీకులూ,కోతులూ' లక్ష్మికి జ్ఞాపకం వచ్చారు; ఈ సంఘటన చూచింతర్వాత.

భగవత్ కైంకర్యానికై ఆ ఆపద మ్రొక్కులవానికి భక్తులు శ్రద్ధాసక్తులతో రెండుచేతులా పట్టుకొని గొంపోవు నారికేళాలను, అక్కడి కోతులు ఆ పళంగా గొంపోయి అప్పళించటమేగాక, భక్తు రాండ్రు తలలపైకురులలో ముడుచుకున్న పుష్పాలహారాలను సయి తం లాక్కొని వెళ్లిదూరంగా గోడలమదుర్లపై కూచొని చిరునవ్వు లతో ఆరగించడం జ్ఞాపకంవచ్చింది.

మన తిరుపతిలాగానే, ఈ శాంక్చ్యుయరీగూడా వారికి ఒక పవిత్రస్థలం.

*　　　*　　　*

ఈ పర్యటనలలోనే ఆస్ట్రేలియా గ్రామీణ ప్రాంతాలలో, 800 మైళ్లు ప్రయాణించారు శ్రీమతి లక్ష్మి. ఈమె కోసరం ఏర్పా టుచేసిన పలు సభల్లో భారతదేశ మహిళా ఉద్యమాలను, మనదేశ స్థితిగతులను గురించి ప్రసంగించారు. ఆస్ట్రేలియాలో అంతా ఆంగ్ల భాషేకనక దుబాసీలతో అవసరం కలగలేదు. ఈమె ప్రసంగించిన ప్రతిచోటా మిత్రురాండ్రు ఎంతగానో ఆదరించారు. చాలా పురా తన విజ్ఞాన నాగరికతలతో చిరకాలం విరాజిల్లిన దేశం, మనదనే గౌరవం వారికుంది.

గెంతుతూ పరుగిడే కంగారూలూ, దూసుకునిపోయే ఈ సూలూ, క్షణంలో వేగంగా మాయమయ్యే కుందేళ్లు, అనేక రక

రకాల ఫలపుష్ప వృక్షాలతో పచ్చని పొలాలతో గ్రామసీమలు కనులకు విందు చేశాయి.

ఇక్కడ గ్రామాలలో ఇండ్లకు తాళాలు వేయరు. ఆ ఊహే వారికి రాదు.

అందరి ఇండ్లలో అన్నీ ఉన్నపుడు దొంగతనాలు ఉండవు అనేదానికి ఆస్ట్రేలియా గ్రామసీమలే ప్రత్యక్షనిదర్శనం.

ఈ దేశంలో ఓటింగు హక్కు యుక్తవయస్కులందరకీ ఉండటమేగాక దానిని ఉపయోగించుకోవటం తప్పనిసరి చేశారు చట్టరీత్యా.

సాంఘిక సంక్షేమ ప్రగతి ఈ దేశంలో మాంచిఉచ్ఛస్థితిలోనే ఉంది. వయోవృద్ధులైనవారికి ఫెడరల్ ప్రభుత్వం చాలా సదుపాయాలు గల్పించారు. అంగవిహీనులకూ, ఇతరత్రా ఆర్జనావకాశ విహీనులకు, ఒక పథకం ప్రకారం సహాయమందిస్తారు. ఆ సహాయం గూడా వారానికి 15 పౌనులనుంచి 20 పౌనులవరకు ఉంటుందని తెలుసుకొని ఆశ్చర్యపోయారు శ్రీమతి లక్ష్మి.

60 సంవత్సరాలు దాటిన స్త్రీలకు, 65 సంవత్సరాలుదాటిన పురుషులకు ముసలితనపు భృతి ఏర్పాటుచేశారు. ఈ దేశంలో సగటుజీవిత ప్రమాణం పురుషులు 68 సంవత్సరాలు, స్త్రీలు 74 సంవత్సరాలు.

* * *

సరే పనిలోపని. తన అసలుపని రైతుల పరిచయం. వారి బాగోగులు తెలుసుకోనడం. మన రైతాంగపు మంచి చెడ్డలు తెలుపుకోటం, అనుభవాలను క్రోడీకరించుకోవటం శ్రీమతి లక్ష్మి ప్రతి విదేశపు పర్యటనలోనూ తప్పనిసరి అంశం.

ఈ సందర్భంగా కొన్ని వ్యవసాయ క్షేత్రాలు చూచారు. చాలమంది రైతుసోదరులను కలుసుకున్నారు.

మిష్టర్ రాబర్టుమెకంజీ గట్టిరైతు. అయిదువందల ఎకరాల భూస్వామి. మరో రెండువందల ఎకరాల పచ్చికబయళ్లు ఉన్నాయి. ఈ పంటభూమికి ఆ పచ్చిక బయలుకూ నాలుగు ఫర్లాంగుల దూరం ఉంది. కొండ అంచువరకు ఈ పచ్చికబయలు ఆక్రమించి ఉంది.

ఈ పంట భూముల్లో అధికభాగం నీటివనరు ఉన్నది. కొద్ది భాగం మాత్రం మెట్టక్రింద ఉన్నది. అది మెరక ప్రదేశంలో ఉన్నం దున కాలువ నీరు ప్రవహించదు. భూగర్భ జలాలను రిగ్గులు ఏర్పాటు చేసుకొని మెట్టపంటలు పండిస్తున్నారు. అందులో ఈమె వెళ్లినపుడు షుమారు 80 ఎకరాలలో ప్రత్తిపంట ఉంది.

హైబ్రిడు రకానికిచెందిన ప్రత్తి గుళ్లలు మొక్కలనిండా విచ్చుకొని,చేనంతా మంచుముద్దలు తాపడం చేసినట్లుగా కన్పించాయి చెట్టు చెట్టుకు నూరు గుళ్లలదాకా ఉన్నాయి. పగలవలసిన కాయలు మరో వందదాకా కనిపించాయి. ప్రత్తి చేను సమీపించగానే రాబర్ట్ మొఖం వికసించింది.

అది గమనించిన లక్ష్మి, "మీ ప్రత్తిపంట తృప్తికరంగా ఉన్నదా!" అని అడిగిందిలక్ష్మి.

"Yes. More than satisfied with my crop this year" అన్నాడు ఆ భూఖామందు. అతని మొఖంలో చిందులాడే సంతోషమే ఆసంగతి చెప్పిందిగూడా.

ప్రత్తి సాగునుగురించి వివిధ దశలలో వారి కృషిని గురించి అడిగి తెలుసుకున్న తదుపరి ప్రత్తిపంట క్రయ విక్రయాలను గురించి అడిగారు లక్ష్మి.

"అంతకుముందు ఈ ప్రత్తిపంట బొత్తిగా గిట్టుబాటు అయ్యేదిగాదుగానీ" అంటూ మొదలుపెట్టాడు రాబర్ట్.

"వివరించమన్నారు" శ్రీమతిలక్ష్మి.

"1963లో ప్రభుత్వం, 'బౌంటీ ఆక్టు''Bounty act' అంటూ ఒక శాసనాన్ని చేసింది. ఆ చట్టంప్రకారం, ప్రత్తి ఉత్పత్తిదారులకు రక్షణ గలిగింది. సంవత్సరానికి 40 లక్షల డాలర్ల చొప్పున, 5 సంవత్సరాల వరకు ప్రత్తిపండించే రైతాంగానికి సబ్సిడీగా యిస్తానని ప్రకటించింది. ప్రతి రైతుకు, పండించిన ప్రతి కిలో ప్రత్తికి దామాషాగా 2 రూపాయల 75 పైసల సబ్సిడీ ముట్టచెప్పింది. అంటే క్వింటాలుకు 275 రూపాయిలు అదనం అన్నమాట. కాగా దేశంలోనే అమ్ముడయ్యే దూదికి మరికొంత సబ్సిడీ యిచ్చింది.

ఈ ప్రోత్సహంతో వ్యవసాయదారులు ఉత్సాహంతో ముందుకు దూకారు. అనేక వనరులను గల్పించుకొని, ప్రత్తిని సాగుచేస్తున్నారు. వివిధ రసాయనికపు ఎరువులు విరివిగా వాడటం వల్లా, క్రిమిసంహారక ప్రక్రియలు భారీఎత్తున జరుపుకొనటంవల్లా ఫలసాయం బాగా పెరిగింది. ఆదాయంగూడా తృప్తికరంగానే ఉంది'' అని అన్నాడు.

"మరి ఆ అయిదు సంవత్సరాలు అయింతర్వాత ప్రభుత్వ సబ్సిడీ ఏమయింది ?" అని అడిగారు లక్ష్మి.

తదుపరిగూడా యిస్తూనే ఉందిగాని, ఉత్పత్తులు అధికమవటంతో దామాషా మేరకు, సబ్సిడీ తగ్గుతుంది. అయినా ఈవాళ మార్కెట్టులోనే డిమాండు పెరిగింది కనుక ఉత్పత్తిదారునకు ఏమీ నిరుత్సాహంగా లేదు'' అన్నాడు రాబర్టు.

పొగాకు ఉత్పత్తి ఏమంత ఎక్కువ గాదు. ముఖ్యంగా మన ఆంధ్రదేశంతో పోల్చి చూచినపుడు కొన్ని ప్రాంతాలవరకే ఈ పైరు పరిమితమై ఉంది. 25 వేల ఎకరాల విస్తీర్ణంలోనే పొగాకు పైరు సాగుచేయబడుతుంది. అయితే దిగుబడిలోనూ, ఆస్ట్రేలియా రైతు తెలుగు రైతుకన్నా చాలా ముందున్నాడు.

చెఱకు ఉత్పత్తికి ఆస్ట్రేలియా ఎక్కువశ్రద్ధ తీసుకుంటుంది. గ్రాఫ్టన్ నుంచి, క్వీన్స్‌లాండ్ వరకు విస్తరించిన 1250 మైళ్ల

తీర ప్రాంతంలో చెఱకు పండిస్తున్నారు రైతులు. అందులో 95 శాతం పంట ఒక్క క్వీన్స్‌లాండ్ రాష్ట్రమే ఉత్పత్తి చేస్తుంది. పంచదార ఎగుమతివల్ల ఆస్ట్రేలియా అధికంగా విదేశద్రవ్యాన్ని ఆర్జిస్తుంది. ఒక్క 1970 సం॥లోనే 11 కోట్ల 60 లక్షల డాలర్ల విదేశీ మారకాన్ని వీరు సంపాయించారు.

ఎకరాకు దిగుబడి మనకన్నా చాలా అదనంగా ఉంది, అంతేగాక, అక్కడి ప్రభుత్వ ప్రోత్సాహంవల్లా, రైతుల కృషివల్లా. చక్కెర దిగుమతీ, దానిలోని తీపిదనము శాతంగూడా ఎక్కువే అమ్మకం రేటుగూడా దానికనుగుణ్యంగా ఉండి రైతులకు మేలు చేస్తుంది.

ముఖ్యంగా, అమెరికా, కెనడా, న్యూజిలాండ్, మలేషియా, జపాను దేశాలకు పంచదార ఎగుమతి జరుగుతుంది. 50 హార్సు పవర్ ట్రాక్టరుకు అనుబంధించిన మరొకయంత్రం, చెఱకును మొదలంటా నరకటమేగాక, చిన్నచిన్న ఖండాలుగాగూడా చేసి ట్రాక్టరువెంటనే నడిచే ట్రక్కులోనికి ఒకేసారి వేసి నింపుతుంది. ఆ ట్రక్కు నిండగానే మరో చిన్నట్రాక్టరు వచ్చి ఆ నిండిన ట్రక్కును తగలించుకొని ఫ్యాక్టరీవైపు పరుగిడుతుంది. అలాగే ప్రత్తి గుళ్లను గూడా భారీ యంత్రాలతోనే తీస్తారు. తదుపరి జిన్నింగు పనిగూడా వారి వ్యవసాయ క్షేత్రంలోనే చేసుకొని దూదిగా మార్చి, బేళ్లను కట్టి అమ్మకానికి పెడతారు.

అలాగే వర్జినీయా పొగాకు పచ్చిఆకు కోసి, మన ఆంధ్ర దేశంలోలాగా, బండ్లపై ఎక్కించి, పొలాలనుంచి, ఇండ్లవద్ద ఉండే బ్యారన్లకు తేవటానికిబదులు, బేరన్నే వాళ్లు పొగాకు చేలోకి నడుపుకుపోతారు. చక్రాలమీద నిర్మాణం గావించిన ఈ బారన్‌ను, ఒక పది హార్సుపవర్ టిల్లర్ చేనిలోకి లాగుకొని పోతుంది. కూలీలు విరిసిన ఆకు విరిసినట్లు చేతుల మీదుగానే గడలకు అల్లి, అక్కడి కక్కడే బేరనకు ఎక్కిస్తారు. కడుపునిండా పొగాకు నింపి

జారన్లు నిదానంగా రైతు గోడవునుకు వస్తాయి. దానివలస ఆకు నాణ్యత ఎంతమాత్రం చెడదని రాబర్టు చెప్పాడు.

నిజంగా ఆ పద్ధతి మనకు ఆశ్చర్యం గలిగిస్తుంది. అవకాశాలు ఉంటే మన రైతులూ ఈ ఆధునిక పరికరాలను వినియోగించుకునే వారే గదా! అని అనిపిస్తుంది. ఎక్కువ లాభం పొందేవారే గదా! అని అనిపిస్తుంది. చివరకు ఉసూరనిపిస్తుంది.

వ్యవసాయ క్షేత్రంనుంచి, మిస్టర్ రాబర్ట్ పచ్చిక బయలు చూడటానికి బయలుదేరారు లక్ష్మి. మనోజ్ఞంగా ఉన్న ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించుకుంటూ ఆ కొద్దిదూరం నడిచేవెళ్లారు. చుట్టూరా కొయ్యచెక్కలతోనూ, ముండ్లతీగలతోనూ బిగించిన ప్రహరి ఈ విశాలమైన పచ్చిక బీడు చుట్టూరా అమర్చిఉంది. మధ్య ఒకపెద్ద కుటీరంలాంటిది పక్కాగృహం ఉన్నది. దానికి కొంచెం విడిగా రెండు మూడు కొట్టాలలాగా ఉన్నాయి. అక్కడక్కడా చుట్టూరా కంతలుండి ఇటుకలతో మూసిన పెట్టులున్నాయి. ఆ ఆవరణలో 1800 గొర్రెలున్నాయి, చాలాబలిసి, మనిషివాటుకు అరపవేమో అన్నంత లావుగా ఉన్నాయి ఆ గొర్రెలు. వొంటినిండ బొచ్చే. ఎక్కువ భాగం తెలుపు రంగుల గొర్రెలే ఉన్నాయి ఆ మందలో.

శ్రీమతి లక్ష్మి నిదానంగా నడచుకుంటూ వెళ్లి, గేటుతీసు కొని లోపలి బిల్డింగులను సమీపించేసరికి, ప్రక్కనే ఉన్న కొండగుట్ట లోనుంచి, ఒక నవయౌవ్వనవతి, గుర్రపు స్వారితోవచ్చి వీరిముందు ఆగింది.

మిస్టర్ రాబర్టు ఆయువతిని పరిచయంజేశాడు. ఆపిల్ల ఆయన కూతురు. పేరు మిస్ మార్గరెట్. 17 సంవత్సరాల వయస్సు ఉం టుంది. మంచి ఆరోగ్యంతో తొణికిసలాడుతుంది. నిలువెల్లా ఉత్సా హం నిండింది.

"Good morning Madam, welcome to you and very very happy to meet you"అంటూ గబగబా స్వాగతం చెప్పింది. నవ్వుకుంటూ శ్రీమతి లక్ష్మి కరచాలనం జేసింది.

ఈ అమ్మాయి ఉదయమే ఇంటి నుంచి వచ్చి గొర్రెల మందల పనిచూస్తుంది. ప్రతిరోజు ఆమె నిత్యకృత్య మిదే, సెకండరీ స్కూలు విద్యముగించుకున్నాక మార్గరెట్ గొర్రెల ఫారం మెనేజ్ మెంటు చూస్తుంది. వీటికి ఆహారం, వైద్యం, ఉన్ని కత్తిరింపులు వగైరా ఈ అమ్మాయి చూచుకుంటుంది. స్థానిక జాతులకు చెందిన వారు సంవత్సర భత్యాలమీద ఆరుగురు ఈ ఫారంలో పనిచేస్తుంటారు.

మార్గెరెట్ గుర్రంమీద సవారిచేసుకుంటూ మందలను కాస్తుంది.

ఆస్ట్రేలియా దేశపు ఎగుమతులలో ఉన్ని ఎగుమతి 18% వరకు ఉన్నాయి. గ్రామీణ పరిశ్రమలలో ఉన్ని పరిశ్రమ చాలాకీలక మైంది. లక్ష్మి ఆస్ట్రేలియా సందర్శించిన సంవత్సరం, ఒక్క ఉన్ని ఎగుమతుల ద్వారనే 74 కోట్ల డాలర్ల విదేశీమారకం సంపాయిం చింది.

గ్రామీణ వృత్తుల్లో, గొర్రెలను, మాంసాన్ని ఎగుమతి చేయ టంగూడా చాలా ప్రాధాన్యం వహిస్తాయి. ప్రపంచ గొర్రెల సంఖ్యలో ఆరవ వంతు గొర్రెలు, అనగా 18 కోట్ల 10 లక్షలు ఆస్ట్రేలియాలో పెంచబడుతున్నాయి. ప్రపంచం మొత్తం ఉన్ని ఉత్పత్తులలో 30% ఉన్ని ఈ దేశంలోనే తయారవుతుంది.

ఉన్ని ఉత్పత్తిదారులకుగూడా సక్రమమైన ధరలు రాబట్టి ప్రోత్సాహమిచ్చేందుకు, ఆస్ట్రేలియా ఉన్ని కమీషన్ని 1970 సంవత్సరంలో ఏర్పాటు చేశారు. అందువలన రైతులకు ఈ పరిశ్రమలో గూడా భద్రత లభించింది.

గొర్రెలఫారం చూడటం పూర్తయిన తర్వాత, మిష్టర్ రాబర్ట్ మెకంజీ వద్ద మిస్ మార్గరెట్ వద్ద వీడ్కోలు తీసుకొని లక్ష్మి బృందం ముందు మజిలీకి ప్రయాణం సాగించారు.

ఒక గ్రామంలో వీరి కోసరమని ఆదిమనివాసులచే ఏర్పాటు చేయించిన ప్రదర్శనాన్ని తిలకించారు. అనాది మానవుడు ఉపయోగించుకున్న స్వయంచోదిత తిపణి 'బ్రూమరెంగ్' అంటే 'ఏరోడైన మిక్సు' ఆధారంగా నేడు నాగరిక మానవుడు ఉత్పత్తి చేస్తున్నట్టి ఆయుధాన్ని ఆనాటి అనాగరిక మానవుడు ఎలారూపొందించాడా అని ఆశ్చర్యం గలుగుతుంది ఆ ప్రదర్శన తిలకించిన తదుపరి. ఒక్క దెబ్బకు డజను పక్షులు పడతాయట. రెండువందల గజాల దూరం నుంచి గూడా విసరగలరట.

ఈ వినోద యాత్రలనుగూడా పూర్తి జేసుకొన్న ప్రతినిధి బృందాలన్నీ తిరిగి మెల్‌బోరన్ సిటీలో నిర్ణీతమైన రోజుకు కలుసుకున్నాయి.

ఒక సమావేశంలో ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకున్నారు. ఈ ప్రపంచ మహిళోద్యమ నాయకురాండ్రు.

దీక్షా దక్షతలతో కృషిసాగించుకుంటూ, అట్టే సమస్యలు లేకుండా ఆస్ట్రేలియనులు ముందుకు నడుస్తున్నారు. అతిథుల పట్ల, ముఖ్యంగా భారతీయుల పట్ల వారికున్న సద్భావానికి కృతజ్ఞతలు తెలుపుకొని శ్రీమతి లక్ష్మి వీడ్కోలు తీసుకున్నారు.

మాతృభూమి దిక్కుగా ఆమె విమానం ఎగిరింది.

* * *

# యుగసంధ్య

''మన దేశంలో అడుగడుగునా ఇన్ని బాధలూ, ఈ దారిద్ర్యం ఈ అజ్ఞానం, ఉండటానికి మూలకారణం, మనలను విదేశస్థులు పరిపాలించటమే. మనలను మనం పాలించుకునే స్థితి మనకులేకపోవటమే''—అనే మాటలు ముప్పది సంవత్సరాలక్రితం, ఇరవై సంవత్సరాల వయస్సులో ప్రపంచాన్ని అర్థంజేసుకునేందుకు ప్రయత్నిస్తూన్న మొదటి రోజుల్లో శ్రీమతి లక్ష్మికి వినిపించాయి.

ఆమెకేగాదు, ఆనాటి ఆ తరం యువతీ యువకులందరికూ ఈ మాటలు వినిపించాయి. ఎందరెందరో ఎన్నో విధాల చేతనయిన మార్గాలలో కృషి జేసి, దేశాన్ని పరాధీనతనుంచి తప్పించి స్వాతంత్ర్య యుతం గావించారు.

అది సిద్ధించిగూడా ముప్పదేడులుగా వస్తుంది.

ఈ మధ్య కాలంలో దేశపు ఈ కొౌస నుంచి, ఆ కొౌస వరకు శ్రీమతి లక్ష్మి అనేక రాష్ట్రాలు పర్యటించారు. ప్రతి రాష్ట్రింలోనూ, పట్టణాలేగాక పల్లెలు సయితం సందర్శించారు. సాధ్యమైనంత సహృదయంతో పరిస్థితులను అవగాహన జేసుకుంటానికి తాపత్రయ పడ్డారు.

ఒకనాడు దాస్యశృంఖలాలతో క్రమ్గి అన్ని విధాల చితికి పోయిన ఈ దేశాన్ని పునరుజ్జీవింప చేసుకుంటానికీ, పూర్వఔన్నత్యాన్ని తిరిగి లభ్యంచేసు కుంటానికీ, నేడు పరదేశస్థుల ఆటంకాలు ఏమీలేవు. మరి దేశం ప్రగతిపథంలో ఆశించినరీతిలో ప్రయాణించటంలేదే! దేశ ప్రజలు సంతోషంగా జీవించటానికి అవసరమైన కనీస సదుపాయాలు ఇంకా సమకూరలేదే !!

శ్రీమతి లక్ష్మి చాలాసార్లు ప్రపంచాన్ని చుట్టిబెట్టి వచ్చారు. అనేక దేశాలను సందర్శించారు. వివిధ పాలనావ్యవస్థలలో ప్రజల బాగోగులు పరికించారు. యుద్ధకాలంలో సర్వనాశనమైపోయి తిరిగి పుంజుకున్న దేశాల ప్రగతీ చూచారు.

మరి మనదేశం మాటేమిటి?

ఈ సందర్భంగా శ్రీమతి లక్ష్మికిఒక విషయంజ్ఞాపకం వచ్చింది. రామరావణ యుద్ధగాధలో, రావణ వధానంతరం, సీతారాములు ఏక మయ్యారు. యుద్ధ విజయంతో ఉత్సాహంతో కేరింతలు గొడు తూన్న వానరసైన్యం అంతా ఒకచోట గుమిగూడి ఉంది. సుగ్రీవుడు సీతారామ లక్ష్మణులను ఒకవేదికపై సుఖాసీనులనుచేసి, సీతాదేవి అరణ్యంలో అక్కడక్కడా వదలి వెళ్ళిన ఆభరణాలను అస్తార్భతంగా తెచ్చి ఆమెకు అందించాడు. హనుమంతుడు శ్రీ సీతారాముల పాద సన్నిధిన ఆశీనుడై ఉన్నాడు. ఎదురుగా వానరసైన్యమంతా సుగ్రీవుని కనుసైగతో నిశ్శబ్దంగా కూచుండి పోయారు. శ్రీ రాముడు సభా సదులవైపు చూచి, అందరిపై దృష్టి సారించాడు. లక్ష్మణుని పిలిచి, చెవిలో ఏదో ఊదాడు. లక్ష్మణుడు వదినగారి చేతిలోని ఆభరణాల మూటను గ్రహించి, సమీపంలోని ఒక ఎత్తైన రాతి దిన్నెపై కెక్కాడు. చేతిలోని మూటను విప్పి, ఒక్కో ఆభరణాన్ని తీసుకొని, నిశ్చలంగా కూచొనిఉన్న వానరసైన్యం పైకి, విసరటం ఆరం భించాడు.

ఆ క్షణంలోనే ప్రారంభమైంది, వానరులలో సంచలనం. ఒక దాని వెంట ఒకటిగా విసరబడుతూన్న ఆభరణాలను అందుకొని, పొందాలనే తృష్ణలో, వానరులు వారివ్యక్తిత్వాలనే మరచారు. వారి అంతస్థులనూ మరచారు. పెద్ద చిన్న భేదాన్ని మరచారు. ఒకరి నొకరు నెట్టుకుంటూ, త్రోసుకుంటూ ఒకరిపై ఒకరుపడి, కుమ్ము కుంటూ, ధూళిలో పొర్లాడుతూ, ఆ ఆభరణాలను సంగ్రహించ టానికి, కాట్ల కుక్కలాగా ప్రవర్తించారు.

ఈ దృశ్యాన్ని చూచిన, సీతాదేవి రామునివైపు చూచింది. రాముడు ఒక మందహాసం చేశాడు.

మానవ ప్రవృత్తిలో ఆ సంఘటన అతిసహజమైనదే అనే అర్థం శ్రీ రామచంద్రుని మందహాసంలో అర్థమయ్యింది సీతాదేవికి. మన దేశ పరిస్థితులను తలచుకున్నప్పుడు, ఈ దృశ్యమే లక్ష్మి మనో ఫలకంపై మెదలుతుంది.

వాల్మీకి మహర్షి విరచిత రామాయణంలో ఈ వర్ణన ఉందో లేదో విచారించుకోనలేదు గాని, శ్రీమతి లక్ష్మి పుదుచ్చేరిలోని అరవిందాశ్రమాన్ని సందర్శించినప్పుడు, అక్కడ ఆమెకు ఆశ్రమ వాసులు బహూకరించిన పుస్తకాలలో, శ్రీ మాత విరచితమైన ఒక గ్రంథం ఆఖరు పేజీలలో పై సంఘటన అభివర్ణితమై ఉంది.

అప్పటిదాకా, భార్యా బిడ్డలను విస్మరించి, ఇల్లు వాకిల్లూ వదలి, ప్రాణాలను లెక్కజేయక, తాము విశ్వసించిన ఒక ధర్మకార్య నిర్వహణకు, అమేయబలశాలి, అష్టదిక్పాలకులను అదుపులో పెట్టుకొని ఊడిగం చేయించుకుంటూన్న లంకేశ్వరునితో భీకరసగ్రామం జేసిన వానర జాతి, ఆకర్తవ్యం ముగియగానే, అతిస్వల్పమైన బంగారు నగల కొఱకు ఇంతహీనంగా పోట్లాడుకొనడం భావుకులకు నిజంగా నవ్వు తెప్పిస్తుంది. నవ్వుకుంటారుగూడా.

కాని నేటి మన దేశ ప్రజల, ప్రజానాయకుల ప్రవర్తనలు మనకు వెంటనే స్ఫురించి, ఆ నవ్వు మాయమై, మనకు దిగులు కలుగుతుంది. మనలో మనకే జుగుప్స గలుగు తుంది. అసహ్యాత పొటమరిస్తుంది.

స్వాతంత్ర్య సమరకాలంలో, ఎన్నో సంవత్సరాలు ఎన్నో త్యాగాలు జేసిన జాతి, నేడు దేశాన్ని స్వహస్తాలలో అభివృద్ధి చేసుకునే అవకాశాలు లభించినపుడు, మనం పదవుల ఆశతో, ధనార్జనాకాంక్షతో, మనలో మనం ప్రవర్తించుకునే తీరు నిజంగా తల వంపు గలిగిస్తుంది.

ఒకనాడు త్యాగ నిరతితో పునీతమైన మన దేశీయుల హృదయాలు నేడు స్వార్థంతో కల్మషార్ణవమై పోయాయేం ?

కాకలు తీరిన ఒక స్వాతంత్ర్య సమర యోధునితో ప్రసంగ వశాత్తూ శ్రీమతి లక్ష్మి ఈ అభిప్రాయాన్ని వెలుబుచ్చినప్పుడు, ఆయన ఒక చిరు నవ్వు నవ్వాడు.

"లక్ష్మి ! నీవు చెప్పింది అర్థమైంది. నీ మానసిక ఆందోళన సబబైనదే. నీవు తెలిపిన వానరుల ఉపమానమూ సరైనదే, ఈ సందర్భానికి చక్కగా అతికిందిగూడా. అయితే నేను ఒకమాట చెబుతాను" అన్నారు ఆయన.

"ఏ మాట బాబా !" అన్నారు శ్రీమతి లక్ష్మి.

ఆయనంటే లక్ష్మికి మహా గౌరవం. జీవితాన్ని కాచి వడపోసిన మనిషి. తోటి మానవుల కోసరం ఉన్నదంతా పోగొట్టుకున్న మానవుడు. ఏ నాడూ ఏ విధమైన స్వార్థానికి ప్రలోభింపబడనివారు. జీవితపు చరమ అంకంలోగూడా జీవితాన్ని ఇంకా లోతులు తఱచి అర్థం జేసుకోవాలనుకునే నిత్య జిజ్ఞాసి.

"అమ్మా ! ఒక్కటి ఆలోచించు. నీవు ఇందాక చెప్పిన వానరుల భంగపాటు కథలోని, నిగూఢ సత్యం ఎట్లా అర్థమయ్యింది ? నీవు అందులో భాగం గాకుండా, ఒక కథను చదివినట్లుగా చదివి, మూడో మనిషివిగా, ఆ చిత్రాన్ని అందంగా ఊహించుకొన్నందు వల్లనేగదా ?" అని అన్నారు.

"అవునండీ" — అన్నది శ్రీమతి లక్ష్మి.

"అలాగే, మన దేశంలో నేడు జరుగుతూన్న ఈ కశ్మలాల పరిస్థితులను గూడా నీవు సక్రమంగా అర్థం జేసుకొన గలిగిందెందుకో తెలుసునా ? ఈ కశ్మలానికి నీవు తల ఒగ్గక, దూరంగా ఉండటం వల్ల, అంతే గదా! ఇతర దేశ పర్యటనలలో, జీవితాన్ని నిత్యనూతనంగా సందర్శించుకొంటూ నీ దృష్టిని అ మలినంగా ఉంచుకోవటం

వల్లనే, నేడు నీకు ఈ భారత దర్శనం సత్యరూపంలో ప్రత్యక్షమైంది. మరి నీతోటి సోదర ప్రజలకు ఇంకా వారి పరిస్థితి వారికి అర్థంగాలేదు. వారు ఇంకా వారి వారి తాపత్రయంతో కొట్లాటల్లో మునిగి ఉన్నారు. ఒక నాటికి అలుపు వస్తుంది. ధూళి ధూసరితమ్ములైన, శరీరాలు ఒకరివి ఒకరి చూచుకొని, ఎవరివి వారు చూచుకొని ఆ నాటి వానరుల్లాగానే చల్ల బడతారు, శాంతిస్తారు."

"అయితే ఈ పరిస్థితులకు నీవుగా కుంద వలసిన పనిలేదు. ఇది ఒక యుగ సంధ్య. మనుష్యుని జీవితంలోనేగాదు, జాతి జీవితంలో గూడా ఈ యుగ సంధ్యలు వస్తూనే ఉంటాయి. ప్రతి యుగసంధిలో, ఈ లాంటి చెడులు, ప్రకోపిస్తూనే ఉంటాయి - లక్ష్మి'' - అన్నారు ఆయన.

"బాబా - నాకు ఒకటి అనిపిస్తుంది. ఇందాకటి దృశ్యంలో ఆ సీతా రాముల సన్నిధిలో, వానర ప్రభువు ఎంత మాత్రం ఆంక్ష విధించినా, ఆ విధంగా వానరులు స్వార్థానికి తమలో తాము కొట్లా డుకునే వారుగారుగదా అని, అనిపిస్తుంది. ఆ సుగ్రీవ రాజు ఆంక్ష విధించలేదు, సరిగదా, తన సైన్యం చేస్తున్న పనిని చూస్తూ ఆయనా, ఉత్సాహంతో గంతు లేశాట్ట, ఎగిరెగిరి పడ్డాడట. కుప్పి గంతులు వేశాడట సంతోషంతో.'' అని అన్నారు శ్రీమతి లక్ష్మి.

వారు ఫక్కున నవ్వారు. లక్ష్మి వారివైపు చూచింది. "నిజమే లక్ష్మి! సుగ్రీవుని మానసిక స్థితే అది. అది గమనించే అతని సైన్యం ప్రవర్తించింది. మనపాలకులుగూడా ఆనాటి సుగ్రీవునిలాగానే వానర మూకలసైన్య ప్రవర్తనకు సంబర పడ్డారంటావ్! అవునా లక్ష్మి" అని మరల నవ్వారు.

"ఈ పరిస్థితి గూడా ఎక్కువసేపు సాగదు. కొద్దికాలంలో మారుతుంది. సభికులందరి ప్రవర్తనా జుగుప్సాకరంగా, హేయంగా మారిన మరుక్షణం సభాపతే తన కంచు చమకాన్ని ఝళిపించి, క్రమ

శిశుణను శాసిస్తాడు. ఒక్క కేకతో సభా స్థలంమంతా నిశ్శబ్దమౌతుంది. అరాజకం సమసిపోతుంది. ఎవరి స్థానాల్లోవారు కూర్చొని, వారివారి వంటికి అంటిన ధూళిని త్వరత్వరగా దులుపుకొని తిరిగి సభ్య సదస్సుల జాబితాలోనికి తొలిగా ఎక్కాలని ప్రయత్నంచేస్తారు ఎవరికివారు. అప్పటికి జాతిలో చంచలత్వం పోయి నిశ్చలత సంప్రాప్తమౌతుంది. మరల ఆదర్శాలు ప్రభావితాలౌతాయి. జాతిజీవనాన్ని సరిదిద్దుతాయిలే."

'ప్రస్తుతానికి యుగసంధ్య—అన్నమాట' అనుకున్నారు శ్రీమతి లక్ష్మి.

# బాల్టిక్ సముద్రరాజతనయ

ఫిన్లెండును, "బాల్టిక్ సముద్రరాజతనయ"గా అభివర్ణించ వచ్చు. బాల్టిక్ సముద్ర గర్భంనుంచి ఈ జీవిగడ్డ ఉద్భవించి నట్టుగా విమానంనుంచి చూస్తే స్ఫురించటమే ఇందుకు కారణం.

శ్రీమతి లక్ష్మి, ఒక అంతర్జాతీయ మహిళా సదస్సులో ఫింన్లెండు ప్రతినిధి వర్గనాయకురాలిని, వారి మహిళా విముక్తి ఉద్యమ ప్రగతిఏమిటని అడిగారు.

ప్రక్కనే ఉన్న జర్మను ప్రతినిధి వర్గనాయకురాలు, నవ్వుతూ, "ఫిన్లెండులో మహిళా విముక్తి ఉద్యమం గురించిగాదు, మనం తెలుసుకోవలసింది, పురుషుల విముక్తి ఉద్యమం గురించే తెలుసు కోవాలి !" అన్నది.

హాస్యంగా అన్నప్పటికీ, ఆమాటనిజమే, అక్కడి స్త్రీలు సమాజజీవితంలో కావలసిన హక్కులన్నీ సముపార్జించుకున్నారు. ప్రధానంగా, ఆస్తి హక్కులు, వారసత్వం, ఆర్థిక స్వేచ్ఛ, ఇత్యాదు లన్నీ అనుభవంలోనికి తెచ్చుకున్నారు.

భార్య విడాకులు అడిగితే, ఒక సంవత్సరంపాటు విడిగా ఉంటున్నామని రుజువయితే విడాకులు వెంటనే లభ్యమౌతాయి. అదే పురుషుడు అడిగితే విడాకులు లభించేప్పటికి ఆతని తలప్రాణం తోకకువస్తుంది. పురుషులపట్ల విడాకుల షరతులుగూడా కఠినంగానే ఉంటాయి. సమానమైనపనికి సమానమైన వేతనం పురుషులలో సమానంగా పొందుతున్నారు.

వయో వృద్ధులకు ఫిన్లెండులో అన్ని సౌకర్యాలతో ఎన్నో గృహాలు నెలకొల్పారు. ముదిమి వయస్సులో నిశ్చింతగా ఇక్కడ స్త్రీ పురుషులు తమ జీవిత చరమ భాగాన్ని గడుపుకుంటారు.

అవివాహితలైన తల్లులు ఈదేశంలో లక్ష్మికి ఎక్కువగానే గన్పించారు. కాని వారిని సంఘంగానీ, ప్రభుత్వంగానీ, ప్రత్యేకంగా పరిగణించరు. అందరు తల్లుల లాగానే సహజంగానే వారు గౌరవ మర్యాదలతోనే చూడబడతారు.

ఫింన్లెండు దేశ స్త్రీలు, ఇతర స్కాండినేవియన్ దేశాలస్త్రీల లాగానే, తమవ్యక్తిత్వాన్ని, సమాజంలో తమ స్థానాన్ని ఎల్లపుడూ గుర్తుకుతెచ్చుకుంటూరు. స్త్రీ పురుషునకు నీడగా ఉండటం ఎంత మాత్రం వాంఛించరు.

శ్రీమతి లక్ష్మితో జరిపిన ప్రత్యేక మహిళా పత్రికా విలేఖరి ఇంటర్వ్యూ ముగిసినతదుపరి, ఆమెతో మామూలు పిచ్చాపాటీ మాట్లాడుకున్నపుడు, ఈధోరణే బయటపడింది.

''మదాం లక్ష్మి! మాదేశంలో స్త్రీల ఆలోచనలు కొంచెం మీకు వింతగానే ఉంటాయేమో——'' అని, కొంచెమాగి మరల.

"సరిక్రొత్తగా మా మహిళలు, వారిపేరు ముందుగా, మిసెస్ అని పిలువ బడటానికి వ్యతిరేకత చూపిస్తున్నారు. మిసెస్ అనంగానే వివాహిత స్త్రీగా అర్థమౌతుంది గదా! వివాహంగాని స్త్రీకి, మిస్ అంటుంన్నారు గదా! మరి పురుషుడు, అతను వివాహితుడైనా అవివాహితుడైనా, ఒక్క మిష్టర్‌తో సరిపుచ్చుకోవడం లేదా?

"అలాగే మేముగూడా మాపేరు ముందు పెండ్లిగానీ గాక పోనీ, ఒట్టి 'మిస్' అనే పదమే ఉపయోగించాలని కోరుకుంటు న్నాము" అని విలేఖరి అన్నది.

"అసలు మాకు పెండ్లి అయిందీ కానిదీ తెలుసుకోవలసిన అవ సరం ఎవరికైనా ఏముంది? "అనిగూడా సూటిగా ప్రశ్నించింది.

'నిజమే' ననిపించింది శ్రీమతి లక్ష్మికి వారు అడిగేదానిలో తప్పేమీ లేదనీ అనిపించింది.

స్వీడన్, డెన్మార్కు దేశాలలో స్త్రీలు, వారి భర్తల పేర్లు వారి పేర్లకు తగిలించుకోరు. తల్లుల పేర్లు కలుపుకుంటారు. మరల తండ్రుల పేర్లు వారి పేర్లతో జోడింపబడటానికి గూడా చాలా విముఖులు.

ఫిన్లెండులో స్త్రీల పేర్లకు తల్లులపేర్లు కలుపు కునేందుకు చట్టం తయారయిందిగూడా.

ప్రస్తుతం ఫిన్లెండు దేశపు విద్యావిధానము సంపూర్ణంగా మార్పులకులోనవ బోతుంది. ఈదేశపు యువ విద్యార్థినులతో లక్ష్మి వివిధ సందర్భాలలో ప్రసంగించినపుడు వారి తీవ్ర ఆలోచనాధోరణికి, ఆవేగానికి ఆశ్చర్యపోయింది.

ఒక యూనివర్సిటీ హాస్టలులో కొందరు విద్యార్థినులను కలుసుకోవాలని ఉంది అన్న ఈమె కోరికను అనుసరించి, ఈమె మిత్రులు ఒక ఇష్టాగోష్టి సమావేశం ఏర్పాటుచేశారు. వివిధ కాలేజీలకు చెందిన విద్యార్థినులు ఒక యాభై మందితో జరిగిన ఈసమావేశంలో, ఆ యువతుల అభిప్రాయాలు విని, భావాల సరళి ఆకళింపు చేసుకున్నాక, మన దేశపు చదువుకున్నామని అనుకుంటున్న ఆడపిల్లల ఆలోచనలు ఎంత వెనుకబడి ఉన్నాయో అనిపించింది. ప్రపంచదేశాల మహిళా ఉద్యమాలు పెక్కింటితో సంబంధముండి, ఎన్నోదేశాలు, ఒకటికి రెండు సార్లు గూడా తిరిగి మహిళా ఉద్యమ ప్రగతిని తీవ్రంగా కాంక్షిస్తున్న లక్ష్మికి, "నేనే వెనక పడ్డానా?" అనిపించింది ఈ యువతుల భావావేశం చూచాక.

అయితే ఇందులో తమంటే తమకు గర్వం లేదు. పురుషులంటే ద్వేషమూ లేదు. కొన్ని అభిప్రాయాలు చాలా సింపుల్ గా బయట పెట్టారు. ఈ ప్రభావం నార్వే స్వీడన్ డిన్మార్కులలో గూడా బాగానే ప్రాకింది.

అసలు, బాల్యమాది విద్యావిధానంలోనే తీవ్ర మార్పులు రావాలంటున్నారు. స్త్రీలకన్నా పురుషులు అధికులు అనే భావన

ఉగ్గుబాలతోనే, విద్యావిధానంలో కలిపి రంగరించి, సమాజాన్ని తయారు చేస్తున్నారనీ, ఫలితంగా, పురుషులు నిజంగానే గొప్ప వారమనుకుంటున్నారనీ, స్త్రీలు సహజంగా తక్కువవారమే నేమో నని అనుకుంటానికి అలవాటు పడ్డారనీ, ఇది ప్రపంచ వ్యాప్తంగా ఉన్న లోపభూయిష్ట విద్యావిధానమేననీ, దీనిని మాఫిన్లెండు దేశంలో ఇక సాగ నివ్వమనీ, బూజుపట్టిన ఈపురాతన ఛాందస భావాలవల్ల స్త్రీ లోకమేగాక, సమాజం మొత్తం నష్టపడుతుందనీ, ఆ అమ్మాయిలు వాదించారు. ఆంగ్లభాష వచ్చిన యిద్దరు యువతులు ఈ సమావేశంలో, వీరి సంభాషణలకు దుబాసీలుగా ఉన్నారు.

సన్నగా పొడవుగా ఉండి, అందంగా తన కురులను ముడుచుకున్న ఒక న్యాయశాస్త్రంలో పి.హెచ్.డి, చేస్తున్నయువతి, లేచి.

"Madam Lakshmi, please look here, అసలు ఈ తల్లిదండ్రుల పెంపకంలో గూడా ఈ విచక్షణే కనుపడుతుంది'' అన్నది.

ఎలాగో వివరించమని శ్రీమతి లక్ష్మి కోరింది.

''చూడండి. తల్లి దండ్రులు పిల్లలకు ఆట వస్తువులు కొని తెచ్చేప్పుడుగూడా ఆడపిల్లలకూ మగపిల్లలకూ తేడాచూపిస్తారు. మగ పిల్లలకు, విమానాలు, టాంకులు, వగైరా బహుకరిస్తూ, ఆడ పిల్లలకు, రబ్బరు బొమ్మలు, రంకులరాటాలు, 'కుయ్ కుయ్' అని మ్రోగే కుక్క పిల్లలనూ, పిచ్చుక బొమ్మలనూ, బహుమతి చేస్తారు. ఇదిగూడా అనార్థాలలో ఒకటి అని అంటాను నేను. అసలు సమాజ దృష్టిలోనే ఈమార్పురావాలండీ" అని అన్నది ఆఅమ్మాయి కొంచెం యాస కలిసిన ఇంగ్లీషులో. శ్రీమతి లక్ష్మికి నవ్వు వచ్చింది

ఈ సోదరి చెప్పిందిగూడా నిజమే. తల్లిదండ్రులు అన్ని దేశాలలో చేస్తూన్న పనేయిది. వాళ్లదృష్టిని ముందు మరమ్మతు చేయాలంటున్నారు ఈ వనితలు.

మరో అమ్మాయి సోషల్‌వర్కు విద్యార్థిని. ఆమె లేచింది. కొంచెం నెమ్మదిగా మాట్లాడే స్వభావం.

"మదాం, అసలు దుస్తులలోగూడా మార్పురావాలని మేము కోరుకుంటున్నాము. స్త్రీకి ప్రత్యేకం దుస్తులు ఎందుకుండాలి." అని ప్రశ్నించింది ?

"ఎవరు ఉంచుకోమన్నారు? మనమే కావాలనుకుని ప్రత్యేక దుస్తులు వాడుకుంటున్నాము" సమాధానం చెప్పింది శ్రీమతి లక్ష్మి.

"అది నిజంగాదు మాడం! మొదట స్త్రీల దుస్తులు ఒకరకంగా ఉండాలి. పురుషుల దుస్తులు మరొక రకంగా ఉండాలని నిర్ణయించింది పురుషులే. ఆ దృష్టికి అలవాటుపడిన స్త్రీజాతి తమ పరిధిలో ఏదో ఫాపన్ల పేరిట కొద్దోగొప్పో మార్పులు చేసుకుంటున్నారు.

"కాని మేము అసలు ఈ విధానానికే వ్యతిరేకులం. స్త్రీలు పురుషులలాగే పాంట్లు, షర్ట్సు ధరిస్తే ఏం మునిగిపోతుందట? ఫ్రీగానూ ఉంటాయి, ఖర్చులూచాలా కలిసి వస్తాయి." అన్నది ఈ యువతి.

అదీ శ్రీమతి లక్ష్మికి బాగానేఉంది! అతివేగంగా మారే ప్రపంచంలో, ఫలానా దుస్తులు మాత్రమే ధరించాలని ఎక్కడ రాసిపెట్టిఉంది? అటు పురుషుల దుస్తులలోగానీ, ఇటు స్త్రీల దుస్తులలోగానీ, ఈ అమ్మాయి అన్నట్లు ఫ్యాషన్ల పేరిట రోజూ మార్పులు జరుగుతూనే ఉన్నాయిగదా! ఇదీ అలాంటిదే! మార్పుల్లో ఇదొక మార్పు అనుకుంది శ్రీమతి లక్ష్మి.

* * *

(UNIONEN) - 'యునిటనెన్' ఫిన్లెండు దేశపు మహిళా సంస్థ. భారతదేశంలోని, 'అఖిలభారత మహిళా మహాసభ' లాంటి సంస్థ. ఈ సంస్థతోనే శ్రీమతి లక్ష్మికి అనుబంధముంది.

వారి ఆహ్వానంపైననే ఈమె ఫిన్లెండు పర్యటనకు వచ్చారు, ఈ 'యునిటనెన్' సంస్థ చరిత్ర ఆధునిక ఫిన్లెండు దేశచరిత్రతో

ముడిపడి ఉన్నది. ఆదేశ ప్రగతిలాగానే, ఈ మహిళా సంస్థ అభ్యుదయాన్ని సాధించింది.

1892 సంవత్సరంలో ఉద్భవించిన ఈ మహిళా సంస్థ క్రమ ప్రగతిని సాధించి, 1917 లో సర్వసత్తాక స్వతంత్ర ప్రభుత్వం ఫిన్లెండులో ఏర్పడిన తదుపరి, ఈ సంస్థగూడా, దేశీయ మహిళా సమాజాన్ని తీర్చిదిద్దే మహాసంస్థగా ప్రభవిల్లింది.

దాదాపు అన్ని రంగాలలో స్త్రీలు ప్రధానంగా వాంఛించిన హక్కులు సాధించారు. ప్రస్తుతం మతపరంగాగూడా వారు సమాన హక్కులు కోరుతున్నారు. మతాధిపత్యంలోనూ, పూజారివర్గంలోనూ సమాన ప్రాతినిధ్యం గావాలంటున్నారు.

స్త్రీ పూజారి లభ్యంగానందున, స్వీడన్ నుంచి, పట్టుబట్టి ప్రత్యేకంగా స్త్రీ మతాధికారిని పిలుపించుకొని, ఖనన కర్మలను జరుపుతున్నారు.

ఈ దేశంలో యాచకులు మచ్చుకైనా కనపడరు.

* * *

ఈ దేశపు అద్భుతం ఏమిటంటే, ఉత్తర ఫిన్లెండు ప్రాంతంలో వేసవి సూర్యుడు 73 రోజులవరకు క్షితిజ రేఖనుదాటి అస్తమించడు. అంటే అక్కడ సూర్యకాంతిలోనే 73 దివారాత్రాలు గడుస్తాయన్న మాట.

అర్ధరాత్రిళ్లు సూర్యదర్శనం గావడం, విదేశీ యాత్రీకులకు అబ్బురమే గలిగిస్తుంది. ఫిన్నిష్ ప్రజలు, ప్రతి సంవత్సరం, జూన్ 22-28 తేదీల మధ్య ఒక శనివారంనాడు "Mid Summer light night Festival" ఉత్సవం జరుపుకుంటారు.

అలాగే, ఈ ఉత్తరప్రాంత ఫిన్నియులు, శీతాకాలంలో, ఒక సుదీర్ఘరాత్రినిగూడా అనుభవిస్తారు. ఆ పగలంత దీర్ఘంగానే ఈ రాత్రి ఉంటుంది. ఈ రాత్రిని వారు 'QAMOOS' అనిపిలుస్తారు.

కనకనే ఫిన్నులు ఆదికాలంనుంచీ సూర్యుని ఎంతో ఉత్సాహంగా ప్రార్థిస్తారు.

ఐరోపాఖండంలోని పెద్ద దేశాలలో ఒకటైన ఫిన్లెండు, సహజ సౌందర్యం ఎంత మాత్రం చెడకుండా పారిశ్రామికంగా పెరిగిన ఈ దేశం, ఐరోపాఖండంలో పచ్చ చీరెను గట్టిన పసిడి బొమ్మగా గన్పిస్తుంది. దాదాపు సగ భాగం సముద్ర తీరప్రాంతమే, అయినా, 60 వేల సరస్సులు ఈ దేశంలో ఉన్నాయి.

ఆధునికంగా నిర్మాణంగావించబడి, అందంగా తీర్చిదిద్దబడ్డ హెల్సింకీ పట్టణం ఈ దేశపు రాజధాని. పూర్వకాలంలో రాజధానిగా ఉన్న 'తుర్కు' పట్టణానికి ఇప్పుడు అనేక ఆకర్షణలు, గలిపించి, యాత్రా కేంద్రంగా రూపొందించారు.

జనసాంద్రత అతి తక్కువగా ఉండి, యాభయి లక్షలు మాత్రమే ఉన్న జనాభాతో, ఫిన్లెండు చాలా అభివృద్ధి సాధించింది. ప్రజల జీవితం ప్రశాంతంగా ఉంది. ప్రపంచ స్త్రీలందరికన్నా ఫిన్లెండు స్త్రీలు అన్ని విధాలా చాలా ముందున్నారు. వస్తుతః ఫిన్నులు స్వేచ్ఛాప్రియులు. వారు శుభ్రమైన స్వేచ్ఛావాయువులను పీలుస్తున్నారు.

# గ్రీకు - పర్యటన

గ్రీసు దేశమనంగానే మనస్సు సహజంగా చరిత్ర పుటలలోనికి వేగంగా పరువులెడుతుంది. అదేసరిగ్గా శ్రీమతి లక్ష్మికి అనుభవంలోనికి వచ్చింది ఆదేశంలో పర్యటిస్తున్నప్పుడు.

మానవ విజ్ఞాన నాగరికతలు ఉన్నతమైనతంగా వెల్లివిరిసిన మానవ చరిత్ర అధ్యాయాలలో గ్రీసు దేశపుకథ అత్యంత ప్రాముఖ్యమైనదీ విలువైనదీను, అని ఆమె అనుకున్నారు.

శిల్పం, చిత్రలేఖనం, సాహిత్యం, గణితశాస్త్రం, వైద్య శాస్త్రం, శాస్త్రీయ రాజకీయాల ఆవిష్కరణ, భూగోళశాస్త్రం లాంటి ఎన్నో విజ్ఞానశాస్త్రాలు, ఈ గ్రీసుల గడ్డపై వెల్లివిరిశాయి. మానవ మేధస్సుకు చురుకైన పదును బెట్టగల ఎన్నో విశిష్ట రచనలు ఈ నేలపై సాగాయి. ఇదేనేల ప్రపంచానికి వైజ్ఞానిక పీఠంగా ప్రభాసించింది 2500 సంవత్సరాలకుముందే. శూరత్వంలోనూ, యుద్ధ నైపుణ్యంలోనూ యుద్ధ నీతిలోనూ గ్రీకులకు ప్రముఖమైన చరిత్ర ఉంది.

శ్రీమతి లక్ష్మి గ్రీసు దేశం జేరుకున్నాక ప్రథమంగా ఈమె మనస్సునకు తలపుకు వచ్చిందెి. అలగ్జాండర్. దానికీ కారణముందను కొంటాను. ఆగ్నేయ ఆశియానుంచి, దాదాపు నైఋతీ ఐరోపాకు ప్రయాణించిన ఈమెకు, తన మాతృ దేశానికీ, తానుదిగిన ఈ గ్రీకు దేశానికి చారిత్రకపరంగా ఉన్న సంబంధం ఏమిటా అనేది సహజంగా ఈమెకు రావలసియున్న ఆలోచనే. అదే ఆమెకు వచ్చింది గూడాను.

ఆ ఆలోచనే అలెగ్జాండర్ ది గ్రేట్ వరకు వెళ్లి ఆగింది. చిన్నాభిన్నమై నిత్యం పోరాటాలతో ముక్కు వరకూ మునిగిఉన్న గ్రీసు

దేశాన్ని ఏకంజేసిన అలెగ్జాండరు ఏసియామైనసారవం జేసుకొని, పర్షియన్ సామ్రాజ్యాన్ని కైవశం గావించుకొన్నాడు. ఆయన విజయ తృష్ణకు, ఈ ప్రపంచమే చాలా చిన్నదిగా స్ఫురించింది. అప్పటికే రత్నగర్భగా విశ్వ విఖ్యాతినొంది, గంగా సింధు నాగరికత లలో ఉజ్వల స్థితిలో విలసిల్లుతూన్నభారతదేశంపైకి అలగ్జాండరు చూపు మళ్ళింది. పంజాబులోని జీలం నదీతీరాన, మహారాజు, తలవంచని మహావీరుడు పురుషోత్తమునితో (పౌరష్) సంకుల సమరంసాగించాడు.

అదీ గ్రీకు దేశానికి భారతదేశానికీ ఉన్న ప్రత్యక్ష సంబంధం. చిన్నప్పుడు లక్ష్మి తన పాఠ్య పుస్తకాలద్వారానే, అలెగ్జాండరు చాలా గొప్ప వీరుడని తెలుసుకున్నది.

దానితోపాటే మంచి మనిషిగా గూడా ఆరోజుల్లోనే స్ఫురించింది.

ఒక రోజు ఆపాఠమే చదువుతూన్న లక్ష్మి, తండ్రి వెంకటేశం గారితో.

"నాన్నగారూ, అలెగ్జాండరు ఎంత వీరుడో అంత గొప్పవాడుగా నాకు అనుపిస్తుందండీ" అని అన్నది. సబ్ కల్టరీ ఉద్యోగంలో ఫైల్సు చూచుకుంటున్న వెంకటేశంగారు, తల పైకెత్తి ఒకసారి కూతురికేసి చూచి, "ఏమిటన్నావ్ పెద్దమ్మాయి! అలెగ్జాండరును గురించిగదూ! అవునమ్మా! అతను గొప్ప వీరుడు" అంటూ 'వీరుడు' మాటకు 'గొప్ప' మాటను కలిపారు.

లక్ష్మికి అర్థమైంది.

అదికాదు నాన్నగారూ, ఆయన గొప్పవీరుడేగాదు, గొప్ప మనిషి గూడా అని నా అభిప్రాయం." అని మరల పలికింది లక్ష్మి.

చేతులోని ఫైలు కొంచెం ఆవలికి నెట్టి వెంకటేశంగారు కుర్చీలో మేను వెనక్కువ్రాల్చి, సాలోచనగాచూచి. "ఏందుకంటావ్

లక్ష్మి" అని అన్నారు. ఆయనకు బిడ్డల విజ్ఞాన తృష్ణ పెంచడమెంతో ఇష్టం.

"యుద్ధంలో గెలిచె! విజయాన్ని చేపట్టె !! పురుషోత్తముడు తన ఎదుట తల వంచనని స్వయంగానే చెప్పె !! అయినా, ఆ మహా రాజు పరాక్రమాన్ని గుర్తించి గౌరవించటం, ఆయన స్వాభి మానాన్ని హర్షించటం గొప్ప పనిగాదా నాన్నగారూ ? గెలుచుకున్న రాజ్యాన్ని తిరిగి పురుషోత్తమునకు ఇచ్చి, తన దారిన తాను తన దేశానికి మరలి పోవటంగూడా గొప్పతనంగాదా నాన్న గారూ !" అడిగింది కూతురు లక్ష్మి.

"అవునమ్మా ! అదిగూడా గొప్పతనమే తల్లీ" - అని అన్నారు వెంకటేశంగారు.

తుదివరి, ఎప్పుడన్నా అలెగ్జాండరు గుర్తుకొచ్చినప్పుడు ఎందుకు ఆయన ఇన్ని యుద్ధాలు చేసినట్లు ? ఇంత జన నష్టం గలి గించినట్లు అని ప్రశ్నించుకోబుద్ధయ్యేది లక్ష్మికి.

మగధ సామ్రాజ్య సైనిక పాటవాన్ని గుర్తించో, లేక, అప్పటికే దీర్ఘకాల యుద్ధాల ద్వారా విసగి వేసారిన తన సైన్యపు విముఖతనుగమనించో, స్వదేశోన్ముఖుడై, తన గడ్డకు జేర కండానే, బాబిలోన్‌లో తన 33వ ఏట మరణించాడు అలెగ్జాండర్.

'మరిఏమి సాధించినట్లూ అలెగ్జాండర్' అని ఆలోచించేది లక్ష్మి ఆ వయస్సులోనే. దానికి సమాధానం వచ్చేదిగాదు.

తాను పోరాడి విజయాలు సాధించిన, పరిషియా తన అనం తరమే తిరిగి స్వతంత్రమయింది. ఏషియా మైనరూ పోయింది. కడకు తాను కష్టించి గ్రీసు దేశంలో సాధించిన సమైక్యత గూడా విచ్ఛిన్నమైంది.

అయితే తన తర్వాత వచ్చిన పరిణామాలకు అతడు బాధ్యుడు గాదనేదీ గూడా సత్యమే ! అతను మాత్రము వీరుడనేదీ

అంత సత్యమే !! ఒక మహా సామ్రాజ్యాన్ని తాను సంస్థాపించాలనే కోరికతో దీర్ఘమైన పోరాటాలకుద్యమించి, చేపట్టిన సంగ్రామంలో నెల్లా విజయుడయ్యాడు.

అందుకనే 'లక్ష్మి' కి ఆ రోజుల్లోనే అలెగ్జాండర్ గొప్ప వీరుడు గానే గాక గొప్ప మనిషిగా గూడా అర్థమయ్యేవాడు.

* * *

ఏమంత వాంఛనీయంగాని ఈ యుద్ధకాండను తొలగిస్తే గ్రీసుదేశంలో ఈమె మనోనేత్రానికి ఎన్నో అద్భుతాలు గోచరమైనాయి.

ప్రథమంగా గ్రీకు పురాణ మహా పండితుడు 'హోమర్' జ్ఞాపకానికొచ్చాడు. ఆయన కృతి 'ఇలియడ్' జ్ఞాపకం వచ్చింది. 'ఒడస్సీ' జ్ఞాప కానికొచ్చింది. కాలగమనంలో శతాబ్దాలు గడిచినా ఈ అద్భుత కావ్యాలలోని రససంపద బిందు మాత్రంతగ్గలేదు. ట్రాయ్ రాజ్యపతనం, హెలెన్‌రాణి వశీకరణ గాథలు రసపుష్టితో నిండిన అద్భుత వర్ణనాగాథలు.

సుప్రసిద్ధనాటక వాఙ్మయకర్తలు 'ఎశ్కూల్యలస్' (Aeschylus) 'సోఫోక్లస్' (Sophocles) 'యూరిపెడస్' (Euripedas) గ్రీకునాటక రంగంలో వినూత్న జీవితాన్ని ఆవిష్కరించిన మహాభావుకులు. ప్రపంచ నాటకరంగానికి వైతాళికులు.

శిల్పవిజ్ఞానంలో గ్రీకుదేశం సాధించిన ఘనతే ప్రపంచ చరిత్రలో ఆ దేశానికి గౌరవ పీఠం లభింపజేస్తుంది. అయితే చిత్రలేఖనంలో ఆ దేశపు చిత్రకారులకుంచెల నైపుణ్యంగూడా శిల్పం సాధించిన గౌరవాన్నిమించి గ్రీకును మరొకమెట్టు ఉన్నతపీఠంపైనే నిలుపుతుంది, అనిఅంటారు శ్రీమతి లక్ష్మి. ఇదిఎంతో నిజంగూడా.

ఐరోపీయ సాహిత్యంలో ప్రథమంగా గ్రీకు రచయితల చేతుల్లోనే నాటకాలు రూపకల్పనచేసుకున్నాయి. విషాదాంతాలూ,

హాస్యాంతాలు రెండూగూడా ఆ మొదటి రోజుల్లోనే చోటుచేసు కున్నాయి.

విశ్వవిఖ్యాత రచయిత్రి 'సాఫో' (Sapho) క్రీస్తుకుపూర్వం ఆరవ శతాబ్దంలో ప్రముఖరచనలు సాగించిందని జ్ఞాపకంవచ్చినపుడు ఆనందం గలుగుతుంది. బహుశా ఐరోపీయ సాహిత్య ప్రపంచంలో గణనీయమైన స్థానం లభ్దినొందింది ఈప్రథమ స్త్రీయేనని లక్ష్మి గర్వపడతారు.

తర్కాన్ని వాదనలోనింపి, ఆత్మజ్ఞానాన్ని పరిశీలించి ప్రజలనూ, ప్రభువులనూ, సత్యాన్వేషణకై ప్రశ్నించిన సోక్రటీస్ తన శత్రువులు తనమరణాన్నికోరి విషపాత్ర అందించినా, తనునమ్మిన సత్యసిద్ధాంతాలకోసరం, ఆ విషపాత్రనే మధుపాత్రగా స్వీకరించి అసువులుబాసిన విషయం జ్ఞాపకంవచ్చి, ఆమహాశయునకు స్తుతులందజేస్తాము. "ఏథెన్సు యువకుల మనస్సును పాడుజేస్తున్నాడనేది ఆయనపై అభియోగం. ఎంతహాస్యాస్పదం" అనుకొంది లక్ష్మి.

స్వార్థానికీ మౌఢ్యానికిజ్ఞానం బలియై పోతూనే ఉంటోంది. యుగయుగాల జాడ్యంఇది. అయినా జ్ఞానం పునఃపుంజుకొని, తన దారిని అదినడకసాగిస్తూనే ఉంటోంది. మరికొంచెం తేజోవంతంగా గూడా ప్రకాశిస్తుంది. మానవచరిత్రలో మనకు ద్యోతకమయ్యేది కూడా ఇదే.

సోక్రటీస్ కథ చూస్తే సత్యపురుషులకు వధ్యప్రాప్తి, క్రీస్తుకు శిలువ వెయ్యటంతోనేగాదు ప్రారంభమైంది, అంతకు ముందునుంచే మానవ చరిత్రలో ఉన్నదనేది మనకు స్పష్టమౌతుంది.

గ్రీకు దేశంలో ఉండి, మనస్సును చరిత్రపుటల్లోకి జొనిపిన శ్రీమతి లక్ష్మికి, సోక్రటీస్ హత్యగావించబడిన తదుపరి ఆయన శిష్యుడు ప్లేటో మనస్సులో మెదిలాడు. తనగురువు మరణానంతరం 12 సంవత్సరాలు, దేశాన్నివీడి, పలుప్రాంతాలలో సంచరించి ప్లేటో

రచించిన 26 వ్యాసాలసంపుటి జ్ఞాపకం వచ్చింది. ఈ వ్యాసాలన్నీ సంభాషణల రూపంలో ఉన్నాయి.

"ఆదర్శ సమాజం" ఎలా ఉండాలో, అందులో వ్యక్తి జీవితం పవిత్రంగా, ఒక క్రమబద్ధంగా నిర్వహించుకోవాలో ఊహాభావనలతో రచించిన ఈగ్రంథం,'ప్లేటోస్ రిపబ్లిక్'గా ప్రపంచ ప్రసిద్ధిపొందింది. ప్రతి రాజకీయ విద్యార్థి విధిగా చదువుకోన వలసిన గ్రంథంగా రూపొందింది.

"నేటి సాంఘిక రాజకీయ రుగ్మతలన్నింటికీ విరుగుడునీచేతి లోనే ఉంది. అదిఏదో తెలుసుకొని,లక్షించి, దాన్నిసాధించుకొనుట లోనే ఈబాధలనివారణ ఉంది." అని ఒకచోట అంటాడు ప్లేటో.

'తాత్త్వికచింతన గలవారే ప్రభుత్వపాలకులుగా అర్హులు అనికూడా అంటాడు''ప్లేటో, ఎంతనిజం !" అని అనుకొన్నది లక్ష్మి. ప్లేటో తదుపరి మనకు జ్ఞాపకంవచ్చేది, ఈయన శిష్యుడు అరిస్టోటిల్ రాజకీయ శాస్త్రాన్ని ప్రథమంగా రూపకల్పనజేసిన మేధావి ఈయనే చరిత్రశాస్త్రానికి మొదట రచయితా ఈయనే. ఈయన అనేక రంగాలలో ఎంతో కృషిజేసి విజ్ఞానాన్ని ప్రోగుచేశాడు. ఒకక్రమ పద్ధతిలో వాటికి స్వరూపాన్ని గల్పించాడు. ఈయన శిష్యులు 158 దేశాల రాజ్యాంగ విధానాలను అధ్యయనంజేసి, ఒక దానితో ఒకటి పోల్చిచూచుకున్నారని గుర్తుకు రాగానే ఈ జ్ఞానతృష్ణ ఎంతటిదోకూడా శ్రీమతిలక్ష్మికి అవగాహన అయింది.

ఈజిప్టు బాబిలోన్ ప్రాంతీయులలో చాలామంది గ్రీకులు, సంఖ్యాశాస్త్రంలో కృషిజేసి, సంఖ్యలకు రూపంఏర్పాటు చేశారనేది కూడామనసుకు తోస్తుంది. ఆధునిక మానవ జీవితంలో, గణితాని కున్న ప్రాముఖ్యం, ఈనాడు అది కంప్యూటర్ల సహాయంతో మాత్రమే మానవ మేధస్సు వేగాన్ని అందుకోగల్గుతున్న యదార్థం గమనానికొచ్చినపుడు, ఈసంఖ్యలను ప్రారంభించిన ఆ గ్రీకుమేధావులూ మన మనసుల్లోకి వస్తారు. వారి విజ్ఞాన పరిశ్రమ, శోధన మనకు అవగతమౌతాయి.

ఈ గణిత శాస్త్రంలోనే, చిరస్థాయిగా నిలిచే పైథాగరస్, ఆర్కిమిడిస్, యూక్లిడ్‌లు ముగ్గురూ మనకు జ్ఞాపకం వస్తారు. ఈ యూక్లిడ్ రాసిన ఎలిమెంట్స్ (Elements) అనే పుస్తకం ప్రపంచంలోని అన్ని దేశాలలో గత 2000 సంవత్సరాల నుంచి, స్టాండర్డు పాఠ్యగ్రంథంగా, విద్యార్థులచేత అధ్యయనం చేయబడుతుంది.

అలాగే వైద్యశాస్త్రంలో సయితం ప్రపంచ ప్రసిద్ధిపొంది ప్రజలకు వైద్యవిజ్ఞాన భిక్షపెట్టిన హిపోక్రేట్స్ (Hippocrates) కూడా గ్రీకు మేధావేనని జ్ఞాపకానికి తెచ్చుకున్నారు శ్రీమతిలక్ష్మి. గ్రీకు దేశసంచారంలో, ప్రతిపట్టణంలో ఏదోప్రత్యేకత ఉందన్నట్లు స్ఫురించింది ఆమెకు. ప్రతివ్యక్తిలో ఏదో ఒక విశిష్టత ఉందన్నట్లు గోచరించింది శ్రీమతిలక్ష్మికి.

ఏ ప్రత్యేకత విశిష్టతలు లేనిదే ఈ చిన్నదేశంలో అందరు మహామేధావులు ఎలా ఉద్భవించారు ? అనికూడా ప్రశ్నించుకుంది శ్రీమతి లక్ష్మి.

సోక్రటీస్, ప్లేటో, ఆరిస్టాటిల్ ఆదిగాగల మహనీయులు ఉద్భవించిన ఈ ప్రాచీన గ్రీకు దేశం ప్రపంచ మానవ విజ్ఞాన నాగరికతల వికాసానికి ఎంతగా తోడ్పడింది అర్థంచేసుకున్న శ్రీమతి లక్ష్మి. మానవులందరూ ఒకటేననీ, వారిలో ఖండాల, దేశాల ప్రాంతాల విభజన కృత్రిమమేననీ, జాతులూ, మతాలూ, ప్రాంతాల విభజన కేవలం అనాగరికమనీ స్వార్థపూరితమనీ మానసికంగా ధృవపరచుకున్నారు శ్రీమతి లక్ష్మి.

# గ్రాండ్ మా అండ్ గ్రాండ్ పా

"మిసెస్ లక్ష్మి! ఆందోళన ఎంతమాత్రం అక్కరలేదు. కొద్దిసేపట్లో చల్లని కబురువింటావు." అంటూ పలికింది నర్సింగ్ హోమ్ డాక్టర్.

ఆ చల్లనికబురు కోసమే ఈ తల్లి లక్ష్మి ఆరాటపడుతుంది ఇవతలిగదిలో. ఆ చల్లనికబురుకోసమే ఆతండ్రి రఘురామయ్యగారు ఇంటివద్ద ఆరాట పడుతున్నారు. నర్సింగ్ హోములోని ప్రత్యేక వార్డులో తమబిడ్డ, నోములపంట పురిటినొప్పులు పడుతోంది.

ఎవరేమైనా చెప్పనీ స్త్రీకి పురుడు పునర్జన్మమే! అందునా తొలిచూలు ఆందోళనాకరమే! ఆధునిక వైద్యశాస్త్ర సదుపాయాలు ఎంతగా పెరిగినా కూతురు ప్రసవవేదన పడుతుంటే తల్లి ఆందోళన చెందడం సహజమే! కన్నీరొలకటమూ సహజమే!!

ఎంతో నిగ్రహపరురాలయిన శ్రీమతి లక్ష్మికి కూడా ఆరోజు తన నిగ్రహం కొంత సడలినట్లు తోచింది.

14 అశోక రోడ్డులో ఆరోజు ఉదయం నుంచీ రఘురామయ్యగారు గంటకోసారి టెలిఫోను చేస్తూనే ఉన్నారు ఆసుపత్రిలో ఉన్న శ్రీమతి లక్ష్మికి. తదుపరి అరగంటకోతూరి టెలిఫోను చేస్తున్నారు. ఈమధ్యలో రెండుసార్లు వచ్చి చూచి గూడా పోయారు.

బిడ్డకు ధైర్యం గలిగించటానికి వచ్చారో! తానే ధైర్యం పొందటానికి వచ్చారో తనకు మాత్రమే తెలుసు.

"ఏం ఫర్వాలేదు, She is allright డోంట్ వర్రీ! లక్కీ you don't worry... వెంటనే రింగు చేస్తావుగా." అని భార్యకు

చెప్పడంలో, లక్ష్మి వర్రీని తగ్గిస్తున్నారో, తన వర్రీని తగ్గించు కుంటున్నారోగూడా రఘురామయ్యగారికి మాత్రమే తెలుసు. ఆయన ఇంటికి వెళ్లారు.

*                    *                    *

ఇంటికి వెళ్లింతర్వాత మాత్రం ప్రతి పావు గంటకూ ఇక్కడ టెలిఫోను మ్రోగుతుంది. 'Hallo' అంటూ. లక్ష్మి సమాధానం చెబుతోంది. 'Not yet' అంటూ.

ఇంటివద్ద రఘురామయ్యగారి గడియారం మరీ ఆలస్యంగా తిరుగుతోంది. ఒక్కోసారి ముండ్లు కదలటం లేదేమో నని పిస్తోంది.

బట్లర్ రామకృష్ణను పిలిచి "ఇదిగో ఆ గోడగడియారం కేసి చూస్తుండు. పావుగంట అయిందో ఉరుకుతూ వచ్చి నాకు చెప్పు. అర్జంటు" అని హుకుం జారీ జేశారు.

సోఫా మీద బాచీపెట్లు వేసుకొని కూర్చున్నారు. చూపులు ఎదురుగా ఉన్న రాతిగోడను దాటి, ఆరు మైళ్ల దూరంలో ఉన్న నర్సింగ్ హోములో తిరుగుతున్నాయి. ఎన్నెన్నో ఆలోచనలు. ఏవేవో ఆలోచనలు.

ఇరవై మూడేండ్లనాడు మదరాసులోనర్సింగ్ హోము జ్ఞాపకం వచ్చింది. ఆనాడు లక్ష్మి పురిటి నొప్పులు పడింది . తన ఆందోళన జ్ఞాపకం వచ్చింది. అప్పటి తన మానసిక స్థితి రూపుదాల్చి, ప్రతి బింబమై తిరిగి ఇపుడు తనకు ప్రత్యక్షమౌతుంది. అయినా లక్ష్మిది సుఖప్రసవమే. బెబీ మొదటి కేక ఇవతలగా ఉండి తను విన్నాడు. ఒళ్లుపులకించింది. నోరు నవ్వులు చిందించింది.

శ్రీమతిలక్ష్మి,దివ్యజ్ఞాన సరోజినిదేవి ఉన్నగదికి ఈ వల తమకొరకు ప్రత్యేకితమైన గదిలో కూర్చొని ఉంది. కూర్చున్నఆమె లేచింది. లేచి నామె నడిచింది. నడిస్తే గోడఎదురైంది. వెనక్కు తిరిగి మళ్లీ

నడిస్తే రెండోగోడ ఎదురైంది. ఆ రెండుగోడల మధ్యానడూస్తు ఉంది.

ఇరవై మూడు సంవత్సరాల క్రితం తన అనుభవాలు స్ఫురణ కొస్తున్నాయి. తన వేదనా జ్ఞాపకం వస్తూంది. తన తల్లిగారు రత్న మాణిక్యమ్మ గారి ఆందోళనా పూరిత వదనమూ మనస్సులో మెదులు తుంది. రఘురామయ్యగారి ఆరాటం, హడావిడీ అన్నీ బయస్కోపు లోని బొమ్మల్లోగా పాత జ్ఞాపకాలు బయటపడుతున్నాయి.

'ఈ మానవ జీవితమనేది గమ్మత్తుగా ఉంటుంది గదూ!' అని తనకు తానే చెప్పుకుంది, శ్రీమతి లక్ష్మి.

'ఎక్కడ నుంచి వస్తున్నామో, ఎక్కడకు పోబోతున్నామో తెలియదుగదా!' అని అనుకుంది శ్రీమతి లక్ష్మి.

అంతా నవ్వు లాట. తోలు బొమ్మ లాట.

టెలిఫోనులో గంట మ్రోగింది. నర్సు పరుగెత్తుకుంటూ వచ్చి వాకిట్లో నుంచి తొంగి చూచింది.

"మాడమ్ గుడ్ న్యూస్"...రొప్పుతూ చెప్పింది నర్స్. టెలిఫోనును ఎత్తింది శ్రీమతి లక్ష్మి.

"థాంక్యు నర్స్-వాట్‌న్యూస్-ప్లీజ్ టెల్‌మి-క్విక్-చేయి లోని రిసీవర్ చెవి దాకా చేర్చింది.

"హల్లో—Yes!-" లక్ష్మి ఫోనులో వింటుంది.

"మీకు మనుమడు పుట్టాడు మాడం - కంగ్రాట్యులేషన్స్... మరో పావుగంట ఉండాలి మీరు నవ శిశువును దర్శించు కోటా నికి..." అంది నర్సు.

"Yes. Raghu - yes - juts now- మీకుమనుమడు పుట్టాడు రఘూ. కాంగ్రాట్సులేషన్సు సంతోషాతిశయంతో ఆమె నోటి మాటలు తేలిపో''తున్నాయి.

"టెలిఫోను తీగెకు ఆవలిచివర ఉన్నాయనకు ఆనందాతిరేకంలో మాటలు గాలిలోకెగురుతున్నాయి Thank you Luky you are always lucky! కాంగ్రాట్యులేషన్సు. నీవు అమ్మమ్మ వయ్యావు. కంగ్రాట్సు.అమ్మాయిని చూచావా! అబ్బాయిని ఎత్తుకున్నావా! నేనూ వస్తాను. రైట్. బై.బై." అన్నారు అటునుంచి రఘురామయ్యగారు.

కోయంబత్తూరుకు ట్రంకుతీగల్లోనుంచి సమాచారం ఉరికింది. ఢిల్లీ లోని స్నేహితులందరి టెలిఫోన్లు అరగంటలో ఈ వార్తను జీర్ణంచేసుకొన్నాయి. ఇక ప్రవాహంలాగా నర్సింగ్ హోమ్‌కు శ్రీమతి లక్ష్మికి కంగ్రాట్యులేషన్స ధ్వనులు పరుగెత్తాయి.

రఘురామయ్యగారు స్నేహితులకు ఒక వంద మిఠాయి పాకెట్సు పంచారా నాడు.

# 14-అశోక రోడ్డు

14-అశోక రోడ్డు ఎప్పుడూ కళ కళ లాడుతుంటూంది. వచ్చే కార్లకు విరామముండదు. పోయేకార్లకు విసుగూ ఉండదు.

విశాలమైన ప్రహారీ మధ్యలో అందంగా ఉండే ఆ ఇంట్లో ఎన్నో రాజకీయ మంతనాలు సాగుతూంటాయి. సంచలనాలు కొన సాగుతుంటాయి. మరెన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలు ఊహించ బడుతుంటాయి. విరచించ బడుతూంటాయి.

కేంద్ర మంత్రి వర్గ సభ్యులు, విదేశీ ప్రముఖులు, రాష్ట్రాల ముఖ్యమంత్రులు, కాంగ్రెస్ పార్టీ అధినేతలు, ప్రజాప్రతినిధులు,సభాపతులు ఎవరోఒకరు ఎప్పుడూ అశోక రోడ్డులోని ఈ 14వ నెంబరు ఇంటికి వస్తూనేఉంటారు.

ప్రతిపక్ష పార్టీల నాయకులు సయితం ఈ ఇంటికి రావడం పరిపాటి. దేశభవిష్యత్తుకు సంబంధించిన వివిధ విషయాలపై చర్చించు కొనడం ఆనవాయితీ. ఎవరు వచ్చినా ఈ ఇంటి యజమానుల ఆదరాభిమానాలు, స్వాగత సత్కారాలు హృదయంగ మయినవిగా ఉంటాయి.

మరీ పార్లమెంటరీ వ్యవహారాల మంత్రాంగం శ్రీరఘురామయ్యగారు చేపట్టిన తదుపరి ఈ ఇంటికి రాకపోకలు ఎక్కువైనాయి. ఎప్పుడు చూచినా రఘురామయ్యగారు బిజీ మినిస్టర్.

రఘురామయ్యగారి ఇంటికి వచ్చే ప్రతి ముఖ్యుడూ, శ్రీమతి లక్ష్మీరఘురామ్‌గారిని దర్శించకుండా వెళ్లరు.

తెలుగుదేశపు ఈ ఆడపడుచు, ఇంటికి విచ్చేసిన అతిథికి నిండు మనస్సుతో కడుపు నింపుతుంది. అరమరికలు లేకుండా ప్రవర్తిస్తుంది.

వచ్చిన వారంతా తమ అక్కలాగనో, చెల్లిలాగనో గౌరవిస్తారు ఈమెను.

రఘురామయ్యగారి పరిచయస్థులతో, సహచరులతోనేగాక, ఈమె సమయం ఈమె స్వంత జనంతో ఎక్కువ వెచ్చించాలిసి వస్తుంది.

కనకనే రఘురామయ్యగారెంత బిజీమినిష్టర్, శ్రీమతిలక్ష్మీ రఘురామ్ అంత బిజీలేడీ.

ఉదయం 6 గంటలనుంచి ప్రారంభమయ్యే ఈ దంపతుల అను దిన కార్యక్రమము, రాత్రి 11 గంటలవరకు సాగుతుంది. ఈ కేంద్ర మంత్రి మండలి ప్రముఖ సభ్యునికి, ముగ్గురు కార్యదర్శులూ, ముగ్గురు పర్సనల్ అసిస్టెంట్సూ, ఉరుకులు పరుగులు పెట్టవలసిందే. రెండు టెలిఫోను తీగలూ ప్రతి నిముషం బ్రతికి ఉండవలసిందే.

స్నానాదికాలు ముగించుకొన్న శ్రీమతి లక్ష్మి, పూజాదికాలు పూర్తి జేసుకొన్న శ్రీ రఘురామయ్య 7 గంటలకు బ్రేక్‌ఫాస్టు టేబులు వద్ద ప్రతి ఉదయం కలుస్తారు. ఒక అరగంటసేపు ఉపాహా రాలు చేస్తూనే విషయాలు ప్రసంగించు కుంటారు. ఆ టైములోనే ఇంటి విషయమైనా, స్వంత విషయమైనా మాట్లాడుకునే వీలు.

ఫలహారానంతరం మంత్రిగారు తన గదిలో తన రాజకీయ కలాపాలలో తన ప్రభుత్వపాలనా శాఖా నిర్వహణలో నిమగ్నులౌతారు.

* * *

రఘురామయ్యగారు వేకువనే నిద్రలేస్తారు. శారీరక వ్యాయామంకోసరం చీకటిలోనే నడకసాగిస్తారు. అది నడకగా ఉండదు. పరుగుగా ఉంటుంది. కనకనే ఆయన ప్రక్కన ఎప్పుడూ ఉండాల్సిన సెక్యూరిటీ గార్డులు పరుగే పెడతారు. ఆయన, నడక పరుగు సాగిస్తుంటే, ఆయనకు రొప్పురాదుగానీ, వాళ్లకు గొస పుడుతుంది.

ఒక రోజు, ఇంకా చీకటిగానే ఉంది. బాగా తెల్లవార లేదు. రఘురామయ్యగారు మైలుదూరపు నడక ముగించుకొని 14 నెంబరు సమీపిస్తున్నారు. గేటులోనికి వస్తున్నారు. గేటుకు సమీపంలో ఒక యువకుడు గోడ నానుకొని మునగ దీసుకొని నిలబడ్డాడు.

అతన్ని చూచి రఘురామయ్యగారు, "కోన్ హై?" అని ప్రశ్నించారు. సెక్యూరిటీగార్డు అతనివైపు గుడ్లురిమి చూచాడు.

ఆ యువకుడు భయపడ్డాడు. తడ బడ పడ్డాడు.

"రఘురామయ్య గారి కోసం వచ్చానండీ !" అన్నాడు. యువకుడు.

"ఏ రఘురామయ్యా ?" అడిగారు రఘురామయ్య గారు.

"కొత్తా రఘురామయ్య గారి కోసమండీ !" అన్నాడా ఆ యువకుడు.

"మరి ఇక్కడున్నావేం ?" అన్నారు రఘురామయ్యగారు.

"లోపలికెళ్తే ఏమన్నా అంటారేమోనని !" అన్నాడు యువకుడు.

"ఎవరన్నా ఏమన్నా అన్నారా ?" ప్రశ్నించాడు రఘురామయ్యగారు.

"అనలేదు గాని అంటారేమోనని ?" నసిగాడు యువకుడు.

"రా ! లోపలకు." అన్నారు రఘురామయ్యగారు.

"అయ్యగారు నిద్రలేచారా అండీ ?" అని ప్రశ్నించాడు యువకుడు.

"రావయ్యా రా లోపలకు మంత్రిగారిని చూపిస్తాను." అన్నారు రఘురామయ్యగారు.ఆ అబ్బాయి గుడ్లలుమాసిఉన్నాయి.

చెప్పులు చిరిగి ఉన్నాయి. తల రేగిఉంది. మొఖంవాడి ఉంది. సెక్యూరిటీ గార్డు గుడ్లురిమి చూడాల్సిన అవసరాలన్నీ ఉన్నాయి.

గేటు దాటి లోపలకు నడచారు. నడుస్తూనే, "ఎప్పుడొచ్చావు ఢిల్లీకి" అడిగారు రఘురామయ్యగారు?

"పదిహేను రోజులయింది." అన్నాడు యువకుడు.

"ఎందుకొచ్చావు? ఉద్యోగం కోసమేనా ?" అడిగాడు మళ్ళీ.

"అవునండీ ! యం. ఎ. ప్యాసయ్యాను. ఎన్నింటికో అప్లై చేశాను ...... రాలేదు. ఇవాళ మధ్యాహ్నం ఇక్కడ ఇంటర్వ్యూ ఉంది. అయ్యగారికి చెప్పుకుందామని వచ్చాను.

"అయ్యగారు ఉద్యోగాలు ఇయ్యరబ్బాయ్ ?" అన్నారు రఘురామయ్యగారు. ఏ వూరు మీది అని అడిగారు, ఊరు పేరు చెప్పాడు యువకుడు.

"అయినా ఒక్కసారి వారిని చూస్తాను. చూపించండి సార్. అసలే కొత్తవాడిని, ఇక్కడ నాకేమీ తెలియదు సార్" అన్నాడు యువకుడు.

దగ్గరలోఉన్న గది చూపించారు, అక్కడ కూచోండి, అన్నారు. ఆయన లోపల కెళ్ళారు.

అరగంటలో బట్లర్ రామకృష్ణ ఆ యువకుడు కూచున్న గదిలోకి వచ్చాడు...'అబ్బాయివి నీవేనా ? అని అడిగాడు. నల్లటి రామకృష్ణ తెల్లటి బట్లర్ దుస్తుల్లో మెరిసి పోతున్నాడు. కోయం బత్తూరు యాస తెలుగులో గడ గడా మాట్లాడాడు. కూచున్న అబ్బాయి లేచాడు. లేచిన అబ్బాయి వణుకుతున్నాడు. లోపలకెందు కొచ్చానా అని అనుకుంటున్నాడు. అసలు ఆ గేటు దగ్గరెందుకు నిలబడ్డానా అని చింతిస్తున్నాడు.

బట్లర్ రామకృష్ణ, 'రా' అన్నాడు. కుర్రవాడు కంగారు గానే ఉన్నాడు. అతని మాటను వినక పోతే ఏమి మూడుతుందోనని వెంబడించాడు. రోట్లో తల పెట్టానుగదా అని అనుకున్నాడు. తలను చేత్తో తడుముకున్నాడు.

ఒక వరండా రెండు ద్వారాలు నడిపించి బట్లర్ ఒక గదిలోకి తీసుకు పోయాడు. పెద్ద టేబుల్ ఉంది. దాని ముందు కుర్చీ లున్నాయి. అవి తళ తళా మెరుస్తున్నాయి.

"కూర్చో!" అన్నాడు బట్లర్ రామకృష్ణ.

అది హుకుంగా వినపడింది ఆ అబ్బాయికి. కూర్చున్నాడు. రెండు నిముషాల్లో, తంగవేలు ప్లేటునిండా పొగలు చిమ్ముతూన్న పొంగలి తెచ్చి ముందు పెట్టాడు.

"తినండి!" అన్నాడు రామకృష్ణ.

ఇది గూడా హుకుంగానే వినపడింది, ఆ అబ్బాయికి.

భయం భయంగా, ఆజ్ఞపాలిస్తున్నట్టు తినడం మొదలెట్టాడు ఆ అబ్బాయి.

"తిను సామీ — నిండా తిను — సంకోచం ఇల్లై — తిను సామీ" రామకృష్ణ చెప్పాడు.

అప్పుడు ఆ అబ్బాయి ఆకలి కదిలింది. కడుపులో మెదిలింది. రెండు రోజులనుంచి నిద్రపోతున్న ఆకలి కరకర లాడింది. నోరూరింది. పొంగలి పూర్తయింది. ఇడ్డెన్లు పూర్తయ్యాయి. కప్పు కాఫీ పూర్తయింది.

యువకుడు రామకృష్ణకేసి చూచాడు.

రామకృష్ణ తృప్తిగా నవ్వాడు.

"సార్!" అన్నాడు రామకృష్ణను ఆ అబ్బాయి.

"చెప్పండి సార్!" అన్నాడు రామకృష్ణ.

"మినిష్టరు గారు ? ......" అన్నాడు అబ్బాయి. "పూజ జేసుకుంటున్నారు. ఇందాకటి గదిలో ఉండండి" అన్నాడు రామ కృష్ణ.

కాసేపటికి శక్రటరీ వచ్చాడు ఆ గదిలోకి. లోపలినుంచి బజ్జర్ మోగింది. టెలిఫోను ఎత్తాడు. ఏదో విన్నాడు. ఆ అబ్బాయి కేసి చూచాడు. 'Yes - sir, అంటూ పెట్టేశాడు.

శక్రటరీ ఈ అబ్బాయి వివరాలు అడిగాడు, ఫలానా టైముకు ఫలానా చోటుకు వెళ్ళి రమ్మన్నాడు.

సరేనని ఆ అబ్బాయి ఆ ఫలానా చోటుకు, ఫలానా టైముకు వెళ్లాడు. ఇంటర్వ్యూకు హాజరై వచ్చాడు వస్తూ వస్తూ, ఆర్డరు తెచ్చుకున్నాడు సాయంత్రానికి.

శక్రటరీకి దణ్ణం పెట్టి తనకు ఉద్యోగం వచ్చిందనీ మంత్రి గారిని ఒకసారి దర్శించు కుంటాననీ చెప్పాడు యువకుడు. ఖాళీగానే మంత్రిగారున్నారని తెలుసుకొని లోపలకు పంపించాడు యువకుణ్ణి శక్రటరీ.

లోపల గదిలో సోఫాలో ఉన్నారు రఘురామయ్యగారు.

ఈ అబ్బాయి ఆయనకెదురుగా వెళ్లి గాభరాపడ్డాడు. ప్రొద్దున తాను చూచిన ఆయనేనా రఘురామయ్యగారు. ప్రొద్దున తన ఆకలి తీర్చిందీ, ఈ పూట తన జీవితపు ఆకలిని తీర్చే ఉద్యోగాన్ని ఇప్పించింది ఈయనేనా !

రఘురామయ్యగారు చిరునవ్వు నవ్వారు. రాండి, కూర్చోండి అని సోఫా చూపించారు. ఈ అబ్బాయికి కండ్ల నీరు ఊరింది. వంగి రఘురామయ్యగారి పాదస్పర్శ చేయబోయాడు. 'ఛ ! ఛ ! అదేమి పని, నేనేమి ఉద్యోగం ఇప్పించలేదయ్యా ! మీరు ఎం. ఎ. ప్యాసయి తిరి. మంచి మార్కులూ ఉండె,ఈవాళ ఇంటర్వ్యూలో కూడాబాగా చేసి ఉంటారు. అందుకనే ఆ ఉద్యోగం వచ్చింది". అన్నారు రఘు రామయ్యగారు.

"అయ్యా, మంచి మార్కులతో ఎం. ఎ. ప్యాసయి చాలా సంవత్సరాలయింది. ఇంటర్వ్యూలలోగూడా చాలాసార్లు బాగానే చేశాను. కాని,......" అంటున్నాడు యువకుడు.

"కాలం గూడా కలసిరావాలిగదా!" అన్నారు రఘు రామయ్యగారు. నీ శక్తితోనే నీకు ఉద్యోగం వచ్చింది. ఆ ఆత్మ విశ్వాసంతోనే మసులుకో. వెళ్లిరా!" అన్నారు రఘురామయ్యగారు.

నమస్కరించి వెనుదిరిగాడు యువకుడు.

తలుపు దగ్గిరకు నడిచేసరికి మంత్రిగారు పిలిచారు.

"ఇటుచూడూ! నీదగ్గిర డబ్బెంతఉంది?" అడిగారు.

ఆ అబ్బాయి నోటమాటలేదు. చూపులు నేలకేసి మళ్లాయి "సరే ఆఫీసులోకెళ్లు." అన్నారు మంత్రిగారు.

ఆఫీసులోకెళ్లేసరికి, ఆ అబ్బాయి ఊరికి టిక్కెట్టుఖరీదు తెలుసుకొని ప్రయాణ బత్తాలుకలిపి ఉన్న చిన్నకవరు ఆ అబ్బాయిచేతికి అందించాడు శక్రటరీ.

* * *

మంత్రిగారి కార్యక్రమము మంత్రిగారిదే. ఈమె గారిది ఈమె గారిదే. ఎవరి వ్యక్తిత్వాలువారివే. ఆయన రాజకీయాలలో ఈమె జోక్యం గలిగించుకోరు. ఆయన ఎన్నికలలో ఈమె పాల్గొనరు. సంగం జాగర్ల మూడిలో ఆనాటి వందల ఎకరాలు రాజకీయాలలో కర్పూరంలా హారతి అయిన రోజుల్లోగూడా ఈమె నోటినుండి ఒక్క అడ్డుమాటరాలేదు. రఘూపై అంతవిశ్వాసం! ఆయన వ్యక్తిత్వంపై అంత నమ్మకం!! ఆయన ఆలోచనలపై అంత భరోసా!!! ఆయన తనకు మంచిదనుకున్నది చేస్తున్నాడు. ఆ స్వేచ్ఛ ఆయనకుంది. నేనెందుకుకాదనాలి అనేది ఆమెభావం. అయితే ఆసక్తిగా గమనిస్తుంటుంది.

"మినిష్టరు గారు ? ...... " అన్నాడు అబ్బాయి. "పూజ చేసుకుంటున్నారు. ఇందాకటి గదిలో ఉండండి" అన్నాడు రామ కృష్ణ.

కాసేపటికి శక్రటరీ వచ్చాడు ఆ గదిలోకి. లోపలినుంచి బజ్జర్ మోగింది. టెలిఫోను ఎత్తాడు. ఏదో విన్నాడు. ఆ అబ్బాయి కేసి చూచాడు. 'Yes - sir, అంటూ పెట్టేశాడు.

శక్రటరీ ఈ అబ్బాయి వివరాలు అడిగాడు, ఫలానా టైముకు ఫలానా చోటుకు వెళ్ళి రమ్మన్నాడు.

సరేనని ఆ అబ్బాయి ఆ ఫలానా చోటుకు, ఫలానా టైముకు వెళ్లాడు. ఇంటర్వ్యూకు హాజరై వచ్చాడు వస్తూ వస్తూ, ఆర్డరు తెచ్చుకున్నాడు సాయంత్రానికి.

శక్రటరీకి దణ్ణం పెట్టి తనకు ఉద్యోగం వచ్చిందనీ మంత్రి గారిని ఒకసారి దర్శించు కుంటాననీ చెప్పాడు యువకుడు. ఖాళీగానే మంత్రిగారున్నారని తెలుసుకొని లోపలకు పంపించాడు యువకుణ్ణి శక్రటరీ.

లోపల గదిలో సోఫాలో ఉన్నారు రఘురామయ్యగారు.

ఈ అబ్బాయి ఆయనకెదురుగా వెళ్లి గాభరాపడ్డాడు. ప్రొద్దున తాను చూచిన ఆయనేనా రఘురామయ్యగారు. ప్రొద్దున తన ఆకలి తీర్చింది, ఈ పూట తన జీవితపు ఆకలిని తీర్చే ఉద్యోగాన్ని ఇప్పించింది ఈయనేనా !

రఘురామయ్యగారు చిరునవ్వు నవ్వారు. రాండి, కూర్చోండి అని సోఫా చూపించారు. ఈ అబ్బాయికి కండ్ల నీరు ఊరింది. వంగి రఘురామయ్యగారి పాదస్పర్శ చేయబోయాడు. 'ఛ ! ఛ ! అదేమి పని, నేనేమి ఉద్యోగం ఇప్పించలేదయ్యా ! మీరు ఎం. ఎ. ప్యాసయి తిరి. మంచి మార్కులూ ఉండె,ఈవాళ ఇంటర్వ్యూలో కూడాబాగా చేసి ఉంటారు. అందుకనే ఆ ఉద్యోగం వచ్చింది". అన్నారు రఘు రామయ్యగారు.

ధాన్ని బయట పెట్టుకుంటుంది. అందరకూ తలలోని నాలుకలాగా మసలు కుంటుంది. తనశక్తికొలది ఆశ్రితులను ఆదుకొంటుంది.

దుగ్గిరాలలో ఉన్న ఆస్తిపాస్తులగురించి ఆయన తెలుసుకోరు. అక్కడ వచ్చే ఆదాయంలో ఈమె దేశ విదేశీ పర్యటనలకు ఇతర సమాజ కార్యక్రమాలకు ఏడాదికి ఎన్నివేలు ఖర్చవుతుందనిగానీ, అసలు ఆదాయం అటుంచి, మూల నిలువలో ఏమాత్రం తరిగిందని గానీ ఏనాడూ ప్రస్తావించరు. అది ఆయనకు పట్టని విషయం. సందర్భించని సంగతి.

గుంటూరు జిల్లాలోని అమరావతిఅంటే శ్రీమతి లక్ష్మికి ఇష్టం. అక్కడ బౌద్ధారామం ఉండేదని, ప్రపంచానికొకనాడు జ్ఞానబిక్ష పెట్టిందనీ, పుణ్యతీర్థమనీ ఆ వూరంటే ఆమెకు ఎంతో అపేక్ష.

అక్కడ కాలేజీ నిర్మాణంలో, దాని అభివృద్ధిలో రఘు రామయ్య దంపతులకు అశేష ఆసక్తిఉంది. దాని బాగుపట్ల వారికి ఎంతో శ్రద్ధఉంది.

ఒకరోజు హైద్రాబాద్ లేక్‌వ్యూ అతిధి గృహంలో దంపతు లిద్దరూ కూచొని ఉండగా, ఆ అమరావతీ కాలేజీ నిర్వాహకులు వచ్చారు. కాలేజీ బాగోగులు సమీక్షించి, మరోలక్ష రూపాయల అవసరాన్ని బయటపెట్టారు. శ్రీమతి లక్ష్మి అయిదు నిముషాలు ఆలోచించి, అలాగే నండి ప్రయత్నంచేస్తాను. త్వరలో మీకు అందేట్టు చూస్తాను అని అన్నారు.

ఆ నిర్వాహకుడు ఒక్కసారి ఎగిరి గంతేశాడు, "అమ్మగారు మాటంటే అది జరిగినట్లే లెక్క అంటూ."

మరి ఆయన ఎందరివద్దకు వెళ్లాడో! ఏమి అనుభవాలు పొందాడో! మరి!!

రఘురామయ్యగారు లక్ష్మి అందజేయ ప్రయత్నిస్తానన్న లక్ష ఎలాగని అడగలేదు? వివరాలు తెలుసుకోలేదు.

ఆమె అన్నారు. అదిఅంతే. అదే ఆయన భావన.

* * *

ఢిల్లీలో డిసెంబర్ జనవరి మాసాలు సామాన్య జనానికి కడు గడ్డు మాసాలు. ఎముకలను గడగడ లాడించే నెలలు. గ్రీష్మంలో నిప్పులు చెరిగే ఎండదేవుడు, డిసెంబర్‌లో పగలే మంచుకురియ నిస్తాడు.

కాశ్మీర్ లోయనుంచివచ్చే శీతల గాడ్పులు హిమాలయాల చలినంతా మోసుకొని ఢిల్లీని ఆవరిస్తాయి. ఢిల్లీలోని జనమంతా గడగడలాడుతారు. కొంగర్లుపోతారు.

ఒకరోజు సాయంత్రం శ్రీ రఘురామయ్య 14 అశోక రోడ్డులో తన ఆఫీసులో కూర్చొని పనిచేసుకుంటుండగా ఒక బస్సు వచ్చి ఆగింది. బస్సులోని జనమంతా బిలబిలా దిగారు. గేటులో నుంచి లోపలకొచ్చేరు. అడ్డుపోదామనుకున్న సెక్యూరిటీ గార్డులు, వాళ్ల వేషాన్ని చూచారు. భాషను విన్నారు. 'ఓహో' - అను కున్నారు.

అసలు ఇంటికిముందే శక్రటరీ ఆఫీసు ఉంటుంది. ఆయన బయటికొచ్చి సంగతి సందర్భాలు అడిగాడు.

వచ్చింది టూరిష్టు బస్సు. వాళ్లంతా తెలుగుదేశంనుంచి యాత్రలకొచ్చారు. ఢిల్లీకివచ్చారు. మంత్రిగారిని చూడటం వారి మొదటి కార్యక్రమం అట. "మా రఘురామయ్యగారిని చూడ టానికి వచ్చామండీ శక్రటరీగారూ!" అన్నారు.

శక్రటరీ లోపలకు వెళ్లారు.

రఘురామయ్యగారు సతీసమేతంగా నవ్వుకుంటూ ఇంట్లోంచి బయటికివచ్చారు. వాళ్లను సమీపించారు. రెండు చేతులతో నమస్క రించారు. జనమంతా రఘురామయ్యగారికిజై, జై కొట్టారు. లక్ష్మీ రఘురామ్ జిందాబాద్ అన్నారు. చుట్టూరా మూగారు.

దంపతు లిద్దరూ అందరనూ ఒకసారి కలియచూచారు. తృప్తిగా నవ్వారు.

పర్యాటకులలో, వారంతా హరిద్వారం, వారణాసి వగైరా చూచుకొని వస్తున్నామని చెప్పుకుపోతున్నారు.

దంపతులచూపు ఆ జనంలో ఒకవైపు ముడుచుకొని, నూలు దుప్పటి కప్పుకొని వణుకుతూన్న ఒక ముసలాయనపై ఆగింది. మళ్లీచూస్తే అలాంటివాళ్లు ఇంకా ఉన్నారు. వారిలో నలుగురయిదుగురు ఆడవారూ ఉన్నారు. అందరూ వణుకుతునే మాట్లాడుతున్నారు. మాట్లాడుతూనే ఈ దంపతులను ఇక్కడ చూడగలిగినందుకు సంతోషిస్తున్నారు.

"రామకృష్ణా" - అని కేకవేశారు శ్రీమతి లక్ష్మి.

అంగలు పంగలువేసుకుంటూ లోపలనుంచి బట్లర్ రామకృష్ణ వచ్చాడు. ఒక్క నిముషం వానితో మాట్లాడారు శ్రీమతి లక్ష్మి. మరో అయిదు నిముషాల్లో రామకృష్ణ వాటుపట్టుకొని రగ్గులుతెచ్చాడు. శ్రీమతిలక్ష్మి ఒక్కటొక్కటే తీసుకొని ఆ అయిదుగురు ఆడవారికి కప్పింది. కప్పుకున్న ఆ ఆడవారు ఆ రగ్గుల్లో మునిగిపోయారు. ఆరగ్గుల బరువుకు వంగిపోయారు. చలితగ్గిపోయింది. వాళ్లమనస్సులు కృతజ్ఞతతో నిండిపోయాయి. వాళ్లశరీరాలు వెచ్చబడ్డాయి. దణ్ణాలు పెట్టారు.

ఇందంతా చూస్తున్న మంత్రిగారు, ఆ యాత్రాదళ నాయకుణ్ణి దగ్గరకు పిలిచారు. చలికి వొణుకుతూన్న ముసలాముతకా జనాన్నిచూపి, వాళ్లందరకూ స్వెట్టర్లు కొనిపెట్టమన్నారు. ఢిల్లీలో చలికి తట్టుకోలేరన్నారు. అప్పుడేవెళ్లి తలోస్వెట్టరూ, తలోమఫ్లరూ కొనవలసిందిగా చెప్పారు.

ఇదంతా చూస్తున్న శ్రీమతి లక్ష్మి, లోపలకువెళ్లి ఓ అయిదు కాగితాలు తెచ్చి మంత్రిగారి చేతిలోపెట్టింది. ఆయన ఆ దళనాయకుని చేతిలోపెట్టి తిరిగి ఆ జనానికి చలిదుస్తులు కొనవలసిందిగా పురమాయించారు.

ఈ ఆకస్మిక హఠాత్ పరిణామాన్ని ఊహించని ఆ యాత్రికులు, రెండు చేతులెత్తి దణ్ణంపెట్టారు. దంపతులిరువురకూ జై, జైలు పలికారు.

ప్రక్కనే కొంచెం ఎడంగా వరండాలో నిలబడిఉన్న పుత్రిక శ్రీమతి దివ్యజ్ఞాన సరోజినీ వరదరాజన్ తనతల్లి దండ్రుల ఆలోచనకు, సమయోచిత చర్యకు హర్షపులికిత అయ్యింది. తోటిమానవుల కడ గండ్లను కడు శ్రద్ధతో గమనించి, ఓపినంత మేరకు తోడ్పడంలో, మరో ఆలోచనలేకుండా ప్రవర్తించినందుకు ఆనందించింది. అట్టి జననీజనకులకు తాను పుత్రిక అయినందుకు గర్వించింది.

తన ప్రక్కనే ఉన్న తన చిన్న కుమారుడు, 'ఉమాకుమార్ నరశింహశ్రీధర్' 'అక్కా'! ఎవరు వాళ్లంతా? అని అడిగాడు. "అమ్మను" "అక్క" అని పిలవటం ఆ ముగ్గురు అన్నదమ్ములకూ చిన్ననాటినుంచి అలవాటే. అమ్మమ్మ శ్రీమతి లక్ష్మిని "మమ్మీ"- అని పిలవడం ఆ ముగ్గురకూ అలవాటే.

అన్నదమ్ములూ ఇందాకటినుంచి ఇదంతా గమనిస్తూనే ఉన్నారు. గ్రాండ్ మా గ్రాండ్‌పాకు, వచ్చినవారు జేజేలు కొట్ట డంతో లోపలగదుల్లో ఆడుకుంటూన్న వాళ్లు, తమ తల్లిగారితోపాటు బయటకువచ్చారు. పెదబాబు శ్రీనివాస్ "టూరిష్టులు ఉమా" అంటూ వివరాలు చిన్నతమ్ముడికు తెలిపాడు.

ముగ్గురు బిడ్డలూ, చిన్నతనంనుంచే తెలుసుకుంటున్నారు మనిషికీ మనిషికీ ఉండవలసిన సంబంధాలు.

* * *

"అక్కా - లాస్ట్ సమ్మర్‌లో ఏంజరిగిందో తెలుసా నేను అప్పుడు ఇక్కడే ఉన్నానుగదా!'' అన్నాడు రెండో అబ్బాయి వెంకటేశంచౌదరి. తన తండ్రిగారి పేరు ఈరెండవ మనుమనికి పెట్టు కొన్నారు శ్రీమతి లక్ష్మి.

"చెప్పు" అన్నాడు తమ్ముడు ఉమాకుమార్.

"మరే ఈలాగే ఒకపెద్ద బస్సునిండా జనం వచ్చారు. అప్పుడుగూడా వాళ్లదగ్గిర డుబ్బు అయిపోయిందంట. గుంటూరు పోవటానికి ఎక్స్‌పెన్సెస్ లేవట. అంతా టూరిష్టులే. పాపం డబ్బు లేకుండా వాళ్ళ ఊరు ఎట్లా పోతారు. అందుకని గ్రాండ్ పా దగ్గరకొచ్చారు.

"గ్రాండ్ ఫా ఏమో, మరే, అన్నీ విని, అరెరే పాపం అన్నారు. ఎక్కడో ఒక హోటల్లో వాళ్లందరకూ మకాం ఏర్పాటు చేశారు. సాపాటు అదీ పెట్టించారు. మరేమో, ఇంకా ఐదు వందల డబ్బు గూడా ఇచ్చి పంపించారు." అని చెప్పాడు వెంకటేశంచౌదరి.

వెంకటేశంచౌదరి చెప్పిందానికి అన్న శ్రీనివాస్ తమ్ముడు ఉమాకుమార్ సంతోషించినట్లు కనపడింది. వాళ్ళ తాతగారి గొప్ప తనం వారికి అర్థమయినట్లే కనపడింది. ఆ అర్థమయిన తాతగారి గొప్పతనం వాళ్లకు గర్వకారణంగా కూడా కనపడింది.

ఇదంతా ఆసక్తిగా వింటూ ఈ బిడ్డల మనోభావాలను గమనిస్తూన్న తల్లి శ్రీమతి దివ్యజ్ఞాన సరోజనీ వరదరాజన్ తృప్తిగా నవ్వుకుంది.

*　　　*　　　*

# తల్లి - తనయ

కోయంబత్తూరులో, అవినాశిరోడ్డు అతివిశాలమయినది. ఎపుడూ కళ కళలాడుతుంటుంది. సుతిమెత్తని మోటారులు మెత్తని ఆ రోడ్డుపై ఆనందంగా పరుగులెడుతుంటాయ్.

అత్యాధునికంగా, అందంగా నిర్మితాలైన భవనాలు లెక్కకు మిక్కిలిగా ఆ రోడ్డుకు ఇరువైపులా నిలిచి చూపరుల దృష్టిని ఆకర్షిస్తుంటాయి. అంద చందాలలో ఒకదానికొకటి పోటీపడు తూంటాయి.

ఆ పోటీ ఆర్జనలోనూ ఉంటుంది. వితరణలోనూ ఉంటుంది.

వాటిలో అధికభాగపు భవనాలలో తెలుగు మాతృభాషగా మనకు వినపడుతుంది. అచ్చ తెలుగుపై పూర్తి తమిళ ప్రభావం వారి భాషణలలో ద్యోతకమౌతుంది. మధ్యాంధ్రుండు, మొదటిసారి విన్నప్పుడు తికమక గుడుస్తాడు. బిత్తరపోతాడు. అయినా అక్కడ శుద్ధాంధ్ర హృదయం ప్రద్యోతకమౌతుంది. ఆ సంభాషణలో మరి యాద నిండు తనంతో ఎదురౌతుంది. ఆ పలుకుల్లో ఆ ప్యాయత ఉట్టి పడుతుంది.

మూడు వందల ఏండ్లనాడు విడివడి, నేడు కలుసుకున్న ఆత్మీయుల బంగారపు పలకరింపులు స్ఫుటంగా ధ్వనిస్తాయి.

ఒకనాడు తెలుగునాడు లోని సర్కారు జిల్లాల నుంచి తరలి పోయి వ్యవసాయాన్ని ప్రధాన వృత్తిగా జేసుకున్నవారి కుటుం బాలివి.

దీక్షతతో, దక్షతతో, పరప్రాంతాలలో శ్రమించిన ఫలితంగా కైవస మైన సంపద వారిది. పెరిగిన సంపదకు గణించిన అనుభవాన్ని

జోడించుకొని వాణిజ్యరంగంలో అడుగిడినాయి ఆ కుటుంబాలు. చేపట్టిన ప్రతిరంగంలో నిజాయితీతో కృషి జేసి, 'సెహభాష్' అని పించుకుంటూ, అటు సంపదనూ, ఇటు పరపతినీ పెంపొందించు కున్నారు వారు. అనేక వ్యాపారాలు ప్రారంభించారు. ఉత్పత్తి కేంద్రములు నెలకొల్పుకున్నారు. తమిళనాడులో ప్రధాన పారి శ్రామిక నగరంగా కోయంబత్తూరును, భారతదేశ చిత్రపటంలోనే ముద్రింపించుకున్నారు. మర్యాదను ప్రోదిచేసుకున్నారు. ప్రతిష్ఠను పెంపొందించుకున్నారు. అయినా పాడినీ పంటనూ కొనసాగించుకుం టూనేఉన్నారు. సంక్రాంతి పండుగనూ, తెలుగు ఉగాది నీ పర్వదినా లుగా భావిస్తూనే ఉంటారు. ఎందుకంటే అవి రైతుల పండుగలు కనుక. వారు రైతులు కనక.

* * *

మద్రాస్‌నుంచి నేను ప్రయాణించిన బ్లూ మౌంటెన్ ఎక్స్ ప్రెస్ ఉదయం 4 గంటలకల్లా కోయంబత్తూరులో నిలిచింది. నేను దిగి అటు ఇటూ చూస్తుండగానే, నే దిగిన బోగీ వద్దకు ఓ నవయువ కుడు ఆదరాబాదరావచ్చి, "తమరు గుంటూరు నుండి దిగారా?" అన్నాడు. గుంటూరులో ఎక్కి, మరల మద్రాస్‌లోఎక్కి, ఈ రైలు ఇక్కడ దిగాను" అన్నాడు. ఆయన నవ్వాడు. నేనూ నవ్వాను. "మీరు.........ఫలానాగాదా," అన్నాడు.

"అవున"న్నాను, "మీకు స్వాగతం చెప్పటానికివచ్చాను." అన్నాడు.

వెంట ఉన్న ఆయన జవాను నా పెట్టే బేడాఅందుకున్నాడు. ఎర్రగా మెరిసె ఓ ఇంపోర్టెడ్ కారు అవినాశ్ రోడ్డులో ఉరికి, పలని స్వామినాయుడు స్ట్రీట్‌కు తిరిగి మూడవ నంబరుగల వరద రాజన్ ప్రహరీ పెద్దగేటు దాటి సిమెంటుడ్రైవ్ గడచి, పోర్టిగోలో ఆగింది. ప్రేమతో నా వెన్నంటి కారులో వచ్చిన ఆయన నాకు నియుక్తమైన అతిథి గదికి గొంపోయాడు. రెండు నిము షాల్లో బీరువా తెరచి, ఎంతో పనితనంలో మిల మిల లాడుతూన్న

కప్పులో పొగలు గ్రక్కుతున్న కాఫీని అందించాడు." కొంచెం విశ్రమించండి. 7 గం॥లకు నేను తమను దర్శించుకుంటాను. 7-30 లకు వరదరాజన్‌గారు మిమ్మల్ని కలుసుకుంటారు" అన్నాడు.

ఆయన ఆప్యాయతకు కృతజ్ఞతలు చెప్పి ఆయన్ను పంపించాను.

* * *

ప్రొద్దున్నే శ్రీనివాసన్ వచ్చాడు. 'పెద్దమ్మగారు రమ్మంటున్నారు' అన్నాడు. శ్రీమతి లక్ష్మి రఘురామ్‌ను ఆ యింటిలో అందరూ పెద్దమ్మగారు అని అంటారు.

ఒకటి రెండు గదులు దాటి ఒక పెద్దహాలులోకి వచ్చాము. మూడంగుళాల మందపు రంగు రంగుల తివాచీ నేల, నాలుగు గోడలను ముద్దిడుకొంటుంది. ఆకుపచ్చ రంగులో కంటికి ఆహ్లాదాన్ని గలిగిస్తూ నాలుగు గోడలూ వివిధ కళాఖండాలను భూషణాలుగా అలంకరించుకొని, ప్రతి గోడా ఒక నవ వధువులా నును సిగ్గు లీనుతున్నది. నాలుగు మూలల్లో రోజ్ ఉడ్‌నే శరీరంగా జేసుకొని, దానితోనే వివిధాభరణాలను దిగవేసుకొని పలు దుస్తులను ధరించి నాలుగు ప్రతిమా మూర్తులు నిలిచి ఉన్నాయి.

గోడలలోనే అమర్చిన గాజు బీరువాలలో వివిధ దేశాల కళాకారుల హస్తనైపుణ్యంతో మలచబడిన అందమైనబొమ్మలు ఎంతో సుందరంగా ప్రత్యక్షమైనాయి.

కట్‌గ్లాసు షాండిలియర్సు పై నుంచి వ్రేలాడుతున్నాయి. నల్ల రోజా కర్రతో తయారించిన సోఫాలు ఒక గాజు పానల్ తలుపు ప్రక్కగా అమర్చబడి ఉన్నాయి.

"రండి, ప్రయాణం బాగాజరిగిందా!" అంటూఆహ్వానించారు శ్రీమతిలక్ష్మి. ప్రక్కనే సోఫాలో అమ్మమ్మని ఆనుకొని కూర్చున్న మనుమని పరిచయం చేశారు. "రెండవ మనుమడు వెంకటేశం

చౌదరి" అంటూ, "నాన్నగారి పేరు పెట్టుకున్నాము ఈయనకు". అంటూ పితృపాదులను స్మరించుకున్నారు భక్తితో శ్రీమతి లక్ష్మి. మనుమ సంతానానికి పెద్దల పేర్లు పెట్టడంలో ఉన్న విజ్ఞతకు కారణం పెద్దలపట్ల వీరికున్న మమకార గౌరవాలేనని స్ఫురించింది.

మనుమని పేరు చివరన ఉన్న చౌదరి ఇక్కడ ప్రత్యేక మైనదే. దక్షిణాదిన కమ్మవారంతా నాయుళ్లుగా ప్రఖ్యాతి గాంచారు.

అయితే శ్రీవైష్ణవ సాంప్రదాయ బద్ధమైన వరదరాజన్‌గారి కుటుంబానికి దుగ్గిరాల తాతగారి పేరు వెంకటేశం చక్కగా అతికి పోయింది.

ఇంతలో పెద్ద మనుమడు శ్రీనివాస్ గ్రాండ్ మాను సమీ పించాడు. స్కూలు యూనిఫారం ధరించి, భుజాన పుస్తకాల సంచి వ్రేలాడించుకుంటూ స్కూలుకు వెళ్తున్నానని అమ్మమ్మగారికి చెప్పటానికి వచ్చాడు. అప్పటికే ముస్తాబైన వెంకటేశం చౌదరి అన్న శ్రీనివాస్‌ని వెంబడించి, గ్రాండ్ మాకు బై బై చెప్పి కారులో ఎక్కారు.

అన్నలిద్దరూ బడి కెళ్లింతర్వాత ఉంగరాలు తిరిగిన జుట్టుతో చిరునవ్వులు చిలికిస్తూ అందంగా మెరిసిపోతూ చిన్ని మనుమడు అమ్మమ్మ వడిలోకి ఆదరా బాదరా చేరాడు. "కాఫీ తిందాము, రా మమ్మి" అంటూ గారాం చేశాడు.

*　　*　　*

వరద రాజన్ సోదరులు నలుగురకూ, ఆ విశాలమైన కాంపౌండులో నాలుగు దివ్య భవనాలున్నాయి. సిరి సంపదలను ఆ భవనాలు మూర్తులా ఎట్లా ప్రతిబింబిస్తాయో, అందులోని

మనుష్యులు గౌరవ ప్రతిష్ఠలకూ సద్గుణ సత్ప్రవర్తనలకూ రూపం పోసుకొని ఎదురౌతారు.

తనయ శ్రీమతి దివ్యజ్ఞాన సరోజినీదేవి, అల్లుడు శ్రీ వరద రాజన్, ముగ్గురు మనుమలనుం, ఆ ఇంటిలో ఏడాదికొక్కసారైనా చూచుకొని ఎంతో తృప్తి పొందుతారు శ్రీమతి లక్ష్మీ రఘురామ్.

"మమ్మీ! ఎన్నో దేశాలు తిరుగుతుంటావు. ఎన్నో వ్యాపకా లతో మసలు తుంటావు. మరి ఈ పచ్చళ్ల విషయం నీకు ఎట్లా గుర్తుంటుంది? నీవు ఏనాడూ ఏ సీజనులో వీటిని మరచిపోవు!" అంటుంది తల్లితో తనయ.

"ఎన్ని దేశాలు తిరిగినా, ఎన్ని పనులున్నా ఏ తల్లికైనా తన బిడ్డ జ్ఞాపకం రాకుండా ఉంటుందా బేబీ! ఆ బిడ్డ అవసరాలు తల్లి స్ఫురణలో నుంచి తప్పుకుంటాయా?" అంటారు తనయతో, తల్లి.

శ్రీమతిలక్ష్మీ ఎప్పుడు కోయంబత్తూరు, వచ్చినా పెద్దజాడీ లతో నిమ్మకాయ, దబ్బకాయ, ఆవకాయ పచ్చళ్లు వెంట వస్తాయి. సంగంజాగర్లమూడి లోని తనస్వంత తోటలో కాసిన పెద్ద పెద్ద నిమ్మకాయలు ఏరి ఏరి పచ్చళ్లుపెట్టి కోయంబత్తూరు తెస్తారు.

* * *

కోయంబత్తూరు ప్రాంతాల్లో 'నాయుళ్లు' గా ప్రఖ్యాతి వహించిన ఈ కుటుంబాలు, ఎంతో సాంప్రదాయ బద్ధంగా ఇంకా కట్టుదిట్టంగా మనుగడ సాగిస్తున్నాయి.

వరదరాజన్ తల్లిగారు, ఉదయమే తన బిడ్డల ఇండ్లకు వస్తారు. అందరనూ పరామర్శిస్తారు. తాను తెలుసుకోవలసిన విష యాలు ఏమైనా ఉంటే తెలుసుకుంటారు. తాను తెలుప వలసిన విషయాలేమైనా ఉంటే తెలుపుతారు.

వృద్ధాప్యంలో గూడా ఎంతో ఆరోగ్యంగా కళకళలాడుతూ చిరునవ్వుతో తన భవనానికి అమ్మగారు రావడం గమనించి శ్రీ వరదరాజన్ కూర్చుని ఉన్నవాడల్లా నిలబడతారు. అమ్మగారు ఆసనంపై కూర్చున్నా, ఆమె "కూరో్చ అప్పా" అని చెప్పిందాకా నిలబడే ఉంటారు. లోపల గదుల్లో పనులు చూచుకుంటూన్నకోడలు వచ్చి అత్తగారిని ఆదరంగా పరామర్శిస్తుంది. పెద్దామె తృప్తిగా కొడుకునూ కోడలునూ చూచుకొని మనుమల సంగతి అడుగుతుంది' పెద్ద తలగా చెప్పవలసిన సంగతులు తనకు తోచినవి ఏమన్నా ఉంటే ఒకటి రెండు కబుర్లాడి మరో కుమారుని ఇంటికి బయలుదేరుతుంది.

అట్లా తల్లిగారు ప్రతిరోజు వరదరాజన్ ఇంటికి రావడం ఈ దంపతులకు సంతృప్తి. ఆ తల్లికి మహా సంతృప్తి.

మద్రాస్ క్రిస్టియన్ కాలేజీలో ఢిల్లిలో చదువులు కొనసాగించి పట్టభద్రురాలైన శ్రీమతి దివ్యజ్ఞాన సరోజినీదేవి అతి నెమ్మదైన ఆడపడుచు. అతి నిశ్శబ్దంతో గూడిన గమనం. ఆదర్శపూరితమైన గమ్యం. పరిశుభ్రమైన ఆలోచనలు, ప్రశాంతమైన చూపులు. సదా చిరునవ్వులు వర్షించే మాటలు.

విద్యార్థినీ జీవితం ముగిసి చాలా ఏండ్లైనా ముగ్గురు ముద్దు బిడ్డలకు మాతృదేవిగా మారినా, అసంఖ్యాకంగా ఆమెగదిలో బీరువాల నిండా నిండిఉన్న పుస్తకాలూ, ఆ పుస్తకాల రచయితలూ ఆమెకు నెచ్చెలులు. ప్రతిరోజూ కొన్ని గంటలు, ఆ పుస్తకాలు ఈమెకు కొత్త సంగతులు చెబుతునే ఉంటాయి. ఈమె ఆ మాటలు వింటూ తాను ఆలోచించుకుంటూనే ఉంటుంది.

పాలెట్ బ్రష్షులూ తీసుకొని వారానికి ఒకటి రెండు రోజులు చిత్రలేఖనంలో సాధన చేస్తూ ఉంటుంది. వాటర్ కలర్స్‌లో, శ్రీమతి దివ్యజ్ఞాన సరోజినీ వరదరాజన్ రచించిన చిత్రాలు, 14. అశోక రోడ్డులో, మదరాసులోని తమ స్వగృహంలో, కోయంబత్తూరులోని భవనంలో గోడలపై అలంకరించబడి, చూపరులకు ఆలోచనలను రేకెత్తిస్తుంటాయి.

గృహాంతర్భాగ అలంకరణ ఒక శాస్త్రం. శ్రీమతి దివ్యజ్ఞాన సరోజినీదేవికి ఈ అలంకరణపై అభిమానం మెండు. తల్లి గారితోపాటు ఒకసారి ఈమె జరిపిన జపాను పర్యటనలో ఈ శాస్త్రంపై తన కున్న మక్కువతో, ఎన్నో విషయాలు అక్కడ తెలుసుకున్నారు. ఆ అనుభవంతో తన ఇంటినీ, ఇంటిలోని ప్రతిగదినీ, ఇంటి ముందు విశాలమైన 'లాన్'నూ డ్రైవ్‌ను ఎంతో ఆలోచనతో, అందంగా, ఆహ్లాదకరంగా అమర్చారు. బజారు నుంచి పుట్టెడు విసుగుతో వచ్చినా, మెయిన్ గేటు దాటి వరండాలో నడచి డ్రాయింగ్ రూము చేరి కూర్చొని,చుట్టూరా కలయ జూచే టప్పటికి మనస్సులోని విసుగంతా మాయమై ప్రశాంతత లభిస్తుంది. వాంఛనీయమైన ఆ ప్రశాంతతకే ఈ గృహాలంకరణ శాస్త్రం రూపొందింది.

"గృహవిషయాలలో స్త్రీలకు సంపూర్ణ సార్వభౌమాధిపత్యం ఉండటం మంచిది'' అంటారు శ్రీమతి దివ్యజ్ఞాన సరోజిని. గృహ నిర్వహణలోని అనుదిన వ్యవహారాలలో పురుషుల ప్రమేయం గృహిణికి చీకాకు గలిగిస్తుంది. అదే కొంచెం ముదిరితే తలనొప్పి గూడా గలిగిస్తుంది! అనిగూడా అంటారు ఆమె.

అలాగే, పురుషుల నిత్య కార్యక్రమాలలో గృహిణులు తల దూర్చి, వారికి తలనొప్పి గలిగించటంగూడా శ్రీమతి వరదరాజన్ సుతరామూ, అభిలషించరు.

"ఎవరి డొమీనియన్ వాళ్లదే. అయితే స్థూలంగా ఎక్కడ ఏమి జరుగుతుందో తెలుసుకొనుటవలన నష్టంలేదు. కాగా ప్రయోజనం గూడా ఉంటుంది. అవసర సమయాలలో భార్యాభర్తలు తగు సలహాలు ఇచ్చుకోవచ్చు, ఒకరికొకరు అండగా ఉండవచ్చు. జీవిత విజయాలను సాధించవచ్చు. అంతేగాని ప్రతి చిన్న విషయంలో భర్తల కార్యక్రమాలను పర్యవేక్షించాలనుకోవడం, వారికి చీకాకునే గాక అసహ్యతను గూడా గలిగిస్తుంది" అంటారు శ్రీమతి సరోజిని.

భారీ వాణిజ్యాలనూ, పరిశ్రమలనూ నడుపుతూన్న శ్రీ వరదరాజన్ ఇంటికి, రాష్ట్రంలోని పలువురు సహచరులూ, దేశంలోని

పారిశ్రామికవేత్తలూ, విదేశాల నుంచి పెక్కురు ప్రముఖులూ వస్తుంటారు. వరదరాజన్‌తో అనేక సమావేశాలు జరుపు తుంటారు.

వచ్చిన అతిథులను సాదరంగా ఆహ్వానించి, ఆదరంగా ఆతిధ్యమిస్తుంది శ్రీమతి సరోజిని. అవసరమనుకున్నప్పుడు ఆయా సమావేశాలలో పాల్గొంటుంది. తనకు తోచిన సూచనలిస్తుంది.

లక్ష్మీరఘురామ్ కోయంబత్తూరు వచ్చిందంటే, ఆ నాయుళ్ల కుటుంబాలకు ఒక పండుగే !

ఎంతో ఆనందిస్తారు. నిండుమనస్సుతో స్వాగతం పలుకుతారు. హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తారు.

విశ్రాంతి తీసుకోవచ్చు గదా అని ప్రతిసారీ శ్రీమతి లక్ష్మి ఆ వూరు వెళ్తారు. అది తప్ప అన్నీ అక్కడ లభ్యమౌతాయి ఆమెకు. నిర్విరామ కార్యక్రమాలతో, సన్మానాలతో, పలకరింపులతో, విందులతో అనుదిన కార్యక్రమం నిండి పోతుంది. శ్రీమతి దివ్య జ్ఞానసరోజనీ వరదరాజన్ ఇంటి కాంపౌండు కార్లతో, ఇల్లు విజిటర్సుతో నిండిపోతుంది.

"ఇక్కడ గూడా షెడ్యూలు ప్రకారం కార్యక్రమాలేనా మాడం ?" అన్నాను నేను.

నవ్వుతున్నారు ఆమె.

* * *

# 6-భగవాన్ దాస్ రోడ్

చేతులు కొంగర్లు పోయే చలిలోనైనా, గుడ్డలు ముద్దయ్యే వానలోనైనా, శ్రీమతి లక్ష్మీ రఘురామ్ ఢిల్లీలో ఉన్నారంటే, ఉదయం తొమ్మిది గంటల కల్లా గచ్చకాయ రంగు పెద్ద ఛావర్లేట్ కారు హారన్ 6-భగవాన్ దాస్ రోడ్డు గేటులో మ్రోగుతుంది. ఆఫీసు గదిముందు ఆగుతుంది.

కారు దిగి వరండాలో ప్రవేశించగానే ముఖ్య సిబ్బంది అందరూ ఎదురై స్వాగతం పలుకుతారు. అందరనూ శ్రీమతి లక్ష్మి పేరు పేరునా పలుకరిస్తారు. సిబ్బంది స్వంత ఇబ్బందులను గూర్చి క్షేమ సమాచారములను గురించి పరామర్శ చేస్తారు.

తన గదిలో తన ఆసనంలో కూర్చోగానే. కార్యదర్శి ఆనాటి కార్యకలాపాల నోటును చూపిస్తుంది. ఇక కార్యక్రమం ప్రారంభ మౌతుంది.

టక టక బూట్ల చప్పుడుతో, చకచకా నడుస్తూ ఆఫీసు శక్రటరీ శ్రీమతి నర్గీస్, ఆనాటి టపాను తెచ్చి ఈమె ముందుంచు తుంది. అన్ని కాగితాలనూ క్షుణ్ణంగా పరిశీలించి, అవసరమైన నోట్సును డిక్టేట్ చేస్తారు శ్రీమతి లక్ష్మి స్టెనోకు.

టెలిఫోను మ్రోగుతుంది,వుమెన్స్ ఫుడ్ కౌన్సిలు కార్యదర్శి రాబోయే సమావేశానికి ఎజండా గురించి సంప్రదిస్తుంది. ఆమెకు అవసరమైన సలహాలు చెబుతుంది శ్రీమతి లక్ష్మి ఫోనులో.

స్వామి శివానంద కల్చరల్ అసోసియేషన్ ప్రతినిధులు వారి కార్యకలాపాల విస్తరణను గురించి సంభాషించటానికి వస్తారు, వారితో ఒకపావు గంట సరిపోతుంది.

దక్షిణ రాష్ట్రాలనుంచి వచ్చిన మహాసభ కార్యకర్తలు వారి సమస్యలను గురించి చర్చించి సంతృప్తిగా వెళతారు.

కాశ్మీరు రాష్ట్రం నుంచి ఒకమహిళా ప్రతినిధివర్గం వస్తుంది. వారితో ముస్లిము స్త్రీల ఆస్తి వారసత్వ సమస్యలు, బహు భార్యాత్వాన్ని గురించి చర్చిస్తారు.

మరల టెలిఫోను మ్రోగుతుంది. ఇర్విన్ కాలేజీ కమిటీ వార్షిక మహాసభలకు ఉపన్యాసకురాలిగా రావాలంటూ అభ్యర్థన చేస్తుంది టెలిఫోను. సరేనని తేదీ, సమయం నోటు చేసుకుంటారు శ్రీమతి లక్ష్మి.

ఇంతలో ఋషీకేశ్ నుంచి, డివైన్ లైఫ్ సొసైటీ ప్రతినిధి వచ్చారని రిసెప్షనిష్టు టెలిఫోనులో చెబుతుంది. వారిని ఆహ్వానించి, వారితో పలువిషయాలు చర్చించి, వారి ప్రచురణలను గురించి గూడా తగు సూచనలు చేస్తారు.

టక టక బూట్ల చప్పుడుతో చకచక నడుస్తూ శ్రీమతి నర్గీస్ వచ్చి "మాడం, ఇది చాలా ముఖ్యం. ఇంటర్నేషనల్ ఎలయెన్స్ ఆఫ్ ఉమెన్స్‌కు ప్రత్యుత్తరం ఈ రోజే లండన్‌కు పోస్టు చేయాలి. సంతకం పెట్టండి," అంటూ సంతకం పెట్టించుకుని. థాంక్‌యు మాడం అంటూ వెళ్ళిపోతుంది.

టెలిఫోను మ్రోగుతుంది. స్టేటస్ ఆఫ్ ఉమెన్ కమిటీ శక్రటరీ టెలిఫోను చేస్తారు. సవివరంగా ఆమెకు చెప్పవలసిన విషయాలు తెలుపుతారు శ్రీమతి లక్ష్మి.

ఫారెన్ స్టూడెంట్సు సర్వీస్ సొసైటీ నుంచి, విదేశీ విద్యార్థినులు వస్తారు. వారి యోగక్షేమాలు తెలుసుకొని వారికి అవసరమైన సలహాలు ఇస్తారు.

విశ్రామంలేకుండా ఈ కార్యక్రమం ఒంటిగంటవరకు సాగుతుంది. శ్రీమతి నర్గీస్ వచ్చి, లంచి సమయం అని జ్ఞాపకం

చేస్తుంది "అవును. మిసెస్ నర్గిస్ - ఈవాళ లంచికి అతిధులుగూడా ఉన్నారు." అంటూ శ్రీమతి లక్ష్మి బయలుదేరుతారు. ప్రక్కనేఉన్న లైబ్రరీలోకి ప్రవేశించి, లైబ్రేరియన్‌ను పరామర్శిస్తారు. ఒక్కసారి పుస్తకాల బీరువాలకేసి చూస్తారు. క్రొత్త పుస్తకాల ఇండెంటును చూస్తారు. అప్రూవ్‌చేసి ఆర్డర్లు పెట్టవలసిందిగా కార్యదర్శికి ఆదేశిస్తారు.

జూడో శిక్షణాలయం ఎట్లాఉందో తెలుసుకుంటారు. ఢిల్లీ యువతులు ఈజూడో పోరాటానికి ఉత్సాహ పడుతున్నారని తెలుసుకొని సంతోషిస్తారు. ప్రక్కనేఉన్న మరొక మూడంతస్థుల భవనంలో ఉద్యోగాలు చేసుకొనే యువతుల కోసరం నెలకొల్పిన హాస్టలును సందర్శిస్తారు. వార్డన్‌ను పిలిచి ఆమె సమస్యలేమైనా ఉన్నాయేమో తెలుసుకుంటారు.

* * *

వచ్చిన అతిధులను సంభాలించుకొని మధ్యాహ్న భోజనానంతరం కొద్దిసేపు విశ్రాంతి తీసుకుంటారు. మరికొంతసేపు చదువుకుంటారు. ఇంటివద్ద శక్రటరీ వచ్చి ఉదయం ఇచ్చిన డిక్టేషన్సుకు, కాపీలు తయారుచేసి సంతకాలు చేయించుకొని పోతుంది. మధ్యాహ్నం టపాలోవచ్చిన ఉత్తరాలు చూపించి తిరిగి డిక్టేషన్ తీసుకుంటుంది. మరల మూడుగంటలకు ఢిల్లీ నగరంలోని ప్రముఖులేగాక పలు ప్రాంతాలనుంచి ఈమెను చూడాలని వచ్చే వారితో ఇంటర్వ్యూలు ప్రారంభమౌతాయి. వివిధ విషయాలమీద, చర్చలూ, అనేక కార్యక్రమాలపై సమాలోచనలూ జరుగుతాయి. ఇవి రాత్రి 8 గంటలవరకు కొనసాగుతూనే ఉంటాయి.

రాత్రి భోజనానికి అతిధులు లేనినాడు, భార్యాభర్తలు కలిసి ఏకాంతంగా భుజిస్తారు. ఇంటి విషయాలూ, పుత్రిక సంగతులు మనుమల కబుర్లు చెప్పుకుంటారు. ముఖ్యమైన ప్రోగ్రాములుంటే టెలివిజను ముందు పది నిముషాలు కూర్చొని, ఎవరి గదులకు వారు వెళతారు.



"రఘు" "లక్ష్మి"



పెంపుడు మేకతో కేంద్రమంత్రి
శ్రీ సి. సుబ్రహ్మణ్యం



మెల్‌బోరన్ జ్యూలో



పల్లెటూరి మహిళల సమావేశంలో



తాజ్‌మహల్ మునివాకిట్లో ముద్దుల మనుమలు : శ్రీనివాస్, వెంకటేశ్ చౌదరి.



— "గ్రాండ్‌మా", ముగ్గురు మనుమలు : కుడిభుజంపైన, తండ్రిపేరెట్టుకున్న వెంకటేశం చౌదరి. ఎడమవైపు నుంచున్నది శ్రీనివాస్. మధ్యలో చిరునవ్వుల ఉమాకుమార్ నరసింహ్వా శ్రీధర్.



—కోటిన్నర రూపాయల బంగారుకల; మహిళల సంక్షేమం కోసం ఒక బృహత్పథక స్వరూపం.

క్రింది వరుస : శ్రీ రఘురామయ్య దంపతులమధ్య తల్లిగారు శ్రీమతి జంపాల రత్నమాణిక్యమ్మ.
పై వరుస : మనుమలు శ్రీనివాస్, వెంకటేశ్ చౌదరి, చెల్లి డాక్టర్ శ్రీమతి రాధాకృష్ణ రామస్వామి; కుమార్తె శ్రీమతి దివ్యజ్ఞాన సరోజినీ వరదరాజన్ ; అల్లుడు శ్రీ వరదరాజన్. (మధ్య) శ్రీధర్





రచయిత కుటుంబంతో



పాతబల కెదురుగా



ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు
శ్రీ వెంకటనారాయణతో

ఇక శ్రీమతి లక్ష్మి రచనా వ్యాసంగం ప్రారంభమౌతుంది. అనేక విషయాలపై ఈమె నోట్సు రాసుకుంటారు. జ్ఞాపికలను తయారుచేసుకుంటారు. రాయడమంటే ఈమెకు ఎంతో అభిలాష. పది పుస్తకాలు ప్రచురించబడ్డాయి. ఇందులో నాలుగు నవలలు. ప్రచురించ బడవలసిన పుస్తకాల సంఖ్య గూడా బాగానే ఉంది. సుప్రసిద్ధ రచయిత్రిగా తెలుగునాట గణ్యత తెచ్చుకున్న ఈమె నవల ఒకటి హిందీలోనికి అనువదించబడింది, "సంఘర్షణ-కీ-రాహే" పేరిట. ఈ నవలను బ్రిటిష్ బ్రాడ్ కాస్టింగ్ శాఖవారు తమ విదేశీ కార్యక్రమాలలో నాటకంగా ప్రదర్శించు కుంటానికి ఆసక్తి చూపించి వీరి అనుమతి పొందారు. 'ప్రపంచ మహిళా విమోచనం' అను బృహద్గ్రంథం ఆంగ్లంలో అచ్చుకావలసిఉంది. 'కులట' అను పేర ఆంగ్లంలో ఒక పుస్తకం ఈ ప్రపంచ మహిళా సంవత్సరంలోనే విడుదలైంది. వివిధపత్రికలకు వ్యాసాలు రాయటం గూడా ఈ సమయంలోనే జరుగుతుంది.

* * *

అఖిలభారత మహిళా మహాసభకు శ్రీమతి లక్ష్మీరఘురామ్ గత అయిదేండ్లుగా అధ్యక్షురాలు. 1975 డిసెంబర్ ఆఖరున జరిగిన గోవా మహాసభలో మూడవతూరి ఏకగ్రీవంగా ఎన్నికైనారు. వీరి నాయకత్వంపై, భారత మహిళా ఉద్యమానికున్న అపార గౌరవానికీ అనంత విశ్వాసానికీ ఈ ఎన్నిక నిదర్శనం. క్రితం సారి జరిగిన ఎన్నికలపుడు జరిపిన పోటీలో అత్యధిక మెజారిటీతో అధ్యక్షపీఠం అధిరోహించారు ఈమె. అంతకుముందు సయితం ఆ అధ్యక్ష పీఠం ఈమెను వరించడానికి ఎంతో ఆసక్తి జూపింది.

ఏమిటి దీని కంతకూ కారణం ?

అధికారమా లేదు. ఆడంబరమా లేదు. ప్రచారమూ లేదు. ఆ ఆసక్తీ లేదు. ఉన్నది ఒక్కటే! అదే సేవాభావం !! నిరంతర సేవా తత్పరత !! నిస్వార్థ సేవానురక్తి !! స్త్రీజాతి జీవితాన్ని సముద్ధరించాలనే త్రప తప్ప అన్యం ఏదీ లేదీమెలో.

గౌరవనీయమూ, విశిష్టమూ అయిన ఈ ఉన్నత పదవిని మున్ను శ్రీమతులు మార్గరెట్ కజిన్స్, సరోజినీనాయుడు, కమలా విఛటోపాధ్యాయ, లీలావతీ మున్షీలాంటి మహనీయురాండ్రు నిర్వహించారు. నాటి పరిస్థితులకు సరితూగిన కార్యక్రమాలను నిర్వర్తించి చరితార్థు లయ్యారు. నేటి పరిస్థితులకు అనుగుణ్యంగా, ఈమహాసభా కార్యక్రమాలను ఏ పటికా ఏడు,విస్తృత పరచు కుంటూ, భారతీయ మహిళా లోకానికి ఈ సంస్థను ఒక శుభ్ర వేదికగా మలచు కుంటూ, తన్ను తాను భారత మహిళా ఉద్యమానికి ఒక పరిశుభ్ర జ్యోత్స్నగా తీర్చి దిద్దుకుంటూ ముందుకు, మునుముందుకు గమి యిస్తున్నారు శ్రీమతి లక్ష్మీరఘురామ్.

ఆ నిత్య చైతన్యయుత సేవానురక్తితో పాటు, గత మూడున్నర దశాబ్దాలుగా మహిళా సేవా కార్యక్రమాలలో శ్రీమతి లక్ష్మికున్న అనుబంధం, పవిత్రమూ పటిష్టమూ దృగ్విశాలమూ అయిఉంది. 1937 లో మదనపల్లి గురుకుల విద్యార్థినీ కాలంలోనే శ్రీమతి మార్గరెట్ కజిన్సుద్వారా మహిళావిముక్తి కార్యాచరణకు ప్రభావితం గాబడ్డ శ్రీమతి లక్ష్మి, తమ చెన్నపురి జీవితంలో ఆంధ్ర మహిళాసభ వ్యవస్థాపక సభ్యురాలేగాక, ఆ సంస్థ అభ్యుదయానికీ మూడుపూవులు ఆరుకాయలుగా వికసించటానికీ ప్ర ప్రథమ దశలో ఎంతగానో తోడ్పడ్డారు. శ్రమించారు.

ఆ విశిష్ట కార్యక్రమానికి, శ్రీమతి దుర్గాబాయి "అక్షర" మైతే, శ్రీమతి లక్ష్మి 'అర్థము' అయింది. జంటగా కూడ బలుక్కొని ఎన్నో ఘనమైన కార్యాలు సాధించారు. ఆ రోజుల్లో యావద్భార తంలో మహిళా జన సంక్షేమానికి దూరదృష్టితో పటిష్ఠమైన ప్రాతి పదికలతో అభ్యుదయకర కార్యక్రమాలను రచించుకొని నిర్వ హించుకొన్నది, బహుశా చెన్నపురి లోని 'ఆంధ్ర మహిళా సభ' యే నేమో !

శ్రీమతి కజిన్స్ ముచ్చటలతో ప్రభావితమైన భావోద్వేగంతో జీవిత ధర్మాన్ని ఉత్తమా దర్శపూరితం జేసుకొని, మదరాసులో స్వంత కాపురం ఏర్పాటు జేసుకున్న మొదటి రోజులనుంచీ, గొప్ప వారసత్వాన్ని పునికి పుచ్చుకు వచ్చిన ఈ భాగ్యశాలి. ఆంధ్ర మహిళా సభ కార్యక్రమాలకు కొండ లాగా అండగా ఉండి, అన్నింటా వెన్నంటి తానుండి, ఆ సంస్థ మహా సంస్థగా ప్రభవిల్లడానికి అమేయ దీక్షా దక్షతలతో ఈమె సల్పిన కృషి ఎంతో గౌరవనీయమూ, అభినందనీయమూనూ.

శ్రీమతి లక్ష్మి సన్నిహిత బంధువులు వదాన్యులు దుగ్గిరాల వాస్తవ్యులూ అయిన శ్రీ వెనిగండ్ల హనుమంతరావు దంపతులు తమ యావదాస్తిని ఈ ఆంధ్ర మహిళా సభకు అర్పించడానికి స్ఫూర్తి నిచ్చిన ఈమె, ఆ దంపతుల ఎనలేని 'ఈవి'కి ప్రభావితరైయె తన జీవితాన్నే ప్రపంచ మహిళా ఉద్యమానికి అంకితం జేసుకున్నారు.

శ్రీ రఘురామయ్య రాజకీయ ప్రవేశంతో, శ్రీమతి లక్ష్మి రంగస్థలం చెన్నపురి నుండి హస్తిపురికి మారింది. సేవా పరిధి విస్తృతమై మరింత సుగంధితమైంది.

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి అధ్యక్షతన, ఆచార్య రంగాజీ లాంటి ప్రసిద్ధ దేశనాయకులతో సంస్థాపించ బడిన ఢిల్లీ ఆంధ్ర మహాసభకు మొట్ట మొదటి మహిళా అధ్యక్షురాలుగా ఎంపికయ్యారు శ్రీమతి లక్ష్మి. ఎంతో దీక్షతతో తన కర్తవ్యాన్ని నిర్వహించారు. ఆ సంస్థ చరిత్రలో గర్వకారణమై, అత్యంత విజయ వంతంగా నిర్వహించ బడిన రజతోత్సవాలు ఈ విదుషీమణి అధ్వ ర్యంలో జరగడం ఎంతో స్తుతిపాత్రమైంది. భారత రాజధానిలో శ్రీమతిలక్ష్మి శక్తి సామర్థ్యాలకు పరిగణన ప్రాప్తించింది. సాంఘిక సేవాను రక్తులకు తలలోని నాలుకలా మసలుకునే ఈమె నిత్యజీవిత

విధానం, వారందరనూ ఉద్దీప్తం చేయడమేగాక, పలు వాగుల దేశ సేవా కార్యక్రమాలలో కృషి జేసే మరి పదుగుర హృదయాలలో గౌరవనీయ మహిళామణిగా నిస్వార్థ సేవకురాలుగా, దక్షతగల నిర్వాహకు రాలుగా ఆవిర్భవించింది.

నిజాయితీతో, నిశ్చలంగా విధినిర్వహణను కొనసాగించు కున్న ఆ ఉన్నత సేవా ప్రమాణమే, తదుపరి అఖిలభారత మహిళా సభ స్టాండింగ్ కమిటీ సభ్యురాలుగా పది సంవత్సరాలపాటు ఎంపికి గావటానికీ, నాలుగేండ్లపాటు ప్రధాన కార్యదర్శినిగా బాధ్యతలు నిర్వహించటానికీ, ఉపాధ్యక్షులుగా రెండేండ్లు ఉండటానికీ, అధ్యక్షు రాలుగా గత అయిదేండ్లుగా చరిత్రను సృష్టించడానికీ, మరి మూడేండ్ల వరకు మొన్న గోవా మహాసభలో ఏకగ్రీవంగా ఎన్నిక గాబడ టానికీ కారణ మయ్యింది.

దేశ స్వాతంత్ర్యానికి పూర్వంనుంచే, అఖిలభారత మహిళా సభకు ఐక్యరాజ్య సమితితో 'మాటామంతీ' సంబంధాలు నెలకొని ఉన్నాయి. శ్రీమతి లక్ష్మీరఘురామ్ అధ్యక్షత వహించిన తదుపరే, యునెస్కో, యికోసోక్, యఫ్.ఎ.ఒ; లాంటి అంతర్జాతీయ ప్రతి పత్తి గల సంస్థలతో సంబంధ బాంధవ్యాలు ఏర్పడి స్థిరపడ్డాయనేది చారిత్రక సత్యం. శ్రీమతి లక్ష్మీరఘురామ్ ఆహ్వానంపై, 1973 లో 23 వ అంతర్జాతీయ మహిళా మహాసభ ఢిల్లీలో జరిగిన తీరు, ప్రపంచ మహిళా ఉద్యమ చరిత్రలో ఒక ప్రత్యేక అధ్యాయాన్ని రచించుకున్న దన్నదీ సత్యమే.

6-భగవాన్‌దాస్ రోడ్డును గురించి శ్రీమతి లక్ష్మీరఘురామ్ ఒక బంగారుకల కన్నది. దానిని రూపొందించటానికి నిర్విరామ కృషి జరుపుతున్నారు ఈమె. ఒక కోటిన్నర రూకల వ్యయంతో, ఈ ప్రాంగణంలోనే ఒక భవనాల సముదాయాన్ని నిర్మింపజేసి,

మహిళల శ్రేయస్సుకు అనువైన వివిధ వ్యాపకాలను ఏర్పాటు చేయాలని వీరి కాంక్ష; అందులో వృత్తి చేసుకొనే మహిళలకు అన్ని ఆధునిక వసతులతో యోగ్యమైన నివాసాలను లభింపజేయడమే గాక, స్త్రీల విజ్ఞాన వ్యాయామాలకూ, ఆర్థిక ప్రగతికీ, రాజకీయ సాంఘిక సిద్ధాంతిక విశ్లేషణా ప్రగతికీ,ఆశయాలమైన అన్నివాంగుల పూర్ణరూపాన్ని లబ్ధి జేసే మహాదాశయంతో ఒక బృహత్తర ప్రణాళి కను రచించుకొని, వాస్తుశిల్పులను సంప్రదించు-చుకొని, ధన సంపత్తిని పోగు జేసుకుంటూ ముందుకు ఉద్యమిస్తున్నారు. అనతికాలంలో ఈ మహత్తర ఆదర్శపూరిత ఘననిర్మాణం తన బంగారు కలను పండిస్తుందని విశ్వసిస్తున్నారు శ్రీమతి లక్ష్మి రఘురామ్.

# జీవితమంటే ఏమిటి?

— మరల

ఆమె నడుస్తున్నది. నడుస్తూనే ఉన్నది. ప్రయాణం సాగుతూనేఉంది. మెట్లు క్రిందికి దిగుతున్నాయ్. ఆమె పైకి ఎక్కుతోంది

నిద్రిస్తోన్న ఆమెలోని దేదో మేల్కొంచింది.

"ఇంకా నడుస్తూనే ఉన్నామనుగా !" అంది 'ఆమెలోనిది'.

"అవును ! నడవటమే మన కర్తవ్యమన్నావుగా!" —అంది 'ఆమె'.

" అనేగా మనం ఇదివరకు నిశ్చయాని కొచ్చింది "— అంది 'ఆమెలోనిది.'

"ఇంతకూ జీవితమంటే ఏమిటని నిర్ధారించు కుందాము ?"

"జీవితమంటే బ్రతకడం. బ్రతకడ మంటే బ్రతుకును గురించి తెలుసు కోవడం. ఆ తెలివిడిలో మంచి చెడులను విశ్లేషించుకొనడం. ఆ తేలిన మంచిని పెంచు కొనడం......"—అన్నది 'ఆమెలోనిది'.

"మంచి అంటే?" అడిగింది 'ఆమె'.

నీ తోటి లోకాన్ని సహానుభూతితో సందర్శించడం. నీ తోటి వారిని సహోదరులుగా గుర్తించడం. బాధితుల ప్రతి ఒక్క కన్నీటి బిందువైనా ప్రేమతో చిరునవ్వుతో, నీ చూపుడు వ్రేలుతో తుడవడం. వేదనలతో మూగవోయిన వారి స్వరాలలో ఆనంద ధ్వనులను ప్రమోగించడం. వారి బాధా పరితప్త నెమ్మోములలో ఆహ్లాదరేఖలను సృష్టించడం. కారుణ్యాన్ని నీ కన్నులలో నింపుకొనడం. మంచిని నీలో పెంచు కోవడం. నీ చుట్టూరా ప్రసరింపజేయడం''. అన్నది 'ఆమెలోనిది'.

"మంచిని మరచి సహోదరులను సయితం ఆక్రందింప జేసే వారివి మాత్రం జీవితాలు గావా ?" అడిగింది 'ఆమె.'

"ఉప్పుదీ కర్పూరానిదీ జీవితాలు గావా ? ఒకటి వెలుగు మొగంచూచి చిటపటలాడి పెటపెటలతో పలుకులుగా మారి ఎదుటి వారి మొగాలకు తగులుతుంది. మరోటి తనను తాను హరించుకొని వెలుగు నిచ్చి కమ్మని వాసనలు పరిసరాలలో ప్రసరించి, జన్మను చరితార్థత జేసు కొంటుంది''. అన్నది 'అమెలోనిది'.

"మరి మన సంగతేమి టంటావ్?" అడిగింది ఆమె.

"ఏనాడో ఆప్రశ్నకు సమాధానంగా నీ కర్తవ్యాన్ని నిర్ణయించుకొని కృషి జేస్తున్నావుగా !" చెప్పింది 'ఆమెలోనిది'.

"లోకంలోని అసంఖ్యాక బాధితుల కన్నీటిని తుడిచే టంత సత్తువ నా ఈ చిన్న వ్రేలికి ఉందా ?'' అన్నది ఆమె.

"నిజమే!లోకపు దుఃఖాశ్రువులను,లోకం లోని గాద్గదిక తను' లోకపు ఆవేదనను ఏఒక్కరి చూపుడు వ్రేలూ తొలగించలేదు. కాని ఎవరకు వారు తమ శక్తి మేరకు కృషిచేయాలి. ఆ దీన మానవ సేవే మాధవసేవ'' అన్నది 'ఆమెలోనిది'.

"అంతేనా ?''

"అంతేగాక !''

"అయితే మరి మాధవు డెవరంటావ్ నెచ్చెలి?" అడిగిందిఆమె.

"ముందు ముందు తెలుసు కుందాములే చెల్లీ ! తొందరే ముంది". అంది 'ఆమెలోనిది'.

'ఆమె' మేల్కొన్నది. ఇదంతా కలా అని అనుకొన్నది' తనలో తాను నవ్వుకొన్నది. "తమ సోమా జ్యోతిర్గమయ" పాడు కొన్నది.

—o—